# చిత్రాగదసంగ్రహము

అను

# శ్రీ సోమయాజి సత్పథము.

రచయిత:

కొలనాధభట్ట వెంకటరమణశాస్త్రి.

శ్రీరస్తు.

# చిత్రాంగదసంగ్రహము

అను

# శ్రీసోమయాజిసప్తశతము.

---

గ్రంథకర్త:

బస్తీహుల్, యకతాల్ శ్రీమత్ప్రాగ్వేంకటపతిరావు దొరవారు

జాగీర్దార్ భామండ్ (మురా ను) జమీందారువారి

ఆదరాభిమానాభిమానపాత్రుడు:

## కాలనాథభట్ట వేంకటరమణమూర్తిచే

రచింపబడి,

భట్నవిల్లి గ్రామసంస్థాపిత

శ్రీశారదాముద్రాలయమున ముద్రింపబడి,

ప్రకటింపబడినది.

మొదటిముద్రణము 1000 ప్రతులు.

**1953**

 [పోస్టేజితోసహా వెల: **5-8-0.**

# హెచ్చరిక.

వైద్యులు, వైద్యేతరులుకూడ యీగ్రంథమునం దుదహరింపబడిన మందులలో చట్టవిరుద్ధము కాకుండునట్లు వారివారిఅర్హతలకు తగినమందులనుమాత్రమే వాడనగును

## ఉద్దేశము.

ఎంతప్రవీణు డైనను కార్యకర్త యగువాడు దోషపాత్రుడే యగును. అట్టి స్థితిలో నావంటి జడమతులమాట చెప్పనేల! సామాన్యముగా మానవులచే ఉచ్చరింపబడు ప్రతిమాటయందు పవిత్రత, చేయబడు ప్రతిపనియందు ప్రయోజనము కానరానట్లే, ఇచటను యోచించనగును ఒకరి కింకొకరికి తెలియని చికిత్సా రహస్యములు వేనవేలు గలవు ఎవరికి తెలిసినవి వారితోనే అంతరించుటకంటె అనుభవజ్ఞులు తమకు తెలిసిన క్రియలను భూమిపై ఒడవేయుట మంచి దను అభిప్రాయముతో యీగ్రంథము నాచే పెద్దలమార్గము ననుసరించి వ్రాయబడినది ఆరోగ్యవిషయమైన క్రియాప్రధానముగాని, పాండిత్యప్రకర్షతో పనిలేదు క్రియాపరిచయము, పాండిత్యప్రకర్ష అను యీరెండును ఒక స్థానమున లేని కారణమున- శ్లో॥ అనుక వ్యతో గ్రాహ్యం బాలా దపి సుభాషితమ్। నీచాద ప్యుత్తమాం విద్యాం స్త్రీరత్నం దుష్కులా దపి॥ అన్నట్లు గుణము లందలి ఉపయోగవిషయములను మాత్రము సంగ్రహించి రచనయందుగల పొరపాట్లను, వైద్యులను రెండవ ముద్రణమున నాచే సవరింపజేయ ప్రార్థితులు

ఇట్లు



గ్రంథకర్త.

(1) అర్ధనారీశ్వరచంద్రికల్పము, పోస్టేజీతో రు 1—4—0 గృహస్థులకు దుష్టగ్రహస్థితిచే కలుగు యిక్కట్లను తొలగించి, పునః వృద్ధిని కలుగజేయును

(2) జాతకమర్మబోధిని, పోస్టేజీతో రు 2—8—0 జాతకము వ్రాయు విధమును గాని, జాతకఫలితములను గాని ఎవరికివారు చెప్పుకొనుటకు ఉపయోగకరముగ నుండును గృహస్థుల కుపయోగించు ధర్మశాస్త్రవిషయము లనేకములు కలవు

(3) వాస్తుసారాంశము (అచ్చు) పోస్టేజీతో రు 2—0—0 ఏకశాలలు, ద్విశాలలు, త్రిశాలలు చతుశ్శాలలు, దిక్స్వభావములు, యమతుల్యగృహవివరణము మున్నగు స్కెచ్చిలతోను, సుపదములతోను, అపూర్వమయిన వాస్తురహస్యములతోను యలరారుచున్నది

---

గ్రంథప్రాప్తిస్థానము - కాలనాథభట్ట వెంకటరామశాస్త్రులు,
పాశర్లపూడి, రాజోలుతాలూకా, తూ॥గో॥జి

షరా — ఒక పేరకములో 3 పుస్తకము లొకసారిగా తీయువారికి ఒక పుస్తకము బహుమానముగా పంపబడును అట్లు తీసుకొనువారు ముందుగనే సగము సొమ్మును పంపవలెను

# విజ్ఞప్తి.

శ్లో. గ్రామేషు పల్లీషు నివాసకానాం
శాస్త్రానభిజ్ఞాన చికిత్సకానాం।
సాధుక్రియానిర్వహణాయ తేషాం
లోకోత్తరజ్ఞానవతాం న చాయం॥

ఈ గ్రంథము ఆంధ్రదేశమున, కుగ్రామములయందును, మారుమూలలనున్న పల్లెలయందును నివసించు శాస్త్రానభిజ్ఞచికిత్సకుల సదాచరణకొరకు చేయబడినది గాని, పండితులగు చికిత్సకులకొరకు కాదు

శ్లో. కస్యాపి దీప్తే పంక్త్యాంతే ఽప్యుపలంభకర్తృభి
ర్యద్వ్యంజన నిహంతే హారి తస్య దచ్చైః।
గ్రంథస్య ది ప్రేహంతే విషయాగదాదౌ
తత్రైవ చ పరిహ్రియంతే పృథవాఽధికేషు ॥

పాకములయందుండిన మిరపకాయముక్కలు మొదలయినవి ఆస్వాదకులచే పరిహరింపబడినను, కూర మొదలయిన పదార్థముల యొక్క రుచికొరకెట్లు సమర్థములగుచున్నవో, అట్లే యిం దుదహరింపబడిన విషయములయందును, ఔషధాదులయందును, ఒకటిగాని, అంతకధికముగాని పరిహరింపబడినను ఆ విషయౌషధాదులు యీ గ్రంథముయొక్క శోభకొరకు సమర్థములగుచున్నవి

ఆస్పృష్టే ఽపి పూర్వపక్షమథనం గ్రంథే కృతే ప్రాయికం
స్యాల్లోపాశ్శతశః ప్రయోజనకృతీ త్యాలోచ్య సంస్కృత్య తాన్ ।
కృత్స్నే ఽప్యేత మశేషబాలకభిష క్ప్రారంభపారోచితం
కుర్వంతు స్థితి మబ్ధివేష్టితమహీచక్రే ఽస్య యూయం బుధాః ॥

గ్రంథము, చేయబడిన దగుచుండ, పూర్వపక్షమథనము, సృష్టిప్రారంభము మొదలుకొనియు ఉన్న విషయమే గాన, కార్యకర్తలయం దనేకవిధలోపము లేర్పడుట సహజమని ఆలోచించి, అట్టి లోపముల నన్నిటిని సవరించి, యీగ్రంథమును చిన్నవైద్యులందరియొక్కయు ప్రథమపాఠమున కుపయోగమైనదానినిగా జేసి, ఓ పండితులారా! మీరు జలధిపరివేష్టితమయిన భూమండలమున యీ గ్రంథముయొక్క స్థితిస్థాపకత్వమును చేయుదురుగాక!

పసిబిడ్డలకు ప్రియమైన ఆనుపాలు, పెద్దవారల కప్రియమైనట్లు ప్రథమాభ్యాసకుల కుపయోగమైన యీగ్రంథము ప్రజ్ఞాధికులకు రుచింపదనుట నిశ్చయము మానవులకు గలుగు బహువిధరోగములను క్రోడీకరించి సులభసాధ్యమైన

మనం దాయుర్వేద, సారూప్య, ఆంగ్లేయ చికిత్సలకు సిద్ధపడుచున్న సాహసికులు అనేకపల్లెటూళ్ళయందు చూడబడుచున్న విషయ మెల్లరకును విశదమే కొన్నికొన్ని కుగ్రామములలో ఎవరో ఒకరు సంచికట్టుకట్టి, ప్రజాసేవారూపమైన వైద్యమును నడపించుచుండుటచే కొంతవరకున్ను పక్వోన్ముఖమైన, లేక సహజప్రశాంత్యాత్మకమైన ఏవియో కొన్ని వ్యాధులు నివారణ కాబడినంతమాత్రమున సద్వైద్యుని గాను. పక్వ కాలవ్యవధానమైన, లేక, సహజాప్రశాంత్యాత్మకమైన ఏవియో కొన్ని వ్యాధులు నివారణ కాబడినంతమాత్రమున అసద్వైద్యుని గాను యోచించు ప్రజా సామాన్యముచే కొంతవరకున్ను యీ సాహసికుల ఉద్యమమునకు కారణమగుచున్నది శాస్త్రాభ్యాసము లేని చికిత్సకులకు జిజ్ఞాసాభిలాష యున్నను శాస్త్రీయ చికిత్సకుల వద్దకు వచ్చి, తమకు తెలుసుకొనవలయునని యున్న విషయములను పృచ్ఛచేసి తెలుసు కొనుటకు సామాన్యముగా చాలమంది సంశయింతురు ఒకవేళ ఎవరో ఒకరు వచ్చి సాహసించి పృచ్ఛచేసినను అది ప్రశ్నయే కాదని నిరసించియో, లేక, తానేదో బ్రహ్మణ్యుడ నని ముఖపిధాన మయేటట్లు అగవ్యగోచరములైన గడగొయ్యమాట లేవియో చెప్పియో, పృచ్ఛకుల హృదయమును వికలముచేయుదురు గాని, ఆ పృచ్ఛకులకు కావలసిన సమాధానమును ఓపికపట్టి చెప్పువారు మిక్కిలి అరుదుగా నుందురు ఇందుచే సామాన్యాసామాన్యులకు ప్రశ్న సమాధాన సంఘటనము కుదరదు. ప్రకటనలను బట్టియు, వేషవాగాడంబరములను బట్టియు వృద్ధిచెందుచున్నట్లు తోచు చున్నను వర్తమాన కాలమున వైద్యవిధానమంతయు ఎగ్గాయిదిగ్గాయిగా నున్న దనుట సిద్ధాంతము రోగోత్పత్తిని తెలుపు భాగము హేతుస్కంధము. రోగలక్షణములను వివరించుభాగము లక్షణస్కంధము ఔషధనిర్మాణగుణాదులను వివరింపుచు ఆయా వ్యాధులయం దాచరింపవలసిన చికిత్సావిధానమును తెలుపుభాగము ఔషధస్కంధము (రోగ హేతువులను, లక్షణములను వివరించుభాగము నిదానము). ప్రకోపించిన వాత, పిత్త, కఫములే సకలరోగములకు మూలకారణములు (దోష త్రయసిద్ధాంతమే ఆయుర్వేదసమ్మతము). మిథ్యాహార విహారాదులే వాతాదిప్రకోప కారణములు మిథ్యాహారవిహారజనితదోషోపశమనముకొరకు ప్రాజ్ఞులచే విధింపబడిన నిరాహారనియమము, ఏకభుక్తనియమము మున్నగు నియమములు అన్నియు ఆరోగ్యమాత్రప్రతిపాదకములు ఈ నియమములు జీర్ణాశయముయొక్కయు, పేగులయొక్కయు విశ్రాంతికరములు గన ఆరోగ్యాభిలాషులచే ఆచరింపతగినవి. ప్రస్తుత కాలమం దట్టి నియమసమయములయందు కూడ క్రొదివిధమున కాఫీ, టీ మొదలయిన దురాచరణమునకు అలవాటుపడి దేహారోగ్యమును కోలుపోవు చున్నారు.

శ్లో. కాఫీం టీం వా ప్రాతరాదౌ గృహీత్వా
పశ్చాత్కర్మ ప్రారభంత్యేవ నిత్యమ్ ।
ప్రాణాభావ స్స్యాదితీ వాన్యథాచే
త్ప్రాణాభావే కర్మ కింవాఽఽచరామః ॥

శుష్కకుక్షితో చేసినయెడల ప్రాణమునకు హాని కలుగును. ప్రాణహాని కలిగినచో ఏమిచేయగలమన్నట్లు, నిద్రనుండి లేవగనే ప్రాతఃకాలమందు కాఫీని గాని, టీని గాని పుచ్చుకున్నతర్వాతనే తమతమ నిత్యకృత్యములను ప్రారంభించు చున్నారు.

శ్లో. స్నానస్య పూర్వం పరతః పిబంతి
ద్రవస్వరూపా న్యశుచి శ్శుచి ర్వా ।
సర్వత్ర వర్ణాశ్రమధర్మశంకా
మపాస్య నూనం క్షురకర్మమధ్యే ॥

స్నానమునకు పూర్వమందు గాని, పరమందు గాని, శుచికలవాడై గాని, అశుచి కలవాడై గాని, క్షురకర్మమధ్యమందుగాని వర్ణాశ్రమధర్మసంశయముతో పనిలేకుండా, ఎక్కడపడితే అక్కడ ద్రవస్వరూపములయిన కాఫీ, టీలను స్వీకరించుచున్నారు

శ్లో. సువాసినీ పూర్వసువాసినీ వా
య త్యాహితాగ్ని గృహమేధనోపి ।
త్యక్త్వాఽత్ర సందేహపదం విభీతాః
పిబం త్యనశ్యం చ యథానుకూలమ్ ॥

సువాసినీలు, విధవాస్త్రీలు, సంన్యాసులు, ఆహితాగ్నులు, గృహస్థులు మున్నగువారు సందేహమును విడచి, నిర్భయముగ వారివారి యిష్టానుసారము కాఫీ, టీలను స్వీకరించుచున్నారు

శ్లో. క్రతౌ వివాహాదిషు పైతృకాదౌ
మహోత్సవే బంధుసమాగమే వా ।
అకాలచింతానియమం పిబంతి
సర్వేషు కార్యేషు శుభాశుభేషు ॥

క్రతువులు, వివాహాదిశుభకార్యములు, పిత్రార్థికాదులు, మహోత్సవములు, బంధువులు, స్నేహితులు మున్నగువారు వచ్చినతరుణము, మరియు సర్వవిధములయిన శుభాశుభములు, శరీరమందు కాలనియమములతో పనిలేకయే యీచెప్పబడిన సాక్షీ, ట్రీల నుపయోగించుచున్నారు. ఈవిధముగా ప్రజలకు సుకుమార వధికమైనకొలది రోగములున్ను రోగము లధికమైనకొలది వైద్యులున్ను, వైద్యు లధికమైనకొలది చికిత్సావిధానములున్ను ఒకదానికొకటి దినదినప్రవర్ధమానము లగుచునే యున్నవి.

మిథ్యాహారాదిదోషసంబంధము లేకున్నను, పైన వివరించిన దురాచరణ లేకున్నను, ఒక్కొక్కప్పుడు మారాత్మీయములైన శస్త్రాస్త్రాభిఘాతాదులచే తక్షణమే వాతాదులు ప్రకోపమునుజెంది, పోటు, నొప్పి మున్నగు నుపద్రవములను కలుగజేయును. ఇవ్విధంబున జనించినరోగము, మరియొక రోగమును పుట్టించుట కూడ కలదు. ఏదిఅయిన నొకరోగము స్వతంత్రముగ జనించి బాధించునప్పుడు, తగిన చికిత్స చేయక, ఉపేక్షించినచో అదియే ప్రబలమై, ఇతరవిధములైన బహువిధరోగములను పుట్టించును. అట్లు పుట్టిన వివిధరోగములు గూడ రోగహేతువుల పోలి యుండును వాటిలో ఒక్కొక్కరోగము మరియొకరోగమును పుట్టించి, తనకు తానే శమించును మరియొకరోగము, ఇంకొకరోగమునకు తాను కారణముగానుండి, రోగాంతరమును పుట్టించుటతో శాంతినొందక, తనవలన పుట్టిన రెండవరోగముతో కలిసి బాధించుచుండును. ఈవిధముగా వ్యాధిసాంకర్యము చికిత్సకు కష్టము కలిగించుచుండుట, అనేకచోట్ల ప్రత్యక్షమగుచున్నది. వ్యాధి అనేకముల పొందినప్పుడు గాని, సంకీర్ణమయినప్పుడు గాని అసాధ్యమై, ఒకానొకసమయమున ఫలానిరోగమని కూడ నిర్ణయింప శక్యము కాకుండును. అట్టి తరుణమున నేర్పరియగు వైద్యుడు తన ఊహచేతనే రోగనిర్ణయమును చేసికొని, శాస్త్రములయందు తనకు స్ఫురించిన మందులతో చికిత్స చేయునది గాని, రోగనిర్ణయము కొరకుగాని, ఔషధనిర్ణయము కొరకుగాని, గ్రంథపరిశీలనము, వాదోపవాదములు మొదలయిన విమర్శనముల నాచరించినయెడల ప్రయోజనము చెడును. ప్రధానరోగమును గుర్తించి, తగిన చికిత్స చేసినయెడల అప్రధానరోగముతోపాటు అప్రధాన (సంకర) రోగమున్ను శాంతించును. సంకరవ్యాధికి వేరు చికిత్సచేయ నవసరముండదు. కాన వైద్యాభ్యాసకులు ప్రధానాప్రధానరోగవిజ్ఞానము కొరకు సర్వదా తమశక్తిని ధారపోయుచుండ వలయును. ఒకానొకచోట ప్రధానాప్రధానరోగవేత్తలగు వైద్యులు తటస్థపడి, వారియొక్క దోషనిర్ణయాభిప్రాయము లొకటే అయినను, ఔషధప్రయోగపద్ధతు లున్ను, గ్రంథపరిచయాభిమానములున్ను భిన్నభిన్నములై యుండుటచే పరస్పరచికిత్సానుసరణమునకు అంతరాయము కల్గుచున్నది. ప్రాజ్ఞుడైన వైద్యుడు యథాన్యాయముగ చికిత్స చేయుచున్నను, స్వభావసిద్ధముగా వ్యాధి అసాధ్యమైనను, లేక, కుదురుటకు ఆలస్యమైనను, వారివారి అదుర్దాప్రకారము తక్షణమే యింకొక

వైద్యుని ప్రవేశపెట్టి, మొదటివైద్యునకు వైద్యముచేత కాదను ప్రతీతిని కలిగించుట దురాచారమైయున్నది. దేహధారి ఎట్టి హేయస్థితియందుండైనను పోవుట కిష్టపడని తన ప్రాణములను రోగగ్రస్తుడైనప్పుడు అపథ్యమునందలి యాశచే పోవుట కిష్టపడినట్లు బంధుమిత్రాదులయొక్క, ప్రేరేపణనిర్బంధముచేతనున్ను, లోభత్వముచేతనున్ను వైద్యనటకులచేతజిక్కి, క్వచిత్తుగా ఒక్కొక్కరోగి తనప్రాణములను గోలుపోవుచున్నాడు యీ విషయమనేకులకు తెలియనిదికాదు సంధ్యావందనము చేయనివారలను, బ్రాహ్మణులలో నుండి తొలగింపజాలనట్లే, వైద్యశాస్త్రజన్య జ్ఞానమణుమాత్రమైనను లేకపోయినను, వైద్యమే ప్రధానవృత్తిగా పెట్టుకొని జీవించు వైద్యనటకులను, వైద్యవృత్తినుండి తొలగించుట అనన్యసామాన్యమయిన విషయము.

శ్లో. వ్యాధే రయుక్తం యద్ద్రవ్యం గణోక్త మపి తత్త్యజేత్ ।
అనుక్త మపి యద్యుక్తం యోజయే త్తత్ర తద్బుధః ॥

ఎట్టి ఔషధయోగమందైనను, చెప్పబడిన ద్రవ్యము రోగోపశాంతి కనుపయోగమయినచో దానిని విడువనగును చెప్పబడకున్నను, రోగోపశాంతి కుపయోగమైనచో దానిని చేర్చవలయును ఇది అనుభవము కలిగి చికిత్సచేయు ప్రాజ్ఞుడగు వైద్యుని అధీనమైయున్నది ఇట్టి సూత్రములకసందర్భార్థ కల్పనలచేసి, కొంతమంది పండితంమన్యులు, మిరియాలకు బదులుగా తమకుతోచిన ఏ కశిందగింజలనో, నిమ్మకాయరసమునకు బదులుగా ఏ పుల్లదబ్బకాయరసమో, లేక ఏ నారింజకాయరసమో, పోసి వారివారి ఇష్టానుసారము మాత్రలనో, కుప్పెలనో, తయారుచేయువారు కొందరు, ద్రవ్యసంపన్నత కలిగియుండుటచే లోకోత్తరనామములుగల మందులను తయారుచేయుటయే ఘనకార్యమని ప్రారంభించి గ్రంథస్థములైన కొన్ని క్లిష్టపదముల అర్థముకొరకు అనేక నిఘంటువులనో, గ్రంథములనో పరిశీలించి బ్రహ్మాండము మీద [illegible] దేనితో సమన్వయించి, [illegible] చెప్పినట్లు వదిసో [illegible] యుంటాని శోధించి, దానితో [illegible] పూర్తిచేయువారు కొందరు సందర్భముకాని ఒకవస్తువును వేయనంతమాత్రముచే ఆమందుకు లోపము కలుగునా? అని తమకు సందర్భములైన వస్తువులతోనే పూర్తిచేయువారు కొందరు ఇట్టివే యింకా అనేకవిధములైన పరిస్థితులచే మందులు సరియైనవి కాకపోవుటయే గాక, ఒకదాని కొకటిపడియు, అసంపూర్ణద్రవ్యములతో నిర్మింపబడియు, గుణవిపర్యాసమునకును, ప్రాణప్రయాసకును కారణ మగుచున్నవి ఔషధముపేరు ఒకటే అయినను, అనేకులగల ఔషధయోగములు అనేకగ్రంథములయందు అనేకవిధములుగా నుండుటచేతను, ఎవరు తయారుచేసినమందులయందే యేయేవస్తువులు చేర్చబడినవో

చేసినవానికి తప్ప, ఆయా మందుల పేర్లను విన్నవానికిగాని, చూచినవానికిగాని తెలుసుకొనుటకు శక్యముకాకుండుటచేతను, ఒకరు తయారుచేసినమం దింకొకరు వాడుట ప్రయాసకరము. ఈమాదిరిగా ప్రతివిషయము ప్రారంభము లగాయితు కొసకంటా సంబంధములేకుండా యెవరికితోచినట్లు వారు ధైర్యసాహసములతో వృత్తిని కొనసాగించుచుండుటయే దేశీయవైద్యంలో మతభేదములకున్నూ, అన్యోన్యానుసరణకును, లోకానాదరణకును కారణమగుచున్నది. ఎంతఔషధసంచయము కల వైద్యునికైనను స్వార్జితపరికరవ్యయస్థితియందు వ్యాజనాదులతో కాలముగడుపు గృహస్థునిభంగి, తనవద్ద నున్నమందులు ఖర్చుపడినప్పుడు అప్పటికి తనవద్ద సిద్ధముగా నున్న మందులతో కాలము గడుపుట తటస్థమగుచుండును. గృహస్థు లీవిషయమును తెలియజాలక, తమ కవసరము తటస్థమైనప్పుడు హఠాత్తుగా వైద్యునికడ కేగుటయు, రోగ మెంతప్రమాదకరమైనదైనను ద్రవ్యాశాపరు డను నిందపా లగుదునను విభీతసంకల్పముగల వైద్యుడు తనవద్ద తగినమందు లేదని గాని, ఫలానామందు తేవలసిన అవసరము కలిగియున్నదని గాని చెప్పకుండు దురాచారము చాలపల్లెల యందు ప్రబలియుండుటచే తనవద్దనున్న మందులలో దేనినో ఒకదానిని ఆషామాషీగా ఇచ్చుటయు, మందుతీసుకొనువారు వైద్యునిచేతిచలవ మంచిదను నిచ్చి నమ్మకమే గాని, మందులలోని శక్తిని తెలియజాలకయు, కొట్టకొసకు సులభసాధ్యమైన రోగము సరియైన మందులతో చికిత్సింపబడక, అసాధ్యస్థితిలోనికి వచ్చుటయు ప్రాజ్ఞులకు విదితమే. ఆయుర్వేద, సారూప్య, అంగ్లేయచికిత్సాభ్యాసకుల కిది మార్గదర్శియగునట్లుతత్తచ్చికిత్సాభినివేశముగల నిష్ణాతులచేనిర్దేశింపబడినవియు నాకనుభవ మందున్నవియు నగు మందులు వర్గాగదప్రకరణమున పొందుపరుపబడినవి. అభ్యాసకులు వారివారి ఉత్సాహానుసారము ఏవిధమయిన చికిత్స నవలంబించినను ఒకవిధానమునం దింకొకవిధానము నాచరించి చికిత్సాసాంకర్యము గావింపక, ఒక విధానముననే చికిత్సను కొనసాగించుటయు, తాము ప్రయోగించు మందులయొక్క గుణపాఠమును చక్కగా తెలిసియుండుటయు, నిష్ణాతులగు పెద్దలు తటస్థపడినచో తాము చేయుచున్న చికిత్సావిధానమును వారికి తెలిపి, వారి సలహా ననుసరించుటయుమూలమున శ్రేయస్కాములు కాగలరు. ఆపరేషనువంటి ప్రమాదకరము కాకున్నను, శస్త్రచికిత్సాలయమున శిక్షితులుగాని వైద్యులు ఎన్నడున్ను సాహసించి యింజక్షను చేయరాదు. ఇంజక్షను అనగా మందును సూదితో రోగియొక్క శరీరమునందలి రక్తములో ప్రవేశపెట్టుట. ఇంజక్షను కొన్నికొన్ని సమయములయందును, కొన్నికొన్ని వ్యాధులయందును ఉపయోగించును. ఇంజక్షను చేయుటచే అమాశయము నుండి బయలుదేరు రసమువలన మందుకు కెట్టిమార్పును కలుగక, శరీరమున వ్యాపించును. కొన్నిమందులు మామూలు మందులవలె, లోనికివేసినయెడల, అమాశయమున

గల, పాచకరసముతో కలసి వికృతిని పొందును. గాన అట్టి మందులను ఇంజక్షను చేయవలయును. గాని లోనికివ్వరాదు కొందరికి ఇంజక్షను చేసిన స్థలమందు భయంకరమైన వాపు జనించియు, పుండ్లుపడియు, అసలురోగముకంటె ఎక్కువబాధకలిగి, అనేకవిధములుగా చిరకాలము బాధనొందినవారి ననేకులను మన మనేకచోట్ల చూచుచునే యున్నాము. అపరేషనువిధాన మంతయు కరతలామలకముగా నలవడిన కోవిదులకే ఒక్కొక్కప్పుడు నాడులు సరిగా తెలియక, నాడులయందసందర్భస్థలమున "సూది" ప్రవేశపెట్టబడి, అనేకవ్యత్యాసములు, తటస్థపడుచుండ, అశిక్షితులు చేయు, ఇంజక్షనులయం దెంతప్రమాదము కలుగవచ్చునో ఊహింపవలసిన విషయమై యున్నది రణవైద్యులను పేరుతో వ్యవహరించుచున్న నాటువైద్యులుచేయు అపరేషనుమాట తలబెట్ట నవసరమే లేదు. స్వేచ్ఛాలబ్ధపాండిత్యముచే ఔషధప్రయోగమే అసమంజస మగుచుండ, ఆయుధప్రయోగ మెంత అవకతవకగా నుండనోపునో చెప్ప నవసరముండదు. గ్రామాధికృతుడనై పల్లెటూరియందు కాలమును వెళ్ళబుచ్చుచున్న నాకు చికిత్సాపరిచితి అంతగా లేకున్నను, మిత్రప్రేరణచే నాకు తెలిసినంతవరకు లోకమున వైద్యులకును, గృహస్థులకును గల సాధకబాధకములను గ్రంథరూపమున వెల్లడించితిని. సత్యాన్వేషణతత్పరు లగు వైద్యులున్ను, గృహస్థులున్ను, వైద్యాభిమానులున్ను నాచే పెద్దలమార్గము నవలంబించి చేయబడిన యీచిన్నగ్రంథమునందు గ్రహింపతగినవిషయములను క్షీరనీరన్యాయముగ గ్రహించి పొరపాటు లేవియైన నున్నచో మన్నించి, వాటిని సానుభూతితో నాకు తెలియజేసి రెండవకూర్పున నాచే సవరింపజేయగలరని యాశించుచున్నాను ఈగ్రంథప్రకటనకు పూనుకొనిన "జడ్జతుల్ యకరాన్ శ్రీదువ్వూరి వేంకటపతిసోమయాజులు బాఫీయత్ భాషండ్ (తూ గో జి. అమలాపురంతాలూకా ముక్కామల)జమీందారు" వారికి మాకృతజ్ఞతాసూచకముగ మొదట "చిత్రాగదసంగ్రహము" అను పేరుతో వ్రాయబడిన యీగ్రంథమునకు "సోమయాజిసత్పథము" అను పేరిడి కృతిగా యివ్వబడినది. తమకు గల కలాభిమానమును కార్యరూపముగ కనబరచువారరునైన యీరోజులలో శ్రీజమీందారువారు యీగ్రంథప్రకటనవిషయమున కనుపరచిన ఔదార్యము ప్రశంసనీయము సత్కార్యములకొరకే తమయొక్క ద్రవ్యమును, కాలమును వినియోగపరచుచు, మహోదారస్వభావముకల శ్రీజమీందారువారికిని, వారికుటుంబమునకును, సాధుజనపరిత్రాతయగు పరమేష్ఠి సంపూర్ణాయురారోగ్యైశ్వర్యములనిచ్చి నిరంతరము రక్షించుగాక! "సోమయాజిసత్పథము" అన యజధాతువు పూజార్థకము, సోమశబ్దము చంద్రపరముచేయగా ఓషధులకు ప్రభువు సోముడు. ఆ సోముని పూజించుట వైద్యునియొక్క కర్తవ్యము గాన సోమయాజి అనగా వైద్యుడని యౌగికార్థము, సత్పథమన మంచిమార్గము అని ఫలితార్థము. కృతిపోషకుల కిట్టి

కృతజ్ఞత కనబరచుకొనుట నాకు విధాయకకృత్య మను సంగతి పాఠకమహాశయులకు విశదము, మనస్సమాధానోచితము, ముదావహము శ్లో॥ ఉపద్రవాదివిషయస్స్వత్రంత్రోత్సుకాత్మనామ్ । నవీనభిషజా మేష స్సుబోధాయ భవిష్యతి ॥ తా॥ ప్రధానరోగముతో జనించిన అప్రధానరోగములు, మరణసూచకలక్షణములు, వ్యాధిహేతువులగు మిథ్యాహారవిహారాదులు, వ్యాధిని తెలుపు పూర్వరూపాదులు అను విషయనిబద్ధమైన యీగ్రంథము వివిధవైద్యశుతూహలురగు నవీనవైద్యులయొక్క సుఖబోధముకొరకు కాగలదు ఉపద్రవాదులను తెలుపుటవిషయము, వీటిని ప్రతిపాదించుట గ్రంథమునకుగల సంబంధము. అభినవవైద్యులు, వైద్యకుతూహలముగలవారలు అధికార్లు. సుబోధరూపకమైన విజ్ఞానము ప్రయోజనము. ఇట్లని అనుబంధచతుష్టయోపపత్తి.

ఇట్లు సజ్జనవిధేయుడు,

గ్రంథకర్త.

# గ్రంథస్థవిషయములు.

పుటములు.

## 1. శరీరాంతర్గత ముఖ్యావయవపటము.




(1) స్వరపేటిక; (2) కంఠనాళము, (3) మెడకొంకి; (4) కుడిఊపిరితిత్తి, (5) కాలేయము, (6) పిత్తాశయము, (7) కుడిమూత్రపిండము, (8) కుడి మూత్రనాళము, (9) పెద్దపేగు, (10) లంబిక; (11) క్రిమిక; (12) గళధమని, (13) గళసిర, (14) ఎడమ ఊపిరితిత్తి, (15) గుండెకాయ; (16) జీర్ణాశయము, (17) ఎడమ మూత్రపిండము, (18) ఎడమమూత్రనాళము; (19) చిన్నపేగులు; (20) మూత్రాశయము.

## 2. అస్థిపంజరము.




(1) లలాటాస్థి, (2) పైదవడఎముక, (3) క్రిందిదవడఎముక; (4) మెడపూస (5) మెడకొంకి (6) అంసఫలకము (7) రొమ్మెముక, (8) భుజాస్థి (9) ప్రకోష్ఠ ఎముక, (10) వెన్నుపూస; (11) మణిబంధాధారాస్థి, (12) కూర్పరాస్థి, (13) మణికతిములు, (14) కరాంగుళ్యాధారాస్థులు, (15) కరాంగుళ్యస్థులు; (16) తుంటి ఎముక, (17) త్రికాస్థి (18) త్రోటిక, (19) ఊర్వస్థి (20) మోకాలిచిప్ప; (21) జంఘిక, (22) జానుక; (23) చీలమండఎముక; (24) పాదాంగుళ్యాధారాస్థులు; (25) పాదాంగుళ్యస్థులు.

## 3. నాలుక.




(1) మూలము,
(2, 2) రుచినితెలుపు గుట్టలు.
(3) అగ్రము.

## 4. హృదయకుహరము.




(1, 1) ప్రక్కయెముకలు,

(2) ఉపాస్థి,
(3,3) మెడకొంకులు
(4, 4) అంసఫలకములు
(5) రొమ్మెముక

## 5. ఊపిరితిత్తులు.




(1) స్వరపేటిక (2) కంఠనాళము, (3) వాయునాళములు. (4) ఎడమ ఊపిరితిత్తి

## 6. గుండెకాయ.




(1) పుపుస్సధమని (2-2) బృహద్ధమని, (3) ఎడమ భుజధమని (4) ఎడమగళధమని (5) కుడిగళధమని, (6) కుడిభుజధమని, (7) ఊర్ధ్వబృహత్సిర; (8) అ బృహత్సిర

## 7. గుండెకాయలోని గదులు.




(1) కుడికర్ణిక; (2) కుడిజఠరిక; (3) ఎడమ కర్ణిక, (4) ఎడమజఠరిక, (5) బృహద్ధమని; (6) పుప్పుసధమని; (7) పుప్పుససిరలు, (8) ఊర్ధ్వ బృహత్సిర; (9) అధో బృహత్సిర

## 8. కాలేయము.




(1) కుడివృత్తము, (2) ఎడమవృత్తము, (3) పిత్తాశయము, (4) అధోబృహత్సిర, (5) జీర్ణాశయసిర, (6) కాలేయధమని, (7) పైత్యవాహిక.

## 9. ఆహారనాళము.




(1) పసరుతిత్తి, (2) ఆహారనాళము; (3, 4) పైత్యవాహికలు; (5) ఆంత్రముఖము, (6) ఆంత్రమూలము; (7) జీర్ణాశయము, (8) కాలేయవృక్వకములనుండి వచ్చిన వాహికలు పడు స్థానము, (9) మధురవాహిక, (10) వృక్వకము, (11, 11) పెద్ద ప్రేగు, (12) చిన్న ప్రేగులు, (13) క్రిమిక, (14) పురీషనాళము; (15) అధోముఖము.

## 10. జీర్ణాశయ సిర.




(1, 2) కాలేయము, (3) పసరుతిత్తి, (4–8) పెద్దపేగు, (5) జీర్ణాశయము, (6) ప్లీహా, (7) వృకము. a. e. d. c. జీర్ణాశయసిరశాఖలు,

## 11. వృక్యాకప్లీహాలు.




(1) బృహద్ధమని, (2) ప్లీహా. మునకు పోవు ధమని, (3) ప్లీహా; (4) సిర, (5) వృక్యాకము, (2 వ అంకవేయబడిన కాలీలో జీర్ణాశయమున్ను, యీ 2 వ అంకకు ఎడమ వైపున అంత్రమూలమున్ను ఉండును.

## 12. మూత్రపిండములు.




(1) ధమని, (2) సిర, (3) కుడిమూత్రపిండము, (4) ఎడమమూత్రపిండము; (5, 5) మూత్రనాళములు; (6) మూత్రాశయము, 7, 7) మూత్రనాళములు ప్రవేశించుచోటు. మూత్రనాళాగ్రములు.

---

# అభిప్రాయము

భారతదేశము రత్నగర్భము, చతుష్షష్టికలాధివాసము, సకల సస్యసమృద్ధము, యజనాదికర్మల కాలవాలము. ఇట్టిదేశమునందు జన్మించిన ఈగ్రంథకర్త నిద్రాహారములకుసైతము తావులేని గ్రామోద్యోగిపదవియం దుండియు, మిక్కిలి శ్రమతీసుకొని, ఎక్కువ అనుభవముతో వైద్యరహస్యముల నన్నిటిని ప్రథమాభ్యాసకులకు తేటతెల్లముగా తెలియునట్లు యీగ్రంథమును వ్రాసి జన్మసార్థకము చేసుకొనెననుట యతిశయోక్తి కానేరదు. వివిధవైద్యకుతూహలాభిలాష గల ప్రథమాభ్యాసకుల కిది సులభముగ చికిత్సాప్రవేశమును కలిగించుట కెంతమాత్రమును సంశయములేదు. "సిద్ధ్యావాదభయం" అను సుభాషితప్రకారము ప్రాచీనులచే రచింపబడిన గ్రంథరాజములే నిర్దుష్టముగా లేవని జరిగించుచున్న విమర్శనములు ఈనాటికిని యున్నవి. ఒకరౌనన్నది మరియొకరు కాదనుట మొదలుపెట్టినవో, ప్రకృత విషయమునకు స్థానమే ఉండదు. గాన, యిందు నిర్ణయించినమందులు మానవకోటికి సంభవించెడు పలువిధవ్యాధుల నివారణకు సరిపోవుననియు, అభ్యాసకులకు ప్రథమప్రవేశోచితము లనియు నా యాశయము. నాయందు గల నిర్వ్యాజవాత్సల్యతతో మదీయాభిప్రాయమును వెల్లడిచేయు నావకాశమును నా కొసంగిన గ్రంథకర్తగారికి నేనవరతము కృతజ్ఞుడను.

మేడూరి కామేశ్వరావు.

26-12-1945

శ్రీగణేశాయ నమః.

# చిత్రాంగదసంగ్రహాఖ్యే
# శ్రీ సోమయాజిసత్కథే
## ప్రశంసాప్రకరణమ్॥



### —గోత్రప్రశంస—

శ్లో॥ శ్రీమాన్వేదవిదగ్రణీ ర్ద్విజవరః కాల్నాథభట్టాన్వయ
స్సద్యజ్వా ప్రథితః పరాశరపురే శ్రీసూర్యనారాయణః।
భారద్వాజసగోత్రజ స్సమభవ త్తస్యాత్మజ స్సత్కృతిం
చక్రే వేంకటపూర్వకో రమణమూ ర్త్యాఖ్యః ప్రణమ్యాశ్వినౌ॥

పాశర్లపూడి, యను గ్రామమున వేదవేత్తలలో అగ్రగణ్యుడును, భారద్వాజస గోత్రికుడును, బ్రాహ్మణశ్రేష్ఠుడును ఆయిన సూర్యనారాయణదీక్షితులు అను ఆహితాగ్నికలడు, అతనికుమారుడు వేంకటరమణమూర్తి అనువాడు అశ్వినీదేవతలకు నమస్కరించి యీగ్రంథమును రచించెను. ॥౧॥

### —జన్మభూకథనం—

శ్లో॥ అంత ర్వేదిక్షేత్ర మస్త్యాంధ్రదేశే
యామ్యాగన్వత్ప్రాగుదగ్గైనతేయం।
ప్రత్యగ్వాశిష్ఠం చ తత్రాంతరస్థా
తజ్జన్మోర్వీ భాతి పాశర్లపూడిః॥ ॥౨॥

ఆంధ్రదేశమున దక్షిణభాగమున సముద్రమును, ప్రాగుత్తరభాగములయందు వైనతేయమను నదియు, పశ్చిమభాగమున వశిష్ఠానదియు గల అంతర్వేది యను పుణ్యక్షేత్రము కలదు ఆక్షేత్రమున యీగ్రంథనిర్మాతయొక్క జన్మభూమియగు పాశర్లపూడి యను గ్రామముకలదు.

— ♦ ఇష్టదేవతాప్రార్థనం ♦ —

శ్లో॥ గణాధిపం వాగధిదేవతాం చా
ప్యారోగ్యదం భాస్కర మోషధీశం।
నమామి మూర్తిత్రయ మాదిశక్తిం
గ్రహా నథ గ్రంథసమగ్రపూర్త్యై ॥౩॥

విఘ్నేశ్వరునికిని, సరస్వతీదేవికిని, ఆరోగ్యదాయకుడగు సూర్యునకును, ఓష
ధులకు ప్రభువయిన చంద్రునకును, బ్రహ్మ విష్ణు మహేశ్వరులకును, ఆదిశక్తికని,
సూర్యాది నవగ్రహములకును యీగ్రంథసంపూర్తికొరకు నమస్కరించుచున్నాను

—♦ గోధన్వంతరిప్రణామం ♦—

శ్లో॥ సస్యౌషధీదోహనరూపకార్యా
ద్గోత్వం ధరణ్యాః ప్రతిపాదితం యత్।
ధన్వంతరే ర్గోధ్వజినో నతి ర్మే
తద్గోశ్చ ధన్వంతరి వైజయంత్యాః॥ ॥౪॥

"హిమవత్పర్వతమును లేగదూడనుగాను, భూమండలమును గోవునుగాను క
ల్పించి ఓషధులను పితికినారు" అను సాంప్రదాయానుసారము గోధ్వజముగల
ధన్వంతరిభగవానునకును, ధన్వంతరిభగవానునికి పతాకముగానున్న గోవునకును నమ
స్కరించుచున్నాను. ॥౪॥

—♦ గోమహిమ ♦—

శ్లో॥ విషం విషాణా మపి విట్చ మూత్రం
మనోహరం సర్వజనస్య లోకే।
నృకాయసిద్ధే రమృతం న గవ్యా
త్తస్మా దశేషాః పరిపూజయే ద్గాః॥ ॥౫॥

పవిత్రములయిన యేగోవులయొక్క మలమున్ను, మూత్రమున్ను భూలోక
మునగల విషములన్నిటికిన్ని విషమున్ను సకలజనులకును గమ్యములున్ను అయినవో
(1. మలము 2. మూత్రము 3 పాలు 4. పెరుగు 5 నెయ్యి యీసముదాయమును
పంచగవ్యమందురు) పంచగవ్యముకంటె కాయశుద్ధికి పనికివచ్చు యిట్టి అమృతవస్తు
వొద్దియు మరియొకటి లేదో అట్టి అమృతమయములగు గోవులను ప్రతివారును
పూజింపవలెను ॥౫॥

## —♦ గురుస్తుతి ♦—

శ్లో॥ శ్రీమద్గౌతమగోత్రజం కొమరగిర్యాఖ్యాన్వయాబ్ధ్యంబుజం
గ్రామోద్యోగిగణప్రధానపురుషం ఛాత్రాభివృద్ధ్యద్వయం।
వందే వేంకటపూర్వకం త్రికరణస్వచ్ఛం నృసింహం గురుం
మయ్యజ్ఞే భవపోషణోచితనయజ్ఞానప్రదం ప్రత్యహమ్ ॥౧॥

గౌతమసగోత్రుడును, కొమరగిరి వంశమనెడు సముద్రమునకు చంద్రుడయినట్టియు, గ్రామోద్యోగులసంఘమున పేరెన్నికగల పురుషుడయినట్టియు, శిష్యుల అభివృద్ధినిగోరుటలో నిరుపమానుడయినట్టియు, త్రికరణశుద్ధుడయినట్టియు, మందమతినయిన నావంటివానికి కూడ సంసారమును పోషించుకొనుటకు సరిపడిన నీతిశాస్త్రజ్ఞానమును కలుగజేసినట్టియు వేంకటనృసింహమను పేరుగల గురువును అనవరతము నమస్కరించుచున్నాను ॥౧॥

శ్లో॥ శ్రీమత్కాశ్యపగోత్రజం కవివరం శ్రీవేంకటేశం గురుం
షట్శాస్త్రార్థసమపండితం హిమకరం కొంపెల్లవంశాంబుధేః।
ఛాత్రాజ్ఞానతమఃప్రభంజనవివస్వంతం వివేకప్రదం
సాష్టాంగం ప్రణతోస్మి నిర్మలసువాఙ్నైపుణ్యసంసిద్ధయే ॥౨॥

షట్ఛాస్త్రములయందును నిరుపమానపాండితి కలిగినట్టియు, కొంపెల్లవారి వంశమను సముద్రమునకు చంద్రుడయినట్టియు, శిష్యుల అజ్ఞానము నశింపజేయుటకు సూర్యుడయినట్టియు, వివేకమును కలుగజేసినట్టియు వేంకటశాస్త్రియను గురువును వాఙ్నైపుణ్య సిద్ధికొరకు సాష్టాంగముగా నమస్కరించుచున్నాను. ॥౨॥

శ్లో॥ సాంగోపాంగజటాఘనాంతనిపుణం శ్రీమల్లుభట్టాన్వయ
క్షీరాంభోధివిధుం నమామ్యుపనిషత్సారానువాదప్రియం।
సుబ్రహ్మణ్యసుధీవరం శ్రుతిగురుం శ్రౌతత్రికాండాన్వయం
నిత్యానుష్ఠితపంచయజ్ఞ మనిశం శిష్యవ్రజాధ్యాపకమ్ ॥౩॥

సాంగోపాంగమయిన జటఘనలయందు నిపుణుడయినట్టియు, మల్లుభట్టవారి వంశమను పాలసముద్రమునకు చంద్రుడయినట్టియు, ఉపనిషత్తులయొక్క సారమును అనువదించుటయందు ఆసక్తి కలిగినట్టియు, కాండత్రయశాస్త్రమందు సాటి లేనట్టియు, ప్రసిద్ధిగ నుండు "శ్లో॥ పాఠ హోమాతిథీనాం సపర్యా తర్పణం బలిః" వేదపాఠము, వైశ్వదేవాదిహోమము, అతిథిపూజ, పితృతర్పణము,

భూతబలి అనుపంచయజ్ఞములను చేయునట్టియు, నిరంతరము శిష్యసముదాయమునకు ఆమ్నాయాధ్యయనమును చేయించునట్టియు, సుబ్రహ్మణ్యము అనుపేరుగల వేదోపదేశకగురువును నమస్కరించుచున్నాను.

—♦ కృతిపతివర్ణనమ్ ♦—

శ్లో॥ గ్రామో గంగలకుర్రినామకలిత స్తత్కోనసీమాంతరే
సర్వగ్రామసమ స్తసీమనికటశ్రీకౌశికావేష్టితే ।
సర్వారామవిరాజితే బహువిధై శ్శాల్యాదిభిః పుష్కలే
వర్ణాచారరతద్విజాదిసహితే భా త్యాంధ్రదేశే ధునా ॥౯॥

ఆంధ్రదేశమునందు వివిధములయిన తోటలతోను, ధాన్యాదులతోను నిండియున్నట్టియు, వర్ణాశ్రమధర్మములయందు కట్టుబాటుకలిగిన బ్రాహ్మణాదివర్ణములు కలిగినట్టియు, ప్రతిగ్రామముయొక్క పొలిమేరయందును చుట్టువారుకొబడిన కౌశికానది కలిగినట్టియు కోనసీమయొక్క మధ్యభాగమున గంగలకుర్రు అనుపేరుగల గ్రామము కలదు. ॥౯॥

శ్లో॥ తత్రామ్నాయచతుష్టయాతినిపుణై ష్షట్ఛాస్త్రపారంగతైః
కావ్యజ్ఞై రధికారిభి స్సుకవిభిః పౌరాణికై ర్యజ్వభిః ।
సత్కర్మప్రవణై ర్విభవశ్చ రనఘై ర్బంధుప్రియై ర్గాయకై
స్తద్భోజాపరమూ ర్తివ ద్విజయతే యో వేష్టిత స్సాదరం ॥౧౦॥

నాలుగువేదములయందు ప్రజ్ఞకలవారితోను, ఆరుశాస్త్రములయందు పారంగతులైనవారితోను, కావ్యజ్ఞానసంపత్తి కలవారితోను, అధికారులతోను, కవీశ్వరులతోను, పౌరాణికులతోను, యజ్ఞయాగాదిక్రతువులు గావించిన ఆహితాగ్న్యులతోను, సత్కర్మకలాపమునందు ఆస్తిక్యబుద్ధి గలవారితోను, ధనవైద్యులతోను, సంపన్నులగు బంధువులతోను, గాయకులతోను, పరివేష్టింపబడి భూలోకమునందు ఉద్భవించిన రెండవ భోజమహారాజు అన్నట్లు— ఎవరు ఆ గంగలకుర్రు అను గ్రామమునందు ప్రకాశమానుడై ఉండెనో— ॥౧౦॥

శ్లో॥ యస్మా త్ప్రత్యుల వాజపేయసవనం నిర్వర్తితం సంహితం
ధూర్తై రధ్వరదీక్షితస్య విమవః ప్రాక్కన్య చిద్యజ్వనః ।
సోపానాని కృతాని కౌశికసరి త్తీరే సముద్ధారితం
జీర్ణం దేవగృహం ప్రతాని సతతం సద్భ్యః పురాణాన్యపి॥౧౧॥

వాజపేయమను క్రతువును చేయబూనిన ఒకానొక అహితాగ్నియొక్క (వంచకులచే విఘ్నము గావించబడిన) వాజపేయమనుయజ్ఞము యెవనివలన నెరవేర్పింపబడినదో! కాశికానదియొక్క రేవునందు సోపానంచాలు కట్టించబడినవో! శిథిలమయినదేవాలయము తిరిగి పునరుద్ధారణచేయబడినదో పండితులవలన అష్టాదశపురాణములు ఎల్లప్పుడు వినబడుచున్నవో! ॥౧౧॥

శ్లో॥ యస్యౌదార్యం జ్ఞాయతే సర్వలోక
ప్రాణాధారగ్రంథసంముద్రణేన ।
షట్పంచాశన్మాత్రదేశాంతరేషు
సర్వోత్కృష్టప్రాజ్ఞకాఖండలానామ్॥ ॥౧౨॥

పంచాశత్కోటియోజనవిస్తీర్ణమయిన భూమండలమునగల జనులకు ప్రాణాధారమయిన యీవైద్యగ్రంథముయొక్క ముద్రించుటచేతనే యాబదియారు (చెప్పన్న) దేశములయందునుగల లోకోత్తరవేద్యులగు విద్వత్పుంగవులకు యెవనియొక్క ఔదార్యము విశదమగుచున్నదో!— ॥౧౨॥

శ్లో॥ ప్రభోత్సవే తద్ధ్వజపాతనేన
సంమూర్ఛితోఽజీవిత ఇత్యసౌ యత్ ।
తన్మాతృపత్నీసుకృతం నిమిత్తం
పూర్తం చ సత్కార్యపరంపరాణాం ॥ ॥౧౩॥

ప్రభోత్సవసమయమున ఆప్రభయొక్క కూలము యితనియందు పడుటచే స్మృతితప్పి మూర్ఛపొందినవాడయినప్పటికిన్ని జీవించినాడన్నమాట ఏదికలదో! దానికి యితని తల్లియొక్కయు, భార్యయొక్కయు, సుకృతమున్ను, సత్కార్యపరంపరలయొక్క పూర్తియున్ను కారణము. ॥౧౩॥

శ్లో॥ కలౌ యుగే యః ప్రభవిష్యతీతి
శ్రుత్వైవ శేషః కిల పూర్వకాలే ।
తత్కీర్తిపుంజశ్రవణాయ వవ్రే
వరం విధాతు ర్ద్విసహస్రకర్ణం ॥ ॥౧౪॥

కలియుగమున యెవడు పుట్టగలడని విని ఆదిశేషుడు పూర్వకాలమున అతనియొక్క కీర్తి వినుటకొరకు తనకు రెండువేల శ్రోత్రములు కావలెనని బ్రహ్మదేవునివలన వరమును కోరెనో!— ॥౧౪॥

శ్లో॥ యత్కీర్తివృక్ష బలిసద్మమూల
స్తారాసుమ శ్చంద్రఫలో న్వ్యమన్యః।
ప్రకాశతే దిగ్విటప స్సముద్ర
కాంచ్యాలవాలస్త్రిజగత్యభీక్ష్ణం॥ ॥౧౫॥

యెవనియొక్క కీర్తియనెడు వృక్షము పాతాళమనెడు వేళ్ళును, నక్షత్రములను పువ్వులును, చంద్రుడను ఫలమును, దిక్కులను కొమ్మలును, భూతలమను కుదురును కలిగినదై మూడులోకములయందు మటిమాటికి ప్రకాశించుచున్నదో!—

శ్లో॥ యస్మి న్నాదశమాబ్దలబ్ధశుచిసత్కారుణ్య సందర్శనాత్
శిష్టా స్సర్వజనప్రశంసనపరా దూరాగతా స్సంశ్రితాః।
దుష్టా స్సర్వజనప్రతారణపరా యాతా స్స్వయం దూరతః
పారిస్కందిభుజంగసూచకఖలా లీనాః ప్రదేశాంతరే ॥౧౬॥

ఎవనియందు పదియసంవత్సరము మొదలుకొనియే పొందబడిన శుచి,సత్యము, కరుణ అనువాటియొక్క చూడడమువలన సర్వజనప్రశంసాపరాయణు లగు శిష్టజనులు దూరమునుండి వచ్చి ఆశ్రయించుచుండిరో, సర్వజనవంచకులయిన దుష్టజనులు సమీపమునుండి దూరమునకు పారిపోవుచుండిరో దొంగలు, వ్యభిచారస్వభావము గలవారు కొండెగాండ్రు ఎక్కడివార లక్కడనే అణగారియుండిరో!— ॥౧౬॥

శ్లో॥ ఊనప్రసంగం న కరోతి కైశ్చి
త్తిరస్కృతాన్వా న తిరస్కరోతి।
కరోతి సేవా మఖిలప్రజానాం
గతం న శోచ త్యనిశం కృతజ్ఞః॥ ॥౧౭॥

యేకృతిభర్త ఎవరితోను వెలితిప్రసంగము చేయడో, తన్ను తిరస్కరించిన వారినికూడ తిరస్కరింపడో, సర్వజనులకు తనశక్తికొలది సవాయము చేయుచుండునో, గతించిన విషయమును గురించి విచారింపడో పొందిన మేలును మరచిపోని కృతజ్ఞుడో— ॥౧౭॥

శ్లో॥ శ్రీ దువ్వూర్యుపనామ వేంకటపతిప్రాక్సోమయాజీ బభౌ
తజ్జోనుక్రమయత్నమగ్రహపద శ్శ్రీసూర్యనారాయణః।
తత్కాన్తిష్టసుత స్స్వవంశతిలక స్తాతాహ్వాయ శ్చాస్తి య
స్తద్వ్యాజ్యాగ్రియనామ సత్పథపదా త్తస్యాంకితేయం కృతిః॥

పూర్వము దువ్వూరి వెంకటపతిసోమయాజులు అను పేరుగల పురుషుండు కలుడు వారివంశపరంపరాగతమయిన యత్యనుగ్రహసంపన్నుడును, సూర్యనారాయణసోమయాజులు అనుపేరుగలవాడును అగు ఆవేంకటపతిసోమయాజులయొక్క కుమారుడుకలడు. ఆసూర్యనారాయణసోమయాజులుయొక్క రెండవకుమారుండును కులప్రదీపకుండును, పితామహునిపేరు పెట్టబడినటువంటిన్ని పురుషు డెవడుగలడో అట్టిపురుషునియొక్క నామధేయమునందలి రెండవపేరునకు చివరచేర్చబడిన సత్పథశబ్దమువలన (సోమయాజిసత్పథమ్) అను నీకావ్యము అతనికే అంకితము చేయబడినది. ||౧౭||

శ్లో॥ పూతం స్వగోత్రం జననేన యస్య
గోత్రాచ పూతా వహనేన యస్య।
గ్రంథోపి తస్యాంకిత ఏష పూత
స్తత్ప్రేరణా ద్గ్రంథకృ దస్మి పూతః॥ ||౧౮||

ఎవనియొక్క పుట్టుకచేత వంశము పవిత్రమయినదో, ఎవనియొక్క వహనముచేత భూమి పవిత్రమయినదో అట్టి మహాపురుషునికి అంకితముచేయుటవలన యీగ్రంథము పవిత్రమయినది యీకృతిభర్తయొక్క ప్రేరణవల్లనుంచి యీగ్రంథమును రచించిన నేను పవిత్రుడ నైతిని ||౧౯||

శ్లో॥ సర్వైశ్వర్యసమన్విత స్సుజనన స్సద్వృత్త స్సాత్త్వికః
పూర్ణాయుః పురుషార్థసాధనపరః ప్రాజ్ఞః ప్రతిష్ఠాన్వితః।
షట్కర్మా విజితేంద్రియః కృతిపతి ర్గోత్రప్రతాపార్జక
స్సోయం సద్గుణపుత్రపౌత్రసహితో జేజీయతా మాచిరమ్॥

సమస్తసంపత్తులతో కూడుకొన్నట్టియు, పవిత్రమయినజన్మకలిగినట్టియు, పవిత్రమయిన జీవితచరిత్రకలిగినట్టియు, సత్వగుణసంపన్నుడైనట్టియు, పరిపూర్ణాయుస్సంపన్నుడైనట్టియు, పురుషార్థసాధనతత్పరుండును, పండితుండును, ప్రతిష్ఠాసంపన్నుండును, యజనాది షట్కర్మనిరతుండును, జితేంద్రియుండును, స్వవంశప్రకాశకుండును అయిన యీకృతిపతి సుగుణసంపత్తిగల పుత్రపౌత్రసంపన్నుండై చిరకాలము వర్ధిల్లుగాక! ||౨౦||

—♦ గ్రంథప్రశంస ♦—

శ్లో॥ భాషాంతరీకరణ మేత్య తు కాపి భాషా
వైరస్య మేతి సహసా స్వరసం విహాయ।
శ్లోకార్థబోధలిఖితం లఘుతారతమ్యం
తాత్పర్య మాంధ్రమయ మత్ర తదేవ సహ్యమ్॥ ॥౨౧॥

ఏభాష అయినను ఇతరభాషలోనికి మార్చబడినప్పుడు దానియందలి మృదుత్వమును విడనాడి వైరస్యమును పొందును. యీగ్రంథమున శ్లోకార్థబోధకొరకు వ్రాయబడిన తెలుగుతాత్పర్యము స్వల్పతారతమ్యము గలిగియున్నది. అది సహింపతగినదే. ॥౨౧॥

శ్లో॥ లోకస్య దృష్టిం ప్రతిపద్య విద్యా
సమన్వయే దుర్గతి రేవ తాభిః।
లోకస్య దృష్టిం వినివర్త్య విద్యా
సమన్వయే సద్గతి రేవ తాభిః॥ ॥౨౨॥

విద్యలన్నియు కైవల్యప్రాప్తికొరకు పుట్టబడినవి గాన లోకదృష్టితో విద్యలను సమన్వయించుటచే దుర్గతియు, లోకదృష్టిని మళ్ళించుకొని వివేకదృష్టితో సమన్వయించుటచే సద్గతియు కలుగుచున్నది. ॥౨౨॥

శ్లో॥ అనుక్రమే యే నవజా వికారా
స్తాత్కాలికా స్తే సముపాసితవ్యాః।
తత్తత్క్రమవ్యాపకకృత్సుధీభిః
కాలానుసారవ్యవహారదక్షైః॥ ॥౨౩॥

పరంపరాగతమయిన ముఖ్యకల్పమందు తాత్కాలికములయిన యే యే మార్పులు నూతనముగా బయలుదేరుచున్నవో కాలానుసారవ్యవహారములయందు సమర్థులైనట్టియు ఆయా కల్పములయందు వ్యాపకము చేయుచున్నట్టియు బుద్ధిమంతులచే ఆమార్పులన్నియు అవలంబింపదగినవి అయి వున్నవి.

శ్లో॥ భాషాంతరాపరిచయాధియుతాత్మకానాం
కుగ్రామవాసభిషజా మధికోపకారః।
భవ్యశ్చ సర్వగృహిణా మపి కల్పితోయం
నానావిధాగదవివేకసమంజసాయ॥ ॥౨౪॥

ఇతరభాషలయొక్క పరిచయములేనందున దిగులుపడిన మనస్సుకలిగినట్టియు, కుగ్రామములయందు నివసించియున్నట్టియు, వైద్యులకు మిక్కిలి ఉపయోగమయి నట్టియు ప్రతిగృహస్థునకు ముఖ్యమయినట్టియు, యీగ్రంథము సమస్తవిధౌషధములయొక్కయు పరిజ్ఞానముకొరకు కల్పించబడినది. ॥౨౮॥

శ్లో॥ యద్వైవపంచాశతి రక్షరాణాం
సమస్తశాస్త్రశ్రుతిమూలరూపాః।
అతోఽత్రోక్తపంచాశతి రౌషధానాం
సమస్తవైద్యాగమమూలరూపాః॥ ॥౨౯॥

కేవల పంచాశద్వర్ణములే సమస్త వేదశాస్త్రములయొక్కయు మొదటిస్వరూపము లెట్లగుచున్నవో అట్లే యిక్కడచెప్పబడిన పంచాశదౌషధములే (వర్ణాగదములే) సమస్తవైద్యశాస్త్రములయొక్కయు మొదటిస్వరూపములు అగుచున్నవి.

శ్లో॥ అభ్యాసానుసరీ కలేతి నిగమా జ్ఞాత్వా పురైకౌషధం
తద్యోగోపశమ క్రియాపరిచయ ప్రావీణ్యతా మార్జయేత్।
ఏవంచ క్రమశో న్యదౌషధమపి స్వస్యాధికారా ద్భిష
క్సంపాద్యాఖిలతంత్ర మార్గవిదసౌ భూయాత్ప్రయత్నాద్ధ్రువం॥

(ఏవిద్య అయినను అభ్యాసమువలన పట్టుబడును) అని శాస్త్రముకలదు. గాన వైద్యాభిలాషగలవాడు ముందుగా ఒక ఔషధమును తెలుసుకొని దాని ప్రయోగోపసంహారములయొక్క వైశద్యమును అలవరచుకొనవలెను. యీప్రకారమే మరియొకమందును క్రమక్రమముగా తనయొక్క అధికారమననుసరించి అలవరచుకొని యీవైద్యుడే తగినప్రయత్నమువలన సమస్తవైద్యశాస్త్రములయొక్కయు మార్గములను గుర్తెరుంగువాడు కాగలడు ॥౩౦॥

శ్లో॥ వైద్యాగమాబ్ధితరణే నిహతోద్యమానా
మప్యాగమేషు విదితే ష్వధికై స్సుధీభిః
వైద్యాగమప్రతరణే సుధియాం కరోమి
శ్రీ సోమయాజికృతిసత్ప్లవనామనౌకాం॥ ॥౩౧॥

బుద్ధిమంతులయిన అనేకమందిచే సమస్తశాస్త్రములు తెలుసుకొనబడినవైనను వైద్యశాస్త్రమను సముద్రమును దాటుటయందు కొట్టబడిన ప్రయత్నముకలవారలకు వైద్యశాస్త్రజ్ఞానము కలుగుటకొరకు ప్రకాశమానుడయిన సోమయాజికి కృతి అయిన సత్ప్లవమను నావను చేయుచున్నాను. ॥౩౧॥

శ్లో॥ ఆయుః కామయమానేన
ధర్మార్థ సుఖసాధనే।
ఆయుర్వేదోప దేశేస్మి
న్విధేయః పరమాదరః॥ ॥౨౮॥

ధర్మార్థసుఖములకు సాధనమయిన యీ ఆయుర్వేదోపదేశమునందు ఆయు ర్భాగ్యమునుగోరు ప్రతిమానవునిచేతను పరమాదరణము చేయదగినది. ॥౨౮

శ్లో॥ కాలాంతరానేకకవిప్రకాండ
ప్రకల్పితగ్రంథపరంపరాభిః।
కూపాదివాంభ స్స్వమతాభిలాష
ప్రయోజనం రాంతు భవిష్ణవోపి॥ ॥౨౯॥

ముందు ముందు బయిలుదేరబోవు వర్తమానులు ఆయా కాలములయందు అనేకు లయిన కవిపుంగవులచే రచింపబడు గ్రంథపరంపరలచే నూతివల్ల మంచినీళ్ళవలె వారివారి స్వేచ్ఛానుకూలవిషయములను గ్రహింతురుగాక. ॥౨౯॥

శ్లో॥ చికిత్సికజ్యోతిషమంత్రవాదాః
పదేపదే కౌతుక మావహంతి।
అన్యాని శాస్త్రాణి వినోదమాత్రం
సాందృష్టికం తేషు ఫలం న కించిత్॥ ॥౩౦॥

వైద్యము, జ్యోతిషము, మంత్రశాస్త్రము ప్రత్యక్షఫలము కలవిగుటచే ప్రతి క్షణము సంతోషమును కలుగజేయుచున్నవి యివిగాక యితరశాస్త్రములయందు వినోదమాత్రమే ఫలితముగా ని ప్రత్యక్షఫలితము లేశమయినను గానరాదు. ॥౩౦

శ్లో॥ ఓషధీశస్య సోమస్య యజనం సోమయాజితా।
తతోస్సోమయాజి శబ్దార్థో భిషగిత్యభిధీయతే॥ ॥౩౧

ఓషధులకు ప్రభువయిన చంద్రునిక పూజచేయుటయే సోమయాజిశబ్దమునకు యౌగికార్థము. గాన సోమయాజి అనగా వైద్యుడు(అనియు సత్పథం అన గా మంచిమార్గము అనియు, సోమయాజిసత్పథం అనగా వైద్యులకు మంచిమార్గమ నియు నిర్వచనము) ఇందుకు శ్రుతిప్రమాణము "ఓషధయ స్సంవదంతే సోమేన సహరాజ్ఞా। యస్మై కరోతి బ్రాహ్మణస్తగ్ం రాజన్పారయామసి॥" తమకు రాజు అయిన చంద్రునితో ఓషధులు చెప్పుకొనుచున్నవి—మాకు రాజవగు ఓచంద్రుడా!

బ్రహ్మనిష్ఠుడయిన వైద్యుడు మమ్ములను యెవరికొరకు ఉపయోగించునో అట్టివానిని మేము తప్పక (ఆరోగ్యవంతునిగా చేయుచున్నాము) రోగములనుండి దరిజేర్పగలము. ||30||

శ్లో। ప్రాగభ్యాసకసౌఖ్యదప్రకరణా న్యాస న్నమస్తాగమే
ష్వప్యస్మి న్నగమే వినాప్రథమతః పాఠ్యాని బాలైరితి।
ప్రప్రాక్సారసమంజసప్రకరణా న్యుక్తాని సంస్కృత్య తా.
న్యాంతేవాసిగణై రశేషభిషజ స్స్వాధ్యాపయం త్వాదరాత్ ||

సమస్తశాస్త్రములయందును ప్రాగభ్యాసకులకు ప్రవేశసుఖమును కలుగజేయు ప్రకరణములు కలిగియున్నవి గాని వైద్యశాస్త్రమునందట్టి ప్రథమపాఠ్యములయిన ప్రకరణములులేవు. అని బాలకులకు మొట్టమొదట చదువుకొనుటకు యోగ్యములయిన ప్రకరణములు చెప్పఁడినవి. గాన వైద్యులనువారందరును వీటియందలి దోషములను సవరించి ఆదరముతో తమశిష్యబృందముచే జదివింపజేయుదురుగాత.

శ్లో॥ అలం శిశుత్వే జననీ పయాంసి
తృప్త్యై న తాని క్రిమశ శ్శిశూనాం।
ప్రారంభ తృప్త్యై వల మప్యయం చ
తృప్త్యై న భూయో దృఢవిక్రమాణాం॥ ||33||

బాల్యావస్థయందు తృప్తికరమయిన తల్లిపాలు దృఢశక్తికలిగిన పిల్లలకు క్రమముచే ఎట్లు తృప్తికరముకావో అట్లే ప్రథమాభ్యాసమందు తృప్తికరమయిన యీగ్రంథమున్ను ప్రజ్ఞాధికులకు తృప్తికరము కాదు ||33||

శ్లో॥ ప్రప్రాక్కృతా జాతకమర్మబోధినీ
తతోర్ధనారీశ్వరనామకవ్రతం।
శ్రీసోమయాజ్యంకితసత్పథాభిదం
సుచిత్రచిత్రాగదసంగ్రహాఖ్యకం॥ ||34||

మొదట జాతకమర్మబోధిని అను గ్రంథమున్ను పిమ్మట అర్ధనారీశ్వరవ్రతము అను (గౌరీతపస్సాంప్రదాయప్రతిపాదకము) గ్రంథమున్ను తరువాత చిత్రాగదసంగ్రహమను పేరుగల సోమయాజిసత్పథమున్ను నాచే వ్రాయబడెను. ||34||

శ్లో॥ యుంక్త్వా ప్రస్తుత రుగ్మి వైద్య వికృతీ శ్శాస్త్రానభిజ్ఞాగద
కారాణా ముపకారికాం చ సుగమా భ్యాసానుకూలాంకృతిం।

కుర్వీత్యాధునికై స్సుహృద్భి రితరైః కైశ్చిత్స్వయం చోదితః
కర్తుం తద్విషయప్రకాశ సులభం గ్రంథం భవా మ్యుద్యతః॥

ప్రస్తుత కాలమందు వైద్యులయొక్కయు, రోగులయొక్కయు, విలక్షణములయిన నడతలను జేర్చి శాస్త్రజ్ఞానసంపన్నులు కాని వైద్యులకు ఉపయోగమయినటువంటిన్ని, సులభప్రవేశానుకూలమయినటువంటిన్ని, గ్రంథమును వ్రాయవలసినది అని ఆధునికులచేతను, స్నేహితులచేతను, ఇతరులచేతను, మరికొంతమందిచేతనున్ను ప్రేరేపింపబడినవాడనై పూర్వోక్తవిషయములను సులభముగా తెలియజేయు యీగ్రంథమును రచించుటకు ఉద్యుక్తుడనైతిని, ॥35॥

శ్లో॥ శాస్త్రేషూక్త మశేష మేవ విబుధై ర్వాచ్యం పునర్నాస్తివా
వ్యాత్మ జ్ఞాత పరిస్థితి ప్రకటనం తత్కాలజానాం విధిః।
త న్మత్కాలపరిస్థితిప్రకటనం మత్కార్య మిత్యూహయా
మద్ధీగోచరసర్వలోకవిషయా విజ్ఞాపితా భావినాం॥ ॥36॥

విద్వత్ప్రకాండులచే లోకమునకు అవసరమయిన ప్రతివిషయమును శాస్త్రములయందు పూర్తిగా చెప్పబడియేయున్నది లోకమునకు అవసరమయిన చెప్పవలసినవిషయము శాస్త్రమునందు చెప్పక వదలిపెట్టినది కానరాదు. అయినప్పటికిని ఎవరెవరి కాలములయం దెట్టిపరిస్థితులు లోకమున కనుపించుచున్నవో ఆపరిస్థితులను ప్రకటనచేయుట ఆయా కాలములయందున్నవారి విధి అయివున్నది గాన నాయొక్క కాలమందుగల పరిస్థితులను ప్రకటనచేయుట నావిధి యనెడు ఊహచే నాకు తెలిసినంతవరకు లోకమున వర్తమానకాలమునగల పరిస్థితులు కాబోవువారికి విజ్ఞాపన చేయబడుచున్నది. ॥36॥

శ్లో॥ జ్యోతి ర్వైద్యక శాస్త్ర మాత్ర హననా ద్భోగః పితౄణాంనృణాం
నూనం సంహృత ఏవ పైతృకదినాభావా త్తిథివ్యత్యయాత్।
ఉద్వాహాదిముహూర్తసత్యసమయాజ్ఞానాత్కుసిద్ధాంతినాం
స్వాచ్ఛంద ప్రహితా గదా దసుహరా ద్దుర్వైద్యకానామపి॥ 37

జ్యోతిర్వైద్యశాస్త్రములయొక్క స్ఖాలిత్యమువలన పితృదేవతలయొక్కయు మనుష్యులయొక్కయు పరిస్థితి నిశ్చయముగా హతమయినది ఎట్లనగా సిద్ధాంతుల తిథివ్యత్యయముచే పితృదినము నశించుచున్నది. ఇందువలన పితృదేవతలయొక్క తిథి తెలియుటలేదు. వివాహాది శుభముహూర్తములయందు నిజమయినసుముహూర్తము తెలియకపోవుట తటస్థమగుచున్నది. దుర్వైద్యులచే యథేష్టముగా ప్రయోగింపబడిన ప్రాణహారములగు మందులచే మనుష్యులయొక్క జీవితము కొట్టబడుచున్నది.

శ్లో॥ షట్ఛాస్త్రేష్వపి వైద్యశాస్త్ర మతులం లోకోపయోగం ముహు
స్తత్సాధ్యం చిరకాలపారపరనాభ్యాసైర్బుధైః కేవలం।
తాదృక్ఛాస్త్ర మసంస్కృతై రభిమతం నిర్వర్త్యతే నిర్భయా
ద్యత్తచ్చిత్రి మతీవ వాంఛతి జన స్తేభ్య శ్చికిత్సామితి॥ ౩౮॥

వైద్యశాస్త్రము ఆరుశాస్త్రములలోను మానవులకు ప్రతిదినము పరమావశ్యకము. పండితులగువారిచే ఆవైద్యశాస్త్రము చిరకాలపారపరనముచేతనున్ను, అభ్యాసముచేతనున్ను సాధింపతగియున్నది. యిట్టివైద్యశాస్త్రము చదువుకొననివారిచే వారివారియిష్టానుసారము నెరవేర్చబడుటయు లోక మిట్టివారివలన చికిత్సనుకోరుటయు మిక్కిలిచిత్రము. ॥౩౮॥

శ్లో॥ ఆయుర్వేదదమితి స్మరంతి కతిచి త్కాలోచితాऽసంస్కృతం
స్వాభ్యస్తాన్యమతక్రియాపరిచయా త్సమ్యజ్ఞతద్భావ్యతే।
యద్వస్తు ప్రకృతౌ సజాతు వికృతౌ రోగా న దోషేతరా
స్సంస్కారావసరోపి తస్య న కదా వైద్యాను మేయా ద్వినా॥ ౩౯॥

కొంతమంది తమకుగల యితరవిధక్రియాపరిచయముచే ఆయుర్వేదమునకు కాలోచితసంస్కారము (రిసెర్చి) జరుగుటలేదని తలంచుచున్నారు ఇది అసంగతము. ఏలననగా వస్తుగుణము ఎల్లప్పుడున్ను ఒకటే రోగములు ఎప్పుడున్ను దోషజన్యములే. గాన వైద్యులు ఊహాకంటె ఆయుర్వేదమునకు సంస్కార మెన్నటికిన్ని అవసరము లేదు ॥౩౯॥

శ్లో॥ గ్రంధానకార్షు ర్మహత స్సుధీంద్రా
స్తే ప్రాగధీతా భ్రమకారకా స్తత్।
పర్యాః పురస్తా దయమేవ బాలై
స్తద్గ్రంధ జిజ్ఞా సుభి రాదరేణ॥ ॥౪౦॥

మేధావంతులయినవారు మహత్తరములయినగ్రంథములను రచించిరి. మొదటనే చదువుటకు అట్టిగ్రంధములు బుద్ధికిలొంగవు. గాన ఆగ్రంథములను చదువదలచినబాలకులు ముందుగా యీగ్రంథము చదువుతగినది. ॥౪౦॥

శ్లో॥ ప్రవిశ్య దుర్గేప యథా కథంచి
త్కైశ్చిత్ప్రదై రేవ కృతప్రవేశాః।
ఆదా వశక్తా అపి సంచరేయుః

క్రమా ద్యథేష్టంచ తథాత్ర బాలాః। ||౮౧||

చొరరానిప్రదేశములయందుకూడ అతికష్టముచే కొన్నిపదములచే ప్రవేశించి పిమ్మట గమ్యస్థానమునకు చేరినవారై స్వేచ్ఛగా సంచరింతురు. బాలకులుకూడ అటులే మొగట అశక్తులయినప్పటికిన్ని కొన్నిపదములచే యీగ్రంథమందు ప్రవేశముకలవారై యథేష్టముగా సంపూర్ణప్రవేశము కలవారలగుదురు. ||౮౧||

శ్లో॥ శాస్త్రేషు సర్వేష్వపి సంత్యసంఖ్యా
శ్చర్చాప్రధానా విషయా స్సమంతాత్।
తే కింతు విద్యానిపుణై రుపాస్యా
నాభ్యాసయోగ్యాః ప్రథమే ర్భకానామ్॥ ||౮౨||

ప్రతిశాస్త్రమందును ఎక్కడికక్కడికే చర్చింపవలసినవిషయములు సంఖ్యాతీతములు. ఆవిషయములు శాస్త్రపారంగతులయినవారికి అవసరములుగాని ప్రథమాభ్యాసకులకు అవసరములేదు. ||౮౨||

శ్లో॥ స్ఫురణార్థో మితామ్నాయోఽమితామ్నాయో భ్రమార్థకః।
అభ్యాసకై ర్మితం జ్ఞేయం నిష్ణాతైర మితం మితం ||౮౩||

మితామ్నాయము, స్ఫురణ కనుకూలము అమితగ్రంథబాహుళ్యము భ్రమకు కారణము గాన అభ్యాసకులచే మితగ్రంథపఠనము చేయతగినది ప్రౌఢులచే మితగ్రంథపఠనమును అమితగ్రంథపఠనము కూడ చేయతగినది

శ్లో॥ గ్రంథానలోకభీతానాం వైద్యానా మధునా ధ్రువం।
సూత్రప్రాయో భవే త్సోమయాజిసత్పథనామకః ||౮౪||

గ్రంథపర్యావలోకనాభీతులైన వైద్యులకు వర్తమానకాలమున యీసోమయాజిసత్పథమను గ్రంథము సూత్రసమానమయినది.

శ్లో॥ భిషగ్భిః పర్యతే సోమయాజిసత్పథనామకః।
అధీత ఏవ దుర్బోధ స్సర్వవైద్యాగమస్థితిః ||౮౫||

యీసోమయాజిసత్పథమను గ్రంథము వైద్యులచే పఠింపబడినచో సమస్తవైద్యశాస్త్రమర్యాదయు తెలుసుకొనబడినదగును.

శ్లో॥ సంస్థాసు లోకోద్ధరణాయ సంత
స్సదాప్రకుర్వం త్యతిథిప్రసంగాః।

తేభ్యాస్సక్తై రభ్యసితుం న శక్యా
జ్ఞానాభివృద్ధ్యై సుధియాం భవంతి॥ ॥౪౬॥

సభలయందు విద్వాంసులు లోకోద్ధారణకొఱకు సామాన్యులబుద్ధికి గోచరములుగాని మహోత్తరవిషయములనుగురించి ప్రశంసించుచుందురు. అట్టివిషయములు అభ్యాసకులకు దురవగాహములున్ను, మేధావంతులకు జ్ఞానదాయకములున్ను అగుచున్నవి. ॥౪౬॥

శ్లో॥ పరస్పరాశ్రియా విద్యా స్స్వానాలం స్వసమర్థనే।
తస్మా త్సర్వకలాభిజ్ఞా దేవ తత్త్వ మవాప్యతే॥ ॥౪౭॥

విద్య అనునది ఒకదానితో నొకటి సంబంధము కలిగియున్నది. గాన ఇతరవిద్యయొక్క సహాయ మవసరము లేకుండా ఏవిద్యయును దానితోనే దానికి సమాధానముకుదరదు అందుచే సమస్తవిద్యలయొక్క పరిచయముగలవానికే విద్యలయందలియాథార్థ్యము తెలియబడుచున్నది ॥౪౭॥

శ్లో॥ సద్య స్సంస్కరణాచ్చ్యుతేశ్చ లఘున శ్శాస్త్రంచ ఘంటాపథ
స్తత్ర్త్యైరివ రక్షితం యది యథాపూర్వత్వ మేత్యన్వహం।
ఏకస్యాఖిలలోకసంవృత మిదం కార్యం త్వసాధ్యం యతః
కర్తవ్యార్థవినిశ్చయే బుధసమావేశాయ సంస్థాః కృతాః ॥౪౮॥

స్వల్పముగా పలితమయిన శాస్త్రమును ఎప్పటికప్పుడు అక్కడనున్నవారు సంస్కరించి సంరక్షించుచుండినయెడల రాజమార్గమువలె ఎల్లప్పుడున్ను నవీనముగానే ఉండగలదు సర్వలోకాయతమయిన యీశాస్త్రరాజమార్గసంస్కారము ఒకనికి శక్యముకానందున వీటిని పునరుద్ధారణాకార్యనిశ్చయమువిషయమై అందుకు సమర్థులయినపెద్దలయొక్క సమావేశముకొరకు సంస్థలు ఏర్పాటు కాబడినవి.

శ్లో॥ నీతిప్రవృద్ధ్యైకతి చిచ్చలోక జ్ఞానాభివృద్ధ్యైవ్యవహార వృద్ధ్యై।
ప్రస్తావనాయాం కతిచిచ్చికిత్సాజ్ఞానాభివృద్ధ్యై కతిచి త్ప్రశస్తాః॥

యీగ్రంథము చాలవరకు నీతియొక్క అభివృద్ధికొరకున్ను లోకజ్ఞానాభివృద్ధికొరకున్ను, ప్రాసంగికజ్ఞానాభివృద్ధికొరకున్ను, చికిత్సాజ్ఞానాభివృద్ధికొరకున్ను ఉపయోగించుచున్నవి. ॥౪౯॥

శ్లో॥ లిఖంతు కావ్యా న్కవయో యది స్యుః
శ్రిస్నిసాయంతు సురూపవత్యః।

శూరాస్తు కర్వంతు పరోపకారం
తదైవ తేషాం సఫలం హి జన్మ॥ ॥౨౦॥

కవియగువాడు కావ్యములను వ్రాయవలెను. రూపవతియగు స్త్రీ సంతానమును కనవలయును. శూరుడగువాడు పరోపకారమును జేయవలయును. అప్పుడే వారివారిజన్మలకు సార్థక్యము ॥౫౦॥

శ్లో॥ క్రియా నహం సత్కృతికల్పనాయ
విద్యాధికే భ్యస్తు వినేశ్వరేచ్ఛాం।
అగుప్తవిద్యో ప్యధికం యధైవ
భుఙ్క్తే దదాతి స్మ ధనాధికేభ్యః॥ ॥౨౧॥

దరిద్రహీనుడు ధనాధికునికంటెను అధికపదార్థముల నెట్లనుభవించుచున్నాడో మరియు ధనాధికులనుమించి వితరణము నెట్లుజేయుచున్నాడో అట్లే పరమేశ్వరానుగ్రహముకంటె వినాగా సత్కావ్యమును రచించుటకు నేనెంతటివాడను. ౫౧

శ్లో॥ ధాతా యధా బహుఘనేషు వటాదికేషు
కూష్మాండకే ఘనసువర్ణఫలం యునక్తి।
వాణీ విశాలమతిమత్సు విచక్షణేషు
గ్రంథపరికల్పనమతిం జడమాద్య శేషి॥ ॥౨౨॥

బ్రహ్మదేవుడు మిక్కిలిగొప్పవయిన మర్రి మొదలయిన వృక్షములుండగా మిక్కిలి అల్పమయిన గుమ్మడితీగెయందు గొప్పదియు, సువర్ణము కలదియు అగు ఫలములను ఎట్లు నిర్మించెనో ఆబ్రహ్మదేవునికి భార్యయగు సరస్వతీదేవియు విశాలమయిన మేధాశక్తిగల విద్వాంసులుండగా నావంటి మందబుద్ధిగలవానికి గొప్పదియు సువర్ణములు గలదియు మంచిఫలితముగలదియు అగు యీగ్రంథమును నిర్మించు సామర్థ్యమునుగూడ అట్లే సమకూర్చెను. ॥౫౨॥

— ♦ విద్వత్ప్రార్థన ♦ —

శ్లో॥ కుగ్రామే జననం నివాస మపి కుగ్రామేఽధికారశ్చ మే
విద్యావ్యాపకసావకాశరహితవ్యాపారసంఘాస్పదః।
ఆత్మానందశమగ్రహాహతబలం తాంతం దధాన స్తత
స్స్వాంగే ప్రాగ్భవవాసనావిధివశ ప్రాప్తా కృశా పాంక్తిః॥ ॥౨౩॥

కేగు ఒప్పించినది సుగాత్రము, నివసించినదికూడ సుగాత్రము. ఇదియును గాక కుగాత్రమునసే విద్యాభ్యాసంగము ను సాక కాశ ను శేని వ్యాపారములకు ఉనికిపట్టయిన గాత్రసాధకపృత్తోద్యోగ, మరియు అత్యాసందకముగ ప్రాపాత ఒలముకలపాడను యీ కారణములచే పాండిత్యము వారియు కృశశరీరమునందే కృశించిపోయినది ॥౫౨॥

శ్లో॥ సామాన్యప్రతిపత్తయే తతి కథితా స్థూలాత్మనా సర్వగు
జ్ఞానమాని ప్రశమాపధాని కతిచి త్కాఽ్యాధానుపానాదికాః।
తత్తద్వ్యాధివిచేచనౌషధగుణకార్థక్రియాకల్పనం
వృద్ధానా ముపదేశత స్స్వానుభవా ద్గ్రంథాంతరై ర్జ్ఞాయతామ్॥

బాలకులకు సామాన్యజ్ఞానము కలుగుటకొరకు స్థూలదృష్టిచే సర్వరోగముల యొక్కయు కొన్నికొన్నిగుణములున్ను రోగములయొక్క నామములున్ను ఆయా రోగముల నుపశమింపజేయు మందులున్ను అనుపానము మున్నగు చికిత్సలున్ను చెప్పబడినవి. ఇవిగాక అప్పటికప్పుడు తాత్కాలికముగా సంభవించుచుండెడు వ్యాధుల వివరణములున్ను ఆయావ్యాధులయందు వాడదగినమందులున్ను అనుపానము మున్నగు విషయములన్నియు పెద్దలయొక్క ఉపదేశమువల్లను స్వానుభవమువల్లను గ్రంథపరిచయమువల్లనున్ను తెలుసుకొనుచుండవలెను ॥౫౩॥

శ్లో॥ అనంతశాస్త్రం బహువేదితవ్య
మల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః
యత్సారభూతం తదుపాసితవ్యం
హంసో యథా క్షీర మివాంబుమిశ్రం॥ ॥౫౪॥

శాస్త్రము అపారమయినది తెలుసుకొనతగినవిషయములు సంఖ్యాతీతములు. కాలవ్యవధి మిక్కిలితక్కువ. విఘ్నములు మెండు గాన నీరములతోగలసిన పాలను హంసవలె సారమయిన విషయము మాత్రమే గ్రహింపబడవలెను ॥౫౪॥

శ్లో॥ రోహంతి బీజాని కడంగరేప
గృహ్ణంతి నిష్ఠ్యూతరసాలసారం।
పిపీలికా స్స్వర్ణకృ దుల్కకేభ్య
స్స్వర్ణం తథా సారవిద స్సదస్మాత్॥ ॥౫౫॥

పొల్లులోకూడా విత్తనములు దగబడి మొలచుచున్నవి. చీమలు నమిలి ఉమ్మిన టెంకలిప్పియందలి సారము గ్రహించుచున్నవి. మసిగట్టువాడు సువర్ణము

కలిగిన మనిభాగ్యులలోనుండి సుకర్ణమునుతీయుచున్నాడు. అప్రకారమే సారవేత్తలు అయినవారు యీగ్రంథమువల్లనుంచి మంచినే గ్రహింతురుగాక, ॥౫౫॥

శ్లో॥ యద్వర్షం మధురతా ముపైతి సుభువి క్షారత్వ మత్యూషరే
శుక్తౌ మౌక్తికతా ముపైతి సదసత్సంసర్గభిన్నా కృతిః।
గ్రంథ స్తద్వదయం విశేషసుగుణై సత్కావ్యతాం దుర్జనే
దుష్కావ్యత్వ ముపైతి దోషగణానా సన్తోపలబ్ధిశ్వరే॥ ॥౫౬॥

వర్షము మంచినేలయందు మంచినీళ్ళుగాను, చవటనేలయందు ఉప్పునీళ్ళుగాను, ముత్యపుచిప్పలయందు ముత్యములుగాను, ఉపాధులయొక్క మంచిచెడ్డల ననుసరించి మారిపోయినట్లు యీగ్రంథముకూడా సుగుణసంపదకలవారికి సత్కావ్యముగాను దుర్గుణసంపదకలవారికి దుష్కావ్యముగాను కనుపించును ॥౫౬॥

శ్లో॥ అసమ్య గస్తీహ సతాం న కించి
త్సమ్యజ్జదోషైకదృశాం మకీహ।
అయంతు తస్మా దుభయప్రమోదం
దిశ త్యజస్రం సమమేవ నూనం॥ ॥౫౭॥

యీగ్రంథమందు సజ్జనులకు దోషములున్ను, దుర్జనులకు సాధువిషయములున్ను కనుపించవు. గాన యీగ్రంథము సజ్జనులకును దుర్జనులకును కూడ సమానముగానే సంతోషమును కలుగజేయును. ॥౫౭॥

శ్లో॥ దుర్జనో దోష మాదత్తే దుర్గంధ మివ సూకరః।
సజ్జనస్తు గుణగ్రాహీ హంసః క్షీర మివాంభసః॥ ॥౫౮॥

సూకరము దుర్గంధమునువలె దుర్జనుడు దోషమును, హంస క్షీరమిశ్రితమైన నీరమునుండి క్షీరమునువలె సజ్జనులు గుణమును గ్రహింతురు. ॥౫౮॥

శ్లో ॥ భూజన్మతా కర్మపథానుగానాం
స్యాద్దూషణా యాపిచ భూషణాయ।
తద్దూషణం భూషణ మప్యపాస్య
గ్రంథోయ మద్వైవ మయా కృతో భూత్॥ ॥౫౯॥

కర్మమార్గానుసారులగు మానవులకు భూమియందు జన్మముకలుగుట దూషణ కొరకున్ను భూషణకొరకున్నుకూడ అయివున్నది గాన దూషణ భూషణములను లెక్కచేయక నాచే యీగ్రంథము రచింపఁబడెను. ॥౫౯॥

శ్లో॥ కర్తా నాహం సర్వకర్తైవ యస్మా
జ్జీవే ష్వంత ర్వ్యాపకః ప్రేరకశ్చ।
తద్దూష్యోహం నాస్మి సద్వైద్యకానాం
యత్సాధూనాం శిష్యశిష్యోస్మి ధన్యః॥ ॥౬౦॥

చరాచరస్వరూపమయిన సమస్తజీవులయందు వ్యాపించియున్నట్టియు, ప్రేరే పించుచున్నట్టియు సర్వకర్త ఎవ్వడుకలడో వాడే యీగ్రంథరచనకు కర్తగాని నేను కాను. అందుచే నేను దూషింపబడనేరను అగియునుగాక నేను సద్వైద్యులకున్ను పండితులకున్ను శిష్యశిష్యుండను అయి ధన్యుడనైతిని ॥౬౦॥

శ్లో॥ కోయం స్వల్పమతిః కిమస్యవిదితం చేత్యాగ్రహం మాకృథాః
పూర్వైర్వ్యత్కథితం మయాపరిచితం సంలేఖితం నాన్యథా।
క్షంతవ్యం విబుధై స్సుగంధమరుత స్సంవాంతిచే త్కుత్రచి
త్సారగ్రాహివిశుద్ధబుద్ధిసహితో నాఘ్రాతి కోవా జనః॥ ౬౧॥

మందబుద్ధియగు వీడెవడు? వీడికేమి తెలుసును? అని నాయందు కోపమును చేయవలదు. పూర్వీకులచే ఏదిచెప్పబడినదో అదియే నావల్ల అభ్యసింపబడినది. అదియే యీగ్రంథమున నాచే వ్రాయబడినదిగాని స్వకపోలకల్పితము ఏమియులేదు. గాన విద్వాంసులు క్షమింతురుగాక! పరిమళసమేతమయిన గాలి వీచునపుడు ఎక్కడనో ఒకదగ్గిర ఆపరిమళమునుగ్రహించెదువారుగాని ఆస్వాదించువారుగాని ఉండకపోరు ॥౬౧॥

శ్లో॥ న పాంతి భేకా స్స్వసమక్షపద్మం
దూరస్థభృంగాస్తు తదేత్య పాంతి।
తథైవ కేచి న్నపఠంతు కేచి
త్పఠంతు తస్మా న్నహి మే విషాదః॥ ॥౬౨॥

కప్పలు తమ సమీపమందున్న పద్మసౌరభమును అనుభవింపజాలవు. తుమ్మెదలు దూరమునందుండియు ఆపద్మసౌరభమును అనుభవింపగలుగుచున్నవి. అలాగునే కొంతమంది ఈగ్రంథమును పఠింపకుందురుగాక కొంతమంది పఠింతురుగాక. దానివలన నాకు విషాదములేదు. ॥౬౨॥

—♦ కలిప్రకృతిః ♦—

శ్లో॥ నిస్సారా పృథివీ నిరౌషధిలతా నీచా మహత్వం గతాః
భర్తా దారవశ స్స్వవాగపజయా పుత్రాః పితృద్వేషిణః।
రాజానో ర్థపరాః ప్రజాః కుటిలినో విప్రా వికర్మస్థితా
ఇత్యేవం పతితాగుణాః కలియుగే ధర్మా వనాంతర్గతాః॥ ౬౩॥

పృథివి సారశూన్యమయిండి ఓషధులును లతలును సారశూన్యములగును అల్పులు అధికులగుదురు భర్తలు భార్యలకు లొంగియుందురు. యథార్థవాదులు అపజయముగలవారగుదురు. కుమారులు తండ్రులతో కలహపడుదురు. రాజు పన్నులను పెంపుజేయును ప్రజలు కపటమనస్కులగుదురు బ్రాహ్మణులు స్వకర్మపరిత్యాగముసు చేయుదురు. యీప్రకారము కలియుగమునందు అన్నియు అధర్మములే ప్రబలియుండును ధర్మములు మనుష్యులులేని అడవులయందుండును. ||౬౩||

శ్లో|| స్త్రీభిః పుమాంసః కులటాభి రార్యా
జామాతృభిస్స్వే మహిషీభి రఘ్న్యాః|
హతాస్స్మయేన ప్రభవోఽనృతాన
ద్వ్రతక్రియా స్సూచిముఖక్రియాభిః|| ||౬౪||

స్త్రీలచే పురుషులున్ను వ్యభిచారస్త్రీలచే పతివ్రతలున్ను జామాతలచే పుత్రులున్ను మహిషములచే గోవులును అహంకారముచే ప్రభువులును అసత్యముచే సత్యమును యింజక్షనులచే అనూచానక్రియలున్ను కొట్టబడుచున్నారు అనగా ప్రధానమయినవానికంటె అప్రధానమయినవానియందు ఆదరణము అధికమనితాత్పర్యము

శ్లో|| అధార్మికా ధర్మవిధిప్రదర్శకా
మూర్ఖా బుధజ్ఞానపరీక్షణోద్యమాః|
సతీవ్రతౌకోత్స్వైరతాశ్చ పాంసులా
వ్యత్యాసధర్మస్య కలే ర్న మోనమః|| ||౬౫||

అధర్మప్రవర్తకులే ధర్మవిధిప్రదర్శకులు. మూర్ఖులే పండితులనుపరీక్షించు పదవులుకలవారు. స్వైరిణులే పతివ్రతలయోగ్యతలను వెక్కిరించువారు. యిట్టివ్యత్యాసధర్మభూయిష్టమయిన కలిపురుషునకు నమస్కారము ||౬౫||

శ్లో|| లబ్ధప్రతిప దాచార్యం లబ్ధారోగ్య శ్చికిత్సకం|
లబ్ధపుత్రా పతిం ద్వేష్టి లబ్ధపారస్తు నావికమ్|| ||౬౬||

విద్యనుపొందినవాడు గురువుతోను, ఆరోగ్యమునుపొందినవాడు వైద్యునితోను పుత్రవంతురాలయిన స్త్రీ భర్తతోను అవలిదరినిజేరినవాడు నావదాటించిన నావికునితోడను కలహింతురు. ||౬౬||

శ్లో| యావ త్తనిష్ఠం బహుమూల్యరత్నం
తత్రత్య సామాన్యసమాన మేవ|
విద్యాధిక స్తత్ర నివాసకోపి
తథైవ సామాన్యసమాన ఏవ|| ||౬౭||

విలువగలరత్నము గనియందున్నంతవరకు ఆగనిలోని సామాన్యశిలలవలెనె ఎట్లు కనుపించునో అట్లే విద్యాధికులుకూడ తమతమ నివాసప్రదేశములయందు ఆపరి సరములయందున్న సామాన్యజనులవలెనే సంచరించుచుందురు ॥౬౭॥

శ్లో॥ పుర్వైవ సంతః కవయోఽద్యచాపి
తే భావికాలేపి పున ర్భవంతి।
అద్యాపి పూర్వస్య చ భేద ఏష
శ్చైత్రాదృశాం మానకృ దద్య మృగ్యః॥ ॥౬౮॥

కవులు పండితులు ఉన్నగువారు పూర్వకాలమందువలెనే యిప్పటి కాలమందు నుకలరు. భవిష్యత్కాలమందుకూడ ఉండకలరు పూర్వకాలమునకును ఇప్పటికాల మునకును గల భేదమేమనగా ఆటువంటికవులయొక్కయు, పండితులు మున్నగువారి యొక్కయు సన్మానముచేయువారు యీకాలమునందరుదు. ॥౬౮॥

శ్లో॥ షణ్ణాం రుచీనా మివ సైంధవస్య
రుచిప్రధానస్య మనోహరస్య।
యథా న మూల్యం సుధియః ప్రజానాం
వాణీ తథా నైవ కలా విభాతి॥ ॥౬౯॥

ఆరురుచులలోను మనస్సునకు ఆహ్లాదకరమయినట్టియు, రుచులలో ముఖ్య మయినట్టియు, ఉప్పునకువలె ప్రజలలోకూడ పండితులకు విలువతక్కువగుటచే ఆ పండితులవాక్చాతుర్యము యీకలియుగమున ప్రకాశించుటలేదు ॥౬౯॥

శ్లో॥ సంత్యేవా త్రిధనేశ్వరాశ్చ బహవ స్స్వార్థవ్యయాలక్ష్యకా
స్తేగోష్ఠిషు సతామతీవ విముఖా షండా స్సుకాంతాస్వివ।
రత్నానా మపివార్ రేపి జలధా క్షారాంబు రత్నానివా
పాతుం తృట్పరిశాంతై రనుచితం తాదృగ్ధనం సజ్జనైః॥ ॥౭౦॥

తమతమ ధనవ్యయమునకు లెక్కచేయని ధనవంతులు యిప్పుడున్న వేనవేలు గలరు. గాని వారు పండితగోష్ఠులయందు సుందరాంగులయందు నపుంసకులవలె విముఖులు. సముద్రుడు రత్నాకరుడయినప్పటికని అసముద్రమునందున్న ఉప్పునీళ్ళు గాని రత్నములుగాని దప్పిగొన్నవారి దాహశాంతికి పనికిరావు. ఇట్లే పండితగోష్ఠివి ముఖులయిన ధనవంతులద్రవ్యము సత్పురుషులఅనుభవమునకు ఉపయోగము కానేరదు.

శ్లో॥ హర్మ్యస్థాన మధర్మకర్మవితతే స్వర్ణాసనభర్మాసనం
శాస్త్రస్తోమలలాటభూలిపిలయః శ్రాంతి స్సవానామపి।
సర్వామ్నాయవచస్సమాపనదినం సంస్థానసదర్మావిధే
రర్థాశాజనిభూ రభూ దిహ మహానర్థావ హోయం కలిః॥ ౨౧॥

అధర్మకర్మలకు సౌధము, దురహంకారమునకు బంగారుసింహాసనము, శాస్త్ర సముదాయముల లలాటలిఖితమునకు లయసమయము, యజ్ఞయాగాదిక్రతువులకు సమాప్తి, సమస్తవేదములయొక్కయు ఉపసంహారదివసము, దుర్మార్గులనుపూజిం చుస్థానము దరిద్రులకు పుట్టిల్లు యీకలియుగము యిట్టిగొప్పదయిన అనర్థములకు మూలాయతనము. ॥౨౧॥

—♦ వైద్యుని మహత్వముచిత్వములు ♦—

శ్లో॥ బ్రహ్మా కేవలదేహద స్తనుభృతాం కర్మానుగుణ్యాక్రమా
త్తత్కర్మ ధనప్రదానవివిధవ్యాధివ్యథాజర్ఝరం।
యోదద్యా త్తదనామయం దృఢతరం కృత్వాపున స్త్వరం
స్వాప్తవ్యాధివికారవారకతయా ప్రత్యక్షవిష్ణు ర్భిషక్॥ ॥౨౨॥

సృష్టికర్త వారివారికర్మలకుతగిన దేహమునుమాత్రమే యివ్వగలుగుచున్నాడు సద్వైద్యుడు వారివారికర్మలకుప్రధానమయినవివిధవ్యాధులచే శిథిలమయిన దేహమును శీఘ్రకాలములో దృఢమయినదానినిగాజేసి యిచ్చుచున్నాడు గాన సద్వైద్యుడు రోగులపాలిటి ప్రత్యక్షవిష్ణువు. ॥౨౨॥

శ్లో॥ చికిత్సకో నామ పరప్రమాదే
స్వశక్తివిశ్రాణన మాతనోతి।
యదిత్యవశ్యం తదిహప్రశంస్యం
రుగ్వారితావా ప్యనివారితావా॥ ॥౨౩॥

వ్యాధి ఉపశమించినను ఉపశమింపకున్నను అపత్కాలములయందు వైద్యుడగువాడు వచ్చి తనకుగల యావచ్ఛక్తిని ధారవోయుచున్నాడన్నమాట ఏదికలదో అదియే కొనియాడతగినది. ॥౨౩॥

శ్లో॥ మస్తే దుస్తరవేదనాకబళితే మగ్నేస్వరేంతర్గళం
తప్తాయాం జ్వరపావకేన చ తనౌ తాంతే హృషీకవ్రజే,
దీనే బంధుజనే కృతప్రలపనే ధైర్యం విధాతుం పునః
కశ్శక్తః కలితామయప్రశమనా ద్వైద్యా త్పరోవిద్యతే॥ ౨౪॥

శిరస్సు ధరింపరాని బాధకలిగి స్వరము కుత్తుకయందే లీనమై శరీరము జ్వరాగ్నిచే తప్తమై ఇంద్రియసముదాయము స్వాధీనముతప్పినదై బంధుజనమంతయు విచారించువారై యుండగా సంప్రాప్తమైనవ్యాధిని తొలగించువైద్యునికంటె ధైర్యముకలుగజేయుటకు సమర్థులు ఎవరుకలరు? ॥౨౪॥

శ్లో॥ వైద్యః కులీనో యదివాధమోపి
ప్రాణాస్పదత్వాత్ సతతం స శుద్ధః।
స్పృశ్యస్తతో రుగ్ణిభి రేష వైద్య
స్తదౌషధం గాంగ మివాతిపూతమ్॥ ॥౨౫॥

సద్వైద్యుడు మహాకులమందుపుట్టినవాడైనను నికృష్టకులమందు పుట్టినవాడైనను ప్రాణములనురక్షించుటకు ఆధారభూతుడు. గాన నిత్యశుద్ధుడుగాన ఇతడురోగులచే నిస్సంశయముగా స్పృశింపబడవచ్చును ఆవైద్యుడిచ్చినమందు గంగాజలమువలె పరమపవిత్రమైనది. ॥౨౫॥

శ్లో॥ అస్పృశ్యరుగ్ణిస్పృశతాఘచింతా
న నిత్యశుద్ధస్య చికిత్సకస్య।
అస్పృశ్యవైద్యస్పృశతాఘచింతా
న రుగ్ణిణాం రుక్పరిణామకాలే। ॥౨౬॥

వైద్యుడు నిత్యశుద్ధుడగుటచే యీరోగిని స్పృశింపవచ్చును, యీరోగిని స్పృశింపకూడదు అను నియమములేక ఎల్లజాతులవారిని స్పృశింపవచ్చును, రోగవ్యాప్తికాలమున రోగులు తమతమ ప్రాణధారణకుగాను యీవైద్యుని స్పృశింపవచ్చును యీవైద్యుని స్పృశింపకూడదు అను నియమము అవసరములేండా వైద్యుడేజాతివాడైనను నిస్సంశయముగ స్పృశింపవచ్చును. ॥౨౬॥

## ——• సద్వైద్యలక్షణము •——

శ్లో॥ లోకమేధ్యనవఖేటనిందయా
జన్మపత్రఫలితప్రశంసనం।
కచ్చరార్థయుతినామయక్రియా
తద్ద్వయం పరిహరే ద్విధిజ్ఞః॥ ॥౨౭॥

లోకమునకు బవిత్రమైన నవగ్రహములయొక్కయు నిందచే జాతకఫలితము

ను జెప్పుటయు మలినప దార్గ ప్రయోగముయొక్క దోషముచే వైద్యమును వాటిపలన సంభవించుపాపము ను పరిహరించుకొను సామర్థ్యములేనివాడు విడిచిపెట్టబడయును.

శ్లో ॥ లోకోత్తరగ్రంధవిశిష్టశే
చర్చాజయ స్స్యాన్నజయః క్రియాసు।
క్రియాజయోభ్యాసగురూపదేశ
హస్తప్రభావాగమశిష్టశేధః॥ ॥౨౮॥

లోకోత్తరమైన ఉగ్రగ్రంధపఠనముచే వాదమునందు జయముకలుగును గాని చికిత్సలయందు జయముకలుగదు అభ్యాసపాటవము, గురూపదేశము, హస్తప్రభావము శాస్త్రాధ్యయనము అనువాటివలన చికిత్సాజయముకలుగును, ॥౨౮॥

శ్లో ॥ పాత్రప్రధానం ఖలుశాస్త్ర మేత
ద్గవి తృణం క్షీర మహేః పయశ్చ।
విషం యథాస్యా దమృతం విషంచ
విషం తథైవా మృతమర్థ తాయాః॥ ॥౨౯॥

గోవులయందు గడ్డి పాలుగాను, పాములయందు పాలు విషముగాను ఎట్లు మారిపోవుచున్నవో అట్లే యీవైద్యశాస్త్రము అర్హత ప్రధానముగాగలది. ॥౨౯॥

శ్లో ॥ విశ్వాస ఏవాత్ర మహాన్ప్రధానో
విశ్వాసహీనస్య వృథా సుధాపి।
మహంతి మంత్రాణి వచాంసి స్పృశో
శుద్ధక్రియా ఏవ ఇతి ప్రతీతే॥ ॥౩౦॥

మాటలే మహామంత్రములు, చేష్టలే శుద్ధక్రియలు అనుప్రతీతివలన చికిత్సావిషయమున నమ్మకమే మిక్కిలి ముఖ్యమైనది. అట్టినమ్మికలేనివానికి అమృతముకూడా వ్యర్థముమగును ॥౩౦॥

శ్లో ॥ శరీరజవ్యాధివినిర్ణయశ్చ
నిర్ణీతతద్వ్యాధివికారశాంతిః।
వైద్యస్య వైద్యత్వ మిదం ప్రసిద్ధం
న వైద్యకోపః ప్రభురాయుషస్స్యాత్ ॥ ॥౩౧॥

వైద్యునకు వైద్యత్వమెంతవరకనగా వ్యాధి ఫలానిది అని నిర్ధారణచే

యుటయు, ఆవ్యాధికి శమనోపాయము చెప్పుటయు ఇంతే కాని వైద్యుడు అయు ర్ధాతుమును పోయగలిగినసమర్థుడు కాజాలడు ॥౨౧॥

శ్లో॥ గురోరధీతాఖిలవైద్యవిద్యః
పీయూషపాణిః కుశలః క్రియాసు।
నిరాగ్రహో ధైర్యధరః కృపాళు
శ్శుద్ధోధికారీ భిషగీదృశ స్స్యాత్॥ ।౨౨।

సద్గురువువలన వైద్యశాస్త్రసాంప్రదాయమును చక్కగా గ్రహించినవాడును, అమృతహస్తముకలవాడును, చికిత్సాసామర్థ్యము కలవాడును, కోపములేని వాడును, ధైర్యవంతుడును, దయాళువును, పరిశుద్ధుడును ఐన వైద్యుడు చికిత్సచేయుటకు అర్హుడు అట్టివాడె సద్వైద్యుడని వ్యవహరింపబడుచున్నాడు. ॥౨౨॥

శ్లో॥ దాక్షిణ్యవానేవ విధిస్వరూప
శ్చికిత్సకస్స్యా దసతాం సతాంచ।
అభేదబుద్ధ్యా కురుతే చికిత్సాం
స ఏవ సద్వైద్య ఇతి ప్రదిష్టః॥ ॥౨3॥

అందరియందు సమానబుద్ధికలవాడే భగవత్స్వరూపుడు, అయోగ్యులకును, యోగ్యులకునుకూడ సమానబుద్ధితో ఎవడు చికిత్సచేయునో వాడే సద్వైద్యుడని చెప్పబడుచున్నాడు ॥౨3॥

శ్లో॥ యో వై చికిత్సానిపుణ స్సమస్త
రుగ్జ్ఞానవా న్ఛాస్త్రవిచక్షణశ్చ।
ప్రతిక్రియాయా మపి తస్య సిద్ధి
ర్భవ త్యవశ్యేన న సంశయోత్ర॥ ॥౨౪॥

క్రియలయందు నేర్పరియు, సమస్తరోగములను గుర్తెరింగినవాడును, వైద్య శాస్త్రపరిశ్రమకలవాడును అగు వైద్యునికి చికిత్సలయందు జయముచేకూరును॥౨౪॥

## —♦ కువైద్యలక్షణము ♦—

శ్లో॥ ఉపేక్షతే పక్వగదస్య శాంత్యై
యత త్యపక్వస్య గదస్య శాంత్యై।
ఏవంవిధో జ్ఞానలవానభిజ్ఞః
క్రియాస్వనర్హః ఖలు (కూటవైద్యః॥) వైద్యజాల్మః॥ ॥౨౫॥

పక్వమయినవ్యాధియొక్క చికిత్సయందు ఉపేక్షించునట్టియు, అపక్వమయి నవ్యాధియొక్క శాంతికొరకు ప్రయత్నించునట్టియు యిటువంటిజ్ఞానములేని మూఢ వైద్యుడు చికిత్సచేయుటకు అర్హుడు కాడు. ॥౨౫॥

శ్లో॥ న ధాతోర్విజ్ఞానం న చ పరిచయో వైద్యకనయే
న రోగాణాం తత్త్వావగతి రపి నో వస్తుగుణధీః।
తథా ప్యేతే వైద్యా ఇతి తరళయంతో జడజనా
నసూ న్మృత్యో ర్భృత్యా ఇవ వసు హరంతే గదజుషామ్॥౨౬॥

ధైర్యవంతులగు మూఢవైద్యులు నాడీజ్ఞానమును, వైద్యశాస్త్రపరిచయమును, రోగపక్వాపక్వజ్ఞానమును ఓషధీగుణజ్ఞానమును ఎరుంగకయే వైద్యులమని పేర్లు పెట్టుకొని తెలియనివారిని భ్రమింపజేయుచు మృత్యుదేవతలకు దూతలై అనేకమంది రోగులయొక్క ప్రాణములనున్ను ధనమునున్ను అపహరించుచున్నారు. ॥౨౬॥

శ్లో॥ మిథ్యౌషధైర్భ్రాంత మృషాకషాయై
రసమ్యలేహ్యై రయథార్థతైలైః।
వైద్యా ఇమే వంచితరుగ్ణవర్ణాః
పిచండభాండం పరిపూరయంతి॥ ॥౨౭॥

వైద్యవేషధారులగు దుర్మార్గులు శాస్త్రోక్తములుగాని అబద్ధపుమందులచేతను న్ను, అసమ్యకరములయిన లేహ్యములచేతనున్ను, అబద్ధములైన తైలకషాయాదుల చేతనున్ను, తమతమయిష్టానుసారముగా చికిత్సలుచేసి రోగులను మోసగించి తమ పాడుపొట్టలను నిండించుకొనుచున్నారు ॥౨౭॥

శ్లో॥ అకాలమృత్యో రవతారమూర్తయే
నమోఽస్తు వైద్యాయ యమాగ్రజాయ।
యమ స్త్వసూనేవ హరత్యశేషా
నహో నను ప్రాణధనాని వైద్యః॥ ॥౨౮॥

అకాలమృత్యుస్వరూపుడును, యమధర్మరాజునకు అన్నగారును, అగుమూఢ వైద్యునకు నమస్కారము. యమధర్మరాజు ప్రాణములను మాత్రమే హరించుచు చున్నాడు. మూఢవైద్యుడు ప్రాణములనుగాకుండగ ధనమునుకూడా అపహరించు చున్నాడు. (కనుకనే యమునికి అన్నగారు.) ॥౨౮॥

శ్లో॥ సంన్యస్తపాపస్మరణాంతరాత్మనా
మనన్యవిశ్వాసయుతాసుహారిణామ్ ।
అజ్ఞాతరుఙ్మర్మధచికిత్సకానాం
నమః త్రిసంధ్యం నరమేధయాజినామ్॥ ॥౮౯॥

పాపభీతిని విడిచిపెట్టినటువంటిన్ని, ఇతరులను నమ్మక తనను నమ్మినవారి ప్రాణములనుమాత్రమే అపహరించునటువంటిన్ని రోగతత్వజ్ఞానములేకుండగ చికిత్సలకు సిద్ధపడునటువంటిన్ని నరులతో యాగముచేయు దుష్టవైద్యులకు త్రికాలముల యందు నమస్కారము. ॥౮౯॥

శ్లో॥ విద్యాధికానా మచికిత్సకత్వా
చ్చికిత్సకానా మనధీత్యకత్వాత్ ।
విద్యాచికిత్సాద్వయహీన ఏక
శక్త్యాప్యయం నైవ చికిత్సకస్స్యాత్ ॥ ॥౯౦॥

విద్యాధికులు, చికిత్సావిషయముల నెరుంగనివారున్ను చికిత్సకులు శాస్త్రజ్ఞానములేనివారున్ను అయియున్నారు. శాస్త్రజ్ఞానమున్ను, చికిత్సాజ్ఞానమున్ను ఈరెండున్ను కలిగియున్నవారే వైద్యులగుదురుగాని ఈరెంటిలో ఒకదానియందు సమర్థత కలిగియున్నప్పటికి రెండవదానియందు సమర్థతలేనియెడల అట్టివాడు వైద్యుడనిపించుకొన నేరడు. ॥౯౦॥

## — ♦ అమృతహస్తలక్షణమ్ ♦ —

శ్లో॥ యస్యోర్ధ్వరేఖా బహవోంగులీషు
వైద్యం త మేవాఽమృతహస్త మాహుః ।
ప్రతిక్రియా స్యాత్సఫలైవ తస్య
ప్రమాదికే ష్వశ్వినయో రివ స్యాత్ ॥ ॥౯౧॥

ఎవనియొక్క చేతివ్రేళ్ళయందు ఊర్ధ్వరేఖ లధికముగా నుండునో అట్టివాడు అమృతహస్తుడని చెప్పబడుచున్నాడు. ప్రమాదకరమయినవ్యాధులయందుకూడ అట్టి అమృతహస్తునియొక్క చికిత్స అశ్వినీదేవతలయొక్క చికిత్సవలె సఫలమయినదై ఆగుచున్నది. ॥౯౧॥

—— దగ్ధహస్తలక్షణం ——

శ్లో॥ కుష్ఠం పంగుం బధిర మమతిం చాంధకం శీఘ్రకోపం
దుర్వృత్తం స్వే మలినవసనం సర్వవిద్వేషభావమ్।
మూర్ఖం స్తబ్ధం దురితవచనం సంతతం కాష్ఠవాదం
సంధ్యాస్నానవ్రతవిరహితం పాణిగాఽకృష్ణరేఖమ్॥ ॥౯౨॥

కుష్ఠురోగి, కుంటివాడు, చెమిటివాడు, మతిస్థిరములేనివాడు, గుడ్డివాడు, శీఘ్రకోపముగలవాడు, ద్రవ్యనిష్కర్ష చేసుకొని చికిత్స సరిగాచేయనివాడు, మలినవస్త్రధారి, అందరితోను కలహించుస్వభావముకలవాడు, తెలివితక్కువవాడు, మందమతికలవాడు, కదలికలేనివాడు, దుర్భాషలాడువాడు, ఎల్లపుడు పిడివాదముచేయువాడు, సంధ్యావందనము, స్నానము, జపము చేయలేనివాడు అరచేతియందు నల్లని రేఖలు గలవాడు వీరు దగ్ధహస్తులుగాన విడిచిపెట్టవలెను. ॥౯౨॥

శ్లో॥ వక్త్రోచ్ఛిష్టం వచనసమయే పైతృకగ్రామచారం
వామాభ్యాసం కుటిలహృదయం చాపి విశ్వాసఘాతమ్।
మిథ్యావాదం వికలకరణం కర్కశం మూర్ఖచిత్తం
జ్ఞాత్వైతాదృగ్విధగుణయుతా న్వర్జయే ద్దగ్ధహస్తాన్॥ ॥౯౩॥

తుంపరలు చెదరునట్లు మాట్లాడువాడు, శ్రాద్ధదినమున శ్రాద్ధమునిమిత్తము గ్రామయాచనకు బయలుదేరువాడు, ఎడమచేయి ప్రధానముగాగలవాడు, దుర్మార్గుడు, నమ్మినవారిని మోసముచేయువాడు, అబద్ధమాడువాడు ముదిమిరాకముందే వణకువాడు, కఠినమనస్కుడు, మూర్ఖస్వభావముకలవాడు వీరు దగ్ధహస్తులుగాన విడిచిపెట్టవలయును. ॥౯౩॥

శ్లో॥ దుర్మంత్రీ రాజ్యనాశాయ గ్రామనాశాయ దుర్భిషక్।
స్యాలకో గృహనాశాయ సర్వనాశాయ మాతులః॥ ॥౯౪॥

మంత్రి చెడ్డవాడయినచో రాజ్యనాశనమున్ను, వైద్యుడు చెడ్డవాడయినచో గ్రామనాశనమున్ను, భార్యసోదరుడు చెడ్డవాడయినచో గృహనాశనమున్ను, మేనమామ చెడ్డవాడయినచో సర్వనాశనమున్ను కలుగును. ॥౯౪॥

శ్లో॥ వైద్యం పానరతం నటం కుపఠకం స్వాధ్యాయహీనం ద్విజం
యుద్ధే కాపురుషం హయం గతరయం మూర్ఖం పరివ్రాజకమ్।
రాజానంచ కుమంత్రిభిః పరివృతం దేశంచ సోపప్లవం
భార్యాయౌవనగర్వితాం పరరతాం ముంచంతి శీఘ్రం బుధాః॥

త్రాగుబోతయిన వైద్యుని, ఉచ్చారణపరిశుద్ధి లేని నటుని, వేదము చదువని బ్రాహ్మణుని, యుద్ధమందు వెనుకకుమరలినవానిని, వేగముగానడవని గుర్రమును, మూర్ఖుడయిన యతిని, దుర్మంత్రులతోకూడుకొనిన రాజును, ఉపద్రవముతోకూడుకొన్న దేశమును, యౌవనమత్తురాలును పరులయందాసక్తికలదియు నగు భార్యను తెలివిగలవాడు శీఘ్రముగా విడిచిపెట్టవలెను ॥౯౦॥

—♦ మూఢవైద్యులకు కీర్తికారణం ♦—

శ్లో॥ అజ్ఞోఽపి సర్వజ్ఞసమీపదేశే నిశ్శంక మాహ్వానబలాచ్చికిత్సామ్
కరోతి ధైర్యాదితి యద్వధేష్టం తత్తారతమ్యాజ్ఞగృహస్థదైన్యమ్

మూఢజనులచే పిలువబడి సర్వజ్ఞులయిన వైద్యుల సమీపదేశములయందు అజ్ఞుడయినవైద్యుడు నిస్సంశయముగా తనయిష్టానుసారము చికిత్స చేయుచున్నాడన్న మాట యేదికలదో! అది వైద్యులయొక్క తారతమ్యజ్ఞానములేక అహ్వానముచేసిన గృహస్థులలోపము. ॥౯౧॥

శ్లో॥ రోగాస్సమస్తాః కతిచిద్వినైవ
శామ్యం త్యవశ్యం స్వయమేవ నూనం।
తథావిధవ్యాధయ ఏవ మూఢ
వైద్యస్య కీర్తిం పరివర్ధయంతి॥ ॥౯౨॥

ఏవియో కొన్ని కఠినవ్యాధులుతప్ప సామాన్యముగా చాలావ్యాధులు వాటంతట అవియే తగ్గుచుండును చికిత్సచేయుటలో ఇట్టివ్యాధులే మూఢవైద్యుల కీర్తిని విస్తరింపజేయుచున్నవి. ॥౯౩॥

—♦ వైద్యులప్రాశస్త్యం ♦—

శ్లో॥ ఆద్యాహృతాన్మధ్యసమాహృతశ్చ
మధ్యాహృతాదంతసమాహృతశ్చ
ఏవంచ రోగోపశమక్రియాసు
క్రమోత్తరస్స్యాత్ఖలు సుప్రశస్తః॥ ॥౯౪॥

చికిత్సావిషయమై మొదట తీసుకురాబడిన వైద్యునికంటె మధ్య తీసుకురాబడినవాడును, మధ్యకాలమున తీసుకురాబడినవానికంటె రోగాంతమున తీసుకురాబడినవాడును ప్రజ్ఞాధికులుగా కనుపడెదరు. ॥౯౫॥

## —♦ వైద్యసాంకర్యం ♦—

శ్లో॥ ఏకశాస్త్రవిధానేన వినాన్యైరౌషధైః క్రియామ్ ।
యస్మాత్కరోతి నైకోపి సంకరా స్సర్వరీతయః॥ ॥౯౯॥

ఇతరవిధములయినమందులను వాడకుండా ఒకవిధమయిన మందులనే వాడి చికిత్స చేయకపోవుట సంకరచికిత్స అని చెప్పబడుచున్నది. ॥౯౯॥

శ్లో॥ అసాంప్రదాయాచరణై రపూర్వ
క్రియాభి రప్యద్యతనై శ్చికిత్సా।
గ్రంథై ర్భిషగ్భిశ్చ యుగక్రమేణ
ప్రత్యేకరీతిః ప్రతిభాత్యపారా॥ ॥౧౦౦॥

అసాంప్రదాయములయిన ఆచరణముల చేతనున్ను, నవీనములయిన క్రియావిధానముల చేతనున్ను, ఆధునికులచే విలక్షణముగా కల్పింపబడిన చికిత్సావిధానము. గ్రంధముల చేతనున్ను, వైద్యుల చేతనున్ను యుగధర్మమును అనుసరించి వివిధములుగానున్నది. ॥౧౦౦॥

శ్లో ॥ ఆహూయంతి పున స్త్యజంతి పున రాహూయంతి వైద్యాన్బహూ
న్జాత్వైకం పటు మేకదా ఉపటు మముం స్మృత్వాన్యదాన్యం పటుం।
దాస్యం త్వౌషధ మాహృతం బహువిధం స్వాప్తై ర్మిథః ప్రేషితం
స్వేచ్ఛాసంకరతాం నయం త్యనుచితాహారాదిభి ర్వ్యాధిషు॥

అనేకమంది తరచుగా కంటికి కనుపించిన ప్రతివైద్యునిన్ని చికిత్సకొరకు ప్రవేశపెట్టుచు వెంటనే వానిని తిరిగి విడిచిపెట్టుచు మరియొకవైద్యుని ప్రవేశపెట్టుచుందురు. వారికితోచినట్లెల్ల చికిత్సలవిషయములో ఒకానొకవైద్యుని సమర్థునిగాను, మరల వానినే అసమర్థునిగాను, మరియొకప్పుడు మరియొకనిని సమర్థునిగాను, తిరిగి వానినే అసమర్థునిగాను తలంచుచు వారివారియిష్టానుసారము వైద్యులను మార్చుచుందురు. యిదిగాక తమమిత్రులచేగాని ఆప్తులచేగాని పంపబడుమందులను యితరులకు తెలియకుండగ రోగులకుపోయుచుందురు. ఈప్రకారము స్త్రీరోగమునకు విరుద్ధమయిన మందులను, స్త్రీఆహారములను, అనుపానముల మొదలయినవాటినియిచ్చి సంకరమును పొందించుచున్నారు. ॥౧౦౧॥

—♦ మూఢరోగులు ♦—

శ్లో॥ దత్తౌషధం చే దహితం యది స్యా
త్పథ్యాదికం వైద్యకకల్పితం చ।
స్వయం త్వకృత్వైవ భిషక్ప్రణీతం
వదం త్యహో కృతిమదుర్గుణాం స్తు॥ ॥౧౦౨॥

వైద్యుడిచ్చిన మందుగాని, చెప్పినపథ్యపానాదులుగాని తమకు అంగీకారము గాలేనప్పుడు ,అమందు పుచ్చుకొనకయు, పథ్యపానములు చేయకయు, చేసినట్లు నటించి వాటివలన దుర్గుణములు గలిగినవని అపద్ధపుమాటలుచెప్పుచుందురు. ॥౧౦౨॥

శ్లో॥ నోచే ద్వికారం స్వకృతా దపథ్యా
త్తద్గోపయ త్యేవ వికారహేతౌ।
స త్యౌషధే న్యశ్యతి వానుపానే
చికిత్స కైర్జ్ఞేయ మిదం రహస్యం॥ ॥౧౦౩॥

రోగి తానుచేసిన అపథ్యమువలన వికారము కలుగకున్నచో దానిని కప్పిపుచ్చును. ఒకవేళ వికారము కలిగినచో అవికారదోషమును ఔషధమందో అనుపానమందో ఆరోపించును. యిట్టిరహస్యము గుర్తించుకొనుచుండవలెను. ॥౧౦౩॥

—♦ దోషప్రకోపస్వభావము ♦—

శ్లో॥ ఊర్ధ్వప్రపాతా ద్విషభక్షణాద్వా
జీవ త్యహో నిర్వికల స్తథైవ।
అపథ్యదోషా దపి నిర్వికార
స్తథా ప్యపథ్యం న కదాపి కుర్యాత్॥ ॥౧౦౪॥

ఉన్నతప్రదేశమునుండి పడినను, విషముతిన్నను వికారముచెందక ఒకానొకప్పుడు మానవుడెట్లుజీవించుచుండునో అప్రకారమే రోగములయందుకూడ అపథ్యాదులవలన వికారము కలుగకపోవచ్చును ఇట్లని బుద్ధిపూర్వకముగా అపథ్యాదులను చేయరాదు. ॥౧౦౪॥

శ్లో॥ అధిశేతే యథా భూమిం బీజం కాలే చ రోహతి।
అధిశేతే తథా ధాతుం దోషః కాలే చ కుప్యతి॥ ॥౧౦౫॥

విత్తనము భూమియందు అణగియుండి కాలాంతరమునందు మొలిచినట్లు వాతాదిదోషములుకూడ తమతమ స్థానములయందు అణగియుండి కాలాంతరమున ప్రకోపమును చెందుచున్నవి. ॥౧౦౫॥

శ్లో॥ అప్రరుహ్యైవ వరాసు బీజాని కతిచి ద్భువి।
కాలాంతరే ప్రరోహంతి కేచి ద్రోగాశ్చ తాదృశాః॥ ॥౧౦౬॥

కొన్ని విత్తనములు (బ్రహ్మదండిగింజలు వాటినే చిన్నపిల్లలు పేలు అనికుక్క అడుచుందురు) భూమియందు ప్రవేశించియు వర్షాకాలమందు మొలవక అటుపిమ్మట మొలచినట్లుగా కొన్ని కొన్ని రోగములు అపథ్యదోషముకలిగినవెంటనే ప్రకోపమును చెందక కొంతకాలమయినపిదప ప్రకోపించును. ॥౧౦౬॥

## —♦ ఆనుషంగికోపద్రవములు ♦—

శ్లో॥ అజ్ఞానినో వాపి వదం త్యుపాయం
ప్రజ్ఞాధికేభ్య స్స్వమతానుసారమ్।
ప్రాణాంతకం వా స్వకృతం తదుక్తం
నోచే ద్ధరిష్యం త్యుపచారకాసూనా॥ ॥౧౦౭

అజ్ఞానులుకూడ ప్రజ్ఞాధికులకంటె యెక్కువగా వారివారి యిష్టానుసారము వారికితోచినట్టు ఉపాయములను చెప్పుచున్నారు. ప్రాణాంతకమయినదయినను వారు చెప్పినది చేయనియెడల ఉపచారముచేయువాని బాధించుచుందురు. ॥౧౦౭॥

శ్లో॥ ద్రష్టుం రుగ్ణిణ మాగతాః పునరమీ తూష్ణీం న గచ్ఛంతి తే
కేచి ద్భూతబలిం వదంతి కతిచి ద్రక్షాత్వచం వాయసమ్।
దృగ్దోషం కులదేవతా నిరసనం హోమం గ్రహాణామిదం
చాపన్నా న్వ్యథయంతి తాని వివశా న్కృత్యాత్యజంత్యౌషధమ్

రోగిని చూచుటకు వచ్చినవారు రోగినిచూచి ఊరక వెడలరు. వీరిలో కొందరు భూతబలియివ్వమనియు, మరికొందరు రక్షరేకులను కట్టించమనియు, మరికొందరు దిగతుడుపు పెట్టమనియు, మరికొందరు దృష్టిదోషమును తీయుమనియు, మరికొందరు యిలవేల్పును నిరశించుటచేగలిగినబాధగాన కులదైవతమును ఆరాధింపవలయుననియు, మరికొందరు గ్రహశాంతి చేయవలయుననియు వారివారి యిష్టానుసారము ఆపత్పీడితులను భ్రమింపచేయుదురు యీ ఆపత్పీడితులు మనస్థిమితములేక వారిమాటలనువిని మందులను లోనికిపుచ్చుట మాని వేయుచున్నారు. ॥౧౦౮॥

శ్లో॥ ఆహారపానీయవిహారపథ్య
భేదానభిజ్ఞా రుక్ప్రముపాగతేషు।
అపప్రథాం ముక్త్వంచిశితానా
మజ్ఞానినో వా పరికల్పయంతి॥ ॥౧౦౯॥

నిజమును తెలియనిమూఢులు ఆహారము, పానీయము, విహారము వీటియొక్క లోపమువలన రోగము తిరగబెట్టినదిఅను అపవాదమును కల్పించుచున్నారు. ॥౧౦౯॥

శ్లో॥ నాజ్ఞాతా వసతి స్వయం తు సహసా జ్ఞాతేవ మధ్యాగత
స్స్వాజ్ఞాతం విషయం విచక్షతి బహుజ్ఞాతేవ తద్బంధుభిః।
సద్య స్సౌఖ్యసుఖాశయాజ్ఞవచనభ్రాంతా స్సువైద్యం త్యజం
త్యేవం వైద్యవిధౌ యథార్థ్వ విధినా లోకేచికిత్సాహతా॥౧౧౦

రోగమధ్యమున రోగినిచూచుటకు వచ్చినవారు తెలియనివారు తెలియనట్లూరకొనక రోగితోను రోగియొక్కబంధువులతోను తమకు తెలియనిరోగములనుగురించి మిక్కిలి తెలిసినవారివలె తమకుతోచినప్రకారము ఉపన్యసింతురు రోగభయముచే తొట్రుపాటునబడినవారు రోగికి తక్షణమే సుఖము చేకూరవలెనను ఆశతో అజ్ఞానులుచెప్పిన వెర్రిమొర్రిమాటలను విని భ్రాంతిపడి చక్కగా వైద్యముచేయుచున్న వైద్యుని తత్క్షణమే ఆలోచనలేక విడిచిపెట్టుచున్నారు ఈరీతిగా వైద్యవిధాన మభ్రష్టము అగుచున్నది ॥౧౧౦॥

—♦ మూఢప్రత్యం ♦—

శ్లో॥ శ్రుత్వా బద్ధ శ్శ్రోత్రణసుఖదాంబరాజ్ఞప్రలాపా
న్ప్రాజ్ఞో వాఽఽపత్ప్రతిహతమనా ముహ్యతి త్యక్తధైర్యః।
ఆపన్నాస్తే స్సపది విపదాం సంఘటంతే ప్రియత్వా
త్పూర్వాదృష్టం ఫలతి మనసా నేచ్ఛతి స్సాక్షమాత్రా॥

ప్రాజ్ఞులుకూడా ఆపత్తువలన మనోధైర్యము చెడి తత్కాలమున చెవులకింపయిన అప్రాజ్ఞుల ఆడంబరవాక్యములనువిని తమకుగల ధైర్యమును పూర్తిగా కోలుపోవుచున్నారు. ఆపన్నులు సామాన్యముగా ఆపత్కాలమందు అప్రాజ్ఞులతో అప్రయత్నముగా కలుసుకొనబడుచున్నారు. ప్రతివారికిని వారివారి పూర్వకర్మానుసారముగ రోగములున్ను ఆరోగములయొక్క ప్రకోపోపశాంతములును సంప్రాప్తములు అగుచుండును. అయినప్పటికి వారివారి పూర్వకర్మానుసారము ఫలప్రాప్త

కలుగుచుండును. అయినప్పటికిన్ని అప్రాజ్ఞులయొక్క సమావేశము యీఅప్రాజ్ఞు అమాటవినుట అవునని సాక్షిమాత్రము లు. ॥౧౧౧॥

శ్లో॥ కేచి త్తత్ర నివాసవద్భి రఖిలై రూనాధికై ర్వైద్యకై
ర్వైద్యం కారయితుం యతంతి చ ముఖప్రీత్యై సమస్తాత్మనామ్
తస్మా దేకతమస్య వా వితతరుక్శాంత్యాం తు కస్యాపివాఽ-
శ్రద్ధా ప్రత్యుత నైవ కింతు భవితృస్వార్థాభిహారో భవేత్॥

కొందరు తమచుట్టుపట్ల నివసించుచున్న సామాన్యవైద్యులచేతనున్ను గొప్ప వైద్యులచేతనుకూడా మొగమాటము చెడకుండా అందరిచేత వైద్యముచేయించుట మంచిదని తలంచి ఆప్రకారముచేయుటకు ప్రయత్నించుచున్నారు. ఇందువల్లనుంచి ఆవైద్యులలో ఒకరికిన్ని రోగశమనోపాయచింత ఉండదు వైద్యముయొక్క పూచీ తమయందు లేదని యెవరికివారు అశ్రద్ధచేయుదురు. దీనివలన ముందు జరగ వలసిన ఆరోగ్యచికిత్సకు అంతరాయముకలుగును. ॥౧౧౨॥

శ్లో॥ కేచి ద్రుజా ముద్ధ్రిత మేవ శాంతిం
న వైద్యకాయ క్వచి దప్యుశంతి।
ఆయాంతి నమ్రాః పున రామయేషు
ప్రాగ్వంచకా విస్మృతపూర్వచేష్టితాః॥ ॥౧౧౩॥

కొంతమంది రోగముయొక్క ఉద్ధృతస్థితినిమాత్రము మిక్కుటముగా చెప్పు చుందురు. రోగికి కలుగుచున్న సుగుణసంపత్తిని చెప్పరు. ఒకానొకప్పుడు వైద్యుని అనాదరణచేసినవారు ఆమయవ్యాప్తి కాలమున పూర్వము తాము యొనర్చిన అనాదరణము మాటనుమరచి మిక్కిలి నమ్రభావముతో వచ్చెదరు. (దీనివలన ఒక్కొక్కప్పుడు వైద్యవైషమ్యము యేర్పడును.) ॥౧౧౩॥

శ్లో॥ హితాయ తత్రత్యచికిత్సకానాం
తేభ్యోఖిలేభ్యః ప్రతిగృహ్య జాయుం।
రుగ్ణాయ దత్వా న మృషానదంతే
గుణాగుణా న్కేచి దహో భిషగ్భ్యః। ॥౧౧౪॥

కొంతమంది తమచుట్టుపట్లనున్న వైద్యులకందరికిని తమయందు అభిమానము కలిగించుకొనుటకొరకు వారివద్ద మందులనుగ్రహించి ఆమందులను రోగులకిచ్చి ఆ వారికితోచినప్రకారము గుణములనుగాని దోషములనుగాని అబద్ధపుసంగతులను చెప్పుచుందురు. ॥౧౧౪॥

శ్లో॥ ప్రితిక్రియాయాం సుచిత్సకేన
సమ్యక్కృతాయామపి వా స్వభావాత్।
నివారణస్య వ్యవధాన హేతో
స్సమానయం త్యన్య మముం విస్సృజ్య॥ ॥౧౧౪॥

తెలివిగలవైద్యునిచే చికిత్స చక్కగాచేయబడుచున్నను స్వభావసిద్ధముగ కొన్నివ్యాధులు కుదురుటకు ఆలస్యమగును. అట్టిసందర్భములలో ఆలస్యమును సహింపక మరియొకవైద్యుని తీసుకొనివచ్చి చికిత్సచేయింతురు ॥౧౧౫॥

శ్లో॥ యుక్తౌషధైః కుర్వతి సచ్చికిత్సా
మాప్తేపి వైద్యే సుకుమారతంత్రైః।
త్వక్పత్రిమూలై రుపతాపలేప
క్రియా స్సమిచ్ఛంతి హి కేచిదజ్ఞాః॥ ॥౧౧౬॥

తనుక్షేమమునుకోరినవైద్యుడు ఆయారోగప్రయోగములయిన మందులచేతనున్ను సుకుమారములయిన చికిత్సలచేతనున్ను జాగ్రితగా చికిత్సచేయుచుండగా కొంతమందిఅజ్ఞానులు యెవరోచెప్పినపసర్లచేతనున్ను వేర్లయొక్కయు ఆకులయొక్కయు కషాయములచేతనున్ను, పట్లచేతను, కాపడము మొదలయినవాటిచేతనున్ను చికిత్సలనుకోరుచు సద్వైద్యమును విడుచుచున్నారు ॥౧౧౬॥

శ్లో॥ రుక్పక్వకాలాగతపాంథవాక్యైః
విసృజ్య వైద్యం కురుతే తదుక్తం।
దైవేక్షణం భూతబలిం వ్రితంవా
రుగ్వారితా తైరితి విశ్వసంతి॥ ॥౧౧౭॥

రోగము పక్వమయ్యేసమయమునకు వీధిలోకివచ్చిన ఏభైరాగిమాటలతో నమ్మి అంతటితో రోగప్రారంభములగాయితు వైద్యముచేసి రోగనివారణచేశినవైద్యుని విడచి ఆభైరాగిచెప్పిన దిగదుడుపుకు పెట్టుటగాని ఏతిరుపతియో మొక్కుదమనిగాని ఏవ్రితమునో చేసెదమనిగాని మొక్కియు వాటివలన రోగము తత్క్షణమే మళ్ళిపోయినదని నమ్మెదరు. ॥౧౧౮॥

శ్లో॥ విశ్వాసశూన్యా ఇతి న త్యజంతి
విశ్వాసయుక్తా ఇతి తత్క్రియాంతం।
నేక్షంతి రుక్శాంతిపరా రుగాదే
స్తుదంతి మూల్యాద్యథ భోజనాద్యు॥ ॥౧౧౯॥

వైద్యునియందు లేకు నమ్మిక లేదని విడిచిపెట్టరు. నమ్మిక కలదని రోగము పూర్తిగాకుదిరేవఱకు మాడరు. రోగప్రారంభములగాయకు యింకా రోగనివారణ కా లేదనియు మంచిమందులను వేయమనియు వైద్యుని పీడించుచుందురు. ॥౧౧౮

శ్లో॥ స్వస్యేష్టవైద్యాగమనాంతరేషు
తత్కాలదోషపకృతిప్రసక్త్యా।
బలాదనిచ్ఛంతమపి క్రియాయై
ప్రవేశ్య పశ్చాద్విసృజంతి వైద్యమ్॥ ॥౧౧౯॥

తమకు ఇష్టమయినవైద్యుడు వచ్చేలోగా వైద్యసహాయప్రసక్తిచే తనయింటి వద్ద చికిత్సకుయిష్టపడనివైద్యుని బలాత్కారముగా వైద్యమునకు ప్రవేశపెట్టి తమకిష్ట మయినవైద్యుడు రాగానే విడిచిపెట్టెదరు. ॥౧౧౯॥

శ్లో॥ యత్కించదప్యౌషధమేవ దీయతే
నైకోఽపి తేషాం గుణదః కథం భవేత్।
ఇత్యాశయా కాలమపాస్య మోహితాః
కుర్వంతి సాధ్యాన్నపి రప్యసాధ్యకాన్॥ ॥౧౨౦॥

యేదో ఒకమందు యిప్పించుచున్నాముకదా వాటిలో ఏదో ఒకటి పనిచేయకపోవునా అను ఆశచే కాలమును వెళ్ళబుచ్చి సులభసాధ్యమయిన వ్యాధులను అసాధ్యములయినవాటినిగా చేయుచున్నారు ॥౧౨౦॥

శ్లో॥ రోగేషు వక్రగమనేషు భిషక్చికిత్సాం
ఆమోదయంత్యవిదితామయభీతిభీతాః।
రోగే ష్వవక్రగమనేషు భిషక్చికిత్సాం
నామోదయంతి కిముతాపహసంతి వైద్యమ్॥ ॥౧౨౧॥

వ్యాధి అసాధ్యముగానున్నప్పుడు, వ్యాధిని గుర్తింపలేక భయపడి వైద్యుడెట్టివిధముగా చికిత్సచేసినను దానిని అంగీకరింతురు. వ్యాధి మళ్ళినదనితోచినప్పుడు వైద్యుని చికిత్సకు అంగీకరింపరుసరికదా వైద్యునికూడ పరిహసింతురు. ॥౧౨౧॥

శ్లో॥ వైద్యాలభే ర్యాకథవిశ్వాసవత్త్వా
ల్లోకానాంభావ్యాపదజ్ఞానవత్త్వాత్।
తత్తత్కాలప్రాప్తజాయా నరిసాంశ్చ
రుగ్ణాం దత్వా హంతి చాఽ మూఢి రేవ॥ ॥౧౨౨॥

అవసరమయినప్పుడు సద్వైద్యుడు లభ్యము కాకపోవుటవల్లనున్ను జెరిగిన మ్మకముకలిగియుండుటవల్లనున్ను ముందు కలుగబోవు అసందర్భస్థితి తెలియకపోవుటవల్లనున్ను ఆయా కాలములయందు తమకుదొరకిన అనవసరములయిన మందులనున్ను కషాయాదులను రోగులకుయిచ్చి తుదకు వీటివల్లనే రోగికి అపాయముకలుగజేయుచున్నారు. ||౧-౨-౨||

శ్లో|| వ్యామోహకాభూషణదర్పవేషైః
కుర్వంతి మాయాం బహవస్స్వకృత్యే।
తాన్విశ్వసంతః కలిచిత్కదాచి
జ్జ్ఞాత్వాపి తేహ్యపదమేవ యాంతి॥ ||౧-౨౩||

అనేకమంది తమకృత్యములయందు ప్రజాసముదాయమునకు మోహము కలుగజేయు ఆడంబరవేషములతోను, సంభాషణతోను మాయనుచేయుచున్నారు. లోకములట్టివారిని నమ్మి ఒకానొకప్పుడు మోసపోవుచున్నది. ||౧-౨౩||

శ్లో|| రుక్పక్వపథ్యాగదయోజనేషు
వైద్యాత్త్వసత్కౌశలదర్శనాయ।
రుక్శాంతివైద్యాభినివేశహంత్రీం
త్యజంతి వాచం స్వపటుత్వసూచీమ్॥ ||౧-౨౪||

కొంతమంది వ్యాధియొక్క పక్వాపక్వతలను నిర్ణయించుటలోను పథ్యపానాదులు కల్పించుటలోను మందులు మొదలయినవి యిచ్చుటలోను వైద్యునికంటె తమకే ప్రావీణ్యత కలదని వెల్లడిచేయుటకు రోగోపశాంతియందు వైద్యునకుగల శ్రద్ధను శమింపజేయు వృథాలాపములను పలుకుచుందురు. ||౧-౨౪||

శ్లో|| ప్రక్షేపమాత్రాద్గదమారుణద్ధి
భ్రమోర్మిమగ్నం నావమివార్గళేన।
కు[illegible]యమావేశవగిత్యుశంతి
శాంతేతి బల్యాదికృతోపచారైః॥ ||౧-౨౫||

సుడిలో పడిపోవుటకు సిద్ధముగానున్న నావ లంగరుచేతవలె ఒకానొకప్పుడు ఒక్కమాత్రచేతనే రోగము అరికట్టబడుచున్నది. అట్టితరి యిది వ్యాధి కాదనియు గ్రహావేశము మొదలయిన పీడ అనియు తామాచరించిన (బలి) దిగతుడుపుల మొదలయినవాటివలననే ఆవ్యాధియొక్క బాధ శమించినదనియు చెప్పుచుందురు ౧-౨౫||

—♦ ప్రాజ్ఞకృత్యం ♦—

శ్లో॥ కుగ్రామవాసః కులహీనసేవా
రసానభిజ్ఞప్రణయోపలబ్ధిః।
నివాసదేవాంతికరుక్చికిత్సా।
వర్జ్యాణి చత్వారి సదా సుధీభిః॥ ॥౧౨౬॥

కుగ్రామమునందు కాపురము, కులహీనుని కొలుచుట, సరసమెరుగనివాని తోస్నేహము, కాపురమున్నదగ్గిర వైద్యముచేయుట కొప్పుకొనుట, యీనాలుగింటిని విద్వాంసుడగువాడు విడిచిపెట్టవలెను ॥౧౨౬॥

శ్లో॥ వివాహవైద్య వ్యవహారజంతు
సంధానదూరస్థితవా న్సుధన్యః॥
తృణేంధనాంభస్సుత వైద్యమిత్ర
పత్నీసమీపస్థితవాంశ్చ ధన్యః॥ ॥౧౨౭॥

వివాహము, వైద్యము, వ్యవహారము జంతుసంధానము యీనాలుగింటియొక్కయు సంధానమందు దూరముగా ఉన్నవారున్ను గడ్డి కంటచెరకు, మంచినీళ్ళు కుమారుడు, వైద్యుడు, స్నేహితుడు, భార్య వీరికి సమీపముగా ఉన్నవారునుధన్యులు

శ్లో॥ శాంత్యున్ముఖేవాపి గదే నివృత్తే
ప్రోక్తేపి ధైర్యే సతివైద్యకేన।
నరోగిణాం జాతు శుభాని కుర్యా
దతీంద్రియజ్ఞోపి కదాచ లోకే॥ ॥౧౨౮॥

వ్యాధి ఉపశమించుటకు ఉన్ముఖముగా ఉన్నప్పుడున్ను, శాంతిపొందినవెంటనేనున్ను వైద్యుడు ధైర్యమునుచెప్పినప్పటికి అతీంద్రియజ్ఞానసంపన్నులు అయిన వారుకూడా రోగులకు వివాహాది శుభకార్యములను చేయరాదు. ॥౧౨౮॥

శ్లో॥ భార్యాద్వయం మహిష్యేకా పరగ్రామే కృషి స్తథా।
రాజయుగ్మం భిషగ్యుగ్మం పంచామూ న్వర్జయే ద్బుధః॥౧౨౯॥

ఇద్దరుభార్యలను వివాహముచేసుకొనుట, ఒకగేదను మేపుట, పొరుగూరున వ్యవసాయము యిద్దరుప్రభువులతో స్నేహము, యిద్దరువైద్యులచే చికిత్సచేయించుట, పండితుడగువాడు యీ అయిదింటిని విడిచిపెట్టవలెను. ॥౧౨౯॥

## — వైద్యకప్రవేశవిధి —

శ్లో॥ ప్రియత్వా త్ప్రాణానాం నిజహృది పురస్తా దభిమత
స్తదా తత్ప్రాత్యానాం బహుళజనరుక్ఛాంతి సరళః।
చికిత్సాపారీణో నిఖిలజన బాహుళ్య (విదితః) వినుతః
ప్రవేష్టవ్యో న్యాస్య ప్రథవితనిజవ్యాధిశమనే॥ ॥౧౩౦॥

ప్రాణముకంటె ముఖ్యవస్తువులేదు గాన చికిత్సావిషయమై ఆరోగ్యమునండి వైద్యులలో చికిత్సలయందు ప్రసిద్ధిచెందినట్టియు ప్రజలకందరకును సమ్మతమయినట్టియు చికిత్సలయందు వైశద్యముకలిగినట్టియు తమకు యిష్టమయిన వైద్యుని ముందుగానే ఆలోచించి చికిత్సకు ప్రవేశపెట్టుకొనవలెను ॥౧౩౦॥

శ్లో॥ స్వాసమ్మతౌ వాపి చికిత్సకేన
ప్రాంత ప్రసిద్ధాఖిలసమ్మతేన।
లోకాపవాదాపనయాయ రుగ్ణ
శ్చికిత్సితవ్యః స్వవశం విహాత్య॥ ॥౧౩౧॥

తమకు ఇష్టములేకున్నను ప్రాంతవాసులకందరికిన్ని ఇష్టుడయిన సుప్రసిద్ధవైద్యునిచే లోకాపవాదము కుండుటకొరకు చికిత్సచేయించవలయును ॥౧౩౧॥

శ్లో॥ ఆగంతుకేభ్య స్సుఖు పురోహితశ్చ
దోషోద్భవేభ్య స్సుచికిత్సకశ్చ।
రక్షే ద్గృహస్థా న్సతతం గృహస్థై
ర్మంత్రౌషధజ్ఞౌ స్వవశే నియోజ్యౌ॥ ॥౧౩౧॥

యోగ్యుడయిన పురోహితుడు ఆగంతుకదోషములవల్లనుంచియు యోగ్యుడయిన వైద్యుడు వాతాదిదోషజనితవ్యాధులవల్లనుంచియు గృహస్థులను కాపాడవలయును. గాన ప్రతిగృహస్థుడున్ను పురోహితవైద్యులను తమస్వాధీనమందుంచుకొనవలయును. ॥౧౩౨॥

శ్లో॥ యద్యన్యవైద్యానయనప్రసక్తి
స్స్వవేశ్మవైద్యా త్స సమాహ్వాతవ్యః।
నోచే న్మహుర్ల భ్యభిషక్సహాయే
న సావకాశోఽస్త్యతిమాన్యవైద్యాత్॥ ॥౧౩౩॥

ఇతర వైద్యుని తీసుకురావలసిన అవసరము కలిగినేని తమకుటుంబవైద్యునిచేత నే వానిని రప్పించుకొనవలెను. అట్లుచేయనియెడల మాటిమాటికి పొందవలసిన వైద్యసహాయమునకు దూరవైద్యునివలన సావకాశము ఉండదు. వీరిగవురు కూడపలుకుకొని వైద్యముచేయుట గృహస్థులకు మంచిసావకాశము. ॥౧౩౩॥

—♦ చికిత్సాప్రారంభకాలమున వైద్యుడు చెప్పవలసినది ♦—

శ్లో॥ ప్రేమ్ణా ప్రాణే ష్వఖిలగృహిణః ప్రార్థయంతే చికిత్సాం
సాధ్యాసాధ్యే ష్వపి భిష గిదం వాచయే త్తైః పురైవ।
కుర్యాం కుర్య ప్రభృతి సతతం సచ్చికిత్సా మహం త
త్కర్మాధీనం ఫలిత మపి తత్కర్మ మద్బుద్ధిరూపం॥ ॥౧౩౪॥

ప్రతిగృహస్థుడును రోగులప్రాణములయందు తనకుగల ప్రేమాతిశయముచే సాధ్యవ్యాధులయందును, అసాధ్యవ్యాధులయందునుకూడ చికిత్స చేయవలసినదిగా కోరుదురు. అప్పుడు వైద్యుడు- అయ్యా! ఇదిమొదలు నేను జాగ్రతగా చికిత్సచేయుదును. ఆచికిత్సాఫలితము రోగియొక్క కర్మాధీనమున్ను ఆకర్మ నాబుద్ధిరూపమున్ను అయివున్నది అని చెప్పవలయును ॥౧౩౪॥

శ్లో॥ మమ క్రియా వో యది సమ్మతా స్యా
త్పరప్రతీకార మపాస్య మేవ।
ఇత్యేవ ముక్త్వా పురత స్తదిష్టం
జ్ఞాత్వా థ కుర్వీత భిష క్చికిత్సామ్॥ ॥౧౩౫॥

నాచికిత్సయందు మీకు అంగీకారముండేనేని యితరులచే చికిత్సచేయించుట మానవలెను. అనిచెప్పి వాని అభిమతమును తెలుసుకొని పిమ్మటనే చికిత్స ప్రారంభింపవలయును. ॥౧౩౫॥

—♦ సమీపచికిత్సాదోషం ♦—

శ్లో॥ అత్యాసన్నతయా నూనం మహా న్యాయా త్యగౌరవం।
ఇంధనత్వం ప్రపద్యంతే సమీపస్థా ప్రచందనాః॥ ॥౧౩౬॥

సమీపస్థితివలన సులభసాధ్యమయిన మంచిగంధపుచెట్లు వంటచెరకుగా వాడబడినట్లు ఎంతటిఘనుడైనను నివాసప్రాంతమున లాఘవమును పొందుచున్నాడు.

శ్లో॥ ప్రాగ్యావతా యా త్వవిలంబితేన
న తావతా శామ్యతి రుక్కదాపి।
తదంతరే సన్నిధివైద్యయోగ
దోషేణ వైద్యం త్వరయంతి శాంత్యై॥ ॥౧౩౭॥

వ్యాధి వచ్చినంతత్వరగా ఎన్నడును శాంతింపదు యీలోపున సాన్నిధ్య స్థితిదోషముచే రోగోపశాంతికొఱకు వైద్యుని తొందరచేయుదురు. ॥౧౩౭॥

శ్లో॥ శక్త్యౌషధై ర్ఝడితి రుక్శమితా స్మరంతి
భ్రాంతిం రుగ ప్రశమితా భిషగప్రగల్భః।
ఏకత్ర జాయునివహోపగమశ్రమశ్చ
నిందాచ సన్నిధివశా దపరత్ర సిద్ధా॥ ॥౧౩౮॥

యుక్తములయిన మందులచే వ్యాధి శీఘ్రముగా ఉపశమించినయెడల ఇదిరోగమేకాదని భ్రాంతిపడితిమనియు, ఉపశమించనియెడల వైద్యలోపమునున్ను తలచుచున్నారు. మొదటిపక్షమున ఔషధవ్యయమున్ను శ్రమయున్ను, రెండవపక్షమున వైద్యుడు తెలివితక్కువవాడని నింద ఇవి సమీపస్థితిదోషములు అయివున్నవి.

శ్లో॥ భ్రాంతిం రుజ శ్శీఘ్రనివారణేన
తద్వ్యత్యయే శంసతి వైద్యలోపమ్।
చికిత్సక స్యౌషధవస్తు మూఢో
పరత్ర కించాపయశో ద్వితీయే॥ ॥౧౩౯॥

శాంచమించుగా పైశ్లోకముయొక్క తాత్పర్యమే దీనికిని సరిపోవును.౧౩౯

శ్లో॥ సమీపవైద్యస్య సదైవ సేవా
ధనంతు కాలే నిజమూరగస్య
బహుస్వభావో బలవత్తరోయం
విధేరపి ప్రత్యుత దుర్నివార్యః॥ ॥౧౪౦॥

సమీపస్థుడయిన వైద్యునకు అనవరతసేవయు, దూరవైద్యునకు ద్రవ్యలబ్ధియు కలుగుచున్నది. ఇది అనేకమందికి అలవాటుగా ఉన్నది. ఇలవాటైనయిన ఈ విషయము ఆబ్రహ్మకుకూడా అనివార్యమయివున్నది. ॥౧౪౦॥

శ్లో॥ న స్నాంతి పర్వ ణ్యపి నార్చయంతి
తీర్థేచ దేవాయతనే సమీపే।
తీర్థాటనే తత్ర ఖలే ఽప్యకాండే
నమంతి సాన్నిధ్యచికిత్సకాంశ్చ॥ ॥౧౪౧॥

పర్వకాలమందైనను సమీపమునందున్న నదియందు స్నానమును, దేవాలయమందు అభిషేకాదులను చేయజాలరు తీర్థాటనసమయములయందు పర్వకాలము కాకున్నను అచ్చటి నద్యాలయాదులు ఖిలములయివున్నను స్నానాదికము అభిషేకాదికముకూడ చేయుదురు. అప్రకారమే సమీపదూరములయందున్న వైద్యులకును తారతమ్యముకలదు. ॥౧౪౧॥

శ్లో॥ విద్యా తదధ్యయనజప్రతిభా సమాపి
లోకేత్ర సేతుహిమవన్నగమధ్యదేశే।
దూరేణ భాతి విబుధో గిరివ ప్రజానాం
వాసేన సన్నిధిగతేన న సాధు భాతి॥ ॥౧౪౨॥

ఆసేతుహిమాచలమధ్యదేశమందంతటను విద్యయు, యీవిద్యాభ్యాసముచే జనించిన ప్రతిభయు సమానమయినప్పటికి పండితుడగువాడు పర్వతమువలె దూరస్థితివలన ప్రకాశించినట్లు సమీపస్థితివలన ప్రకాశింపడు. "దూరస్థాః పర్వతారమ్యాస్సమీపస్థాశ్చబర్బరాః" ॥౧౪౨॥

—♦ చికిత్సానర్హులు ♦—

శ్లో॥ అన్యప్రదిష్టాచరణానురక్తం
వైద్యాభిమానాన్విత మాశుకోపమ్।
విశ్వాసహీనం బహుశంకితారం
స్వపోషకం వా న చికిత్సయేత్ప్రాజ్ఞః॥ ॥౧౪౩॥

ఇతరులు చెప్పినదానిని చేయుటయందాసక్తికలవాడు స్వతహాగా వైద్యాభిమానముకలవాడు శీఘ్రముగా కోపగించుకొను స్వభావముకలవాడు తనవైద్యమందు నమ్మికలేనివాడు మాటిమాటికి శంకలుచేయువాడు ఇట్టివాడు తనను పోషించువాడయినప్పటికి చికిత్సచేయరాదు. ॥౧౪౩॥

శ్లో॥ దాతా దాసశ్చ ద్వావేవ సహాయా వైద్యజీవనే।
శేషాః పరిత్యజ్య వైద్యస్య జీవనాధారదారకాః॥ ॥౧౪౪।

ధనవంతుడు ద్రవ్యమిచ్చువాడును సామాన్యుడు శుశ్రూషచేయువాడును మాత్రమే వైద్యుని కాలక్షేపమునకు సహాయకులు, ధనమునూ ఇవ్వక శుశ్రూషను చేయక వైద్యసహాయమును కోరువారు వైద్యునిజీవనాధారమును పాడుచేసినవారు.

శ్లో॥ క్రియా స్వనుష్ఠానవిధి ర్వ్యచిత్రి
రూప స్తదాత్మాభ్యసితక్రియాసు।
జ్ఞాత్వైవ లిప్సాం విచికిత్సయే త్తా
నాహ్వానిత స్సన్భిషగాత్మమానః॥ ॥౧౪౫॥

చికిత్సావిధానములు అనేకరకరకములుగా ఉన్నవి వాటిలో తనకు తెలిసిన చికిత్సను అనగా తనకు అభ్యాసమై యున్న చికిత్సయందు అభిలాషకలదో లేదో తెలుసుకొని ఆత్మగౌరవమును కోరు వైద్యుడు తనచికిత్సయందు అభిలాషకలవారికి మాత్రమే చికిత్స చేయవలయును ॥౧౪౫॥

## —♦ చికిత్సాంగములు ♦—

శ్లో॥ రోగీ విత్తం సేవకో దీర్ఘ మాయు
ర్భృత్యో వైద్యో యుక్ప్రశస్తౌషధంచ।
అంగా న్యాహు స్సప్త వైద్యక్రియాయా
స్తేషామేవ స్యా త్సమగ్రా చికిత్సా॥ ॥౧౪౬॥

చికిత్సకు- రోగి, ద్రవ్యము, సేవకుడు, దీర్ఘాయుర్దాయము, భృత్యుడు, తెలివి గలవైద్యుడు, రోగోపయుక్తమైన ఔషధము, అను ఏడుఅంగములు. ఈఅంగములు యెవరికిగలవో వారికే సంపూర్ణమయిన చికిత్స జరుగును. ॥౧౪౬॥

## —♦ రుగ్మవైద్యనియమం ♦—

శ్లో॥ చికిత్సకా రుగ్మిషు దుష్టభావా
శ్చికిత్సకే దుష్టధియ స్సరోగాః।
ప్రయాంతి తే రౌరవమేవ తస్మా
త్ప్రవర్తితవ్యం పితృపుత్రధర్మాత్॥ ॥౧౪౭॥

రోగులయందు దురభిప్రాయముగల వైద్యులున్ను, వైద్యులయందు దురభిప్రాయముగల రోగులున్ను, రౌరవాదినరకములను పొందుచున్నారు. గాన వీరు పరస్పరము పితృపుత్రభావములతో సంచరింపవలయును ॥౧౪౩॥

— ♦ చికిత్సావశ్యకత ♦ —

శ్లో॥ నిర్వాపయే త్తైలబలేపి దీపే
యథా సమీరేణ తథా పమృత్యోః।
ఆయుష్యయుక్తోపి హి జంతురేవం
హింస్యా చ్చికిత్సావిధినా సురక్ష్యః॥ ॥౧౪౪॥

తైలము పూర్తిగా ఉన్నప్పటికిన్ని గాలిచేత దీపము ఆర్పబడిన చందమున బ్రహ్మలిఖితమయిన ఆయుర్దాయము ఉన్నప్పటికి అపమృత్యుదాయకమయిన మిథ్యాహార విహారాదులవల్ల ఆయుర్దాయమునకు ఒకనొకప్పుడు భంగముకలుగునుగాన సద్వైద్యుడగువాడు చికిత్సావిధానముచే అట్టి మిథ్యాహారాది రూపమయిన దోషములను తొలగించి రోగులను రక్షింపవలయును ॥౧౪౫॥

శ్లో॥ భవే చ్ఛరీరం యది చే దరోగం
లబ్ధుం చతుర్వర్గఫలం సుసాధ్యమ్।
రోగావృతం చే త్తదలభ్య మేవ
కర్తవ్య మస్మా దగదం శరీరమ్॥ ॥౧౫౦॥

శరీరము రోగరహితముకానిచో ధర్మార్థ కామమోక్షములు సాధింపబడవుగాన పురుషార్థములనుకోరు ప్రతిమానవుడున్ను తనదేహమును రోగరహితమయినదానినిగ తప్పక జేసుకొనవలయును ॥౧౫౦॥

— ♦ చికిత్సాప్రయోజనం ♦ —

శ్లో॥ చికిత్సకుః-ఉపైతి భిషక్క్వచిద్ధనం
క్వచి త్క్రియాభ్యాస మపి క్వచి ద్యశః।
ధర్మం క్వచి త్స్నేహ మతీవ గౌరవం
మూర్ఖేషు లుబ్ధేషు చ వైర మేవ॥ ॥౧౫౧॥

చికిత్సచేయుటవలన ఒకానొకచోట గ్రవ్యలాభమున్ను ఒకానొకచోట అభ్యాసపాటవమున్ను, ఒకానొకచోట కీర్తియున్ను, ఒకానొకచోట ధర్మమున్ను

ఒకానొకచోట స్నేహమున్ను, ఒకానొకచోట గౌరవమున్ను పొందుచున్నాడు. మూర్ఖులకును లుబ్ధులకును చికిత్సచేయుటచే వైరమును పొందుచున్నాడు ॥౧౫౧॥

— ♦ చికిత్సా (మహిమ) ఫలము ♦ —

శ్లో॥ సర్వామ్నాయపురాణశాస్త్రపఠనప్రఖ్యాతతీర్థాటన
తీర్థాగ్న్యాయతనేశ్వరాలయతటాకారామసంస్థాపనాత్।
ఉత్కృష్టవ్రతదేవతాస్తుతిజపస్నానాన్నపానాదికా
దేతస్మాత్ త్రిదశేష మేవ సుకృతం సద్వైద్యకృత్యాల్లభేత్॥

చతుర్వేద పారాయణము, అష్టాదశపురాణపఠనము, ప్రసిద్ధములయిన క్షేత్రములకు వెడలుట, తీర్థాగ్న్యుపాసనము, శివాలయప్రతిష్ఠ, తటాకప్రతిష్ఠ, ఆరామప్రతిష్ఠ, మహోన్నతవ్రతాచరణము, పరమేశ్వరారాధన, జపము, స్నానము, అన్నదానము, చలివేంద్రి మొదలయిన సత్కార్యములన్నిటిచేతను ఎంతఫలితముకలదో అంతఫలితమున్ను సద్వైద్యమువలన కలుగుచున్నది. ॥౧౫౨॥

—♦ చికిత్సాలయావశ్యకత ♦—

శ్లో॥ గచ్ఛంతి మేకస్య నిరీక్షణాయ
శతం సమాహూయ చ వైద్యకస్య।
తదుర్గ్మసందర్శనవిఘ్నశాంత్యై
మగ్నం చికిత్సాలయ మానయంతి॥ ॥౧౫౩॥

వైద్యుడు రోగినిచూచుటకుగాను తొందరగా పోవుచుండగా ఆ వైద్యుని అనేకమంది పిలుచుచుందురు అందుచే రోగినిచూచుటకు విఘ్నముకలుగును అట్టివిఘ్ననివారణకొరకు (రోగిని ఎప్పుడుపడితే అప్పుడు చూడగలుగుటకు) రోగిని చికిత్సామందిరమునకు తీసుకొని వెడలుదురు ॥౧౫౩॥

శ్లో॥ యదుర్గ్మవాసస్య చికిత్సకాగమా
త్క్రియాలయస్యైవ రుగన్వితాగమాత్।
యథార్హదివ్యౌషధయోజనావధి
శ్చికిత్సకస్యాస్త్యచిరాయ సర్వదా॥ ॥౧౫౪॥

రోగియొక్క నివాసమునకు వైద్యుని తీసుకువచ్చుటకంటె చికిత్సాలయమునకు రోగిని తీసుకువచ్చుటవలన రోగానుకూలౌషధములను యిచ్చుటకు వైద్యునికి సౌకర్యముగా ఉండును. ॥౧౫౪॥

## —♦ చికిత్సానిష్ఫలకాలము ♦—

శ్లో॥ రుజుత్వసంధాన మివాన తేచ
జలాధికేంబూద్ధరణంచకూపే।
సుదుఃఖతే సాంత్వవచఃప్రచార
మంతాగతా ర్త్యౌషధ మప్యనర్థః॥ ॥౧౫౫॥

వంగిపోయినదానిని యథాప్రకారముగా చేయుటచేతను జలకలిగిననూతియం దధికముగా నీరుతోడుటచేతను విచారించువానిని ఓదార్చుటచేతనున్ను అనర్థమువాటిల్లినట్లు చంపుటకువచ్చిన రోగమునకు ఔషధప్రయోగమువలన దుర్గుణములే అధికమగుచుండునుగాని, సుగుణసంపత్తి యెంతమాత్రము కలుగనేరదు. ॥౧౫౫॥

## —♦ చికిత్సావిషయములు ♦—

శ్లో॥ ఔషధ స్యానుపానస్య పద్యస్స్ఫురణమేవచ॥
చికిత్సాయాం ప్రధానం స్యా త్పథ్యస్యాపిచ భూరిశః॥ ॥౧౬౬॥

వైద్యుడగువానికి రోగినిచూచుసరికిగాని రోగులు అడిగేసరికిగాని ఔషధముయొక్కయు, అనుపానముయొక్కను పథ్యపానాదులయొక్కయు, స్ఫురణయే మిక్కిలి ముఖ్యముగా వుండవలయును. ॥౧౫౬॥

శ్లో॥ మాత్రావృద్ధి రోగతుల్యే గుణే వా
మాత్రాహ్రాసో రోగపక్వే వికారే।
కుర్యాత్కల్కాన్కేతకీచూర్ణతుల్యా
న్దంతాస్పృశ్యం సర్వమ ప్యౌషధం చ॥ ॥౧౫౭॥

రోగము హెచ్చుతగ్గులులేక సమానస్థితిలోనున్నప్పుడున్ను గుణము కనుపించనప్పుడున్ను మోతాదులను పెంపుచేయవలయును. రోగము పక్వోన్ముఖమయినప్పుడును వికారములు శాంతించినపుడును మోతాదులను తగ్గించవలెను. మందులలో కలిపెడుచూర్ణాదులు (కంటిలోపెట్టినను మెరగకుండ) మొగలిపుప్పొడివలె నుండవలెను. ఏమందు లోపలికపుచ్చుకున్నను పండ్లకు తగలనీయకూడదు ॥౧౫౭॥

శ్లో॥ వ్యాధే ర్నిదానం బహుకష్టసాధ్యం
న రుక్క్రియా తాదృశకష్టసాధ్యా।
వ్యాచ్యాస మస్తిమ్క మధిచ్యుతం చే
త్ప్రతిక్రియా తస్యతు వర్జనీయా॥ ॥౧౫౮॥

వ్యాధులనుపోల్చుటలో కష్టమున్నదిగాని చికిత్సచేయుటలో యెంతమాత్రము కష్టములేదు. ఏరోగికి హృదయము శ్వాసకోశము మెదడు చెడిపోవునో అట్టిరోగులకు చికిత్సచేయనవసరములేదు. ॥౧౫౮॥

శ్లో॥ నివేశ్య కర్ణాదిషు కంటకాదీ
న్బహిర్వదిష్యంతి న తజ్జబాధామ్।
శయ్యాసనస్థక్రిమికీటబాధాః
శోచ్యాః పురస్తాత్పృథుకామయేషు॥ ॥౧౫౯॥

శ్రోత్రాదీంద్రియములయందు ముండ్లు, చింతగింజలు, పలకపుల్లలు, మొదలయినవాటిని ప్రవేశపెట్టుకొని వాటివలనకలిగినబాధలను చెప్పజాలక పసిబిడ్డలు బాధపడుచుందురు. అట్టిసమయములయందు పిల్లలుపరుండు పక్కలుమొదలయినవాటియందున్ను నివసించు క్రీడించు ప్రదేశములయందున్ను క్రిమికీటకాదులు ఉన్నవేమోయని పరికించియు పయిన చెప్పిన ఇంద్రియసమూహమును పరిశీలించియు తగినచికిత్సలను చేయవలెను ॥౧౫౯॥

శ్లో॥ అంతర్గతే ష్వామయదుర్గుణేషు
రోగార్త్వపర్యాయబహిర్గతేషు।
అనూహ్య రుక్పర్యవసానరూపా
న్భ్రాన్త్యా రజ్ఞా యది దుశ్చికిత్సామ్॥ ॥౧౬౦॥

అంతర్గతములయిన రోగవికారములు రోగోపశమనరూపములు కాదలంచి బహిర్గతము లగుచుండగా అట్టివ్యాధులను వ్యాధిపర్యవసానరూపములుగా ఆలోచింపక దుర్గుణములు అని భ్రాంతిపడి దుశ్చికిత్సను చేయుదురు. ॥౧౬౦॥

శ్లో॥ చికిత్సయతి రోగాంతే యోభిషక్తేన రోగిణాం।
జీవితాన్మరణాద్వాపి యశ ఏవోపలభ్యతే॥ ॥౧౬౧

యేవైద్యుడు రోగాంతమున చికిత్సకు ప్రవేశించునో అట్టివైద్యుడు రోగి జీవించినను జీవించకున్నను యశస్సునే పొందుచున్నాడు. యేలననగా ఎవనికిని శక్యముగానివ్యాధిని కుదిర్చినాడు అనియు, ఎవనికిని శక్యముగానివ్యాధిని యితనుమాత్రము యెట్లుకుదర్చగలడనియు చెప్పుదురుగాని యెవరును నిందింపరు. ॥౧౬౧॥

శ్లో॥ రుగ్మిణి క్షేమగే దైవాద్వైద్యస్యానయనాంతరే।
యత్రైవమప్రత్యానయనే తేన విందేత్స్వకారణమ్॥ ॥౧౬౨॥

వైద్యుడు తనను రోగిదగ్గరకు తీసుకువెళ్ళేలోగా రోగి స్వస్థుడైయున్నప్పుడు రోగి తనను సాగనంపుటలోగల ప్రేమనుబట్టి తనయందు వారికిగల గౌరవమును గుర్తించుకొనుచుండవలెను. ||౧౬-౨||

## —♦ వైద్యకర్తవ్యం ♦—

శ్లో॥ న రోగశాంత్యై ప్రయతేత పూర్వం
యతేత రోగేషు వికారశాంత్యై
వికారశాంతౌ స్వయమేవ శామ్యే
ద్రోగస్తు నిర్ణీతదినావసానే॥ ||౧౬-౩||

వైద్యుడు రోగారంభమునందే రోగోపశాంతికొరకు ప్రయత్నింపరాదు. రోగమధ్య బయలుదేరుచుండు వికారములయొక్క ఉపశాంతికొరకు ప్రయత్నింపవలెను వికారములు ఉపశమించినచో నియమితకాలప్రకారము రోగము దానంతట అదియే శాంతించును ||౧౬-౩||

శ్లో॥ అస్వస్థతా సుస్థితవత్స్వనేకా
స్వస్వస్థతాం తాం ప్రబలాం పురస్తాత్।
నివార్య పశ్చాదవశిష్టబాధాం
నివారయేదేవ యథాక్రమేణ॥ ||౧౬-౪||

ఒకరోగికి అనేకవిధములయినబాధలు కలిగివున్నప్పుడు ఆబాధలలో ప్రబలమయినబాధను ముందుగా నివారణచేసి ఆటుపిమ్మట మిగిలినబాధలలో అధికముగానున్నబాధలలో ప్రబలమయినబాధను ముందుగానివారణచేసి పిమ్మట మిగిలినబాధలలో అధికముగానున్నబాధను క్రమక్రమముగా నివారణచేయుచుండవలెను.

శ్లో॥ ఇచ్ఛంతి కేచిత్పృథగస్రదోషం
తత్త్రైకదోషోపశమౌషధాని।
సహస్రశస్సంతి తదేవ వైద్యా
దద్యుర్యథేష్టం వివిధౌషధాని॥ ||౧౬-౫||

అన్నివ్యాధులయందును వాతపిత్తశ్లేష్మదోషములు మూడుమాత్రమే. యీదోషములకంటె భిన్నమయిన రక్తదోషము కలదని కొంతమంది అంగీకరించుచున్నారు. యీదోషోపశమనౌషధములు వేనవేలుకలవు ఆకారణముచేతనే వైద్యులు వారి

వారి యిష్టానుసారము దోషోపశాంతివిషయమై అనేక విధములయిన మందులను ఉపయోగించుచున్నారు. ||౧౬౫||

శ్లో|| ఏకౌషధే బహుశోగ్రణప్రభావో
హ్యేకామయాపహరణే వివిధౌషధాని|
గ్రంథాంతరై రనుభవేన యతః ప్రసిద్ధం
తజ్జాయునిర్ణయకరో భువి దుర్లభ స్స్యాత్|| ||౧౬౬||

ఒక ఔషధమునందు అనేక విధములయిన రోగములను కుదర్చుశక్తియు ఒక్క వ్యాధియందు అనేక విధములయిన ఔషధములను ఉపయోగింపవలసిన అవసరమున్ను గ్రంథములచేతనున్ను అనుభవముచేతనున్ను కూడ తెలియబడుచున్నది. గాన యీరోగమునకు యిదే మందు అని నిర్ణయించుటకుగాని ఊహించుటకుగాని ఎవ్వరికిని శక్యము కాదు ||౧౬౬||

శ్లో|| ఏకః పరాత్మా బహుదేవరూపైః
పశ్యేద్యథోపాసకభావనాయాః|
అనేకరూపా గదశక్తి రేకా
రుజ శ్శమే ద్వైద్యకభావనాయాః ||౧౬౭||

పరమాత్మ ఒక్కడే అయినప్పటికిన్ని ఉపాసకునియొక్క భావనావశముచే బహుదేవతాస్వరూపుడయి ఎట్లుప్రసన్నుడగుచున్నాడో అట్లే అనేక రూపములయిన మందులయందున్న కేవలశక్తియు వైద్యునియొక్క నమ్మకమునను సరించి రోగములను ఉపశమింపచేయుచున్నది. ||౧౬౭||

శ్లో|| అత్యర్ఘవద్భ్యః క్షుధితస్య తృప్తై
రనర్ఘవ త్తాలఫలం త్వలంహి|
తథోపయుంజ్యా త్సుకుమారభేదా
త్క్రియాసు తద్రుగ్మ్యుచితౌషధాదీన్|| ||౧౬౮||

క్షుత్పీడితుడయిన ఒక్కొక్కనికి క్షున్నివారణకొరకు మిక్కిలి విలువగల పదార్థములకంటె విలువలేని తాటిపండు ఎట్లు సరిపడుచున్నదో అట్లే చికిత్సచేయుటలో వారివారి సుకుమారముల ననుసరించి వారివారికి తగినమందులు అహారాదికము మొదలయినవాటిని ఉపయోగపరచుచుండవలెను ||౧౬౮

శ్లో॥ లోకాః ప్రమాదస్మరణం విహాయ
ప్లవం సమాశ్రిత్య యథా మ్మయేషు।
పారంగతా ఏవ భయావహేఽపి
వైద్యం సమాశ్రిత్య తథాఽఽమయేచ॥ ॥౧౬౯

లోక సామాన్యము ప్రమాదమనుమాటను విడిచిపెట్టి తెప్పను ఆధారముగా చేసుకొని అగాధములయిన జలాశయముల నెట్లు దాటుచున్నాడో అట్లే వైద్యుని ఆధారముగా జేసుకొని భయంకరమయిన వ్యాధినుండి విముక్తుడగుచున్నాడు ౧౬౯.

శ్లో॥ ప్రాణాస్పదం వాపి సమర్ప్య రుగ్ణం
వైద్యాయ మృత్యో ర్నబిభేతి లోకః।
ప్రాణాస్పదత్వా ద్భిషజస్తు తస్మా
త్సమ్యగ్విదిత్వైవ చరే చ్చికిత్సామ్॥ ॥౧౭౦॥

తమ ప్రాణముకంటె ప్రియమయినరోగిని వైద్యుని అధీనముచేసి మృత్యువునకు భయపడడు. వైద్యుడు ప్రాణమును నిలుపుటకు ఆధారమయినవాడు. గాన రోగమును చక్కగా గుర్తించి చికిత్స చేయుచుండవలెను. ॥౧౭౦॥

శ్లో॥ నక్తేంధకారే ప్రబలాతపేవా
రాత్రౌ దినే పర్వణి పైతృకే వా॥
స్వాఽస్వస్థతాయాం విషమస్థితౌ వా
పరార్థసంధానవిధిః ప్రధానః॥ ॥౧౭౧॥

చికిత్సకునియొక్క విధియేమనగా రాత్రియందుగాని కటికచీకటియందుగాని మెండియెండలయందుగాని రాత్రులయందుగాని పగటియందుగాని పర్వదినముల యందుగాని పితృదినములయందుగాని తాను అస్వస్థుడై ఉన్నప్పుడుగాని మరియు అనేకవిధములయిన యిక్కట్టులయందున్నప్పుడుగానియితరుల యోగక్షేమునిమిత్తము పాటుపడుటయే ముఖ్యవిధి. ॥౧౭౧॥

శ్లో॥ ధనం గృహీతం యది వా దరిద్రా
ద్ధర్మార్థ్య చికిత్సా ధనినాం కృతాచేత్।
లుబ్ధస్య ధర్మాయ ధనాయ వాపి
కుర్యా చ్చికిత్సాం సతు విప్రహైవ॥ ॥౧౭౨

దరిద్రులవద్దనుంచి ద్రవ్యమును తీసుకున్నను ధనవంతులకు ఉచితముగా వైద్యముచేసినను లుబ్ధులకు ద్రవ్యము తీసుకొనిగాని ఉచితముగాగాని వైద్యము చేసినను అట్టివైద్యుడు బ్రహ్మహత్యాపాతకము చేసినవాడు అగుచున్నాడు ॥౧౭౨॥

శ్లో॥ స్పృష్ట్వా కరం రోగనిపీడితానాం
ప్రక్షాళయే చ్చేత్స్వకరౌ చ వైద్యః।
విషద్వ్యరక్షాళనయేవ శీఘ్రం
రోగా వినశ్యంతి హి తస్య రుగ్ణః ॥౧౭౩॥

వైద్యుడు రోగులయొక్క హస్తగతనాడులను పరిక్షించి వెంటనే తనచేతులను కడుగుకొనినయెడల క్షాళనచే బురదపోయినట్లుగా రోగియొక్క వ్యాధి శీఘ్రకాలములో నివారణ అగుచున్నది ॥౧౭౩॥

శ్లో॥ వైద్యా త్పరారోగ్యవిధానకాలే
స్వారోగ్య మత్యంత సురక్షణీయమ్।
స్వారోగ్యభంగో యది చే త్పరేషాం
ఆరోగ్యసంధాన నిరర్థక స్స్యాత్॥ ॥౧౭౪॥

వైద్యుడు తాను ఇతరులకు చికిత్సచేయుసమయములయందు తనయొక్క ఆరోగ్యమును మిక్కిలి జాగ్రత్తగా కాపాడుకొనుచుండవలెను తనయొక్క ఆరోగ్యమునకు భంగము కలిగించుకొనినచో యితరులకు ఆరోగ్యము కలుగజేయుటకు పనికిరానివాడగును. ॥౧౭౪॥

శ్లో॥ పురాకృతా చే దితరోపదిష్టా
ప్యోక్తా చికిత్సా యది నిష్ఫలాపి।
న వైద్యవైషమ్యభవాపవాద
స్తస్యాథవా న్యాయకృతాపి నింద్యా॥ ॥౧౭౫॥

బుద్ధిమంతుడయిన వైద్యుడు యితరులుచెప్పిన చికిత్సలను ముందుగా చేయనిచ్చినయెడల పిమ్మట తానాచరించిన చికిత్స వ్యర్థమైనను వైద్యలోపమనెడు అపవాదము ఉండదు అట్లుచేయక తాను న్యాయమయినచికిత్సనే చేయుచున్నను ఒకవేళ కాలకర్మవశమున తనచికిత్స వ్యర్థమయినచో వైద్యమునందలి లోపముగా నిందింతురుగాన యితరులుచెప్పిన చికిత్సాపద్ధతిని తానంగీకరించుట మంచిపనిఅయియున్నది.

శ్లో॥ విసృజ్యతాం రోగిహితాభిలాషిణా
చికిత్సకే నాత్మహితాభిలాషిణా।
స్నానం నివాసం శయనం చ భోజనం
ప్రియత్నత స్సద్మసు రోగవాసిషు॥ ॥౧౭౬॥

రోగులయొక్కయు తనయొక్కయు క్షేమమునుకోరు వైద్యుడు రోగి నివసించి వున్న యింటియందు స్నానము, బసచేయుట, పరుండుట, భోజనముచేయుట వీటిని ప్రియత్నపూర్వకముగా విడిచిపెట్టవలయును ॥౧౩౬॥

శ్లో ॥ కర్తు ర్వినా మేళన మౌషధానాం
అన్యస్య విజ్ఞాతు మశక్య మేవ।
తదన్యదత్తౌషధ భేదతత్త్వం
సందృష్ట మాత్రేణ న నిశ్చితవ్యః॥ ౧౭౭॥

ఔషధమును చూచినంతమాత్రముచే ఇది ఫలానిమందు అని నిర్ణయించుటకు వీలుండదు. ఏయేమందులు సమ్మేళనము గావింపబడినవో ఇచ్చినవారికితప్ప తదన్యులకు ఆమందులయొక్క సమ్మేళనము గోచరము కాదు గాన ఒక వైద్యుడిచ్చినమందును ఇంకొక వైద్యుడు పరీక్షించి యిది ఫలానిమందు అని నిర్ణయించుట పనికిరాని పని అయివున్నదిదు యీ రాచారము అనేక చోట్ల ప్రబలముగానున్నది. ॥౧౩౭॥

శ్లో॥ ఆలోచ్య రోగే ష్వనుపానవాంతి
నశ్యాను లేపాంజనలంఘనాని।
స్వేదక్రియాభోజ్య విరేకపథ్య
ధూపాని కుర్వీత నదేత బుద్ధ్యా॥ ॥౧౭౮

చికిత్సాసమయమున అవసరమయిన అనుపానములు, వమనకర్మ, నస్యకర్మ పట్లు కట్లు కలికము (త్రి)విధలంకణములలో ఏదోయొకవిధమయిన) లంకణము స్వేదకర్మ, ఆహారనిర్ణయము, విరేచనసాధనము, పథ్యపానాదుల నిర్ణయము ధూపక్రియ మొదలయినవిషయములను తనబుద్ధిసూక్ష్మముచే ఆలోచించి చేయుచు చెప్పుచు ఉండవలెను. ॥౧౩౮॥

శ్లో॥ న జ్ఞాయతే రోగిముఖప్రపన్నతా
చికిత్సకస్యాపి ముహు ర్నిరీక్షణాత్।
తస్మా త్కదాచి త్కనిరీక్షణం జగు
ర్వికారనూన్యే ష్వఖిలామయేషు॥ ॥౧౭౯॥

రోగిని తరచుగా చూచుచుండుటవలన రోగియొక్క ముఖసౌష్టవము బాగుగా తెలియబడదు. కాన వికారశూన్యములయిన రోగములయందు అప్పుడప్పుడు మాత్రమే వైద్యుడు రోగిని చూచుచుండవలెను. ॥౧౪౯॥

శ్లో॥ వికారనామాని న సంతి తస్మా
ద్వైద్యో న యాయాదనభిజ్ఞలజ్జాం।
యావన్న నశ్యేంత్యఖిలేంద్రియార్థాః
కాలస్య కుర్యాత్కుటిలా గతి స్స్యాత్॥ ॥౧౫౦॥

వైద్యశాస్త్రమునందు రోగవికారములకు సంపూర్ణమయిన నామధేయములు గానరావు. గాన వైద్యుడు ఒకానొకప్పుడు రోగవికారములను గుర్తింపలేనంతమాత్రమున లజ్జను పొందరాదు. యేమనగా ఇంద్రియవ్యాపారము ఉపశమించువరకు చికిత్సచేయవలయును కాలగతి ఎవరికిని తెలియదు. ॥౧౫౦॥

శ్లో॥ స్వచ్ఛందగవ్యాళవిహంగనవ్య
ద్విపాన్యథా బంధయతి ప్రసహ్య॥
అసాధ్యరోగేషు చికిత్సకోసా
యతేత యోద్ధుం సహ మృత్యునాపి॥ ॥౧౫౧॥

పట్టుకొనుటకు శక్యముగాక యథేచ్ఛముగా తిరుగుచుండు పాములను, పక్షులను, అడవియేనుగులను ధైర్యముతో వేటగాడు యెట్లుబంధించుచున్నాడో అట్లే చికిత్సకుడున్ను అసాధ్యరోగములయందు మృత్యువుతో పోరాడుటకు ప్రయత్నింపవలయును. ॥౧౫౧॥

శ్లో॥ దీర్ఘేషు రోగేషు పరంతు పథ్యాత్
తృప్త్యాదనాభావజదుర్బలేన।
మ్రియేత జాత్వార్తియుతః ప్రదద్యా
ద్యథోచితాహార మలం చ తృప్త్యై॥ ॥౧౫౨॥

ఒకానొకప్పుడు దీర్ఘరోగములయందు ఆహారపుష్టి చాలక పథ్యము తినినవానుకకూడా ప్రాణహాని సంభవించును. గాన అట్టిదీర్ఘరోగచికిత్సలయందు రోగులయొక్క జీర్ణశక్తిననుసరించి యథోచితాహారమును యివ్వవలెను. ॥౧౫౨॥

శ్లో॥ రోగేషు దీర్ఘేష్వపి చ జ్వరేషు
ప్రాయశ్శరీరస్య బలం ప్రధానమ్।
సురక్షణీయం వివిధై రుపాయై
రాహార పానీయ మహౌషధాద్యైః॥ ॥౧౮౩॥

దీర్ఘరోగములయందును దీర్ఘజ్వరములయందును శరీరబలము కాపాడవల యును. గాన బహువిధములయిన ఉపాయములచేతను తత్తత్కాలోచితములయిన మ హౌషధాదులచేతనున్ను ఆహారాదులచేతనున్ను శరీరపుష్టిని కలుగజేయవలెను.

శ్లో॥ దేహస్థితోష్ణాపగమే ౽పి తేషాం
యథాస్థితౌ ప్రాగ్భవసద్గుణానామ్।
కస్తూరికాద్యుష్ణకరౌషధాని
భోజ్యాని దద్యా త్పునరా యథోష్ణమ్॥ ॥౧౮౪॥

శరీరవేడిమి దిగిపోయినప్పటికిన్ని రోగిక ఆరోగ్యస్థితియందున్న సుగుణసంప ద యథాప్రకారముగా నిలిచియున్నచో కస్తూరి మొదలయిన ఉష్ణకరౌషధముల నున్ను ఉష్ణకరాహారములనున్ను శరీరవేడిమి తిరిగి యథాప్రకారస్థితిలోనికి వచ్చేవ రకు ఇచ్చుచుండవలెను. ॥౧౮౪॥

శ్లో॥ రోగేషు సర్వే ష్వతిసారపూర్వే
ష్వాహారలోపా దసుహాని మేతి॥
విణ్మూత్రబంధాది షు దేహకార్శ్య
ముఖ్యేషు దద్యా దుచితం చ హారమ్॥ ॥౧౮౫॥

అతిసారవ్యాధులయందున్ను మూత్రపురీషబంధాదివ్యాధులయందును శరీర మును కృశింపజేయు తదితరవ్యాధులయందున్ను ప్రాణాపాయము తటస్థింపకుండు నట్లు జీర్ణశక్తిననుసరించి రోగికి అనుకూలములయిన యుచితాహారములను యిచ్చు చుండవలెను. ॥౧౮౫॥

శ్లో॥ చికిత్సకై స్సంసయకాలయేషు
రజః క్రియాయాం సముపాగతాయామ్।
జాయ స్సమక్షం గ్రసితవ్య ఏవ
స్స్వవైద్యనిర్బంధవిధౌ పరేషామ్॥ ॥౧౮౬॥

సంశయమనస్కుల యింట్లలో తనమిత్రాదుల నిర్బంధవశముచే చికిత్స చేయ వలసివచ్చినయెడల అట్టిస్థితియందు వైద్యుడగువాడు తానిచ్చినమందును తనయెదుటనే రోగులచే మింగించుచుండవలయును. ॥౧౮౧॥

శ్లో॥ రోగస్య నామకరణా న్నతిభీతిదాని
కృత్వా ప్రధృష్య కిల రోగయుతా న్సువైద్యః।
ఉన్మూలయే దతిభయంకర మప్యసాధ్యం
రోగంచ సాహసయుతో త్వరయా స్వశక్త్యా॥ ॥౧౮౨॥

సద్వైద్యుడయినవాడు రోగమునకు భయంకరమయిన పెద్దపెద్దపేర్లుపెట్టి రోగులను భయపెట్టక రోగము ప్రమాదమయినదైనప్పటికిన్ని ఆసంగతి రోగికి తెలియనీయక అట్టిరోగమును అధికసాహసముతో శీఘ్రముగా నివారణచేయుటకు ప్రయత్నించవలెను ॥౧౮౩॥

శ్లో॥ తనూనపా చ్ఛత్రువిషోపమాన
స్స్వల్పోపి రోగో హ్యానుపేక్షణీయః।
సమ్యగ్విచార్య ప్రథమే తు రోగం
చరే చ్చికిత్సాం భిషగప్రమత్తః॥ ॥౧౮౪॥

రోగము స్వల్పమయినదయినను అగ్ని, శత్రువు, విషము వీటితో పోల్చదగియున్నది. గాన ఉపేక్షచేయరాదు మొదటనే జాగ్రతగా ఆలోచించి చికిత్స చేయవలెను. ॥౧౮౫॥

శ్లో॥ అసాధ్యరోగే ష్వభిలాషవస్తు
దానే కదాచి చ్ఛమయంతి రోగాం।
తద్వస్తు దద్యా త్సహ సాహసేన
క్రియాప్రవీణో యది వైద్యక శ్చేత్॥ ॥౧౮౭॥

అసాధ్యరోగములయందు ఒకానొకప్పుడు రోగికి ఇష్టమయిన పదార్థములను ఇప్పించినచో రోగము ఉపశమించును. ఆసమయములయందు వైద్యుడు మిక్కిలిసాహసముతో రోగుల మనోరథమును పూర్తిచేయుంచవలెను. ॥౧౮౯॥

శ్లో॥ నోల్లంఘునారంభ ముపక్రమేత
స్థిరే త్వమాయాం నియమం న పథ్యే।
క్వాథః ప్రమాదా ద్యది లుప్యతేగ్నౌ
క్షిప్త్వాపయుంజిత తదర్థనీరమ్॥ ॥౧౯౦॥

వారములలో శనివారమున్ను, తిథులలో అమావాస్యయు మొదలిడి లంఘ నారంభము చేయించరాదు పథ్యమిచ్చుటలో యీనియమమును పాటించనవసరము లేదు. పయికూడనిరోజులలో లంఘనారంభమవసరమయినయెడల రోగిచే బియ్యపు గింజను పంటితో కొరికించి యుమియింపవలయును. ప్రమాదవశమున కషాయము యిగిరిపోయినచో తయారు కాదగినకషాయములో సగమునీరుపోసి మసలకాచి దా నిని ఉపయోగించవలెను. ॥౧౯౦॥

శ్లో॥ గతం కృతం శోచతి చానభిజ్ఞః
కర్తవ్యకృత్యం ప్రతి చాప్యభిజ్ఞః ।
ఉక్తో భయం శోచతి విద్వ్యవిందు
స్త్వాఖ్యః క్రియాయాం త్రిషు మధ్య ఏవ॥ ॥౧౯౧॥

తెలివిహీనుడయినవాడు గతించినదానిని గురించియు, తెలివిగలవాడు ముం దు చేయవలసినదానిని గురించియు, తెలిసీ తెలియనివాడు రెండువిధములుగాను ఆలో చింతురు. వీరి ముగ్గురిలోను మధ్య చెప్పబడినవాడే చికిత్స చేయుట కర్హుడు.

శ్లో॥ రోగోపశాంత్యాతురచిత్తనత్వా
త్సంబంధినో హ్యామయవేదితస్య ।
దాస్యం త్యనాలోచనయైకవారం
సద్యః ప్రదద్యాన్మిత మౌషధం యత్॥ ॥౧౯౨॥

రోగిసంబంధీకులు రోగోపశాంతియందుగల ఆతురతచే మందంతయు (మో తాదుల నన్నింటిని) త్వరత్వరగా యిచ్చివేయుచుందురు కాన ఉద్ధృతవ్యాధుల యందు రోగుల కిచ్చు మోతాదులను మితముగా యిచ్చుచుండవలెను. ॥౧౯౨॥

శ్లో॥ ఆజీవితవ్యాపక మిష్టకాలే
రంగస్థలే దర్శయతే బహూనామ్ ।
గ్రంథే స్తథారోగసమూహరూపం
మేధా క్రియాశాస్త్రగురూపదేశైః॥ ॥౧౯౩॥

నాటకరంగస్థలమున అనేకుల జీవితచరిత్రమంతయు స్వల్పకాలములో ఎట్లు ప్రదర్శింపబడుచున్నదో అట్లే రోగసముదాయస్వరూపమున్ను అనేకగ్రంథముల యందు ప్రదర్శింపబడినది. కాన నారోగసముదాయస్వరూపమును బుద్ధివైశద్యము చికిత్సాభ్యాసము, శాస్త్రపరిచయము, గురూపదేశము అనువాటివలన చక్కగా తెలుసుకొనవలయును. ॥౧౯౩॥

శ్లో॥ శ్రుతోపమానాం చ్ఛ్రుతరూపచిహ్నా
రూపాపక్షే పశ్యతి తత్స్వరూపం ।
గ్రంథానుమేయా త్స్వగురూపదేశా
త్స్వయానుభూత్యా చ తథాఽమయానాం ॥౧౯౪॥

ఒక వ్యక్తిని గురించి కొన్ని సాదృశ్యములను విని అవ్యక్తిని ఎన్నడెరుంగ కున్నను వినియున్న సాదృశ్యములచె అవ్యక్తి యీరకముగా నుండవచ్చునని తన మనస్సుయందొక మాదిరిగా రూపకల్పన చేసి అవ్యక్తిని పోల్చుకొనుచున్నాడు. అప్రకారమే రోగములను కూడ గ్రంథవిచారణ, గురూపదేశము, స్వానుభవము, వీటిచే గుర్తింపవలెను. ॥౧౯౪॥

శ్లో॥ పతోచితం మాక్త్రికచూర్ణమూల్యం
ఘటార్థమానం ఘటచూర్ణమూల్యమ్ ।
యత్కించి దర్ఘంచ యథార్థ మేవ
చికిత్సయే త్తుల్యగుణౌషధ స్యత్ । ॥౧౯౫॥

ఒక్క తమలపాకునకు రాయతగినంత చిమత్యపుభస్మ, కడివెడు ద్రవ్యము ఖరీదు కలిగి యుండును, కడివెడు సున్నము బహుస్వల్పమయిన ఖరీదు కలిగి యుండును. కాన గృహస్థులయొక్క తారతమ్యమును బట్టి వరహారతాహాతుకు తగినట్లు యథోచితాగదములతో చికిత్స చేయవలెను ॥౧౯౫॥

శ్లో॥ లోభాచ్చికిత్సాజనితం స్వపుణ్యాం
నశ్య త్యతోర్థం న భిషగ్విలిప్సేత్ ।
తథాపి లిప్సే న్నిజజీవితార్థం
ధనాధికేభ్యః పరజీవితార్థమ్॥ ॥౧౯౬

లోభత్వము చే చికిత్సచేయుటవలన కలిగినపుణ్యము నశించును. కాన వైద్యుడు ప్రతిఫలాపేక్షతో వైద్యముచేయరాదు. కాని తన జీవితము నిమిత్తమున్ను యితరుల (నిరుపేదల) జీవితమునిమిత్తమున్ను ధనవంతులవద్దనుంచి ద్రవ్యమును స్వీకరించవచ్చును. ॥౧౯౬॥

## — ♦ వైద్యులకు చండాలత్వము ♦ —

శ్లో॥ మనోహతం రోగిణ మీక్ష్యజాయు
ప్రయోగసంహారవివేకమూఢమ్।
ముహు ర్ముహూ రోగినిరీక్షణాతురం
వైద్యేషు చండాల ముశంతి సంతః॥ ॥౧౯౭॥

రోగిని చూచినంతనే భయపడినట్టియు, ఔషధములయొక్క ప్రయోగోపసంహారములయందు ఊహాపోహాలు లేనట్టియు మాటిమాటికి రోగినిచూడవలయునను తలంపుగలిగినట్టియు వైద్యుని చండాలతుల్యునిగా చెప్పెదరు. (అనగా గుణములను ఒట్టిరే వైద్యము చేయవలెననుట ) ॥౧౯౭॥

శ్లో॥ ప్రాశంసికప్రకరణం య దిహ ప్రణీతం
తత్తుల్య మేవ వివిధ వైద్యవిధానరీతౌ।
యోగక్రియాసముపహారవిధానకృత్యే
హ్యారోగ్య మేవ ఫలితం సకలక్రియాణామ్॥ ॥౧౯౮॥

వివిధములయిన వైద్యవిధానములయందును, ఔషధములయొక్క ప్రయోగోపసంహారక్రమమునందును యిక్కడచెప్పబడిన ప్రశంసాప్రకరణము సమానమే. అన్నివిధములయిన చికిత్సలకు ఆరోగ్యమేఫలితము. ॥౧౯౮॥

ఇతి చిత్రాగదసంగ్రహాఖ్యే శ్రీసోమయాజిసత్పథే (సత్పథప్రకరణేషు)
"ప్రశంసాప్రకరణమ్"



శ్రీగణేశాయ నమః

# చిత్రాగదసంగ్రహాఖ్యే

# శ్రీసోమయాజిసత్పథే

## పరిభాషాప్రకరణమ్.



### — రోగాగమనకాలం —

శ్లో॥ దివా ఋతూనాం నిశి భోజనస్య
ధాతుత్రయస్యాపి యథా స్థితౌ వా।
తేషాం పురస్తా దపి మధ్యమేంతే
స ఏవ కాలస్తు యదైవ రోగః। ॥౧॥

పగటిభాగముయొక్కయు వసంతాదిఋతువులయొక్కయు, రాత్రిభాగముయొక్కయు, భోజనముయొక్కయు వాతాది ధాతుత్రయముయొక్కయు హెచ్చుతగ్గులతో సంబంధము లేకుండగనే పయిని చెప్పబడినవాటి మార్పుతో సంబంధములేకుండా మొదలుగాని మధ్యగాని చివరగాని ఎప్పుడు రోగము సంప్రాప్తమగుచున్నదో అప్పుడే రోగప్రారంభకాలము అగుచున్నది ॥౧॥

శ్లో॥ ఆహారకాలనియమ స్సకాలమయానాం
యస్మాత్సదాపి వివిధాః ప్రభవంతి రోగాః।
తస్మాద్ధరా జ్జనిత సర్వరుజా ముపాయా
త్కృత్వా ద్విచింత్య భిషగామయకారణాని॥ ॥౨॥

రోగమువచ్చుటకు ఆహారనియమము గాని కాలనియమము గాని లేదు. అన్ని విధములయిన రోగములు కాలనియమములేకయే సర్వకాలములయందును అన్నివేళలయందును వచ్చుచుండును గాన హరాత్పిద్ధములయిన వ్యాధులకు వైద్యుడు వ్యాధికారణములను (గుర్తించి) ఆలోచించి ఉపాయముచే చికిత్స చేయవలెను. ॥౨॥

శ్లో॥ క్వచి న్నజాయ త్యమరః పృథివ్యాం
కశ్చి త్తతో మృత్యు రవార్య ఏవ।
కంతు స్వశక్త్యా రుజ ఏవ వార్యాః
ప్రతిక్రియాదక్షచికిత్సకేన॥ ॥౩॥

భూలోకమున మరణమునుపొందని మానవుడు జన్మించడు గాన కాలమృత్యువు అనివార్యము. మరియు చికిత్సాసామగ్ర్యముగల వైద్యునిచే వ్యాధులుమాత్రము ఉపశమింపజేయబడవలయును. ॥౩॥

## —♦ రోగజ్ఞానమునకు పంచోపాయములు ♦—

శ్లో॥ మిథ్యాన్నపానాది నిదానమాహు
రామాదిదోషాదిచ పూర్వరూపమ్।
మాంద్యం చ రూపం స్వగదం శయంచ
సంప్రాప్త మేవం రుగభిజ్ఞతాం చ॥ ॥౪॥

తత్వమునకు సరిపడని ఆహారాదులు నిదానమనియు, అట్టియాహారాదులచే జనించిన అజీర్ణాదులు పూర్వరూపమనియు ఆ అజీర్ణాదులచేజనించిన మాంద్యాదులు రూపమని, వాటినుపశమింపజేయు మందు ఉపశయమని, ఆయావ్యాధులకు చెప్పబడినలక్షణములచే వ్యాధి ఫలానిదని తెలియబడుట సంప్రాప్తియనియు చెప్పబడును

## —♦ నిదానపంచకోపసంహారం ♦—

శ్లో॥ దుష్టా స్స్వ్యాహారవిహారలోపా
న్మలా శ్చ తద్దోషవశా ద్భవన్ద్రుక్।
వ్యాధేః పరిజ్ఞానవిధౌ మిథ స్స్యా
ద్వ్యాధి ర్నిదానస్య నిదాన మస్య॥ ॥౫॥

ఆహార విహార వైషమ్యముచే ధాతుత్రయవైషమ్యమున్ను, ధాతువైషమ్యముచే వ్యాధియున్ను పుట్టుచున్నవి కాన వ్యాధిని కనిపెట్టుటకు నిదానమున్ను, నిదానమునకు వ్యాధిన్ని పరస్పరాశ్రయములయి వున్నవి ॥౫॥

## —♦ రోగభేదములు ♦—

శ్లో॥ పంగ్వంధకుష్ఠబధిరాస్తు నిసర్గజాస్స్యు
రాగంతుకా శ్చ కఫపిత్తమరుజ్జ్వరాఖ్యాః।
ప్రాగామయా స్తు మలజా అపి కర్మజాశ్చ
త్రేధావిధాశ్చ కఫపిత్తమరుజ్జ్వరాఖ్యాః॥ ॥౬॥

స్థూలదృష్టిచే వ్యాధులు స్వాభావికములనియు, ఆగంతుకములనియు రెండు విధములు. వాటిలో కుంటి, గుడ్డి, చెముడు, మూగ కుష్ఠు మొదలయినవి స్వాభావిక

వ్యాధులు త్రిదోషజనితజ్వరాదులు ఆగంతుకవ్యాధులు ఇవి కర్మజన్యములని యు, దోషజన్యములనియు, కర్మదోషజన్యములనియు మూడువిధములుగా వ్యవహరింపబడుచున్నవి. ||౬||

శ్లో|| ఏకైకేనైవ చ దోషేణ త్రయోద్వాభ్యామపి త్రయః|
త్రిదోషై రపి చైక స్స్యా దేవం సప్తవిధో గదః|| ||౭||

వాతము, పిత్తము, శ్లేష్మము వీటివలన ప్రత్యేకముగా జనించునవి మూడు వాత పిత్త శ్లేష్మముల ద్వంద్వములచే జనించునవి మూడు త్రిదోషములచే జనించునది ఒకటి. యీప్రకారము సకలవ్యాధులు ఏడువిధములయి ఉన్నవి ||౭||

శ్లో|| సమ్యక్కృతాని యది వాప్యనివర్తితాని
స్స్యుః కర్మజాని కఫపిత్తమరుద్భవాని|
దోషోద్భవాని గుణదాని చికిత్సితాని
కర్మక్షయౌషధగుణా స్త్యుభయాత్మకాని|| ||౮||

నిదానశాస్త్రముచే వ్యాధిస్వరూపము బాగుగా నిర్ణయింపబడి యథానుకూలముగా చికిత్సచేయబడినను ఉపశమింపని వ్యాధులు కర్మజములు ఇవి ప్రారబ్ధకర్మమునశించినపిదప శాంతినొందుచున్నవి వాతాదిధాతువులయొక్క వైషమ్యముచే జనించి యథావిధిగా చికిత్సచేయబడి శాంతిని చెందిన వ్యాధులు దోషజములు. ఇవి ఔషధాదులచే శాంతినొందుచున్నవి ప్రారబ్ధకర్మమువల్లనున్ను వాతాదిదోషవైషమ్యమువల్లనున్ను జనించినవ్యాధులు కర్మదోషజములు (ఇవియే ఉభయాత్మకవ్యాధులు) ఇది ప్రారబ్ధకర్మముయొక్క క్షయము ఔషధసేవ వీటిచే శాంతినొందుచున్నది. ||౮||

శ్లో|| శ్లేష్మరుగ్భ్యః పిత్తరోగాః పిత్తరుగ్భ్యశ్చ వాతికాః|
బహవ స్తద్వాతపిత్త శ్లేష్మరీతి స్సమంజసా|| ||౯||

శ్లేష్మవ్యాధికంటె పైత్యవ్యాధులు పైత్యవ్యాధులకంటె వాతవ్యాధులు అధికముగానున్నవి కాన యీవైద్యశాస్త్రమున వాత పిత్త శ్లేష్మములు అనుక్రమము సమంజసముగానే యున్నది. ||౯||

శ్లో|| గాణాం త్రిధాతు ష్వపహాయ భూయో
దేకస్య యుగ్మస్య చ వాప్రధానమ్|
తద్దోషనామ్నైవ రుజః ప్రధానం
సర్వేషు రోగేషు వినిర్ణయంతి|| ||౧౦||

వాత పిత్త శ్లేష్మములలో తక్కువగానున్న దానిని విడిచిపెట్టి హెచ్చుగానున్న ఒకదానియొక్క గాని రెండింటియొక్క గాని మూడింటియొక్క గాని ప్రాబల్యమును అనుసరించి ఆదోషముల యొక్క పేరుతోనే సమస్త వ్యాధులయందును రోగముకు పేరిడుచున్నారు ॥౧౦॥

శ్లో॥ వికారోపశమో రోగశాంతి రేవ న సంశయః।
వికారో నామ రోగైక దేశోంగాంగిక్రమేణ తు॥ ॥౧౧॥

వికారోపశాంతియే రోగశాంతి వికారమనగా రోగముయొక్క ఏకదేశము యీ వికారమునకున్ను రోగమునకున్ను అంగాంగిభావము. ॥౧౧॥

శ్లో॥ యథైకబీజప్రభవా మనుష్యా
అన్యోన్యసాదృశ్యవిహీనరూపాః।
తథైకదోష ప్రభవాశ్చరోగా
అన్యోన్యసాదృశ్యవిహీనరూపాః॥ ॥౧౨॥

ఏకబీజజనితులయినప్పటికిన్ని మానవులలో ఒకరినిపోలి ఇంకొకరు ఎట్లుండరో ఆట్లే ఏకదోషజనితములయినప్పటికిన్ని రోగములున్నూ ఒకరోగమునుపోలి ఇంకొకరోగము ఉండదు ॥౧౨॥

శ్లో॥ జానాతి సంచారిణ మంధకారే
ప్రాయ స్స్వరూపృష్ట్యైవ చ దృష్టమాత్రాత్।
తథైవ రోగోపి చికిత్సకేన
సంద్రుష్టమాత్రేణ వినిశ్చితవ్యః॥ ॥౧౩॥

లోకసామాన్యముగా చీకటిలో వెళ్ళుచున్న మనుష్యుని పలుకరించకుండగనే ఎట్లు గుర్తించుచున్నారో ఆప్రకారమే రోగిని చూచినంతమాత్రముచే ఆరోగిని పరీక్షింపనవసరములేకుండగా ఫలానిరోగమని తెల్పవలెను ॥౧౩॥

శ్లో॥ పత్రాదికం వీక్ష్య వినిశ్చయంతి
వృక్షేషు భేదా న్విహగేషు చాపి।
రోగాన్వితం వీక్ష్య తథైవ రోగం
వినిశ్చయం తేఽనుభవప్రవీణాః॥ ॥౧౪॥

ఆకులు మొదలయినవాటిని చూచి వృక్షజాతులనున్ను రెక్కలు మొదలయిన

వాటినిచూచివృక్షజాతులను రెక్కలనుచూచిపక్షులనెట్లుపోల్చుచున్నారో ప్రావీణ్యతగలవైద్యులు రోగినిచూచినంతమాత్రముననే రోగము ఫలానిదనిపోల్చుచున్నారు.

శ్లో॥ కాచాని రత్నాని సమస్వరూపా

న్యేవంచ ధాన్యాని వినిశ్చయంతి।

లోహాని వస్త్రాణి పశూ న్మనుష్యా

న్నైలాని కాష్ఠా న్యురగా స్తథైవ॥ ॥౧౪॥

సమానాకారముగల గాజురాళ్ళనున్ను రత్నములనున్ను ధాన్యములను లోహములను, వస్త్రములను, పశువులను, మనుష్యులను చూడగానే యిది యీ (ఫలాని) జాతియనియు, వీడు ఫలానివాడనియు, ఎట్లుగుర్తించుచున్నారో అట్లే రోగములను పోల్చగలుగుచున్నారు ॥౧౫॥

శ్లో॥ ఏకామయోనేక విధామయత్వం

ప్రపద్యనానావికృతిస్వరూపమ్।

ప్రయాతి శాంతిం విధిపక్వకాలే

చికిత్సకో వా నచ సంకరస్తు॥ ॥౧౬॥

సమర్థుడయిన వైద్యుడు చక్కగా చికిత్సచేయుచున్నను ఒక్కొక్కరోగము అనేకవ్యాధులుగా పరిణమించి కర్మపక్వమయినపిమ్మట ఉపశాంతినిపొందుచున్నది ఇట్టిసంగరమున క్రియాసంకరవ్యాధులు కుదురుట కష్టతరమైయున్నది ౧౬॥

శ్లో॥ పిత్తం పంగుః కఫం పంగుః పంగవో మలధాతవః।

వాయునా యత్ర నీయంతే తత్ర గచ్ఛంతి మేఘవత్ ॥౧౭॥

పిత్తకఫములు రెండును స్వతంత్రశక్తిలేక వాతమెచ్చటకు తీసుకొనిపోయిన అచ్చటికి మేఘములవలె పోవుచున్నవి ॥౧౭॥

శ్లో॥ కుపితానాంచ దోషాణాం శరీరే పరిధావతాం।

యత్ర సంగ స్ఖవైగుణ్యా ద్వ్యాధి స్తత్రోపజాయతే॥ ॥౧౮॥

ప్రకోపించినదోషములు శరీరమున వ్యాపించుకాలమున ఎచ్చోటికిచేరునో అచ్చోటనే వ్యాధి జనించుచుండును. ॥౧౮॥

శ్లో॥ రుగ్భేదవిజ్ఞాన మశక్యమేవ

గ్రంథప్రశస్తా వశవర్ణితంవా।

సామాన్యతః పిత్తమరుత్కఫానా

మూహాధికజ్ఞాన మలం సమగ్రమ్॥ ॥౧౯॥

గ్రంధపరిశంసావశముచే బహుశిముగా వివరింపబడినను రోగజాతులు తెలియ బడవు. కాన వైద్యునికి వాతపిత్తశ్లేష్మములయొక్క వృద్ధిక్షయములను కనిపెట్టుజ్ఞాన ముఉండినచాలును. ॥౧౯॥

శ్లో॥ ఉగ్రాహతే ర్జీవతి కశ్చి దాజౌ
వల్పాహతే ర్మృత్యు ముపైతి యద్వత్॥
ఉగ్రామయా జ్జీవతి కశ్చి దేవం
స్వల్పామయా న్మృత్యు ముపైతి జాతు॥ ॥౨౦॥

యుద్ధమునందు ఒకానొకడు గొప్పగాయము తగిలియు జీవించుచున్నాడు. మరియొకడు స్వల్పమయిన గాయము తగిలినంతమాత్రముననే మృతినొందుచున్నాడు అప్రకారమే ఒకానొకడు అసాధ్యరోగములనుండికూడ విముక్తుడగుచున్నాడు. మరియొకడు సామాన్యరోగముచేతనే మృతినొందుచున్నాడు. ॥౨౦॥

శ్లో॥ జాతూదయ స్యా స్తమయస్య పశ్చా
న్నక్తందివా శేష ఇవ ప్రజాభిః।
రోగోద్భవ శ్చా పగమశ్చ తద్వ
త్ప్రాయః పరిజ్ఞాతు మశక్య మేవ॥ ॥౨౧॥

దుర్దినమున (మేఘచ్ఛన్నమయి సూర్యదర్శనముకాని మునురురోజున) సూర్యోదయ సూర్యాస్తమయసమయము లెట్లు తెలియబడవో అట్లే ఒకానొకప్పుడు రోగారంభ రోగోపశాంతి సమయములుకూడ తెలియబడవు ॥౨౧॥

శ్లో॥ న జ్ఞాయతే భావికవర్షమానం
దృష్టా పురస్తా దపి మేఘమాలా।
రోగావధి స్తద్వదనూహ్య ఏవ
చిరంతనాభ్యాస విశారదైర్వా॥ ॥౨౨॥

నీలమేఘపరంపరలు ఎదుట కనబడుచున్నను ఇంతపరిమితిగల వర్షముకురియునని ఎట్లు తెలియబడదో అట్లే రోగములయొక్క ఉద్భవోపశాంతి నియతికూడ తెలియబడదు. ॥౨౨

పడకలకు పరివాహములకు ఎగుడుగాపోవుటలోను వాలుగాపోవుటలోను ఎట్టితారతమ్యముకలదో ఆశ్లైరోగము అభిముఖముగా నున్నప్పుడున్ను వళ్ళు మొగముగా నున్నప్పుడున్ను మందులు పనిచేయుటకుకూడా గుణతారతమ్యము కలిగియుండును. ॥౨౬॥

శ్లో॥ రోగోద్ధ్రుతిం శాంతి మివాపశాంతిం
రోగోద్ధ్రుతిం పశ్యతి జాతు లోకః।
శాస్త్రోపదేశానుభవా త్స్వపుష్టై
ర్విజ్ఞాయతే కేన చిదత్రతథ్యమ్॥ ॥౨౭॥

ఒక్కొక్కసమయమందు రోగముయొక్క ఉధ్రుతమును ఉపశాంతిగాను, ఉపశాంతిని ఉద్ధ్రుతముగాను చూతురు యీఉద్ధ్రుతోపశాంతుల వాస్తవస్థితి శాస్త్రపరిచయము గురూపదేశమహిమచేతనున్న స్వానుభవము వీటిచేత తెలుసుకొనబడుచున్నది. (యీవిషయము బ్రహ్మజ్ఞానమువంటిది) ॥౨౭॥

శ్లో॥ క్లిశ్నాత్యన్యా న్వాతరు క్పిత్తరోగీ
క్లిశ్యత్యాత్మ న్యేవచ శ్లేష్మరోగీ।
క్లిశ్నాత్యన్యా న్క్లిశ్యతి ద్వంద్వరోగీ
వ్యక్తావ్యక్తక్లేశబాహుల్యగాత్రః॥ ॥౨౮॥

వాతరోగి చూచువారికి బాధనుకలుగజేయును. (అనగా బాధచూడలేక చూచువారు బాధపడుదురు) పైత్యరోగి తనలోతానే బాధపడుచుండును శ్లేష్మరోగి ఇతరులను బాధపెట్టుచు తాను బాధపడుచుండును ద్వంద్వరోగి అనిర్వాచ్యమయినబాధలతో ఒకప్పుడు తనలోతానే బాధపడుచును, ఒకప్పుడు ఇతరులను బాధపెట్టుచుండును ఒకప్పుడు ఆరోగ్యవంతుడుగాను ఉండును. ॥౨౮॥

—♦ రోగసహనశక్తి ♦—

శ్లో॥ అహ్నా స్సమీపా త్తిమిరం తుసాయం
యన్మన్యతే ప్రప్రధమే కఠోరమ్।
క్రమాన్నిశీథే విరళం తదేవ
రుగ్వ్యాకులః ప్రాక్ప్రహరత స్తథైవ॥ ॥౨౯॥

చీకటి సాయంకాలమున తక్కువగా ఉన్నప్పటికిన్ని పగటికి సమీపసము

యమగుటవలన ప్రబలముగాను నిశిధమున ప్రబలముగా నున్నప్పటికిన్ని సామాన్య ముగాను ఎట్లు తలచబడుచున్నదో అట్లే రోగాతురతయు సహింపబడుచున్నది.

## —♦ వంశానుక్రమరోగములు ♦—

శ్లో॥ క్షయాదియుక్తా యది రోగవంశ్యా
స్తద్రోగబీజాని శరీరగాని।
అల్పేపి హేతౌ సతి సంభవంతి
తద్రోగపుంజస్తు కులోద్భవానామ్॥ ॥30॥

రోగియొక్క పూర్వీకులు క్షయాదిరోగములు గలవారయినయెడల ఆరోగబీజములు వంశపరంపరా ముందుయుండు అవంశమునపుట్టబోవు వారిరక్తమునందిమిడి యుండుటచే స్వల్పమయినరోగహేతువు కలిగినను వంశపరంపరాగతమయిన పూర్వీకులకుగల పూర్వోక్తరోగములుగా మారిపోవుచున్నవి ॥30॥

## —♦ సాంక్రామికరోగములు ♦—

శ్లో॥ అక్షిరోగో హ్యపస్మారః కుష్ఠక్షయ మసూరికాః।
దర్శనా త్స్పర్శనా ద్దానా త్సంక్రమంతి నరాన్నరమ్॥ 31

నేత్రవ్యాధులు అపస్మారము (మూర్ఛ), కుష్ఠరోగము, మశూచికము, ఈరోగములు ఆ రోగముకలవారిని చూచుటచేతనున్ను ముట్టుటచేతనున్ను వారివద్దనుండివస్తుపరిగ్రహము చేయుటచేతనున్ను ఒకరినుండి మరియొకరికి సంక్రమించుచున్నవి

## —♦ సాధ్యాసాధ్యయాప్యరోగలక్షణములు ♦—

శ్లో॥ జాయో రభావే సతి పూర్వకాలే
సాధ్యోపి యాప్యత్వ ముపైతిరోగః।
యాప్యో ప్యసాధ్యత్వ ముపైతిపశ్చా
దసాధ్య మాయా త్యథ మారకత్వమ్॥ ॥33॥

రోగారంభమునందు ఔషధసేవ చేయనిచో సాధ్యరోగమే యాప్యరోగము అగును (ఔషధసేవ చేయుచున్నంతకాలము యాప్యరోగి సుఖముగానుండును) యీయాప్యరోగమే యథోచితమయిన ఔషధసేవచేయక ఉపేక్షించినయెడల అసాధ్యరోగము అగును. యీఅసాధ్యరోగమే మారకోపద్రవమును కలుగజేయును.

## — అసాధ్యరోగములు —

శ్లో॥ జ్యోతిర్విదాం జ్ఞాతు మశక్యమేవ
ప్రాయః కళత్రాయురపత్యభూతీః।
జలోదరశ్లీపదయక్ష్మకుష్ఠా
శ్చికిత్సకానా మపి దుర్నివార్యాః॥ ॥౩౪॥

కళత్రవిషయము, ఆయుర్విషయము సంతానవిషయము, ఐశ్వర్యవిషయము ఇవి జ్యోతిష్కులకు తరచుగా తెలియవు జలోదరము, బోద, క్షయ కుష్ఠు ఇవి చికిత్సకునికి కుదర్చశక్యములు కావు ॥౩౪॥

## — సర్వరోగశమనోపాయం —

శ్లో॥ పురాణవేదశ్రవణం సుకర్మ
దీనార్తసంరక్షణ మన్నదానం।
గ్రహార్చనం దేవతతీర్థయానం
హన్త్యా రుజ స్సూర్య ఇవాంధకారమ్॥ ॥౩౪॥

పురాణములనువినుట, చతుర్వేదపారాయణము సత్కర్మానుష్ఠానము, దీనులను ఆపన్నులను కాపాడుట, అన్నదానము నవగ్రహారాధన, దేవతాదర్శనమునకు వెళ్ళుట, తీర్థయాత్రలకు వెళ్ళుట, ఇనునవి సూర్యుడు చీకటిని పోగొట్టునట్లు సమస్తరోగములను పారదోలుచున్నవి ॥౩౫॥

## — వైషమ్యక్రియావిశేషము —

శ్లో॥ అల్పస్య కార్యావసరేషు కాలం
యథావృథాస్యా న్మహదాశ్రయేణ॥
తథాల్పరోగేషు మహౌషధైర్వా
వినా స్వసామర్థ్యాధికరణ్యయోగాత్॥ ॥౩౬॥

గొప్పవారిని ఆశ్రయించుటచే సామాన్యునిపనులు ఎల్ల చెడిపోవునో అట్లే సామాన్యవ్యాధులయందు ప్రబలమయిన ఔషధములను ప్రయోగించుటచే ప్రయోజనము కానరాదు. కాన రోగోచితౌషధములనే ప్రయోగించవలెను. ॥౩౬॥

శ్లో॥ అల్పౌషధాని ప్రబలేచ రోగే
నాల్పేచ దద్యా త్ప్రబలౌషధాని।
పూర్వప్రదత్తౌషధవీర్యశాంతా
వన్యౌషధా న్యాగుణలాభసిద్ధేః॥ ॥3౭॥

రోగము ప్రబలముగా నున్నపుడు బలహీనమయిన మందులను, రోగము స్వల్పమైయుండెగా బలవత్తరమైన మందులను యివ్వరాదు మొదట యిచ్చిన మందు పనిచేయలేదనితోచినయెడల ఆమందుయొక్క బలము క్షీణించినపిదప (లేనిచో క్షీణింపజేసి) సుగుణము కలిగేవరకున్న మందును మార్చి యిచ్చుచుండవలెను ॥3౭॥

శ్లో॥ యథా నిశీథప్రతిభాసితో వా
దివా న దీపో రుచిరో విభాతి ॥
గుణప్రదో వా ప్యగదో రుగాదా
వారోగ్యకాలే త్వగుణప్రదః స్యాత్॥ ॥3౮॥

దీపము నిశీథమున ప్రకాశించునట్లు పగటిభాగమునం దెట్లు ప్రకాశింపదో అట్లే రోగము ప్రబలముగా నున్నపుడు పనిచేసిన మందు ఆరోగ్యము వచ్చుచున్న కొలది పనిచేయదు ॥3౮॥

—ఔషధావస్థ—

శ్లో॥ స్యా దేవ మధ్వాదిరస స్సమస్త
ద్రవ్యే గురుత్వాదిగుణ శ్చ శక్తిః ।
ఉష్ణాదివీర్యో మధురాదిపాక
స్తత్ర్వ మన్యైక్యసవీర్యలీనం ॥ ॥3౯॥

ప్రతిఔషధద్రవ్యమునందును మధురాదిషడ్రసములు, గురుత్వాదిగుణములు, ప్రభావము, ఉష్ణాదివీర్యము, మధురాదివిపాకము, అను అయిదు శక్తులు కలవు. లోకమునందలి ద్రవ్యసమూహ మంతయు చంద్రసూర్యాత్మకం బౌటచే ప్రతిద్రవ్యమునందును యిమిడియున్న వీర్యము, ఉష్ణత్వము, శీతలత్వముగాని అగుచుండుటచే ఉష్ణవీర్యము, శీతవీర్యము అని రెండువిధములుగా నుండును. ॥3౯॥

శ్లో॥ దీపోర్ధ్వధూమం వినిహంత్యకస్మా
ద్దీపోర్ధ్వకాంత్యర్పితకాచశక్తిః ।
వ్యాధే ర్వికారా నపి జాయుశక్తి
స్తధా కధాచి త్సహసా చిరేణ ॥ ॥౮౦॥

దీపముయొక్క మీదుభాగమున కాంతినిమిత్తము ఉంచబడిన చిమ్నీలోని శక్తి తత్క్షణమే దీపమునందలి పొగను సంహరించిన చందమున రోగోపశాంతికొరకు ప్రయోగించబడిన ఔషధములోని శక్తి వ్యాధియందలి వికారములను ఒకొక్కప్పుడు శీఘ్రముగాను, ఒకొక్కప్పుడు ఆలస్యముగాను సంహరించును ॥౮౦॥

శ్లో॥ జీవప్రపంచేపి జడప్రపంచే
చైతన్యశక్తి స్సదృశీ హి యస్మాత్ ।
తత్తుల్యవస్త్వౌషధసంప్రయోగే
శీఘ్రేణ తద్వ్యాధినివారణా స్యాత్ ॥ ॥౮౧॥

చరములయిన ప్రాణిసముదాయమునందెట్టి చైతన్య (ప్రాణధారణా) శక్తి కలదో అట్టి చైతన్యశక్తియే అచరములయిన తరుగుల్మలతాదులయందు కూడ కలదు. కాన శరీరమున లోపించిన శక్తిని పూర్తిచేయుటకుగాను, అట్టిశక్తిగల వస్తువులను తిరిగి దేహమందు ప్రవేశపెట్టుటచే రోగము శీఘ్రముగా తగ్గుచున్నది. ॥౮౧॥

## షడ్రసోత్పత్తిః

శ్లో॥ మధ్వమ్ల్యతిక్తకట్వమ్లకషాయా ష్షడ్రసాః క్రమాత్ ।
భూతైః క్ష్మాగ్నిఖవాయుభ్యస్స్యాతాం ద్వాభ్యాంయథోత్తరం॥

పృథివ్యాదిపంచభూతములలోను పృథివి, ఉదకము, వీనిచే మధురసము, ఉదకము, తేజస్సు వీనిచే లవణరసము, అగ్ని, వాయువు, వీటిచే కషాయరసము. పృథివి, అగ్ని వీటిచే ఆమ్లరసము, పృథివి, వాయువు వీటిచే తిక్త (చగరు) రసము పుట్టుచున్నవి ॥౮౨॥

## ఔషధనైవిధ్యం

శ్లో॥ గ్రాహ్యా ప్రమాథి వమన దీపన పాచనాను
లోమ వ్యవాయి శమన భేదనధాతువృద్ధిః ।
విస్రంసనాఽసు హరణ లేఖన శోధ శుక్రో
త్పత్తిప్రభేద బల రసాయన కాశి సూక్ష్మాః॥ ॥౮౩॥

ద్రవమును శోషింపజేసి దీపనపాచనములను కలుగజేయు శొంఠి, పిప్పళ్ళు, జీలకఱ్ఱ మొదలయినవి గ్రాహ్యౌషధములు. కర్ణనాసాముఖరంధ్రములలో ప్రవేశించి, స్వశక్తిచే అచ్చటి దోషము పోగొట్టు మిరియములు, వస మొదలయినవి ప్రమాథ్యౌషధములు. అపక్వమైన పిత్తమును గాని, శ్లేష్మమును గాని ఊర్ధ్వముఖంబున పోగొట్టు మంగ కాయ మొదలయినవి వమనౌషధములు. ఆహారపదార్థమునుమాత్రము పచనము గావించు పెద్దసోపు మొదలయినవి పాచనౌషధములు. ఆమమును పచనము గావింపక అగ్నిని పెంపొందించు పెద్దసదాపు మొదలయినవి దీపనౌషధములు. దీపనపాచనములను కలుగజేయు చిత్రమూలము మొదలయినవి దీపనపాచనౌషధములు. ఆహారపదార్థమును పచనము గావించి దాని బంధమును పోగొట్టి అధోముఖమున వెడలించు కరక్కాయ మొదలగునవి అనులోమౌషధములు. భుజించినవెంటనే దేహమంతటను వ్యాపించి వెంటనే జీర్ణమగు గంజాయి, నల్లమందు మొదలగునవి వ్యవాయౌషధములు. సమస్థితిలో నుండు వాతాదులకు విరోధమును కల్పించక ప్రబలమైనట్టియు, విషమమైనట్టియు నగు దోషములను సమానముగాచేయు తిప్పతీగె మొదలగునవి సంశమనౌషధములు. ఒకదానితో యింకొకటి కలిసియుండెడు దోషములయొక్క బంధమును తత్క్షణము విడగొట్టి స్వస్థానమున చేర్చు క్షారములు శొంఠి, పిప్పలి మిరియాలు, శిలాజిత్తు మొదలగునవి ఛేదనౌషధములు. శుక్రమును వృద్ధిచేయు పెన్నేరు, నేలతాడి, పంచదార, పిల్లితేగలు మొదలయినవి ధాతువృద్ధ్యౌషధములు పచనము కాతగిన పదార్థమును పచనముచేసి వాని, వాని స్థానములను పొందించునట్టియు, మలాదులను క్రిందికి వెడలించునట్టియు రేలజిగురు మొదలయినవి స్రంసనౌషధములు వికాసి, వ్యవాయి, సూక్ష్మ, ఛేది మద గుణములు గలిగి ప్రాణంబులతీయు వసనాభి మొదలయినవి ప్రాణహరౌషధములు. దోషభూయిష్ఠమయిన రసాది ధాతువులను మలమును శుష్కింపజేసి శమనంబును పొందించు తేనె, వేడినీరు, వస, యవలు మొదలయినవి లేఖనౌషధములు. వాతాదులలో కలసి స్వస్థానమందుండు మలాదులను ఊర్ధ్వముఖముగా గాని, అధోముఖముగా గాని, వెడలించు డావరడంగి మొదలయినవి సంశోధకౌషధములు. శుక్రమును ప్రవర్తింపజేయు పాలు, మినుగులు, ఉశిరికపండ్లు మొదలయినవి శుక్రప్రవృత్త్యౌషధములు. స్వమార్గమున బంధించియున్న మలమూత్రములను అధోమార్గమున వెడలించు కటుకరోహిణి మొదలయినవి భేదనౌషధములు సంభోగశక్తినికలిగించు చిట్టాముట్టు చన్నచెల్లగడ్డ, పంచదార,దూలకుండవిత్తులు మొదలయినవి వాజీకరణౌషధములు దేహమునందలి రోగమును పోగొట్టి యుదిమిని రాకుండాజేయు తిప్పతీగె, అడవిశనగలు కరక్కాయ మొదలగునవి రసాయనౌషధములు. కీళ్ళపట్లను వదలించి, కాంతినికలుగజేసి, రసాదిధాతువులద్వారా ఓజస్సును కలుగజేయు పోకచక్కలు, కొఱ్ఱలు మొదలగునవి వికాస్యౌషధములు దేహమందలి సూక్ష్మరంధ్రములయందు ప్రవేశించు సైంధవలవణము. తేనె, వేపనూనె, నువ్వులనూనె మొదలగునవి సూక్ష్మౌషధ

మ్ములు. మైనస్తువులలో నే ఔషధము లనియు, వస్తువు లనియు గూడ వ్యవహరింతురు. గ్రాహ్యౌషధములు, గ్రాహ్యద్రవ్యములు. ఇట్లే మిగిలినవాటి నూహింపవలెను. కషాయరసంబుగల కొడిశపాల, దుందిలము మొదలగునవి స్తంభనౌషధములు. మరియు తమోగుణప్రధానములై, బుద్ధిమాంద్యమును కలుగజేయు కల్లు మొదలగునవి మద ద్రవ్యములు. గురుత్వగుణము కలిగి, రసవహస్రోతస్సుల నడ్డగించి, శరీరమునకు గురుత్వము కలుగజేయు పెరుగు మొదలగునవి అభిష్యందిద్రవ్యములు.

ద్రవ్యము (ఔషధము) లయందు ఇన్నివిధములయిన తేడా వున్నది, అని తెలియుటకు సంగ్రహముగా చెప్పబడినవి. వివరములను అభ్యాసవైశద్యముచేతనున్ను గ్రంథాంతరములచేతనున్ను తెలియనగును. ॥౪౩॥

## —♦ఔషధానా మాగమనం♦—

శ్లో॥ యద్ద్రవ్య మాదౌ పరికీర్తితం త
న్నామ్నైవ తద్యోగకృతాం చ యోగాత్ ।
త్యాజే దయుక్తం గణకీర్తితం వా
సంయోజయే ద్ద్రవ్య మకీర్తితం వా॥ ॥౪౪॥

వైద్యశాస్త్రమున తరచుగా ఏయే యోగములయందేయే ద్రవ్యములు మొదట చెప్పబడుచున్నవో ఆద్రవ్యప్రధాన మయిన పేర్లున్ను, కొన్నిచోట్ల ఆ ఔషధకర్తల పేర్లతోను, కొన్ని కొన్ని ఔషధములు గలవు. ఉదాహరణము— బోళబద్ధవటి, సుదర్శనచూర్ణము మొదలయినవి యే ఔషధగణమందయినను చెప్పబడిన ద్రవ్యము ప్రస్తుతరోగమునకు అనుపయోగ మయినచో దానిని విడిచిపెట్టవలయును చెప్పకున్నను ఉపయోగ మయిన ద్రవ్యమును గ్రహింపవలయును. ఇది అనుభవము కలిగి చికిత్స చేయు వైద్యుని అధీనమై యున్నది. ॥౪౪॥

## —♦ఔషధగోపనము♦—

శ్లో॥ అభక్ష్యపే యాఽపరిశుద్ధవస్తు
సమ్మేళనాసహ్యకరౌషధానామ్ ।
నివేదనా దుర్గ్రహణాచ్చ వైద్యైః పరీత్యా
దోషా స్తదన్యై ర్న గదో న వాచ్యః॥ ॥౪౫॥

భక్ష్యయోగ్యములు కానట్టియు, పానార్హములు కానట్టియు, అపరిశుద్ధము లయినట్టియు నగు వస్తువుల సమ్మేళనముచే అసహ్యకరము లయిన ఔషధములను

తెలియుటవలన ఒకానొకప్పుడు రోగోపశాంతికి బదులుగా వ్యతిరేకమయిన దోషములు బయలుదేరును. కాన యిది ఫలానిమందని తెలియనివ్వరాదు. ॥౮౫॥

శ్లో॥ బ్రూయా ద్భిషగ్ రోగ్యౌషధనామ వైద్యః
కదాచి దప్యాత్మజనాయ నాపి।
యత్రైవ మంత్రే ప్రకటీకృతే త
చ్ఛక్తి ర్వినశ్య త్యగదేపి వైద్యః॥ ॥౮౬॥

మంత్రమును ప్రకటన చేయుటచే దానియొక్క శక్తి ఎట్లు తగ్గిపోవుచున్నదో అట్లే మందుయొక్క శక్తికూడ నశించిపోవుచున్నది కాన రోగికి యిచ్చుచున్న మందు ఫలానిదని తనయొక్క స్వజనముతోకూడ చెప్పరాదు. ॥౮౬॥

—♦ ఔషధసేవకు కాలము ♦—

శ్లో॥ కాలేఽనుక్తే ప్రాతరంగే జలాస్స్యుః
భాగేనుక్తే తత్ర భాగం సమానమ్।
పాత్రేఽనుక్తే మృణ్మయం చాఽద్రవేంధ
స్తైలేనుక్తే గ్రాహ్య మేవం తిలోత్థమ్॥ ॥౮౭॥

ఔషధసేవకు కాలనిర్ణయము చెప్పనిచోట్ల ప్రాతఃకాలమందుమాత్రమే పుచ్చుకొనవలయును. భాగనిర్ణయములేనిచోట్ల సమానభాగములు, పాత్రనిర్ణయములేనిచోట్ల మట్టిపాత్ర, ద్రవద్రవ్యము చెప్పనిచోట్ల మంచినీళ్ళు, తైలమును చెప్పనిచోట్ల నువ్వులనూనె ఉపయోగించవలెను ॥౮౭॥

—♦ దేశజ్ఞానం ♦—

శ్లో॥ అనూపదేశం బహునీరవృక్షం
వాతప్రకోపం లఘునీరవృక్షమ్।
పిత్తాధికం జాంగలదేశమాహు
స్సాధారణం ద్వంద్వవిపర్యయేణ॥ ॥౮౮॥

విస్తారమయిన నీరు, వృక్షములు గలది అనూపదేశము. అప్రదేశమందు వాతసంబంధమయినట్టియు, కఫసంబంధమయినట్టియు వ్యాధు కలిగియుండును. స్వల్పమయిన నీరు, వృక్షములుగలది జాంగలదేశము. ... పిత్తసంబంధవ్యా...

ట్టియు, రక్తవికారసంబంధమయినట్టియు వ్యాధులు కలిగియుండును. యీరెండు ప్రదేశములకంటె యితరమయినది (అనగా యుచితమయిన ఉదకము, వృక్షములు కలది) సాధారణదేశము. ఆప్రదేశమందు యుచితవ్యాధులు కలిగియుండును. ॥౪౮॥

## —♦ అనుపానావశ్యకత ♦—

శ్లో॥ వ్యాప్నోతి సర్వత్ర సమీరయోగా
దహ్నోయ వైశ్వానరరేణుకేశః।
తథౌషధం చాప్యనుపానయోగా
ద్వ్యాప్నోతి సర్వత్ర సమం శరీరే॥ ॥౪౯॥

అగ్నికణము స్వల్పమయినదయినను వాయుసహాయమునన శీఘ్రకాలమునందంతటను వ్యాపించునట్లు ఔషధమున్ను అనుపానసహాయముచే శరీరమంతటను శీఘ్రముగా వ్యాపించును. ॥౪౯॥

## —♦ లంఘనావశ్యకత ♦—

శ్లో॥ న పచ్యతే భస్మసమన్వితేగ్నా
వన్నాదికం సామకఫాదిగుప్తే।
తథైవ తస్మా జ్జఠరే జ్వరార్తా
నాదోషపక్వా దుపవాసయేత్తాన్॥ ॥౫౦॥

నిగురుచేకప్పబడిన నిప్పుయందు అన్నాదికము ఎట్లు పచనముకాదో ఆట్లే కఫాదిదోషభూయిష్టమయిన జఠరకోశమందు భుజింపబడిన అన్నాదికమున్ను జీర్ణము కాదు. ఆ ఆమాదిదోషములు పక్వమయ్యేవరకు జ్వరితులను లంఘనము చేయించవలయును. ॥౫౦॥

శ్లో॥ కఫపిత్తే ద్రవే ధాతూ సహేతే లంఘనం మహత్।
ఆమక్షయా దూర్ధ్వ మతో వాయు ర్న సహతే క్షణమ్॥౫౧॥

శ్లేష్మమును, పైత్యమును ద్రవస్వరూపధాతువులు కాన లంఘనమును సహింపగలిగియుందురు. ఆమ (అపక్వ) దోషము క్షీణించిన వెనుక కేవల శుద్ధవాతము లంఘనమును సహింపలేదు. లంఘనము జ్వరములయందు ముఖ్యచికిత్స గాన ఆలంఘనమును శరీరము సహించగలిగియుండునని తెలియవలయును. ॥౫౧॥

శ్లో॥ భావ్యా మయోపశమయోగ్యసదౌషధేన
తత్రాంతవాసిగృహ మేధిసమాశ్రయేణ।
రుగ్వ్యాకులక్షుభితరక్షణదీక్షితేన
సద్వైద్యకేన భువి కోన్య ఇహాస్తి తుల్యః॥ ॥౯౨

ముందు రోగివ్యాధులయొక్క ఉపశాంతికి అనుకూలమయిన మందులను భద్రపరచియున్నట్టియు ఆయాప్రాంతములయందు నివశించియున్న గృహస్థులకు ఆధారభూతుడయినట్టియు రోగాతురతచే క్షోభించుచు వారియొక్క రక్షణయందు దీక్షకలిగియున్నట్టియు సద్వైద్యునితో సమానమయినవాడు యీభూలోకమున యెవడు కలడు? ॥౫౨॥

—♦ లంఘనక్రమం ♦—

శ్లో॥ శుష్కోపవాసం యది సామవాతో
మందోష్ణభోజ్యం యది పిత్తరోగః।
శ్లేష్మామయశ్చే ద్ద్రవరూపహారః
ప్రోక్తా స్త్రిధా లంఘన ముక్తమేవమ్॥ ॥౯౩॥

నిరామవాతమునందు యుచితాహారమును, సామవాతమునందు శుష్కోపవాసమున్ను పిత్తరోగమందు తేలికగాను, గోరువెచ్చగానున్న ఆహారమున్ను శ్లేష్మరోగమున ద్రవరూపమయిన ఆహారమున్ను ఇవ్వవలెను ॥౫౩॥

—♦ లంఘనము పనికిరానివారు ♦—

శ్లో॥ క్షయామయే గర్భవదావృద్ధబాలై
ర్దూరం ప్రయాణ శ్రమగైః కృశాంగైః।
హృద్రోగయుక్తై ర్గ్రహణీరుగార్తై
రనౌదనం లంఘన మేవ వర్జ్యమ్॥ ॥౯౪॥

క్షయరోగులు, గర్భిణీ స్త్రీలు, పసిబిడ్డలు, దూరము నడచినవారు, క్షీణించినవారు, హృద్రోగము గలవారు, గ్రహణ్యతిసారరోగములు గలవారు వీరికి లంఘనము పనికిరాదు ॥౫౪

## —♦ సాదృశ్యకృత్యములు ♦—

శ్లో॥ స్యు ర్లంఘనే యే లఘుభోజనేస
సుప్తౌ గుణా నేత్రనిమీలనేన।
మౌనే గుణా యే మితభాషణేన
నిస్పర్శనే యే శ్రుతివేష్టనేన॥ ॥౫౫॥

లఘుభోజనము లంఘనముతోను, కన్నులు మూసుకొనుట నిద్రతోను, మిత భాషణము మౌనముతోను, చెవులుమూసుకొనుట నిర్వాతస్థితితోను సమానము.౫౫॥

## —♦ పథ్యప్రాముఖ్యత ♦—

శ్లో॥ న రోగిణో హ్యౌషధ మస్తి పథ్యా
దపథ్యక స్యౌషధ మప్యనర్థమ్।
సేవేత తత్పథ్యయుతః ప్రశస్తం
భైషజ్య మారోగ్యసుఖానుభూత్యై॥ ॥౫౬॥

రోగికి పథ్యముకంటె ఔషధము యొక్కవిశేషముయినది కాదు. పథ్యముచేయని వానికి ఔషధము ఒకానొకప్పుడు అపాయకరము. అందుచే రోగి పథ్యముచేయుచు ఆరోగ్యాభివృద్ధికొరకు తత్పానుకూలౌషధమును సేవింపవలయును. ॥౫౬

## —♦ పథ్యకాలనిర్ణయం ♦—

శ్లో॥ ఆశోషితవ్రీహిభువాం ప్రసేక
శ్శీఘ్రాభివృద్ధిం వితనోత్యవశ్యమ్
తథా దరిద్రాహారవిశోషితానాం
దద్యాత్క్రమా దన్నమయం చ పథ్యమ్॥ ॥౫౭॥

ఆరకట్టబడిన వరిచేలకు నీటిపారుదలవలన శీఘ్రాభివృద్ధి ఎట్లు కలుగుచున్నదో అప్రకారమే దరిద్రాహారముచే శోషింపచేయబడినరోగులకు అన్నమయమయిన పథ్యమున్ను క్రమక్రమముగా శీఘ్రాభివృద్ధిని కలుగజేయుచున్నది. ॥౫౭॥

—♦ అభ్యాసవస్తుప్రాముఖ్యత ♦—

శ్లో॥ అభ్యాసవ స్త్వామయవృద్ధికృద్వా
త్యాజ్యం త దభ్యాసితవస్తునైవ।
త్యక్తం తదభ్యాసితవస్తు చేత్స్యా
న్నవీనరోగాః ప్రభవంతి మానవమ్॥ ॥౫౮।

చిరకాలమునుండి అభ్యాసమై యున్నవస్తువు రోగోపశాంతికి అవరోధకమయి నదయినను దానిని రోగిచే పరిత్యజింపరాదు ఎందువల్లననగా చిరకాలాభ్యస్తమయిన వస్తుపరిత్యాగముచే రోగోత్తవికారములు కలుగునుగాన దానిని యథాప్రకారముగా సేవింపచేయవలెను ॥౫౮॥

—♦ వైద్యవృత్తాంతః ♦—

శ్లో॥ రుజ్యా యథా దోషజదుర్గుణానాం
కైర్వాఽప్యనిర్వాచ్యతయా భిషగ్భ్యః।
వార్యా స్వధీగోచరితక్రియాభి
స్తత్కాలరుక్శాంతిసమంజసాభిః॥ ॥౫౯॥

రోగములయందు ఆయా దోషానుగుణ్యముగా జనించెడు దుర్గుణములు ఎవరికని చెప్పుటకు సాధ్యములు గావు గాన ఆయా కాలములయందు సంప్రాప్తము లయిన వ్యాధులయందు వైద్యులవలన వారివారిబుద్ధికి స్ఫురించిన రోగోపసంహారోచితక్రియలచే చికిత్స చేయఁదగలయును ॥౫౯॥

శ్లో॥ ఆసేతో స్తుహినాద్రిమధ్యభువనే ష్వేక త్ర కాశ్చి త్తథై
వౌషధ్యః కతిచి త్పరత్ర కతిచిద్రోహంతి యస్మా ద్బుధాః।
తత్తత్ప్రాంతమహౌషధీభి రమితా న్గ్రన్థేషు యోగా న్జగు
స్తత్కుర్వంతి చికిత్సకాః ప్రవిపదం ప్రాప్తౌషధీభిః క్రియాః॥

సేతువుమొదలు హిమవత్పర్వతమువరకు మధ్యయందుగల ఒక ప్రదేశమందు కొన్ని రకములును, మరియొక ప్రదేశమందు మరికొన్ని రకములున్ను, ఓషధులు మొలచుచున్నవి. అందువల్లనే ఆయాస్థలములయందు సంప్రాప్తములయిన ఓషధులతో అక్కడనున్న విద్వాంసులు వివిధములయిన యోగములను గ్రంథములయందు నుడివియుండిరి. ఆ కారణముచే వైద్యులుకూడ వారువారు నివసించుప్రాంతములయందు తమకు సులభసాధ్యమయిన ఓషధులతోనే చికిత్సలను నెరవేర్చుచున్నారు. ॥౬౦॥

శ్లో॥ తద్భూమిజాశేషవనస్పతీం స్తు
నైకస్య వా జ్ఞాతు మశక్య మేవ ।
ప్రాయేణ తత్రత్యమహౌషధీనాం
చికిత్సకై ర్జ్ఞాన ముపార్జితవ్యమ్॥ ॥౬౧॥

పై కారణములవలన భూమండలమున అసంఖ్యాకములైన ఓషధులను తెలుసుకొనుట కొకానొకనికిన్ని శక్యము కాదు కాన తరచుగా వైద్యులు తమ పరిసరములయందుండు ఓషధులను తెలుసుకొనవలసియున్నది. ॥౬౧॥

శ్లో॥ సలోకదృశ్వా చతురబ్ధిమధ్యం
న సర్వవిద్యాసు సమానబుద్ధిః ।
సర్వౌషధిజ్ఞో న చికిత్సకేషు
న పక్షపాతాన్య స్వసమాశ్రితేషు॥ ॥౬౨॥

చతుస్సముద్రమధ్యగతమైన భూమినంతయు తిరిగి జూచినవాడున్ను, తనకు వచ్చిన విద్యలన్నిటియందు సమానప్రజ్ఞ కలవాడున్ను, ప్రపంచమున గల ఓషధులనన్నింటిని గుర్తెరింగిన వైద్యుడున్ను, తనను ఆశ్రయించినవారివిషయమై పక్షపాతములేనివాడున్ను ఉండడు. ॥౬౨॥

శ్లో॥ శుద్ధి ర్నిజజ్ఞాతవనస్పతీనాం
ప్రయోగసంహారపరిశ్రమశ్చ ।
వృద్ధై స్సదా స్వానుభవాచ్చ వేద్యం
గ్రంథై స్స్వశక్త్యా సతతం భిషగ్భిః॥ ॥౬౩॥

వైద్యుడగువాడు తనచే తెలుసుకొనబడిన ఓషధులయొక్క శుద్ధిన్ని ప్రయోగోపసంహారవిధానమున్ను పెద్దలవల్లనుంచిన్ని, స్వానుభవమువల్లనుంచిన్ని గ్రంథవిమర్శనవల్లనుంచిన్ని తన బుద్ధికుశలత ననుసరించి, తెలుసుకొనుచుండవలెను.

శ్లో॥ దివ్యౌషధీనాం బహవః ప్రభావా
బృందారకానా మివ విస్ఫురంతి ।
తత్తా స్వ్విదిత్వైవ చరే చ్చికిత్సాం
సంభావ్య తత్స్థావరజౌషధీనామ్॥ ॥౬౪॥

దేవతలకు వలెనే ఓషధులకును, అసంఖ్యాకములయిన ప్రభావములు కలిగియున్నవి. కాన వాటిని బాగుగా తెలుసుకొని ఊహచే చికిత్స చేయవలయును.

శ్లో॥ ద్రవ్యేషు యోగే ష్వపి చౌషధీషు
నాస్త్యేవ సంఖ్యా వివిధేషు లోకే ।
జ్ఞాతాని తద్యేన తు యాని యాని
తై రేవ కుర్యా దఖిలాం చికిత్సామ్॥ ॥౬౫॥

బహువిధములైన ద్రవ్యములు, ఔషధయోగములు, ఓషధులు నివి యసంఖ్యాకములైనందున యొకనిచే ఏవి తెలుసుకొనబడినవో వాటిచేతనే యావత్తు చికిత్సలను నెరవేర్చవలెను. ॥౬౫॥

శ్లో॥ ఏకస్మి న్బిందా వణవో యావంత్య స్సంత్యమీ యథా ।
న శక్యా వక్తు మోషధ్యా గుణా అపి సవిస్తరమ్ ॥౬౬॥

ఒక్క నీటిబొట్టునందుగల అణువులను చెప్పుట కెటులు శక్యము కాదో అటులే నొక యోషధియం దెన్ని గుణములు కలవో వాటిని పూర్తిగ చెప్పుట శక్యము కాదు ॥౬౬॥

శ్లో॥ వృక్షేషు చారోహణ మప్సు తార్ణం
చేపేషు లక్ష్యం పరమం స్వరేషు ।
అభ్యస్య సూక్ష్మేషు యథైవ పశ్చా
త్కృతీ భవే జ్జాయుషు చ క్రియాసు॥ ॥౬౭॥

సూక్ష్మమైయున వృక్షములయం దారోహణమును (ఎక్కుటను) ఉదకములయం దీదుటను, బాణములయందు లక్ష్యమును, అక్షరములయం దుచ్చారణమును, మున్ముందుగ అభ్యసించి పిమ్మట నేర్పరు లెట్లగుచున్నారో అప్రకారమే ఔషధములయందును చికిత్సలయందునుకూడ నేర్పరులు కాగలరు. ॥౬౭॥

శ్లో॥ అనామవి న్మోమహా ముపైతి వైద్యో
న వేత్తి పశ్య న్నపి భేషజాని ।
క్రియాక్రమో భేషజమూల ఏవ
తద్భేషజజ్ఞాన ముపార్జితవ్యమ్॥ ॥౬౮॥

ఔషధములను జూచుచు వాటిపేర్లను తెలియజాలని వైద్యుడు విమనస్కుడగుచున్నాడు. చికిత్సావిధాన మంతయు ఔషధములయం దాధారపడియున్నది. కాన ప్రతివైద్యునిచేతనున్ను తనబుద్ధి కలోంగినంత ఔషధవిజ్ఞానము సంపాదింపతగియున్నది. ॥౬౮॥

శ్లో॥ గోపైః కాననవాసిభిః స్తదితరై ర్వైద్యక్రియాకోవిదైః ।
ర్వ్యాఘ్రై స్తాపసిభిః ప్రసిద్ధపథికై ర్దేశాటనై ర్భిక్షుకైః ।
స్వాజ్ఞౌషధ్యభిధానవర్ణఛదనవ్యక్తిప్రమాణాకృతీ
ర్జాత్వా గ్రంధవిమర్శనేన విషయా న్విందా ద్భిష గ్భేషజమ్॥

పశుకాపరులు, వనవాసులు, వీరికంటె ఇతరులయినవారు, వైద్యవిశారదులు, యెరుకలవాళ్లు, రోగులు, తెరువరులు, దేశాటనముచేయువారు, భిక్షాటనముచేయువారు, వీరివల్లనుంచి తనకు తెలియని ఓషధులయొక్క పేర్లను, జాతులను, ఆకులపోలికను, చెట్లు లేక తీగెలయొక్క స్వరూపస్వభావాదులను తెలుసుకొనుచు, వైద్యుడగువాడు గ్రంథవిమర్శనముచే వివిధములగు ఔషధములు తెలుసుకొనుచుండవలెను.

శ్లో॥ స్వజ్ఞాతై రఖిలై ర్యథేష్ట మపి సద్వైద్యాః ప్రశాంతిం రుజాం ।
కుర్వం త్యౌషధసంగ్రహైశ్చ వివిధై స్సర్వౌషధీసంగ్రహైః ।
ఆయుర్వేదవిపశ్చితాం కుశలినాం ప్రాంతౌషధీజ్ఞానినామ్
నస్యా త్పణ్యసమాహృతాఖిలవిధ వ్యాధ్యౌషధాప్తి ర్వ్యథా॥ ౭౦॥

ఆయుర్వేద వైద్యులు తమకు తెలిసిన వివిధ ఓషధులచేతను, వివిధౌషధములచేతను, రోగోపశాంతిని జేయుచున్నారు. తమ తమ ప్రాంతములయందుగల ఓషధీపరిజ్ఞానము కల వైద్యునకు బజారునుండి రోగోపశాంతి కనకూలమైన మందులను తీసుకొనురావలెనను క్లేశ ముండదు ॥౭॥

శ్లో॥ స్వస్మి న్న తృప్తా న్విసృజంతు తృప్తా
న్యత్నేన సాధు చికిత్సయంతు ।
స్వానిష్టవైద్యా ద్దురితం న కించి
త్స్వస్యేష్టవైద్యా త్సుకృతం న కించిత్॥ ॥౭౧॥

వైద్యుడు తన చికిత్సయందు సంతుష్టిలేని రోగులను విడిచిపెట్టవలెయును. (అనగా అన్యనిర్బంధముచేతనయినను అట్టివారికి చికిత్స చేయకూడ దనుట) తనచికిత్సయందు సంతుష్టిగల రోగులను చక్కగా చికిత్సింపవలెను తనయందు తుష్టిలేనివారికి చికిత్సచేయుటకంటె దోషమున్న, తనయందుగు తుష్టికలవారికి చికిత్సచేయుటకంటె సుకృతమున్న కంటె మరొకటి లేదు ॥౭౧॥

శ్లో॥ వైద్య స్సర్వామయవ్యాపి యదుక్తం దోషలక్షణమ్ ।
దర్శనస్పర్శనప్రశ్నైః ప్రత్సమ్య గుపలక్షయేత్॥ ॥౨౨॥

వైద్యు డగువాడు సర్వరోగములయందును అన్నికాలములయందు వ్యాపించియున్న దోషలక్షణములను విమర్శించుట, రోగిని చూచుట, రోగిని స్పృశించుట, రోగితో సంభాషించుట, మొదలయినవాటిచే రోగమును కనిపెట్టవలెను ॥౨౨॥

శ్లో॥ కఫప్రకోపే వమనం స నశ్యం
విరేచనం పిత్తభవే వికారే ।
వాతాధికే వస్తివిశోధనం చ
సంసర్గదోషేషు యథోచితేన॥ ॥౨౩॥

కఫము వృద్ధిచెందినప్పుడు నశ్యముతోకూడిన వమనమును, పిత్తము వృద్ధిచెందినప్పుడు విరేచనమును, వాతము వృద్ధిచెందినప్పుడు వస్తికర్మనున్ను ద్వంద్వరోగములయందు యథోచితచికిత్సలనున్ను చేయవలయును ॥౨౩॥

శ్లో॥ క్రియాం కఫఘ్నా మనిశం చ కుర్యా
చ్చికిత్సక స్సన్నిషు జాగరూకః ।
క్షీణే కఫే సత్యఖిలే క్రమేణ
దోషోఽవశిష్ట స్స్వయ మేవ శామ్యేత్ ॥ ॥౨౪॥

వైద్యుడు సన్నిపాతరోగములయందు మిక్కిలిజాగరూకతతో శ్లేష్మహరచికిత్సలను చేయవలెను కఫము కనుపించకుండినను కఫహరచికిత్సను తప్పక చేయవలయును. ఏలననగా సన్నిపాతవ్యాధులయందు కఫదోషము విశేషముగా హరించిన వెంటనే మిగిలినదోషములన్నియు నాటంతట అవియే శాంతినిపొందెడు స్వభావము కలవైయున్నవి ॥౨౪॥

శ్లో॥ ద్విధా చోపక్రమ స్తేషాం తర్పణం చాఽపతర్పణం ।
బృంహణం లంఘనం చేతి తత్పర్యాయ ఉదాహృతః ॥౨౫॥

సర్వవిధరోగములయందును తర్పణము, అపతర్పణము అను రెండుక్రియలను చేయవలయును. బృంహణము, లంఘనము అనునవి తర్పణము అపతర్పణము అను వాటికి నామాంతరములు ॥౨౫॥

శ్లో॥ బృంహణం య స్బృహా త్వాయ లంఘనం లాఘవాయచ।
బృంహణం లాఘనం వాతపి త్తశ్లేష్మోచితం చరేత్॥ ॥౭౯॥

పుష్టికొరకు బృంహణక్రియ లాఘవముకొరకు లంఘనక్రియ చేయించవల యును. వాతపిత్తశ్లేష్మరోగములయందు యధోచితమయిన బృంహణ లంఘనక్రియ లను చేయించవలయును. ॥౭౯॥

శ్లో॥ రోమకోపే ఘనేల్పే చ పూర్వం నాడీం పరీక్షయేత్।
ఆదావంతే స్థితి స్తస్యా విజ్ఞేయా భిషజా స్ఫుటమ్॥ ॥౭౭॥

వైద్యుడు వాతపిత్తకఫములలో ఇది అధికముగానున్నది, ఇది తక్కువగాను న్నది అను విషయమును తెలుసుకొనుటకై నాడిని పరీక్షించి ఆనాడియొక్క ఆ ద్యంతస్థితిని తెలుసుకొనుచుండవలెను ॥౭౭॥

శ్లో॥ ఆదౌ సర్వేషు రోగేషు నాడీం జిహ్వాం చ మూత్రకమ్।
లఘుత్రియం విదిత్వైతత్ పశ్చా ద్వ్యగ్నం చికిత్సయేత్॥ ॥౭౮॥

సర్వరోగములయందును ముందుగా నాడి, నాలుక, మూత్రము వీటిని పరీ క్షించి చికిత్సచేయవలెను దీనినే లఘుత్రియ మని చెప్పుదురు ॥౭౮॥

శ్లో॥ ప్రతిక్రియాయాం వైద్యైః కృతాయాం
అన్యో న కుర్వీత పున శ్చికిత్సామ్।
ప్రతిక్రియా ద్వంద్వకృతా యది స్యా
త్సాంకర్యతా మేత్య నిహంతి రుగ్ణమ్॥ ॥౭౯॥

ఒకరోగికి ఒకవైద్యుడు చికిత్సచేయుచుండగా ఇంకొక వైద్యుడు చికిత్స చే యకూడదు. ఇద్దరువైద్యులచే చికిత్సచేయబడినయెడల అట్టిచికిత్స సాంకర్యమును పొంది ఒకానొకప్పుడు రోగులను చంపును ॥౭౯॥

శ్లో॥ అశ్లేష్మకశ్లేష్మ మవాతకోనిలం
భ్రామ్య త్యపిత్తో హ్యతిపిత్త మాత్మనః।
తదా చర న్నామయి లక్ష్యసత్క్రియ
స్మిథశ్చరే ద్భ్రాంత్యతిరేకసాధనమ్॥ ॥౮౦॥

శ్లేష్మరోగము కానివాడు తనకు శ్లేష్మరోగమనియు, వాతరోగము కానివాడు తనకు వాతరోగమనియు, పిత్తరోగము కానివాడు పిత్తరోగమనియు, భ్రమచెం

శ్లో॥ నివార్యతే త్రాణ్య మయైవ రోగో
నాన్యత్ర గచ్ఛే దితి తైర్నవాచ్యః।
గచ్ఛం త్వత్రుప్తా యది చేత్పున స్తే
ప్రత్యాగతా స్సత్క్రియయాదృతవ్యాః॥ ।౮౪॥

యీరోగము తప్పక నాచే నివారణచేయబడుచున్నదిగాన ఇంకొక వైద్యుని బద్దకు వెళ్ళరాదు అని ఎవరిని అపకూడదు తనచికిత్సయందు యిష్టములేనివారు వారి వారి యిష్టానుసారము చికిత్సకులబద్దకు వెడలుదురుగాక అట్లు వెళ్ళినవారు ఒకానొకప్పుడు చికిత్సావిషయమై తిరిగి తనదగ్గరకేవచ్చినయెడల నిస్సంశయముయిన మనస్సుతో జాగ్రతగా చికిత్సచేయవలయును. ॥౮౪॥

శ్లో॥ చికిత్సకో వాహనమంతరేణ
న క్వాపి గచ్ఛేత్పథి పాదచారీ।
తత్రాపిగచ్ఛే దసహాయక స్స
న్నాసాయ మారభ్య తథోదయాంతమ్॥ ॥౮౫॥

వైద్యుడెన్నడును వాహనము (శకటాదులు) లేకుండ పాదచారియై చికిత్సకు బయలుదేరకూడదు రాత్రిభాగములయందు అట్టివాహనములపయినికూడా సహాయములేక ఒంటరిగా వెడలరాదు ॥౮౫॥

శ్లో॥ వర్షాంధకారే ప్రబలాతపేవా
రాత్రౌ దినే పర్వణి పైతృకే వా।
స్వాస్వస్థతాయాం విషమస్థితౌ వా
పరార్థసంధానవిధిః ప్రధానః॥ ॥౮౬॥

చికిత్సకునియొక్కజీవితము వర్షము, కటికచీకటి, మెుండిఎండలు, రాత్రి, పగలు, పర్వకాలము, పైతృకదినము, తాను అస్వస్థుడైవుండుకాలము, అనివార్యమయిన చిక్కుస్థితులు వీటియందుకూడా యితరులయొక్క యోగక్షేమమునిమిత్తము పాటుపడుటయే ప్రధానముగాకలది. ॥౮౬॥

శ్లో॥ ఆహృత్యౌషధ మన్యత స్తు కురుతే వైద్య శ్చికిత్సా మసౌ
ప్రాప్నో త్యేవ యదా కదాచి దపి వా నిస్సంశయం వంచనామ్
తస్మా దస్యసమాహృతౌషధచికిత్సాయా స్స్వకీయౌషధం
ప్రాశస్త్యం గుణదాయకం సముచితం దాతుం యథాశక్తితః॥

యితరులవద్దనుంచి మందులు తెచ్చిచికిత్సచేయువాడు వాటిప్రాశస్త్య (ప్రాశస్త్య)ములను తెలుసుకొనజాలనందున ఎప్పుడో ఒకప్పుడు పరాభవమును పొందవలసివచ్చును. కాన సాధ్యమయినంతవరకు వైద్యుడగువాడెల్ల తాను స్వయముగా చేసుకొనినమందులనే వాడవలయును. దానివలన మందులకు ప్రాశస్త్యమున్న గుణాధిక్యతయు (గుణమును కనిపెట్టుకొనుటకు తగినసావకాశము) తనకు కర్తవంచన లేకుండా అందరికి మందులను ఉచితముగా పంచిపెట్టుటకువీలున్నూ కలుగుచున్నది ॥౮౭॥

శ్లో॥ రుజ స్స్వభావా ద్గతినా స్థితే శ్చ
తత్త్వానుసారేణ తదన్యహేతోః।
మాత్రాప్రమాణం పరికల్పనీయం
క్రియాసు వైద్యేనసదామయానామ్॥ ॥౮౮॥

రోగస్వభావము స్థితిగతులు రోగియొక్క తత్త్వము ఇంకను తాత్కాలికములైన యితరగుణములు వీటిననుసరించి మోతాదులయొక్క పరిమాణమును నిర్ణయించవలయును ॥౮౮॥

శ్లో॥ సమ్యగ్విచార్యౌషధదేశకాలాన్
వపు ర్వయ స్సాత్మ్య బలాగ్నిమత్త్వమ్।
వికారహేత్వాకృతిసాధ్యతాంశ్చ
తత శ్చికిత్సే ద్భిష గామయార్తాన్॥ ॥౮౯॥

వైద్యుడు ఔషధమును దేశము, కాలము, శరీరము, వయస్సు, సాత్మ్యధర్మము, బలము, జఠరాగ్ని వికారహేతువులు, ఆకారము, సాధ్యత్వము వీటినిబాగుగా తెలుసుకొని రోగులకు చికిత్సచేయవలెను. ॥౮౯॥

శ్లో॥ నిర్మాణకాలే భిషగౌషధానాం
దద్యా ద్విషా ణ్యంతత ఏవ ఖల్వే।
ఏవం ప్రమాదా ద్యదివా ద్వివారం
విషానుసంధానవిధి ర్నభూయాత్॥ ॥౯౦॥

ఔషధములను తయారుచేయునపుడు ఖల్వములో విషపదార్థములను అన్నివస్తువులకంటె చిట్టచివరగ వేయవలయును అప్రకారముగా విషపదార్థములను చిట్టచివర వేయుటవలన పొరపాటుచేతనయినను రెండవసారివేయుట తటస్థపడదు. ॥౯౦॥

శ్లో॥ స్యాదౌషధానాం విషమప్రదానా
ద్విజాం విరుద్ధౌషధసంప్రదానాత్।
ప్రాణస్య హానిః ప్రభవేత్కదాచి
త్తస్మాదనాలోచనయా న కుర్యాత్॥ ॥౯౧॥

పొరబాటున ఒకమందుకు బదులుగా ఇంకొకమందు ఇచ్చుట, రోగమునకు సరిపడని (అపాయస్థితిని కలుగజేయు) మందు ఇచ్చుట వీటివలన ఒకానొకప్పుడు ప్రాణాపాయము తటస్థపడగలదు. కావున ఈపనులను చేయునపుడు బహుశ్రద్ధతోను ఆలోచనతోను చేయుచుండవలెను. ॥౯౧॥

శ్లో॥ మానే తులాయాం చ సిరూపణే వా
విశ్రాణనే ప్యౌషధసంగ్రహాణామ్।
భూయాద్భిషక్కల్పితజాకరూక
శ్శ్రద్ధాళు రత్యంతశుచి స్సుశీలః॥ ॥౯౨॥

ఔషధములలో వేయు ద్రవ్యములనుగాని, ఔషధములనుగాని కొలుచుట తూచుట ఔషధములను తయారుచేయుట రోగులకుమందిచ్చుట, వీటియందు వైద్యుడు మిక్కిలిజాగ్రతతోను శ్రద్ధతోను, సదాచారసంపత్తితోను (తనకులాచారధర్మముతోను) నుంచిమనస్సుతోను ఉండవలయును. ॥౯౨॥

శ్లో. దోషోపశాంత్యై పరిదీయమానం
వినా న శిష్యాయ బహిః ప్రకాశ్యం
యత స్త్రిదోషాజ్ఞతయా జడానాం
తత్తచ్చికిత్సాభి రపభ్రమంతే॥ ॥౯౩॥

వైద్యుడు చికిత్సచేయుచున్నప్పుడు రోగులకిచ్చెడు మందులను తనశిష్యులకు తప్ప తదితరముల కెవ్వరికిని తెలియనివ్వరాదు. ఎందువల్లననగా వైద్యులుకానివారు త్రిదోషతారతమ్యములను గుర్తింపజాలక యీమందులపేర్లు జ్ఞప్తియందుంచుకొని వారివారియిళ్ళయందుగాని వారిప్రాముఖ్యతగల మరియొకచోటగాని మూఢచికిత్స నుచేయనుద్యమింతురు ॥౯౩॥

శ్లో॥ కుర్యాచ్చికిత్సాం వ్యవహారమేవ
శాస్త్రం వినా జ్యోతిష మప్యనశ్యమ్।
పురోహితత్వం సతు విప్రహైవ
శాస్త్రం ప్రియత్నేన విచారయేత్తత్॥ ॥౯౪॥

వైద్యము, వ్యవహారము, జ్యోతిషము, యాజ్ఞికము యీనాలుగింటిని శాస్త్ర సాంప్రదాయమును తెలియకచేసినవానికి బ్రహ్మహత్యాదోషము గలుగుచున్నది. కాన వీటిని నెరవేర్చువారు ఆయాశాస్త్రజ్ఞానసంపన్నులయి యుండవలయును.

శ్లో॥ జ్ఞాతాని యావం త్యపి తేభ్య ఏవ
జ్ఞేయాని సర్వస్య బహూని తస్మాత్।
ప్రయోగసంహారవి దల్పజాయు
శ్లాఘ్యో న భిజ్ఞాదిక జాయుగుప్తేః॥ ॥౯౫॥

లోకమున సామాన్యముగా ప్రతివారికిన్ని తెలుసుకొనబడినవిషయములకంటె తెలుసుకోతగినవిషయములే ఎక్కువగానుండును, కాన ప్రయోగోపసంహారవిధానము తెలియబడని పలువిధములైన ఔషధములను జాగ్రత్తపెట్టినవానికంటె ప్రయోగోపసంహారములు చక్కగా తెలియబడిన స్వల్పసంఖ్యాకములైనమందులను, జాగ్రతపెట్టినవాడే కొనియాడదగినవాడు. ॥౯౫॥

శ్లో॥ ఆహ్వానకారీ మను తేఽవమాన
మనాగమేఽన్యానయనే తదర్థే।
ఆహూయమాన శ్చ తత స్సుఖార్థీ।
నేచ్ఛే ద్ద్వయో దాత్మ సుఖం కదాపి॥ ॥౯౬॥

ఒకపనిని నెరవేర్పవలెనన్న యిద్దరునాయకులచే ఆపని ఎన్నడు సాంతముగా నెరవేర్పబడదు యెందువలననగా పిలిచినప్పుడు వెళ్ళనిచో పిలిచినవాడు అవమానమును పొందుచున్నాడు. పిలవబడినవాడు వెళ్ళేసరికి ఆపనినిమిత్తము ఇంకొకడు వచ్చినచో వెళ్ళినవాడు అవమానమును పొందుచున్నాడు కాన సుఖాభిలాషగలవాడు ఒకపనినిమిత్తము యిద్దరునాయకులను యెన్నడు నియమింపరాదు. ॥౯౬॥

శ్లో॥ వైద్యే వర స్స్వార్థనిరర్థకారీ
ప్రాకౌషధార్థగ్రహణప్రవీణః।
ఆహ్వానమాత్రాగమనానుకూల
స్స్వాచారనిద్రాశనవర్జితాత్మా॥ ॥౯౭॥

తనస్వంతపనులను పాడుచేసుకొనువాడు, ముందుగానే ఔషధమూల్యమును రాబట్టుకొనునేర్పుకలవాడు, పిలచినతోడనే వెంటబయలుదేరివచ్చువాడును, ఆచారమును విడిచిపెట్టినవాడును వేళకు నిద్రాహారముల నపేక్షింపనివాడును వైద్యము చేయుటకు తగినవాడు. ॥౯౭॥

శ్లో॥ నిర్ణీతవిత్తస్య చ రోగశాంతి
ప్రశస్తవీర్యౌషధిసంగ్రహాప్తిః।
అనిశ్చితస్యౌషధయోగ్యమూల్య
ప్రాప్తి ర్ద్వయం దుర్లభ మేతదేవ॥ ॥౯౭॥

ద్రవ్యనిర్ణయముచేసుకొని వైద్యముచేయించుకొనువానికి రోగోపశాంతికి అనుకూలమైనమందున్ను ద్రవ్యనిర్ణయముచేసుకొనక వైద్యము చేశినవానికి మందుకు తగినఖరీదున్ను యీరెండు తటస్థపడుట దుర్లభమయినసంగతి అయివున్నది. ॥౯౭

శ్లో॥ వ్యాపారచరమే సంధి స్సద్వైద్యానయనం తథా।
వ్యాధా వసాధ్యేసద్బుద్ధి ర్వేదాంతపరిభాషణే॥ ॥౯౯॥

వ్యాపారాంతమునందురాజీపడుటయు, వ్యాధి అసాధ్యమయినతర్వాత అనుకూలమయినవైద్యుని తీసుకువచ్చుటయు, వేదాంతప్రసంగముచేయుసమయమున సద్బుద్ధియు యివి సామాన్యముగా లోకమందు ప్రాయికములు అయివున్నవి ౯౯.

శ్లో॥ యావ త్ప్రదాస్య త్యఖిలౌషధాని
యావ త్స్వయం గచ్ఛతి రోగిసద్మ।
యావన్న పృచ్ఛ త్యణువామహ ద్వా
కేచి త్ప్రశంసంతి చికిత్సకం తమ్॥ ॥౧౦౦॥

మందులను పంచిపెట్టుచున్నంతకాలమున్ను రోగులను తనంతటతానేవెళ్ళి చూచుచుండునంతవరకున్ను స్వల్పముగాగాని అధికముగాగాని ప్రతిఫలమును కోరనంతవరకున్ను కొంతమంది వైద్యుని పొగడుచుందురు ॥౧౦౦॥

శ్లో॥ తక్రాగారదధేనుదాసగురుసద్వైద్యాదిషు ప్రాయతే
స్వార్థాదౌ బహుగౌరవాతిశయితా మధ్యే ప్యుదాసీనతా।
స్వార్థాంతే కుటిలస్వభావపరతా విస్మృత్య పూర్వాదరం
తచ్చింత్యంనహితత్రితత్రిభగవా న్ద్విత్రాన్కృతజ్ఞాన్సృజేత్॥

మజ్జిగపోసినవారు, కాపురముండుటకు ఇల్లు ఇచ్చినవారు, పశువులు, సేవకుడు, సత్పురుషులు, గురువు మొదలయినవారు వీరియందు ప్రారంభమున అధికగౌరవమును, మధ్యకాలమున సామాన్యగౌరవమును, (ఉదాసీనభావమున్ను) తుదకు అపహానబుద్ధియుకలిగి మొదటిమేలును మరచిపోవుదురు. ఇట్లని విచారింపవలసినపనిలేదు షడ్గుణైశ్వర్యసంపన్నుడయిన విధాత అక్కడక్కడ ఇద్దరినో ముగ్గురినో మొదటిమేలునుమరచిపోని కృతజ్ఞులనుకూడా సృజించియేయుండును. ॥౧౦౧॥

శ్లో॥ అవిశ్వాసాపగమనం సవిశ్వాసాగమా న్మహాత్।
ద్వితీయం పుత్రికాతుల్యం త్వాద్యం పుత్రసమం విదుః॥ ౧౦౨॥

తమయందు విశ్వాసములేనివారు (తమవద్దకు చికిత్సకు రాకుండ వెళ్ళిపోవుట-విశ్వాసముగలవారి రాకకంటె గొప్పగా ఎంచబడుచున్నది వీటిలో మొదటిది పుత్రజననతుల్యము రెండవది పుత్రికా జననతుల్యము. ॥౧౦౨॥

శ్లో॥ కష్టం భిషగ్జీవిత మన్యదుఃఖతః
శోచ త్యహోరాత్రమపి స్వయం యతః।
రోగీ మృతశ్చే ద్భిషగేవ మారకో
జీవత్యసౌ దైవవశం వదంతి యత్॥ ॥౧౦౩

నిరంతరము యితరులకు సంప్రాప్తమయిన దుఃఖముతో దుఃఖించుచుండువైద్యులయొక్క-జీవితము మిక్కిలి కష్టమయినదయియున్నది. రోగి మృతినొందినచో చంపినవాడు వైద్యుడే అనియు, జీవించినచో దైవయోగము బాగున్నందున జీవించినాడనియు చెప్పుదురు. ॥౧౦౩॥

శ్లో॥ స్యా దేకధేను ర్గృహిణీద్వయంచ
గ్రామాంతరే సేవ్య మమాయకత్వం।
అప్రార్థితోపాయ నివేదకత్వం
భిషగ్ద్వయం రాజయుగం సుఖఘ్నాః॥ ॥౧౦౪॥

ఒకఆవునుమాత్రమే మేపుట (యిరుగుపొరుగునకు పిల్లపాలు, పథ్యపువారి మజ్జిగతేట గోమయము, వీటికి ఉపయోగించును ఎవరికయినా ఒకరికి వీటివిషయమై లోటువచ్చుటయు, వారితో వివాదపడుటయు తప్పదు మేపినఆసామీకి పేడకూడ మిగలదు) ఇద్దరుభార్యలను వివాహముచేసుకొనుట, ఊరిపక్కవూళ్ళో వ్యవసాయముచేయుట, మాయతెలియకుండా సంచరించుట, (యదార్థవాదము మొదలయినవి) పరోపకారబుద్ధితో ఎదటివారు తనను అడగకపోయినను వారివద్దకేగి వారికిహితబోధచేయుట, ఇద్దరువైద్యులచే వైద్యము చేయించుట, సమానస్థాయీగా యిద్దరు ప్రభువులతో సంబంధము కలిగియుండుట ఇవి యెప్పటికయినను సుఖమునకు భంగము కలుగచేయునవై యున్నవి. ॥౧౦౪॥

శ్లో॥ ప్రతిఫలరహితం స్యాద్వ్యాపకం యస్య లోకే
క్షణమపి నహి తస్య వ్యాపక స్స్యావకాశః॥
ప్రతిఫలవిషమం స్యాద్వ్యాపకం యస్య పుంసః
క్షణమపి నహి తస్య వ్యాపక స్స్యావకాశః॥ ॥౧౦౫॥

ప్రతిఫలాపేక్ష లేనివానియొక్క వ్యాపకమునకు క్షణమయినను సావకాశముకలిగియుండును విపరీతమయిన ప్రతిఫలాపేక్షకలవానికి ఒక్కక్షణమయినను వ్యాపకముచేయవలసినపని ఉండదు. ॥౧౦౫॥

శ్లో॥ జ్ఞాతా సుధీర్వా యది మోహమేతి
వ్యామోహకాడంబరపుంశ్చలీషు॥
వివాహ వైద్యవ్యవహారగోషు
క్షిప్తలోకోపి తథైవ కాలే॥ ॥౧౦౬॥

సర్వసామాన్యముగా మోహమును కలుగచేయు పటాటోపముగల వ్యభిచారస్త్రీలయందు, పరిజ్ఞాతలయినవారికికూడ వ్యామోహముకలిగినట్లు స్వతస్సిద్ధమయిన తొట్రుపాటుకల లోకమున్ను వివాహము, వైద్యము, వ్యవహారము, పశువులు వీటివిషయమయి మోహమునుపొంది మోసపోవుచున్నారు. (ఇది సర్వానుభవసిద్ధము)

శ్లో॥ తిరస్కరిణ్యా మపవిప్లవాయాం
అనేకచిత్రాకృతికంపనంచ।
స్త్రీవేషకే పుంసి భజంతి నాట్యం
తథాభిషగ్వేషధరే చికిత్సామ్॥ ॥౧౦౭॥

తెర నిశ్చలమయినదని ఎరిగియుండియు దానియందు అనేకవిధములయిన ప్రతిమలయొక్క చలనమును, స్త్రీవేషధారియగు నటకుడు పురుషుడని ఎరిగియుండియు వానియొక్క నాట్యమును చూచుటకు ఎట్లు సిద్ధపడుచున్నారో అట్లే సద్వైద్యుడు కాని వైద్యవేషధారియొక్క చికిత్సకును సిద్ధపడుచున్నారు. ॥౧౦౭॥

శ్లో॥ జాయుష్వసత్స్వేవ చికిత్సకైశ్చ
ప్రయోగసంహార వివేకమూఢైః।
కృతక్రియావ్యత్యయమానభాగ్భి
ర్భ్రష్టా భృశం వైద్యకలా త్రిధైవమ్॥ ॥౧౦౮॥

మందులులేకుండా చికిత్సకు సిద్ధపడువారు కొందరు, ఔషధములయొక్క

ప్రయోగోపసంహారపరిచయములేనివారు కొందరు, చేసినవైద్యమునకు తగినసన్మాన
ము జరగనివారుకొందరు వీరిచే చికిత్సావిధానము క్షీణించుచున్నది ॥౧౦౮॥

శ్లో॥ వైద్యే వ్యాధినివారణం సముదితప్రత్యక్షజం జ్యౌతిషే
పాండిత్యావసరో నచాస్తి హి తయో రూనాధికవ్యాకృతిః।
ఏతద్భిన్నకలాసు పాండితిగపి న్యూనాధికత్వాదికమ్
తత్కాలానుభవప్రధానఫలితాభావా ద్బుధై ర్గణ్యతే॥౧౦౯॥

వైద్యమునందు వ్యాధి త్వరలో నివారణయగుటయు, జ్యోతిషమునందు చెప్పినఫలితము ఋజువునకు సరిపడుటయు ముఖ్యవిషయములైయున్నవి. గాన యీ రెండుశాస్త్రములయందును పాండిత్యప్రకర్షతోను చిన్నపెద్ద తారతమ్యముతోను పనిలేదు. వీటికంటెభిన్నములయిన శాస్త్రములయందు తాత్కాలికఫలితము కనుపించనందున పాండిత్యప్రకర్షయు, చిన్నపెద్దలతారతమ్యమును పరిగణింప తగినవైయున్నవి. ॥౧౦౯॥

శ్లో॥ జ్యోతిర్వైద్యవ్యాపకాలంబనేన
స్వచ్ఛందాత్మా మాన్యవృత్తి స్సమేభ్యః।
యాతీ త్యల్పః పామరోవా మహత్త్వం
తావన్మాత్రా ద్జాయతే తన్మహత్త్వం॥ ॥౧౧౦॥

అందరికంటె చిన్నవయస్సుకలవాడుకాని కులహీనుడుకాని జ్యోతిర్వైద్యశాస్త్రప్రసక్తి కలిగినంతమాత్రముచే తనసంవారిలో స్వేచ్ఛాజీవనముకలవాడయి సన్మానమును పొందుచున్నాడన్నమాట యేదికలదో దానివల్లనుంచే ఆయాశాస్త్రములయందుగల అధిక్యత తెలియబడుచున్నది ॥౧౧౦॥

శ్లో॥ ఆయుర్వేదోఽత్యంతశస్తశ్చికిత్సా
విధావితి ప్రత్యహా మేవ సర్వైః।
ప్రశంసితోవాపి విసృజ్యతేహి
వేదాశ్చ శాస్త్రాణి యథా ప్రజాభిః ॥౧౧౧॥

చికిత్సావిధానములో ఆయుర్వేదచికిత్సకంటె ప్రశస్తమయినచికిత్స యింకొకటిలేదని ప్రజలచే ఎల్లప్పుడూ కొనియాడఁబడుచున్నను సకాలములయందుమాత్రము వేదశాస్త్రములవలెనె విడిచిపెట్టబడుచున్నది. ॥౧౧౧॥

శ్లో॥ ఖడ్గాఽభిఘాతా దపి జాత్వమృత్యో
సూచిప్రవేశా న్నమృతి స్తథాపి।
శస్త్రాలయాఽశిక్షితవైద్యకై స్త
త్సూచిక్రియా జాత్వపి నైవకార్యా॥ ॥౧౧౨॥

ఒకానొకప్పుడుఖడ్గప్రవాహామువల్లకూడా మృత్యువు కలుగుటలేదు. అట్టిస్థితి లో సూదిని శరీరమందుగుచ్చినంతమాత్రముచే ప్రాణాపాయమురాదు. ఇట్లని శస్త్రా లయశిక్షితులుగానివారు యింజక్షను యెన్నడుచేయకూడదు. ॥౧౧౨॥

శ్లో॥ సదౌషధా దస్త్వనివారితారు
గ్విషప్రయోగాన్మృతి మేతి నూనం।
సమాన మేత త్సకలాగదేషు
ప్రావీణ్యతా మేత్య చరేత్క్రియాం తత్॥ ॥౧౧౩॥

మంచిమంచిమందులవలన రోగము కుదరకపోవచ్చునుగాని విషప్రయోగము వలన ప్రాణముతప్పకపోవును ఇందుకుసందేహములేదు. ఈవిషయము అన్నివిధము లయిన మందులయందును సమానమే గాన చికిత్సాప్రావీణ్యతను సంపాదించిన పిదప చికిత్సచేయుట ప్రారంభించవలెను ॥౧౧౩॥

శ్లో॥ కువైద్యజోపద్రవశాంతి రేవ
కష్టం భవేద్యోగ్యచికిత్సకస్య।
స్వాభావికవ్యాధినివారణా
త్త ద్గ్రాహ్యం నజాత్వౌషధ మజ్ఞ వైద్యైః॥ ॥౧౧౪॥

మూఢవైద్యులుచేసిన చెడు చికిత్సవలన సంభవించెడు ఉపద్రవములను మరలించుట స్వాభావికమయిన వ్యాధిని కుదుర్చుటకంటె మిక్కిలికష్టమయినది. గాన మూఢవైద్యులవద్దమందు ఎన్నడును పుచ్చుకొనరాదు. మూఢవైద్యులయందు వెర్రినమ్మకముకలవారు చెడుచికిత్సచే కలిగిన ఉపద్రవమునుకూడ వ్యాధియొక్క స్వభావమేఅని తలంచుచుందురు. ॥౧౧౪॥

శ్లో॥ కష్టం చతుష్షష్టికలాసు వైద్యం
సర్వం పరప్రేక్ష్య మముత్ర యస్మాత్।
క్రియాప్రవీణోపి న సావకాశో
జాయుప్రయోగస్య వినాస్యతృప్తిమ్॥ ॥౧౧౫॥

అరువదినాలుగువిద్యలలోను వైద్యవిద్య ఒక్కటిమాత్రమే కష్టమయినది. ఎందువల్లననగా యీవైద్యవిధానమంతయు పరాధీనవిషయము ఎంతగొప్పవైద్యుడ యినను రోగులయొక్క అంగీకారము లేనియెడల తనప్రజ్ఞావిశేషములుగాని, ఔషధప్రయోగోపసంహారప్రావీణ్యతనుగాని ఉపయోగపరచుటకు తగినసావకాశము ఉండదు ॥౧౧౫॥

శ్లో॥ బిలేశయాద్యా ఇవ బాడిశాద్యై
ర్మిథః ప్రయుక్తై రనభిజ్ఞరోగాః।
దోషం ప్రకల్ప్యై వ విశోధ్యవార్యాః
ప్రయోగసంహారవిదా సదాపి॥ ॥౧౧౬॥

గహస్యముగాదాగియున్న సర్పాదులు గేలము మొదలయిన ఎరలచే బయటకు లాగబడినట్లుగా రసాదిధాతువులయందు అణగియున్న రోగములనుప్రయోగసంహారనిష్ణాతయగు వైద్యుడు అహారరూపమయి దోషకల్పనచే (అనగా వ్యాధికి సరిపడని అహారము) ఇదియే అనుపశయమందురు. బయటకులాగి నివారణ చేయవలయును.

శ్లో॥ అగ్న్యాదిసామ్యం పరిశోధనీయం
ప్రకల్ప్య దోషం ద్రవరూపహారైః।
యదా జ్వర స్స్యా న్నకృతాల్పదోషా
ద్విందాద్య మగ్రంతే జఠరాగ్నిసామ్యమ్॥ ॥౧౧౭॥

ద్రవస్వరూపములయిన అహారాదులచే దోషకల్పనచేసి జఠరాగ్నియొక్క [illegible]లములను కనిపెట్టవలెను సామాన్యమయిన లేక ద్రవరూపమయిన అహారమువలన జ్వరముకలుగనియెడల జఠరాగ్ని హెచ్చుతగ్గులులేక సమానముగానున్నదని తెలియవలయును. యీజఠరాగ్నిభేదములు ముందుచెప్పబోవు అజీర్ణరోగవివరమున తెలియనగును ॥౧౧౭॥

శ్లో॥ త్యజం త్యమూల్యం నిజభావిజీవితం
సద్య స్స్వసౌఖ్యస్పృహయైవ రుగ్మిణః।
రోగే ష్వపథ్యా దహహాప్య వేద్యకా
న్నింద్యా పతస్తా న్నకదాపి తాదృశః॥ ॥౧౧౮॥

రోగులు పథ్యముచేయజాలక తమయొక్క అమూల్యమయిన జీవితమును తత్కాలసుఖప్రదమయిన అపథ్యమువలన ఎట్లుకోలుపోవుచున్నారో అప్రకారమే

కుహైద్యులవల్లనున్న కోలుపోవుచున్నారు. గాన అట్టివారిని నిందచేయరాదు (ఇది అనివార్యము) ॥౧౧౭॥

శ్లో॥ ఉపోష్యోపవాసవ్రతము ఏకభుక్త
వ్రతాదికం చాన్యవిధవ్రతాని।
ఆరోగ్యసూత్రప్రతిపాదకాని
జీర్ణాంత్రవిశ్రాంత్యుచితాన్యుపాసేత్
(ప్రాజ్ఞైరుపాస్యా న్యఖిలానితాని) ॥౧౧౯॥

నిరాహారోపవాసముచేయు వ్రతములు, ఏకభుక్తము (మధ్యాహ్నముమాత్రము భోజనముచేయువ్రతములు) యింకా పలువిధములయినవ్రతములు యివి అన్నియు ఆరోగ్యసూత్రప్రతిపాదకములు అయివున్నవి. (జీర్ణకోశమునకు విశ్రాంతిని కలుగచేయుటకుగాను యీవ్రతములన్నియు ఆచరింపతగినవై యున్నవి) గాన ప్రాజ్ఞులగువారిచే ఇవన్నియు ఆచరింపతగినవి. ॥౧౧౯॥

శ్లో॥ భూతైర్గృహీత మితి భూతవిదో వదంతి
వైద్యా వదంతి కఫపిత్తమరుద్వికారమ్।
జ్యోతిర్విదో గ్రహగతిం పరిశీలయంతి
కర్మేతి నిశ్చితధియో మునయో వదంతి॥ ॥౧౨౦॥

మంత్రశాస్త్రజ్ఞులు గ్రహబాధ కలదనియు వైద్యులు వాతాదిదోషములు కలవనియు చెప్పుదురు. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు గ్రహగతులను (గోచారస్థితిని) పరిశీలింతురు మునులు కర్మానుభవమనియు చెప్పుదురు ॥౧౨౦॥

శ్లో॥ వ్యాధితస్యార్థనాశస్య దేశాంతరగతస్య చ।
సర్వస్య శోకదగ్ధస్య సుహృద్దర్శన మౌషధమ్॥ ॥౧౨౧॥

రోగగ్రస్తుడు, సర్వస్వముపోయినవాడు, దేశాంతరగతుడు, ఆపత్పీడితుడు వీరలకు మిత్రసందర్శనమే ఔషధము. (చూడగానే విచారముపోయి సంతోషము కలుగుననుట) ॥౧౨౧॥

శ్లో॥ యథా మృతస్యాగమనం తథైవ
వృష్టిప్రతిష్టంభదినేషు వర్షమ్।
అంధస్య దృగ్లాభ మివ స్మరంతి
వైద్యస్య సందర్శన మామయేషు ॥౧౨౨॥

చనిపోయినవాడు తిరిగి బ్రతికినప్పుడున్ను వర్షప్రతిబంధక దివసములయందు సువృష్టికలిగినప్పుడు అంధునికి దృష్టిలాభము కలిగినప్పుడున్ను ఎట్టిసంతోషము కలుగుచున్నదో రోగపీడితులకు రోగోపద్రవకాలమున వైద్యునియొక్క దర్శనమాత్రముచేతనే అట్టిసంతోషము కలుగుచున్నది ॥౧౨౨

శ్లో॥ పితా చ సమ స్స్యాపది రోగహారీ
మధ్యే భవే ద్బాంధుసమాన ఏవ।
స్నానే భవే న్మిత్రసమ స్సుఖగ్రా
రోగ్యే భియాతిః ప్రతికృష్టదృష్టా॥ ॥౧౨౩॥

నీచులదృష్టియందు వైద్యుడు ఆపత్కాలమున తండ్రివలెను మధ్యకాలమున బంధువునివలెను ఆరోగ్యస్నానకాలమున మిత్రునివలెను సంపూర్ణారోగ్యముకలిగిన వెనుక శత్రువునివలెను కనుపించును ॥౧౨౩

శ్లో॥ ఔషధాన్యపి మంత్రాణి నిమిత్తశకునాని చ।
భాగ్యకాలే ప్రసన్నాని నిష్ఫలా న్యపరత్రచ॥ ॥౧౨౪॥

ఔషధములు, మంత్రములు, శకునములు వల్లసంభవించు క్షేమములు ఇవి అదృష్టదినములలో అనుకూలములును దురదృష్టదినములలో ప్రతికూలములునుఅగును.

శ్లో॥ సూతికా సూతికా చైవ భామినీ నావిక స్తథా।
వైద్యోపాధ్యాయదీపాశ్చ కార్యాంతే నిరసం త్యమూన్॥౧౨౫

మంత్రసాని, సేవకుడు స్త్రీ నావదాటించు పడెవాడు వైద్యుడు ఉపాధ్యాయుడు దీపము వీరు కార్యము ముగిసినవెనుక తిరస్కరింపబడుచున్నారు. ॥౧౨౫

## —♦ ఉపచారలక్షణమ్ ♦—

శ్లో॥ రోగిప్రియ స్సాహసిక స్సువక్తా
ప్రసన్నవక్త్ర స్స్మితపూర్వభాషీ।
ప్రశాంతకోపః పటుధైర్యశాలీ
నిరామయ స్స్యా దుపచారయోగ్యః॥ ॥౧౨౬॥

రోగికి ఇష్టమయినవాడును రోగియందిష్టముకలవాడును సాహసముకలవాడును వక్తృత్వముకలవాడును కోపములేనివాడును నవ్వుచు మాట్లాడు స్వభావము కలవాడును నిర్మలమయిన ముఖకాంతికలవాడును ధైర్యశాలియును నీరోగియును అయినవాడు రోగికి ఉపచారముచేయుటకు తగినవాడు. ॥౧౨౬॥

## —♦ నియతకృత్యములు ♦—

శ్లో॥ ప్రాత ర్ముఖక్షాళన మేకవారా
భ్యంగం ద్విరా రక్షుర మాసనస్యమ్।
ద్విమాసవిష్టా యనవాంతి రేవ
త్ర్యహా స్సమావేశన వామసుప్తిః॥ ॥౧౨౭॥

సూర్యోదయము కాకముందు దంతధావనము, వారమున కొకపర్యాయము అభ్యంగనము, పక్షమునకొకపర్యాయము క్షురకర్మ, మాసమునకొకపర్యాయము నశ్యకర్మ రెండుమాసముల కొకపర్యాయము విరేచనమునకుసాధనము, అరుమాసముల కొకసారి వాంతిసాధనము మూడురోజుల కొకసారి సంభోగము, ప్రతిరోజును ముందుగా ఎడమపార్శ్వమున శయనించుట యివి నియతముగా ఉండవలెను.

## —♦ దినచర్య ♦—

శ్లో॥ సంతోషజీవస్య నిరోగ మేవా
రోగ్యస్య మూలా దివసస్యచర్యా।
ముఖ్యాహి యస్మా దతి విస్తృతాత్రి
సాసంగతా ప్రస్తుత ఇత్యహేయా॥ ॥౧౨౮॥

మానవునియొక్క సంతోషజీవితమునకు ఆరోగ్యమున్ను ఆరోగ్యమునకు దినచర్యయు క్రమముగా ఒకదానికొకటి కారణములయియున్నవి. గాన వాటిలో ప్రధానమయిన ఆదినచర్య మిక్కిలి విపులముగా చెప్పబడినది. ఇది వైద్యశాస్త్రమునకు సంబంధించనిదని ఏవగించుకొనగూడదు. ॥౧౨౮॥

శ్లో॥ దీర్ఘాయు రారోగ్య సమస్తభాగ్య
మూలా గృహస్థేహపరానుకూలాః।
యే ముఖ్యధర్మా దివసస్య చర్యా
ప్రసంగ ముద్దిశ్య సమీరయంతే॥ ॥౧౨౯॥

దీర్ఘాయుర్దాయము ఆరోగ్యము ఐశ్వర్యము వీటకి కారణములున్ను గృహస్థుల ఇహాపరములకు అనుకూలములున్ను అయిన ముఖ్యధర్మములు యేవికలవో అవి దినచర్యాప్రసంగవశముచే చెప్పబడుచున్నవి. ॥౧౨౯

శ్లో॥ సంవేశవిశ్రాంతిగతేంద్రియాణి
ప్రాతఃప్రసన్నాని నిశాంతయామే।
తత్ప్రాతరుత్థాయ పురా స్మరేత్స్వ
శయ్యామముక్త్వా ముహు రిష్టదేవమ్॥ ॥౧౨౯॥

నిద్రించునప్పుడు ఇంద్రియములన్నియు విశ్రాంతినిపొందియుండును గాన ప్రాతఃకాలమున నిద్రనుండి లేచుసరికి మనస్సు నిర్మలముగా నుండునుగాన యీ యింద్రియములకు తిరిగి వ్యాపారప్రసక్తికలుగకుండా నిర్మలమయిన మనస్సుతో శయ్యనుండి దిగకయే తనయిష్టదైవమును అనేకపర్యాయములు ధ్యానించవలెను.

శ్లో॥ అత్యుత్తమాంగా న్యధ మాంగతుల్యా
న్యతీవ నిద్రాసమయే స్రవంతి।
సుప్తోత్థిత స్స్వీయహృషీకశుద్ధ్యై
ప్రక్షాళయే దంగవితాన మాశు॥ ॥౧౩౦॥

నిద్రించునపుడు ఉత్తమములయిన జ్ఞానేంద్రియములుకూడా అధమములయిన కర్మేంద్రియములవలెనె మలమును స్రవించు స్వభావముకలవైయున్నవి. గాన నిద్రనుంచిలేవగానే యింద్రియములయొక్క పరిశుద్ధినిమిత్తము ప్రక్షాళనముచేయుట మిక్కిలి అవసరము ॥౧౩౦॥

శ్లో॥ దుర్గంధనాశాయ ముఖస్య రుచ్యై
తాల్వక్షిదంతాస్య విశుద్ధయేన।
శీతోదకే నోషసి వక్త్రశుద్ధిం
కుర్వీత నిత్యం ముఖ రక్షశుద్ధ్యై। ॥౧౩౧॥

ముఖముయొక్క దుర్గంధము పోవుటకొరకును తాలువులు కన్నులు దంతములు నోరు ఇవి పరిశుద్ధము లగుటకొరకును చల్లనినీటితో దంతధావనముచేయువలెను.

శ్లో॥ తృణైశ్చ పర్ణై ర్మధురతిక్తవద్భిః
కాష్ఠైః పయస్యందిభి రవ్యవక్రైః।
కుర్వీత సూర్యోదయపూర్వమేవ
దంతామయధ్వంసక దంతశుద్ధిమ్॥ ॥౧౩౨॥

తీపికలిగినట్టిగాని చేదుగలిగినట్టిగాని తృణములచేతనున్ను ఆకులచేతనున్ను

సాలు కలిగినట్టియు శంకరలేనట్టియు పుల్లలచేతనున్ను సూర్యోదయము కాకమును పే దంతరోగములను గాకుండాచేయు దంతధావనమును చేయవలయును. ॥౧౩౨॥

శ్లో॥ నిర్వర్త్య శారీరకనిత్యకృత్యం
మూత్రాదికోత్సర్జనమూలకంచ।
ప్రక్షాళ్య పాదాదిక మేవ కుర్యా
ద్దండూమణం ప్రత్యుతస ప్తవారమ్॥ ॥౧౩౩॥

మలమూత్రవిసర్జనము మొదలయిన శరీరమునకు విధాయకమయిన నిత్యకృత్యములను నెరవేర్చుకొని వెంటనే పాదప్రక్షాళనము గావించుకొని యేడువార్లు పుక్కిలించి ఉమ్మి వేయవలెను, ॥౧౩౩॥

శ్లో॥ చతుష్పథే దేవగృహే స్మశానే
వల్మీకవాపీ విషవృక్షపార్శ్వే।
తీర్థాంతికే జాతవనస్పతీంశ్చ
నైవోపయుంజీత మలప్రదేశే॥ ॥౧౩౪॥

నాలుగుత్రోవలుకలసిన ప్రదేశము, దేవాలయము, స్మశానము, పుట్ట దిగుడుబావులు, విషవృక్షములు, నీళ్ళరేవులు, మరుగుదొడ్లు మొదలయినవాటియందుగాని వాటిసమీపములయందుగాని మొలచిన చెట్లునుగాని వాటితాలూకు అంగములనుగాని ఉపయోగింపరాదు ॥౧౩౪॥

శ్లో॥ కాయో నవచ్ఛిద్రసమన్వితోయం
మలం స్రవత్యేవ దివా నిశాచ।
స్నాయాత్త్రికాలం మలశోధనాయ
కోష్ణేన శీతేన జలేనవాపి॥ ॥౧౩౫॥

నవరంధ్రములతోకూడిన యీశరీరము సర్వకాల సర్వావస్థలయందు మలమును స్రవింపుచుచేయుండును గాన యీమలమును పోగొట్టుకొనుటకై మానవుడు ప్రతిరోజున్ను ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములందు స్నానముచేయవలెను

శ్లో॥ స్నాయా న్ముహూర్తం సలిలై స్సుశీతై
ర్యది ద్విజశ్చే దఘమర్షణాద్యైః।
స్నానా ద్వినశ్యంతిహి దాహతాప
శ్రమాతషాయాసమలా స్స్వదేహాత్॥ ॥౧౩౬॥

బ్రాహ్మణుడు అఘమర్షణాది మంత్రములచేతను బ్రాహ్మణేతరులు అమంత్రకముగాను రెండుఘడియలసేపు స్నానమాచరింపవలెను స్నానమువలన దాహము, తాపము, శ్రమ, యెండదెబ్బ మొదలయినవి నశించుచున్నవి. ॥౧౩౬॥

శ్లో॥ గుణా దశ స్నానపరస్య సాధో
రూపంచ తేజశ్చ బలంచ శౌచమ్।
ఆయుష్య మారోగ్య మలోలుపత్వం
దుస్స్వప్ననాశ స్సుమతిశ్చ మేధా॥ ॥౧౩౭॥

స్నానముచేసిన సత్పురుషునికి రూపము తేజస్సు బలము శుచిత్వము ఆయుర్వృద్ధి ఆరోగ్యము ధైర్యము దుస్స్వప్ననాశము బుద్ధిధారణాశక్తి అను పదిగుణములు కలుగును. ॥౧౩౭॥

శ్లో॥ వసా శుక్ర మసృ ఙ్మజ్జా కర్ణ విణ్మూత్ర విణ్ణఖాః।
శ్లేష్మాశ్రుదూషికా స్స్వేదా ద్వాదశైతే మలాన్నృణామ్॥౧౩౮

క్రొవ్వు రేతస్సు నెత్తురు మెదడు గులివి మూత్రము విష్ఠ చీమిడి తెమడ కన్నీరు కంటిపుసి చెమట అని మలములు పన్నెండు ॥౧౩౮॥

శ్లో॥ స్నానం తు నేత్ర శిరకాయ సౌఖ్యం
హృదాదిసర్వాంగగరక్తనాడీ
తతే ర్వికాసం వితనోతి దేహా
దుర్గంధనాశం చ శరీరపుష్టిమ్॥ ॥౧౩౯॥

స్నానమువలన నేత్రములకును, శిరస్సునకును సౌఖ్యమును హృదయము మొదలయిన సమస్తఅవయవములయందునుగల రక్తనాళములును విస్తరించుచున్నవి మరియు దేహమునందుగల దుర్గంధము నశించి శరీరమునకు బలము కలుగుచున్నది.

శ్లో॥ స్నానే దానే జపే హోమే వైశ్వదేవే సురార్చనే।
ప్రాయశ్చిత్తే తథా శ్రాద్ధే విమనాడీ ప్రశస్యతే॥ ॥౧౪౦॥

స్నానము దానము జపము హోమము వైశ్వదేవము దేవతార్చనము ప్రాయశ్చిత్తము శ్రాద్ధము వీటికి విషగడియలు మంచివి. ॥౧౪౦॥

శ్లో॥ ఆధ్మానవాతశృతినేత్రరోగ
తత్కాలభోక్తా గ్రహణీరుగార్తః।
అజీర్ణరుక్పీనస తాపయుక్త
స్స్నానం త్యజే త్సోఫయుతోఽతిసారీ॥ ॥౧౪౧॥

కడుపుబ్బరము వాతరోగము కర్ణరోగము నేత్రరోగము అప్పుడే భోజనముచేసినవాడు గ్రహణీరోగము అజీర్ణము పీనస (పడిశము) తాపము ఈరోగములు కలవారు స్నానముచేయరాదు ॥౧౪౧॥

శ్లో॥ కులోచితం దైవికకర్మకృత్వా
స్వవృత్తిసద్వర్తన మాతనోతు।
భుంజ్యా త్పిబే స్స్వస్యయథానుకూలం
న రోధయే న్మూత్రపురీష వేగమ్॥ ॥౧౪౨॥

స్నానానంతరము తనకులక్రమాగతమయిన యిష్టదైవముయొక్క ధ్యానపూజవాదికర్మలను నెరవేర్చుకొని పిమ్మట తనజీవితమునిమిత్తము యథాన్యాయమయిన వృత్తిని చేసుకొనవలయును తనతత్వమునకు అనుకూలమయినపదార్థములను తినవలెను. మితముగా దాహము పుచ్చుకొనవలెను మూత్రపురీషములను అసుమానము కలిగినవెంటనే విడిచిపెట్టుచుండవలెను ॥౧౪౨

శ్లో॥ ధర్మానురక్తో విజితేంద్రియశ్చ
పథ్యాన్నభోక్తా యది సత్యసంధః।
దీర్ఘాయురాప్నోతి చిరాయనూనం
గోవిప్రమాతాపితృ దేవభక్తః॥ ॥౧౪౩॥

ధర్మమునందాసక్తి జితేంద్రియత్వము, పథ్యభోజనము, సత్యభాషణము, గోవులు బ్రాహ్మణులు తల్లిదండ్రిలు దేవతలు వీరియందు భక్తికలిగియుండుట వీటిచే దీర్ఘాయుర్దాయమును పొందుచున్నాడు. ॥౧౪౩॥

శ్లో॥ అవిత్తసంపాదక ముత్సృజంతి
దారాశ్చ పుత్రాశ్చ సహోదరాద్యాః।
తం విత్తవంతం పునరేవయాంతి
విత్తం హి లోకే పురుషస్య బంధుః॥ ॥౧౪౪॥

భార్య కుమాళ్ళు సోదరులు మున్నగువారందరున్ను ధనార్జనచేయలేనిపురుషు

ని విడిచిపెట్టుచున్నారు నిర్ధనికుండయిన ఆపురుషుడు ధనవంతుడాయెనేని తిరిగి వానివద్దకు చేరుచున్నారు. గాన యీకలియుగమున ద్రివ్యమే పురుషునకు బంధువు

శ్లో॥ ప్రజానురాగేణ ధనం చినుష్వ
తేనేనధర్మం ప్రతిపాలయస్వ।
ధర్మేణ సంపాదయ దివ్యకీర్తిం
కీర్త్యాచ లోకా న్గంలా న్పనిధాః॥ ॥౧౮౫॥

జనకంటకములేకుండా ప్రజాసామాన్యముయొక్క అనురాగమువలన ద్రవ్యమును ఆర్జింపవలెను. తానుసంపాదించిన ద్రవ్యమువలన గృహస్థధర్మములను జరుపుకొనవలెను. గృహస్థాశ్రమములలో తానాచరించుచున్న ధర్మకార్యములచే కీర్తిని సంపాదించుకొనవలెను. ॥౧౮౫॥

శ్లో॥ ఆయాత మాయాత ముపేక్షణీయం
గతం గతం సర్వ ముపేక్షణీయమ్।
అలం వృథా ఖేదనమోదనాభ్యా
మలంఘనియాహి గతి ర్విధాతుః॥ ॥౧౮౬॥

ధనార్జనము చేయునప్పుడు యేది తనకు లభ్యమగుచున్నదో దానినిగురించియే ప్రయత్నించవలెను యేది సంప్రాప్తమయినను పోవునో గానినిగురించి విచారింపరాదు దైవలిఖితముదాట శక్యము కాదు. ॥౧౮౬॥

శ్లో॥ నష్టం కులం భిన్న తటాకకూపం
ప్రభ్రష్టరాజ్యం శరణాగతంచ।
గాం బ్రాహ్మణం దేవగృహం చ జీర్ణం
య ఉద్ధరే త్పూర్వచతుర్గుణం స్యాత్॥ ॥౧౮౭॥

క్షీణించుచున్నకుటుంబము, పాడయిపోవుచున్నట్టియు, పాడయిపోయినట్టియుచెరువులు, నూతులు, దేశము, శరణుపొందినవాడు, గోవులు, బ్రాహ్మణులు, దేవాలయములు వీటిని యెవరు పునర్నిర్మాణముచేసి ఉద్ధరించుచున్నారో వారికి పూర్వము ప్రతిష్ఠచేసినవారికంటె నాలుగురెట్లు ఫలితముకలుగును. ॥౧౮౭॥

శ్లో॥ యశస్కరే కర్మణి మిత్రసంగ్రహే
ప్రియాసు నారీ ష్వధనేషు బంధుషు।
క్రతౌ వివాహే వ్యసనే రిపుక్షయే
ధనవ్యయో ష్టాసు న గణ్యతే బుధైః॥ ॥౧౮౮॥

పుణ్యకార్యము, మిత్రసంగ్రహము, తనకుటుంబములోని స్త్రీలు (భార్య కుమార్తెలు కోడండ్రు మనుమరాండ్రు మొదలయిన ఆత్మీయులు) ధనహీనులయిన బంధువులు యజ్ఞయాగాదిక్రతువులు, వివాహము అపత్కాలము శత్రుసంహారము యీయెనిమిదింటివిషయములోను అయ్యెడుఖర్చును ప్రాజ్ఞులు లెక్కచేయరు.

శ్లో॥ స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనమ్।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥ ॥౧౪౯॥

ఇతరులుచేసిన ధర్మసంస్థను రక్షించుటవలన తాను స్వయముగా చేసినదానికంటె రెట్టింపుఫలితము కలుగుచున్నది ఒకరుచేసినదానిని చెడగొట్టినయెడల తాను స్వయముగా జేసినదికూడ నిష్ఫలమగుచున్నది ॥౧౪౯॥

శ్లో॥ శ్వః కార్య మద్య కర్తవ్యం పూర్వాహ్ణే చాపరాహ్ణికమ్।
నహి ప్రతీక్షతే మృత్యుః కృతం న స్యథ వా కృతమ్॥౧౫౦॥

వీడికి అవసరమయినపనులు పూర్తిఅయినవా? లేదా? అని మృత్యుదేవత నిరీక్షింపదుగాన ప్రతిమానవుడు రేపటికార్యమునకు తగినసన్నాహమును యీరోజున ను మధ్యాహ్నమునందు జేయదగిన కార్యసన్నాహము ఉదయకాలమందును జేసుకొనుచుండవలెను ॥౧౫౦॥

"క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం జీవితమావయోః। యమస్య కరుణా నాస్తి ధర్మస్య త్వరితాగతిః॥" ఆరము సుగమము

శ్లో॥ వాగ్వాద మర్థసంబంధం పరోక్షే దారభాషణమ్।
యత్ర మిత్రత్వ మిచ్ఛంతి తత్ర త్రీణి వివర్జయేత్॥ ॥౧౫౧॥

యెక్కడ స్నేహమునుగోరుదురో అక్కడ వాగ్వివాదము యిచ్చిపుచ్చుకొనుట పురుషులు యింటివద్దలేనిసమయమున స్త్రీలతో ప్రసంగించుట వీటిని విడిచిపెట్టవలెను. ॥౧౫౧॥

శ్లో॥ చత్వారి ఖలు కార్యాణి సంధ్యాకాలే వివర్జయేత్
ఆహారం మైథునం నిద్రాం స్వాధ్యాయం చ తతః పరమ్।
ఆహారా జ్జాయతే వ్యాధి ర్మైథునా ద్గర్భనష్టకం
శ్రియో హారతి నిద్రాయా స్స్వాధ్యాయా స్మరణం ధ్రువమ్॥

భోజనము, సంభోగము, నిద్ర, వేదపఠనము, ప్రదోషకాలమున యీనాలుగింటిని విడిపెట్టవలెను. అట్లుచేయనియెడల భోజనమువల్ల రోగమున్ను సంభోగమువల్ల గర్భపాతమున్ను నిద్రవల్ల శ్రియోనాశమున్ను వేదపాఠమువల్ల మరణముకలుగును.

శ్లో॥ శవదాహే గ్రామదాహే సపిండీకరణేతథా।
శక్త్యుత్సవేచ సంక్రాంతౌ నగచ్ఛేత్పరవాసరే॥ ॥౧౪౩

శవదాహము గ్రామదహనము సపిండీకరణము (చనిపోయిన పన్నెండవరోజు) అమ్మవారిజాతర సంక్రాంతి వీట్లకు మరుచటిదివసములయందు ఆగ్రామము నుండి కదలకూడదు (ప్రయాణము చేయరాదు) ॥౧౪౩॥

శ్లో॥ న సభాం ప్రవిశే త్ప్రాజ్ఞ-స్సభ్యలోప మవేక్షయన్।
అబ్రువ న్విబ్రువ న్వాపి సభ్యదోషై స్సలిప్యతే॥ ॥౧౪౪॥

తనకు కనుపించుచున్న సభ్యలోపములను చెప్పకపోయినను, చెప్పినను రెండువిధములచేతినుకూడా దోషమునే పొందుచున్నాడుగాన ప్రాజ్ఞుడు సభలో ప్రవేశింపరాదు ॥౧౪౪॥

శ్లో॥ విచిత్రవస్త్వాది సుసంగ్రహో౽పి
ప్రమాదిక స్స్యా దఖిల స్తదేవ।
వాంఛం త్యదానేన తు వైర మేతి
తద్వస్తునాశః ప్రతిదాపనేన॥ ॥౧౪౫॥

అపురూపగమయిన వస్తుసంగ్రహము ప్రమాదకరము. ఎందువల్లననగా ప్రతివారు ఆవస్తువునే కోరుచుందురు. (యెరువు అడుగుదురు) ఇవ్వనియెడల వారితో విరోధపడవలెను యిచ్చినయెడల ఆవస్తువ యింక ఉపయోగమునకుపనికిరాదు.

శ్లో॥ శయ్యాసనాచ్ఛాదనధారణేషు
ప్రవిశ్యచాత్మజ్వలనాని యస్మాత్।
తత్తోపవిష్టేష్వపి సంక్రమంతి
తస్మా న్నధార్యాణి పరై రమూని॥ ॥౧౪౬॥

పరుండుశయ్య, కూర్చుండెడు ఆసనము, కప్పుకొనెడు కట్టుకొనెడు వస్త్రములు, వీటియందు ప్రవేశించియున్న తన ఆత్మశక్తియొక్క ప్రజ్వలనములు వాటియందు ప్రవేశించినవారియందు సంక్రమించుచున్నవి. కాన (ఒకరుధరించినవి ఇంకొకరు ధరింపకూడదు.) అందువల్ల తన ఆత్మశక్తియొక్క ప్రజ్వలనములు అక్కడ లేనందువల్ల తిరిగి తానాస్థానమందు ప్రవేశించినప్పటికి కొంతకాలమునకుగాని తిరిగి యథాప్రకారమయిన ఊహాపోహాలుకలుగవు. (ఇది అనుభవసిద్ధమయినవిషయము)

శ్లో॥ వేషం న విశ్వసే త్ప్రాజ్ఞో వేషో దోషాయ కల్పతే।
రావణో భిక్షురూపేణ జహార జనకాత్మజామ్॥ ॥౧౫౭॥

రావణుడు సర్వసంగపరిత్యాగరూపమయిన యతివేషముచే సీతాదేవిని అపహరించెను గాన ప్రాజ్ఞుడయినవాడు యెన్నడున్ను యెవనివాని వేషమునుచూచి మోసపోకూడదు వేషమే ఇతరులను మోసముచేయుటకు సాధనము ॥౧౫౭॥

శ్లో॥ అధికారశ్చ గర్భశ్చ ఋణంచ శ్వానమైథునమ్।
ప్రవేశే సుఖమాప్నోతి నిర్గమే ప్రాణసంకటం॥ ॥౧౫౮॥

ఉద్యోగము గర్భోత్పత్తి ఋణము కుక్కతింటెము ఇవి ప్రారంభకాలమున సుఖముగానున్నను విడుదల కాలమున దుఃఖకరములు. ॥౧౫౮॥

శ్లో॥ ప్రత్యక్షే గురవస్తుత్యాః పరోక్షే మిత్రబాంధవాః।
కార్యాంతే దాసభృత్యాశ్చ నకదాచన పుత్రకాః॥ ॥౧౫౯

యెదుట గురువులున్ను చాటున మిత్రులు బంధువులున్ను కార్యాంతమున దాసదాసీజనులున్ను కొనియాడతగియున్నారు తనకుమాళ్ళు యెన్నడున్ను కొనియాడతగినవారు కారు (అనగా కొనియాడకూడదనుట) ॥౧౫౯॥

శ్లో॥ వరం వనం వ్యాఘ్రగజాదిసేవితం
జలేన హీనం బహుకంటకావృతమ్।
తృణాని శయ్యాపరిధానవల్కలం
న బంధుమధ్యే ధనహీనజీవనమ్॥ ॥౧౬౦॥

బంధుజనమధ్యమున ధనహీనజీవనము చేయుటకంటె పెద్దపులులు, ఏనుగులు, మొదలైనవి కలిగినట్టియు, ఉదకములు లేనట్టియు, ముండ్లమయమైనట్టియు గడ్డిపక్కగా కలిగినట్టియు, చెట్లతొక్కలే వస్త్రములుగా కలిగినట్టిదియు నగు వనవాసము కొంచెము మంచిది ॥౧౬౦॥

శ్లో॥ పతివ్రతాయాః కుచకుంభయుగ్మం
మత్యగ్రశార్దూలనఖావళిశ్చ।
లుబ్ధస్య విత్తం రణశూరశస్త్రం
చత్వార్యకామ్యాని చిరాయురిచ్ఛతా॥ ॥౧౬౧॥

దీర్ఘాయుర్దాయమును కోరుకొనుమానవుడు పతివ్రతను మోహించుట, జీవించియున్న పెద్దపులిగోళ్ళను సంపాదింపకోరుట, లుబ్ధునియాచించుట యుద్ధసన్నద్ధు

డైన కూరునిచేతియందున్న శస్త్రమును ఊడబెరుకుటకు ప్రయత్నించుట యనువాటి ని మానవలెను.

శ్లో॥ మాతా గరీయసీ లోకే మాతుర ప్యధికం ఖలః ।
మాతా మలం కరే ణైవ జిహ్వాయా తొలగతే ఖలః ॥౧౬౨॥

లోకమందు ప్రతివ్యక్తికిని అందరికంటె తల్లి గొప్పది. దుర్మార్గుడు యీతల్లికంటె గొప్పవాడు. ఎందువల్ల ననగా పిల్లవాని మలమును తల్లిచేతితో తీయుచుండ దుర్మార్గుడు తన కిష్టములేనివారిపై లేనిపోని అపవాదములను కల్పించి వాని మలమును నాలుకతో తీసివేయుచున్నాడు ॥౧౬౨॥

శ్లో॥ స్వోపకారం కవిం వైద్యం మంత్రిణం మంత్రవాదినం ।
స్వామినం ధనికం మూర్ఖం జాలినం న ప్రకోపయేత్ ॥౧౬౩॥

తన కుపకారము చేసినవాడు, కవీశ్వరుడు, చికిత్సకుడు, మంత్రి, మంత్రశాస్త్రజ్ఞుడు, ప్రభువు, ధనవంతుడు, తెలివితక్కువవాడు ఇంద్రజాలికుడు వీరికి కోపమునుకలిగించరాదు ॥౧౬౩॥

శ్లో॥ ప్రమాద మల్పస్య తు దోష మాహు
ర్మహాత్మనాం దోష మపిప్రమాదం ।
పాత్రస్థితేఽణౌ తదపస్త్యజంతే
శవేషు కుల్యాదిషు న త్యజంతే॥ ॥౧౬౪॥

లోకస్వభావ మెట్టిదనగా చిన్నచిన్న గృహస్థులయొక్క ప్రమాదమును దోషముగాను, గొప్పవారియొక్క దోషమును ప్రమాదమునుగాను, ఎంచుదురు. ఉదాహరణ॥ చెంబులోని నీటిలో నలక కనుపించినవాటిని పరిహరింతురు. కాలువలు మొదలయినవాటిలో శవములు చేతికి తగిలినను అనీటిని విడిచిపెట్టరు. ॥౧౬౪॥

శ్లో॥ స్త్రియాం శ్రియాం వా యది నాస్తి వాంఛా
సర్వత్ర పూజ్యేత కులాధమో వా
తే ష్వస్తి వాంఛా యది చే త్తదానీం
నైవ ప్రపూజ్యేత మహీశ్వరో వా॥ ॥౧౬౫॥

కాంతాకనకములయందు వ్యసనము లేనివాడు కులాధముడైనను అంతటా పూజింపబడును వాటియందు వ్యసన మున్నవాడు జగదీశ్వరు డైనను ఎక్కడను పూజింపబడడు. ॥౧౬౫॥

శ్లో॥ ధనాధికస్యాపి దరిద్ర ఏవ
స్వయం ధనాపేక్షితయా వ్యజస్రమ్ ।
మహాదరిద్రోఽపి ధనాఢ్య ఏవ
ప్రాప్త్యేపి వార్థే హ్యతినిస్పృహత్వాత్ ॥ ॥౧౬౬॥

ధనమందు అపేక్ష కలిగియుండుటవలన యెంతటి ధనవంతుడైనను దరిద్రుడే యగును. లభ్య (మగుచున్న) ము కాతగిన ధనమందుకూడ అపేక్ష కలిగియుండక పోవుటవలన యెంతటిదరిద్రుడైనను ధనవంతుడే యగును. ॥౧౬౬॥

శ్లో॥ అనార్జనే వా పరసేవనే వా
స్వీయా తుదంతిస్మ గృహంగతా స్తే।
త్యాగేచ మానే వ్యణుమాత్రలోపే
ద్వయానుసంధానవిధా గృహస్థః॥ ॥౧౬౭॥

ధనసంపాదన లేనప్పుడు, ఇతరులకు సేవ చేయవలసివచ్చినపుడు స్వజనము పీడపెట్టుదురు. ఖర్చుయందుగాని, మార్యాదయందుకాని ఏమాత్రపు స్వల్పలోపము వచ్చినను యింటికివచ్చిన బంధువులు మొదలయినవారు పీడపెట్టుదురు. ఈ రెండువిషయముల సమీకరణము నిమిత్తము గృహస్థుడు బాధపడుచున్నాడు ॥౧౬౭॥

శ్లో॥ ఇచ్ఛంత్యకార్యకరణేన ధనాగమశ్చే
త్తత్కర్తు మేవ నిజదారసుతాదయ స్తు।
తస్మా దిహపరసుఖానుభవానుకూల
వృత్త్యార్జయే ద్ధన మపి స్వకుటుంబభృత్యై ॥౧౬౮॥

అకార్యకరణముచే ధనలాభము కలిగినప్పటికి దారాపుత్రాదులు అట్టి ధనలాభము నపేక్షింతురు. కాన ప్రతిగృహస్థుడున్ను ఇహపరములకు బాధకములేని వృత్తివలన కుటుంబభరణముకొరకు ధనము నార్జింపవలెను. ॥౧౬౮॥

శ్లో॥ అనాహూతోఽధ్వరం గచ్ఛే దాహూత శ్శుభకర్మణి।
అనాహూతోఽపి వాఽఽహూతో న గచ్ఛే చ్ఛ్రాద్ధకర్మణి॥౧౬౯॥

యజ్ఞయాగాదిక్రతువులకు పిలవబడకుండాను, శుభకార్యములకు పిలవబడియు వెళ్ళవలెను. శ్రాద్ధకర్మకు పిలవబడకుండాను, పిలవబడియు కూడా వెళ్ళకూడదు.

శ్లో॥ దేశాటనం పణ్డితమిత్రతా చ వేశ్యా
సంభాషణం రాజసభాప్రవేశః।
అనేకశాస్త్రార్థవిలోకనం చ
చాతుర్యమూలాని భవంతి పంచ॥ ॥౧౭౦॥

దేశాటనము, పండితులతో స్నేహము, వేశ్యలతో సంభాషించుట, రాజసభల కేగుట, అనేకశాస్త్రములయందు పరిచయము, యీ అయిదున్ను చాతుర్యకారణములు. ॥౧౭౦॥

శ్లో॥ అశ్వత్థ మేకం పిచుమంద మేకం
న్యగ్రోధ మేకం దశ తింత్రిణీకమ్।
కపిత్థబిల్వామలకత్రయంచ
నవామ్రవాపీ నరకం న పశ్యేత్॥ ॥౧౭౧॥

ఒక రావిచెట్టు, ఒక వేపచెట్టు, ఒక మర్రిచెట్టు, పదిచింతచెట్లు, ఒక వెలగచెట్టు, ఒక మారేడుచెట్టు, ఒక పెద్దఉసిరికచెట్టు, తొమ్మిదిమామిడిచెట్లు, ఒక నడబావి, వీటిని స్థాపనచేసినవాడు నరకమును చూడడు (యిదియే వనసంతర్పణచేయుటకు అర్థమై యున్నది

శ్లో॥ సతాం బహూనాం బహుభావనత్వా
ద్బహుస్థితానాం గృహిణాం కదాచిత్।
తత్తత్స్వభావై ర్బహుధోపలబ్ధం
సహ్యం సుఖం వాప్య సుఖం సమానం॥ ॥౧౭౨॥

కుటుంబవృద్ధిగల గృహస్థులకు వారి వారి మతముల ననుసరించి అనేకరకములయిన సుఖములుగాని, కష్టములుగాని, సంభవించుచుండును వీటిని ప్రతిగృహస్థుడున్ను సమానముగానే భావించవలెను. ॥౧౭౨॥

శ్లో॥ రుగాపదౌషధై ర్విషం మంత్రై ర్నైచ్యం విత్తా ద్వినశ్యతి
జాయుమంత్రధనై ర్వాపి వాగ్వ్యయం న నివర్తతే ॥౧౭౩॥

మందులవలన రోగమున్ను, మంత్రమువలన విషమున్ను, ధనమువలన నైచ్యమున్ను, నశించుచున్నవి. ఔషధము వలనగాని, ధనమువలనగాని వాగ్వ్యయము నశింపదు. ॥౧౭౩॥

శ్లో॥ వృద్ధి రన్నా ద్విషా న్మృత్యూ రుజీమా సవిపర్యయా।
దత్యా విరోధ మాప్నోతి హృత్వాచ ప్రణయంతథా ॥౧౭౪॥

అన్నమువలన అభివృద్ధియు విషమువలన మరణమున్ను, లోకప్రసిద్ధమై యున్నవి. అయినప్పటికిన్ని రోగముచే యివి వ్యత్యయములగు రోగములందు విషమువలన అభివృద్ధియు, అన్నమువలన మృత్యువున్ను ఎట్లు పొందుచున్నవో అట్లే దానమువలన విరోధమున్ను, అపహరించుటవలన ప్రణయమున్ను సంప్రాప్తమగుచున్నవి

శ్లో॥ గమ్యతే యది మృగేంద్రమందిరం
లభ్యతే ద్విరదకుంభమౌక్తికం।
జంబుకాలయగతేన లభ్యతే
వత్సపుచ్ఛ మపి చర్మఖండనమ్॥ ॥౧౭౫॥

సింహము నివసించు పొదయందు ప్రవేశించుటచే ఏనుగులయొక్క కుంభస్థలములయందలి ముత్యములనున్ను, నక్క నివసించు బొరియయందు ప్రవేశించుటచే వత్సపుచ్ఛము, తోలుముక్కలు, మొదలయినవాటిని పొందగలుగుచున్నాడు

శ్లో॥ దారా న్పరేషాం జననీ మివ స్వాం
విత్తాంశ్చ లోష్ఠా న్యఖిలా నివ స్వాన్।
సర్వాత్మనా పశ్యతి యో విపశ్చి
త్స ఏవ దీర్ఘాయు రుపైత్యరోగమ్॥ ॥౧౭౬॥

ఇతరుల భార్యలను తల్లులవలెను, విత్తములను కుండపెంకులవలెను, అందరిని తనవలెను, అన్నివిధముల చేతను ఎవడు చూచుచున్నాడో అట్టివాడు దీర్ఘాయుర్దాయమును, ఆరోగ్యమును పొందుచున్నాడు ॥౧౭౬॥

శ్లో॥ సాధ్వీ ద్వారగవాక్షచత్వరతలే నైకాకినీసంవసే
ద్గోష్ఠీ నిష్కుటతీర్థనాటకకథోద్వాహా న్నగచ్ఛే త్స్వయం।
దుశ్చర్యా విధవా భృకుంపవిహసి సంభాషణం నాచరే
దేకాంగీవ చరే త్ప్రసాధితతను ర్భర్త్రా సహార్థాంగ్యపి ॥౧౭౭॥

పతివ్రతయగు స్త్రీ పొత్తికట, (ద్వారములపక్క) కిటికిటీలదగ్గర ముందరివాకిళ్లలోను ఒంటరిగా నిలువబడియుండరాదు. సభలు యింటికి చేరిగాని, సమీపమందుగాని, ఉద్యానవనములు, తీర్థములు, నాటకములు, హరికథలు, వివాహాదులు, విటికి ఒంటరిగా పోరాదు. దుర్నడతలు గలవారు, విధవాస్త్రీలు, భర్తపోయిన కరే

విశేషమయిన భర్తలు గల వ్యభిచారుః, స్త్రీలు, స్త్రీవేషధారియగు పురుషుడు, కొండెములు చెప్పువారు, వీరితో సంభాషింపరాదు. అలంకరించుకొనబడిన దేహముకలదై ఎల్లప్పుడూ కూడా భర్తతో ఏకాంగివలె సంచరింపవలెను ॥౧౩౭॥

శ్లో॥ నిర్దార్వగ్ని రివ క్షుధాతురతనా దాహారదారుక్షయా
న్మాంద్యం ప్రాప్స్యతి జారర స్సపచతే భుక్తం నిరాహారకః।
వాతాదీ న్పచతే త్రిదోషపచనే ధాతుక్షయం చ క్రమా
త్తైః ప్రాణః పచతే తదేవ నియమాద్భుంజ్యాద్ద్వివారం క్షుధీ॥

కట్టెలు లేక అగ్ని చల్లారునట్లు, ఆకొన్నవాడన్నమును తిననియెడల (జరరాగ్నికి ఆహారమే కట్టెలు) ఆహారమను కట్టెలు లేక జరరాగ్ని మందగించును. భుజింపబడిన ఆహారాదికమును జరరగ్ని పచనము గావించుచున్నది భుజింపనివాడు వాతాదిదోషములను పచనము గావించుకొనుచున్నాడు. ఆత్రిదోషములు పచనము గావింపబడినచో (త్రిదోషములు నశించినచో) క్రమముగా రసాదిసప్తధాతువులున్ను నశించును. ఆధాతుక్షయముచే ప్రాణములు నశించును కాన భోజనేచ్ఛాకాలమందు ప్రతిరోజూనా నియమప్రకారము రెండుసార్లు భోజనము చేయవలెను

శ్లో॥ భోజ్యం సుపక్వం నను కించిదుష్ణం
త్యాజ్యం సదా పర్యుషితం చ శీతం।
స్వాపే ద్దివా నప్రిపిబే త్పపంక
మంబుత్యజే జ్జాగరణం నిశీథే॥ ॥౧౭౯॥

చక్కగా పక్వమయినట్టియు, కొంచము వెచ్చగా (గోరువెచ్చగా) నున్నట్టియు వస్తువులను భుజింపవలెను నిన్నటిపదార్థమును పాసిపోయినను, కుళ్ళిపోయిన పదార్థమును తినరాదు పగటిభాగమందు నిద్రింపరాదు. మురికినీరు త్రాగకూడదు. రాత్రి మేల్కొనగూడదు ॥౧౩౯॥

శ్లో॥ పరాన్నేన ముఖం దగ్ధం హస్తౌ దగ్ధౌ ప్రతిగ్రహాత్ ।
పరస్త్రీభిర్మనోదగ్ధం శాపశక్తిః కుతః కలౌ ॥ ॥౧౮౩॥

పరాన్నభుక్తిచే ముఖమున్ను, ప్రతిగ్రహదోషముచేహస్తమున్ను, పరస్త్రీలచే మనస్సున్ను, తగులబెట్టబడుచున్నవి. అగుచుండగా వాక్శుద్ధి ఎక్కడిది.

శ్లో॥ శతం విహాయ భోక్తవ్యం సహస్రం స్నానమాచరేత్ ।
లక్షం విహాయ దాతవ్యం కోటిం త్యక్త్వాహరిం భజేత్ ॥౧౮౧॥

నూరుమెతుకులను విడిచిపెట్టి భోజనమును, వేలకొలది బిందువులచే స్నానము ను, లక్షమును విడిచిపెట్టి దానమును, చేయవలెను. జపము చేయునప్పుడు తావళి మునందలి మేరువుపూసను విడిచిపెట్టి లెఖ్ఖ చూచుకొనవలెను.

శ్లో॥ విషస్య తైలస్య నకించిదతరం
మృతస్య సుప్తస్య నకించిదంతరం।
ఋణస్య దానస్య నకించిదంతరం
ద్విజస్య దేవస్య నకించిదంతరం॥ ॥౧౮౨।

నూనెకును విషమునకున్ను, నిద్రించినవానికిన్ని చనిపోయినవానికిన్ని, దానము నకును బదులునకున్ను, దేవునకును బ్రాహ్మణునకున్ను, స్వల్పతారతమ్యము. ॥౧౮౨

శ్లో॥ స్వయం హిపాకః పచనియఏవ
స్వబంధుభి శ్శోత్రియముఖ్యవర్గైః
దారైశ్చ పుత్రైరథవాప్యశిష్యైః
కృతస్స్వయం పాకవదేవ భూయాత్ ॥ ॥౧౮౩॥

సామాన్యముగా ప్రతిమానవుడును స్వయముగా వంటచేసుకుని భుజింపవలె ను. అయినప్పటికిన్ని తనబంధువులు శ్రోత్రియులు ముఖ్యవర్గము భార్య పుత్రుడు త నయొక్క శిష్యులు వీరిచేచేయబడిన వంట తను స్వయముగ చేసుకొన్నట్లే అగును.

శ్లో॥ వాషండదీనశ్చథతాల్పరుగ్ణాం
దృష్టిర్నిషిద్ధా నిషుసే వరాణాం।
మాతా పితృస్వీయ వధూపిప్రియాణాం
సూదస్య వైద్యస్య శుభైవ దృష్టిః॥ ॥౧౮౪॥

భోజనకాలమందు నపుంసకులు, దీనులు. ఆకొన్నవారు, నీచులు రోగముగ లవారు వీరలయొక్కదృష్టి దోషభూయిష్టమైనది తల్లి తండ్రి తనభార్య స్నేహితు లు, వంటవాడు, వైద్యుడు వీరలయొక్క దృష్టి దోషరహితమయినది

శ్లో॥ నోచ్ఛిష్టశంకా మధుపర్క సోమ
ఫలేక్షుతాంబూలపరిగ్రహేషు।
భుక్త్వాంతధౌతాంగుళినంయుతాజ్యే
బాలేషు వృద్ధేషు హావిర్మఖేషు॥ ॥౧౮౫॥

వివాహకాలమున చేయబడు మధుపర్కప్రాశన (పెరుగు మొదలయినవి) సోమపానము, ఫలములు, చెరకుకర్రలు తాంబూలము, భోజనముచేసి చేతిని కడుగుకొనినతరువాత చేతిని దిగబడిన చమురు, బాలురు, వృద్ధులు హవిస్సు (హోమమునిమిత్తమువండిన అన్నము మొదలయినవి) వీటికి యెంగిలిలేదు ॥౧౮౫॥

శ్లో॥ తస్మాత్కుంభశతం జలం పరిహరేత్కూపాదిదోషే తదా
దద్యాత్తత్ర చ పంచగవ్య మసకృత్క్షీరం చ సర్పిః పచేత్।
ప్రోక్ష్య క్షౌమకటాది తూలమలినే సంశోధయే దాతపే
హస్తోచ్ఛిష్టజలం పదంబుపతనాద్దంశేషు సంస్పృశ్యతా ॥౧౮౬॥

నూతులు చెరువులు మొదలయినవి అపవిత్రతనొందినప్పుడు అట్టివాటినుండి నూరుకడవలజలములు ఎత్తి పారబోసి శేషించిన నీరుగల కూపాదులయందు పంచగవ్యమును చల్లవలెను. (గోమహిమవద్ద యీపంచగవ్యము చెప్పబడినది) పాలు నెయ్యి కాచుటచేతను పట్టుబట్టలు చాపలు మొదలయినవి దూది నీళ్ళుచల్లి ఎండవేయుటవల్లను ఎంగిలిచెయ్యి కడిగినదగ్గర కాళ్ళుకడుగుకొనుటచేతను శుద్ధియగుచున్నది. యీగలు మొదలయినవి ఒకరినుండి ఒకరికి ఎంగిలితాకించినను అపవిత్రపదార్థములను స్పృశించి పవిత్రపదార్థములను స్పృశించినను దోషములేదు. ॥౧౮౬॥

శ్లో॥ మలస్య మూత్రస్య విసర్జనే స్త్రీ
సంగే ఋతుస్త్రీశ్వపచోక్తికాలే।
క్షౌరే శవోద్వాహవిధౌ గతౌ చ
వినిర్ణితాష్టస్వనిశం నివీతీ॥ ॥౧౮౭॥

మలమూత్రములను విడిచిపెట్టునప్పుడు సంభోగకాలమందు రజస్వలాస్త్రీలతోను చండాలురతోను సంభాషించునప్పుడు క్షౌరకాలమందు శవమును మోయునప్పుడు లోవనడచుచున్నప్పుడు యీయెనిమిదిపనులయందు ఎల్లప్పుడు నివీతి (దంధ్యములు పేరుగా ఉంచుకొనుట) చెప్పబడినది ॥౧౮౭॥

శ్లో॥ చండాలసూతికాతేయాపతితేభ్యో యథాక్రమం
ఏకం, ద్వే,త్రీణి, చత్వారి యుగాన్యుత్సృజ్యసంచరేత్ ॥౧౮౮॥

చండాలురు, సూతికాస్త్రీలు బహిష్టయినస్త్రీలు పతితులు (కులముచెడినవారు) వీరికి క్రమముగా 1-2-3-4 బండికాడులు దూరములువిడిచి సంచరించవలెను.

శ్లో॥ వ్యర్థైతా న్యవ్రతఘ్నాని గురోర్వచన మౌషధమ్।
బ్రాహ్మణస్యచ కామాయ కందమూలం జలం పయః ॥౧౮౭॥

గురువాక్యాచరణము, ఔషధము, బ్రాహ్మణుని యొక్క కర్మసంపూర్తి కందమూలములు ఉదకము పాలు వీటిని సేవించుటవల్ల యేవ్రతమునకున్ను భంగము కలుగ నేరదు ॥౧౮౭॥

శ్లో॥ అజ్ఞాతం శుచి సర్వమాపణిగతం భైక్షం గుడం మాక్షికం
శృంగం చర్మ పతత్రిఖండితఫలం కారోః కరం స్త్రీముఖమ్।
దంతస్థాః పృషత శ్చ వేదవిదుషా మాచామలేశాశ్శుభా
శ్శయ్యా వస్త్రవధూకమండలుసుతా స్స్వీయాశ్చ మేధ్యాస్సదా॥

అపవిత్రమయినట్టి మనకు తెలియనిది (మనము చూచేసరికి పవిత్రముగా నున్నట్టి) ప్రతివస్తువయు బజారునందు (గుకాణమందు) ఉన్నదియు, మధూకరాన్నము, బెల్లము తేనె, గొరగేదికొమ్ము కృష్ణాజినము చిలకకొట్టినపండు కంసాలియొక్క ముంజెయ్యి స్త్రీముఖము వేదోచ్చారణచేయునప్పుడు నోటనుండిపడెడు తుంపరలు ఆచమనముచేయునప్పుడు చెదరెడునీళ్ళు పక్కబట్ట భార్యకమండలము కుమారుడు వీరు ఎల్లప్పుడు పవిత్రతకలవారు. ॥౧౮౮॥

శ్లో॥ యజ్జలేన దివా పక్వం యత్పక్వం తుషయా సహ।
తత్సర్వం ఫలవద్జ్ఞేయం శలాట్వంబుసితాదయః ॥౧౮౯॥

ఉదకముతో ఉడకనిది, (కాల్చబడిన కందమూలాదులు) పొట్టుతోకూడా ఉడికినవి (అటుకులు) యీమొదలయినవిన్ని, పచ్చికాయలలోని నీరు, పంచదార మొదలయినవి ఫలములతో సమానము ॥౧౮౯॥

శ్లో॥ స్యా చ్చంచలం చిత్త మసత్యచారిణాం
తచ్చింతచాంచల్య మనాయు రాస్పదమ్।
తద్ధర్మసంస్థాపితసత్యవర్తనం
సౌఖ్యాధికారోగ్యచిరాయు రాస్పదమ్॥ ॥౧౯౦॥

అసత్యవాదులయొక్కయు, అసత్యప్రవర్తకులయొక్కయు, మనస్సు ఎల్లప్పుడున్ను చంచలముగా నుండును. ఆచిత్తచాంచల్యము ఆయుర్దాయమును హరించును గాన ధర్మనిర్ణీతమయిన సత్యవర్తనము సౌఖ్యమునకు, ఆరోగ్యమునకు, దీర్ఘాయుర్దాయమునకును ఆస్పదమగుచున్నది. ॥౧౯౦॥

శ్లో॥ ప్రాయస్స్వకృత్యేషు కరోతిమాయాం
సానన్యబాధా యది సత్యసంధః ।
సైవాన్యబాధా కృతసత్యసంధ
స్తదేవ సత్యానృత తారతమ్యమ్ ॥౧౯-౩॥

ప్రతివాడును తనయొక్క కృత్యమును నెరవేర్చుకొనుటలో కొంత మాయను కల్పనచేసినను అట్టిమాయ ఇతరులకు బాధకరము కానిచో సత్యసంధుడేయగును ఆమాయ ఇతరులకు బాధకరమైనచో అసత్యవర్తనము కలవాడగును, ఇదియే సత్యమునకును అనృతమునకున్ను గల తారతమ్యము. ॥౧౯-౩॥

శ్లో॥ జరా భవేద్దూరపరిశ్రమేణ
మార్గప్రయాణేన సదా నరాణాం ।
తస్మాన్న గచ్ఛేదతిదూరమార్గం
వినైవ శశ్వచ్ఛకటాదికంచ ॥ ॥౧౯-౪॥

దూరము నడచుట చేతను మార్గాయాసముచేతను ముదిమి కలుగుచున్నది గాన బండి మొదలయిన వాహనాది పరికరములు లేక దూరము వెళ్ళరాదు. ॥౧౯-౪॥

శ్లో॥ ధార్యాణి వస్త్రాణ్యతినిర్మలాని
శుచిప్రదేశేషు ప్రవాసితవ్యం ।
విలేపయేద్వాసిత వస్తుభిస్స్వ
దేహం శిరోజానపి సర్వదైవ ॥౧౯-౫॥

పరిశుభ్రములయిన వస్త్రములనుధరింపవలెను నిర్మలమయినప్రదేశములయందు నివసింపవలెను. పరిమళద్రవ్యములచే దేహమునకును శిరోజములకును లేపనము చేసుకొనవలయును ॥౧౯-౫॥

శ్లో॥ పక్షేచ పక్షే క్షురకర్మ తైలా
భ్యంగంచ వారే నియమేన కుర్యాత్ ।
న చర్మరోగాః ప్రభవంతి జాతు
శ్రోత్రేంద్రియస్యాధికసౌఖ్యతా స్యాత్ ॥ ॥౧౯-౬॥

పక్షమున కొకసారి క్షురకర్మ వారమున కొకసారి అభ్యంగనముచేయవలెను. ఇందువలన చర్మరోగములు పుట్టవు శ్రోత్రేంద్రియమునకు సౌఖ్యముకలుగును.

శ్లో॥ తైలాభ్యంగా త్తాప ఇ ర్కే కుజేంతం
జీవే నిస్వం భార్గవే స్యాద్విపత్తిః।
సోమే కాంతీ రౌహిణేయే సుసంప
త్సామ్రాజ్యశ్రీ ర్మందవారే నరాణామ్॥ ॥౧౯౭॥

అభ్యంగనము చేయుటకు ఆదివారము తాపమును, మంగళవారము మృతిని, గురువారము దరిద్రమును, శుక్రవారము విపత్తును, సోమవారము కాంతిని, బుధవారము సంపదను, శనివారము అఖండసామ్రాజ్యవైభవమును కలుగజేయును.

శ్లో॥ వాంతిక్రియా మ ప్యయనే న కుర్యా
న్మాసద్వయే నైవ విరేచనాని।
మాసేన నశ్యం త్రిదినైశ్చసంగం
వామేన శయ్యా శయనం పురస్తాత్॥ ॥౧౯౮

ఆరుమాసములకొకసారి వాంతిక్రియ, రెండుమాసములకొకసారి విరేచనసాధనము మాసమునకొకసారి నశ్యకర్మ మూడురోజులకొకసారి సంభోగము ప్రతిరోజూనా పరుండునప్పుడు ముందుగా ఎడమప్రక్కనుపరుండుట ఆచరింపతగినవైయున్నవి. ॥౧౯౮॥

శ్లో॥ దదాతి నిద్రా స్వశరీరపుష్టిం
ఉత్సాహశక్తిం జఠరాగ్నివృద్ధిమ్।
ఆహారజీర్ణం నిజధాతుశక్తిం
మనోవికాసం మృదుదేహకాంతిమ్॥ ॥౧౯౯॥

నిద్రవలన శరీరమునకు బలమును ఉత్సాహమును జఠరవృద్ధియు ఆహారము జీర్ణమగుటయు నరములకు సత్తువకలుగుటయు మనోవికాసమును దేహకాంతియు కలుగుచున్నవి ॥౧౯౯॥

శ్లో॥ ఆరోగ్యయుక్తస్తు సుఖేనభుక్త్వా
నిద్రాత్యజాన న్నపి చ స్వదేహాన్।
నారోగ్యతో న్యత్సుఖ మస్తికించి
త్తస్మాత్సమస్తై స్తదుపాసితవ్యమ్। ॥౨౦౦॥

ఆరోగ్యవంతుడు సుఖముగా భుజంపుచున్నాడు. సుఖముగా నిద్రించుచున్నాడు. కాన ఆరోగ్యముకంటె ఇతరమయినసుఖము ఇంకొకటిలేదు. సర్వజనుల ..లను ఆరోగ్యమే సంపాదించుకోతగినదై యున్నది. ॥౨౦౦॥

శ్లో॥ దివాకృతవ్యాపకదోషశాంత్యై
తద్వ్యాపకాంతే ముహురిష్టదైవమ్।
దుస్స్వప్నశాంత్యై శయనస్యపూర్వం
ధ్యాయే దనిద్రాస్థితికాలమేవ॥ ॥౨౦౧॥

ప్రతిమానవుడు తాను పగటిభాగమందుచేసిన జీవితవ్యాపారమునందు సంప్రాప్తములయినదోషములు ఉపశమించుటకై ఆయావ్యాపారమును ముగించుకొని నపిమ్మట దుస్వప్నములు రాకుండగలందులకు నిద్రవచ్చేవరకు తన యిష్టదైవమును ధ్యానము చేసుకొనుచుండవలెను. ॥౨౦౧॥

శ్లో॥ యః కాల మిత్థం నయతి ప్రవీణః
కరస్థ ఏవాస్య సుఖోపలంభః।
చికిత్సక స్యోపకృతిస్తు తస్య
నాస్త్యేవ ధర్మాచరణా దజస్రమ్॥ ॥౨౦౨॥

ఏమానవుడు ,తనజీవితమును యీప్రకారముగా గడుపుకొనుచుండునో ఆ మానవునకు సుఖము అరచేతియం దిమిడియుండును. పూర్వోక్తములయిన ధర్మముల నాచరించినవానికి చికిత్సకుని అవసరము యెన్నడును ఉండదు. (అనగా జీవితకాలము ఆరోగ్యముగానే ఉండుననుట) ॥౨౦౨॥

## —♦ సర్వరోగకర్మవిపాకం ♦—

శ్లో॥ దేవబ్రాహ్మణవైభవాపహరణా త్పాండుర్జ్వరో వా గురు
ద్వేషా ద్గుల్మ మపస్మృతి ర్గురుపరస్త్రీసంగమా దశ్మరీ।
చండాలీగమనా త్ప్రమేహ మథవా క్షుద్రాద్విజఘ్నాత్క్షయ
స్స్యాలా గోద్విజసంగమేన వధయా దత్తాపహారాదపి॥ ॥౨౦౩॥

దేవతలయొక్కయు బ్రాహ్మణులయొక్కయు ద్రవ్యమును అపహరించుటచేపాండువుగాని జ్వరముగాని గురుద్వేషముచే గుల్మరోగముగాని అపస్మారముగాని గురుభార్య పరస్త్రీలసంగమముచే అశ్మరీరోగము చండాలీసంగమముచే ప్రమేహము గాని క్షుద్రరోగములు గాని బ్రహ్మహత్యవలన క్షయ గోవు బ్రాహ్మణస్త్రీ వీరల సంగమముచే గాని వీరి వధచే గాని లేక యిచ్చినదానమును తిరిగి అపహరించుటచే గాని కూలరోగమున్ను సంప్రాప్తమగుచున్నది.

శ్లో॥ దారోత్సర్జనయా గ్రహణ్యాధిపతి ద్రోహేన వాత స్సురా
పానా త్పిత్త మనర్థవిత్తహరణా చ్ఛ్లేష్మాకృతఘ్నాదితః ।
పుష్పిణ్యా గమనా ద్భృదగ్ని విషదా దామానిల శ్లీపదం
గోత్రస్త్రీగమనా ద్భగందరమపి వ్యర్థాలపాత్కుష్ఠకా ॥ ౨౦౪॥

పతివ్రతయగు భార్యను విడనాడుటచే గ్రహణీరోగము అధికారిని మోసపుచ్చుటచే వాతరోగము, సురాపానముచే పిత్తరోగము, దరిద్రుల ధనమును అపహరించుటచేతనున్ను ఇతరులవల్ల పొందిన మేలును మరచుటవల్లనున్ను శ్లేష్మరోగమున్ను బహిష్టయిన (ముట్టయిన) స్త్రీలతో భోగించుటవలన హృద్రోగమున్ను, అగ్నిప్రయోగ విషప్రయోగములచే ఆమవాతమున్ను స్వగోత్రస్త్రీని భోగించుటవలన శ్లీపద వ్యాధి (బోద) గాని భగంధరవ్యాధి గాని వ్యర్థమయిన లేక (కఠినమయిన) సంభాషణమువల్ల కుష్టురోగమున్ను సంప్రాప్తమగుచున్నవి, ॥౨౦౪॥

శ్లో॥ హింకా నిత్యజపాగ్నిహోత్రవిరహా తృష్ణా పానీనాశా దుదా
వర్తం దాహ మదాహతః కృపణతా౽జీర్ణం స్వకర్మా స్మృతేః।
ఉన్మాదం వమనం కదన్నవితరా హ్యూహ్యాం రుజా సంభవం
రుగ్ణాం కర్మవిపాక మప్యనుదితం జారత్వ చౌర్యాదిభిః ॥ ॥౨౦౫॥

ప్రతిరోజు నా చేయవలసిన షట్కర్మపరిత్యాగము అగ్నిహోత్రపరిత్యాగము వీటివలన హిక్క నూతులు చెరువులు మొదలయినవాటిని పాడుచేయుటచే ఉదావర్తము దాహమివ్వకపోవుటచే తృష్ణ లోభత్వముచే అజీర్ణము స్వకర్మత్యాగముచే ఉన్మాదము పురుగులు పట్టినట్టి గాని పాసిపోయినట్టి గాని కుక్కలు కాకులు మొదలయిన వాటిచే ముట్టబడినట్టి గాని అన్నాదులను ఇతరులకు పెట్టుటచే వాంతి సంప్రాప్తములు అగుచున్నవి. మరియు ఇందు పేర్కొనబడని జారత్వ చోరత్వాది దోషములచే సంప్రాప్తములు కాతగిన వివిధ వ్యాధులు ఊహ్యాంబులు ॥౨౦౫॥

## —•స్వ ల్పా యు ర్ల క్ష ణ ము లు.•—

శ్లో॥ రాత్రౌ దాహో భవతి చ దివా జాయతే శీతలత్వం
కంఠే శ్లేష్మా పిరసవదనః కుంకుమాకారనేత్రే ।
కృష్ణా జిహ్వా వహతిచ సదా స్థూల సూక్ష్మా చ నాడీ
తద్భైషజ్యం మనుజవితతే రామ రామేతి నామ ॥ ॥౧౦౬॥

రాత్రి భాగములయందు దాహము పగటి భాగములయందు శీతలము కంఠమందు శ్లేష్మము ముఖకళ మారిపోవుట కండ్లు ఎఱ్ఱబడుట నాలుక నల్లబడుట నాడి ఒకానొకప్పుడు లావుగాను, ఒకానొకప్పుడు సన్నముగాను నడచుట యిట్టి లక్షణములుగల రోగికి రామ నామ స్మరణకంటె ఔషధ మింకొకటి లేదు. (అనగా అసాధ్యరోగముల యందు భగవన్నామస్మరణమే కర్తవ్య మనుట.)  ॥౨౦౮॥

శ్లో॥ సుహృత్కస్య శ్యామ కోష్టో ప్యసితరదతతి శ్శీతనాసాప్రదేశ
శ్శోణాక్షశ్చైక నేత్రో లులితపదకర శ్రోత్రపాతిత్యయుక్తః।
శీతస్వాసో ధవోష్ణ శ్శ్వసనసముదయ శ్శీతగాత్రప్రకంప
స్స్వేదో నిష్ప్రపంచః ప్రభవతి మనుజస్సర్వదా మృత్యుకాలే॥

నోరెండుట పెదవులు దంతములు నలుపెక్కుట ముక్కుదగ్గర (శ్వాస) చల్లబడుట ఒకకన్ను మూయబడియు ఒకకన్ను తెరవబడియు యుండుట, కాళ్ళు చేతులును పట్లువదలినట్లుండుట చెవులు వ్రేలబడుట శ్వాస చల్లగాగాని వెచ్చగాగాని వచ్చుట అయాసము శరీర మెత్తి కుదవేయుట భయోత్పాతము కలుగుట, కర్తవ్యాకర్తవ్యజ్ఞానము లేకుండుట యిట్టిలక్షణములుగల రోగికి మరణమాసన్నమయినదని తెలియవలయును  ॥౨౦౭॥

శ్లో॥ స్వేదో లలాటే హి భవే న్నరస్య
సీతార్ధి తస్యాపి సుపిచ్ఛిలస్య।
కంఠస్థితం శ్లేష్మకృతప్రయత్నై
ర్బహిర్నయా త్యంతరపి మ్రియేత సః॥  ॥౨౦౨॥

ఏరోగికి శరీరము చల్లబడి ముఖమున చమటయు దేహమున జిగటయు ఎన్ని విధములచికిత్స చేసినను కంఠగతమయిన శ్లేష్మము పయికిగాని క్రిందికిగాని కదలక యుండునో అట్టిరోగి శీఘ్రకాలమున మృతినొందును.  ॥౨౦౫

శ్లో॥ ఏకం రౌద్రం చ భుగ్నం వికసిత మపరం మీలితం యస్యచక్షు
స్తారా వా యన్నపశ్యే న్నకిమపి కుటిలం చోర్ధ్వగం
యస్య వా స్యాత్।
రౌద్రం యః పీతకేవా భ్రమియుతమధవా కంపయుక్తాథ కోవా
దృష్టి ర్యస్యాత్రసాధ్యోనభవతి మనుజోరోగయుక్తః కదాచిత్

రోగికి ఒక్క నేత్రముమాత్రము తెరచికొనియుండి భయంకరముగాను వికారముగాను వంకరగాను చూచుచు రెండవకన్ను మూతపడి ఒక వేళ తెరచినయడల నల్లగుడ్డుకనపడకపోయినను మరియు వంకరగాను పైకి ఈడ్చినట్లున్ను భయంకరముగాను నల్లగుడ్డునకు వణుకుకలిగియు చూచినయడల అట్టిరోగము అసాధ్యమయినదని తెలియవలయును. ॥౨౦౯॥

శ్లో॥ కూర్చభ్రూయుగనాసికాగ్రరసనావక్త్రస్థలావర్ణనం
ప్రాణోష్ఠస్య కృశాజ్ఞతా శ్రుతిరనా శక్తిర్న చాశాశనే।
వ్యాహారశ్రవణాక్షమత్వ ముభయోష్ఠాలంబనాస్పందనే
పక్ష్మక్లిష్టివిజృంభణే తనురుహాస్యపరిచ్యుతి స్స్యా న్మృతిః॥౨౧౦॥

కనుబొమ్మలమధ్యప్రదేశము కనుబొమ్మలు నాసికాగ్రము నాలుక ఇవికనుపించకపోయినను ముంచేయి ఎక్కడ లావుగనున్నదో ఎక్కడ సన్నముగనున్నదో తెలియకపోవుట చెవులుమూసుకొనినచో హోరు వినబడకుండుట, భోజనమందు (అయిష్టము) అపేక్షలేకయుండుట (ఏవగింపు) ఎదటివారుచెప్పినమాట వినుటయందు అయిష్టము ఊర్ధ్వాధరోష్ఠములు రెండిటియొక్కయు వ్రేలాడుటగాని చలించుట కనురెప్పలు లోనికిడుచ్చుకొనిపోవుట లేక విస్తరింపునొందుట రోమకూపములనుండి రక్తముస్రవించుట వీటివలన మరణమాసన్నమయినదని తెలియవలెను. ॥౨౧౧॥

శ్లో॥ బద్ధం శ్యామం నితాంతం మరుతి సకుపితే పిత్తకోపేతుపీతం
పానీయాభం సఫేనం కఫరుషిచ మలం సాంద్రపాండువర్ణమ్।
రక్తే వృద్ధే స రక్తం జలనిభమథ తద్ద్వంద్వరోగే ద్విలింగం
సర్వై ర్దోషై స్స రోషై ర్భవతి కిలమలం రోగిణ స్సర్వలింగమ్

మలము వాతప్రకోపమున నల్లగాను పిత్తప్రకోపమున పచ్చగాను, కఫప్రకోపమున నీటివలెను నురుగుతోను గట్టిగాను తెల్లగాను రక్తప్రకోపమున రక్తవర్ణముకలిగి నీటితో సమానముగాను ద్వంద్వప్రకోపమున ద్వంద్వచిహ్నములు కలిగియు త్రిదోషప్రకోపమున సర్వచిహ్నములు కలిగియు ఉండును. ॥౨౧౧॥

శ్లో॥ దుర్గంధంశ్యామవర్ణం మలమరుణనిభం పాండురాభంవిచిత్రం
మాంసాంభ మేచకం తత్ప్రభవతి మరణాయైవ రోగాన్వితస్య।
విస్రం శైథిల్యయుక్తం ముహు రతినిపత త్స్యా దజీర్ణాచ్చవర్చో
దిశ్మాత్రం చైత దేవం నిగదిత మగదై ర్లక్షణం వర్చసోఽపి॥

మలము దుర్గంధముగాను, నల్లగాను, కొంచము ఎర్రగాను, లేక తెల్లగాను, అనేకరకములయిన రంగులు కలదిగాను. మాంసమువలెను, బూడిదవలెను ఉన్నచో అట్టివాడు జీవింపడు అజీర్ణమునందు మలము పెంటికలుగాను శిథిలముగాను అనేక సార్లుగాను అగును. ॥౨౧౨॥

— దీర్ఘాయుర్లక్షణములు —

శ్లో॥ సౌమ్యా దృష్టి ర్వదతి విమలం హస్తపాదౌ సకోష్ణౌ
స్వల్పో దాహస్సురసవదనః కోమలా యస్య జిహ్వా।
నాసా శ్వాసో వహతి సరళం స్వేదహీనో జ్వరో సౌ
సాధ్యో రోగీ భవతి నియతం వైద్యభైషజ్యయోగ్యః॥ ॥౨౧౩॥

నిర్మలమయినదృష్టి మంచిమాటలు కాళ్ళు చేతులు వేడిగానుండుట స్వల్పదాహము ముఖము కళగలిగియుండుట నాలుకకు రుచి తెలియుట శ్వాసలు సరళముగానడచుట చమటపట్టకుండా జ్వరమువచ్చుట యీలక్షణములుగలరోగి చికిత్సచేయుటకు తగినవాడు. ॥౨౧౩॥

శ్లో॥ దేహో లఘుత్వాశ్రమగతక్లమమోహతాపాః
పాకో ముఖే కరణసౌష్ఠవ మవ్యథత్వమ్।
స్వేదః క్షుతం ప్రకృతియోగమనోన్నలిప్సా
కండూశ్చమూర్ధ్ని విగతజ్వరలక్షణాని॥ ॥౨౧౪॥

దేహము చులకనగానుండుట, శ్రమ, మోహము, తాపము ఇవిలేకుండుట ముఖము వికాసముగానుండుట, దేహముతేలికగానుండుట యేవిధమయినబాధలులేక చమటపట్టుట తుమ్మువచ్చుట మనస్సు యథాస్థితిగానుండుట అన్నముయందభిలాష తలయందు దురద యీలక్షణములు కలిగినచో జ్వరము మళ్ళినట్లు తెలియనగును.

శ్లో॥ యస్య నిద్రా సుఖేన స్యా త్శరీరం సోద్యమం భవేత్।
ఇంద్రియాణి ప్రసన్నాని సరోగీ నైవ నశ్యతి॥ ॥౨౧౫॥

సుఖముగా నిద్రపట్టుట పనులయందాసక్తి కరచరణాద్యంగములు పటుత్వముకలిగియుండుట యిట్టిలక్షణములుగలరోగి తప్పక జీవించును ॥౨౧౫॥

— మూత్రపరీక్ష —

శ్లో॥ మంజిష్ఠాభం ధూమ్రవర్ణం చ నీలం
స్నిగ్ధం మూత్రం వారితుల్యం చ నీకమ్।
జ్ఞాత్వాచిత్తే బుద్ధిమాన్మానుషాణాం
కుర్యా త్తత్వం భేషజం రోగిణాం చ॥ ॥౨౧౬॥

మూత్రము మంజిష్ఠరంగు (ఎర్రరంగు) కలిగియు పొగరంగు గలిగియు చిక్కదనముకలిగియు నీటివలెను చల్లగానుఉన్నయెడల అట్టిరోగికి చికిత్సచేయవలెను

శ్లో॥ నీలం చ రూక్షం కుపితే చ వాయౌ
పీతారుణం తైలసమంచ పిత్తే।
స్నిగ్ధం కఫే పల్వలవారితుల్యం
స్నిగ్ధోష్ణరక్తం రుధిరప్రకోపే॥ ॥౨౧౭॥

రోగియొక్క మూత్రము వాతప్రకోపమువల్ల నల్లగాను, పలుచగాను పిత్తప్రకోపమున పచ్చగాను యఱ్ఱగాను నూనెవలెను కఫప్రకోపమున బంకగాను బురదవలెను రక్తప్రకోపమున వెచ్చగాను బంకగాను ఎఱ్ఱగాన ఉండును. ॥౨౧౭॥

శ్లో॥ పిత్తానిలే ధూమ్రజలాభ ముష్ణం
శ్వేతం మరుచ్ఛ్లేష్మణి బుద్బుదాభమ్।
సశ్లేష్మపిత్తే కలుషం సరక్తం
జీర్ణజ్వరేసృక్పృదృశంచ పీతమ్॥ ॥౨౧౮॥

పిత్తవాతప్రకోపమున పొగరంగుగలనీళ్ళవలెను వెచ్చగాను వాతకఫప్రకోపమున నురుగగాను కఫపిత్తప్రకోపమున రక్తవర్ణముకలిగియు జీర్ణజ్వరమున ఎఱుపు పసుపు గంగుగను ఉండును. ॥౨౧౮॥

—♦ తైల బిం దు ల క్ష ణం —

శ్లో॥ వికాసిచే త్తైల ముథాసుమూత్రే
సాధ్య స్సరోగో నవికాసితం చేత్।
స్యాత్కష్టసాధ్యో యదిమగ్న మేవాఽ
సాధ్య శ్చికిత్సాం ప్రతి వైద్యకస్య॥ ॥౨౧౯॥

మూత్రమున విడిచిపెట్టబడిన తైలబిందువు బాగుగావికసించినయడల ఆరోగము సాధ్యమనియు వికసించనియడల కష్టసాధ్యమనియు మునిగినయడల అసాధ్యమనియు తెలియనగును. ॥౨౧౯॥

శ్లో॥ ప్రాక్ప్రత్యగాశా సరణాత్సుసౌఖ్యం
యామ్యప్రసారా దగదేనసౌఖ్యం।
ఉదక్ప్రసారా త్పరిపక్వరుక్త్వం
విదిక్ప్రసారా న్మరణం చ వింద్యాత్॥ ॥౨౨౦॥

మూత్రమున విడువబడిన తైలబిందువు పూర్వదిక్కునకుగాని పశ్చిమదిక్కునకుగాని వ్యాపించినయెడల దానంతట అదియే సుఖముకలుగుననియు దక్షిణదిక్కునకువ్యాపించినయెడల ఔషధసేవచే సుఖముకలుగుననియు ఉత్తరదిక్కునకు వ్యాపించినయెడల రోగము రహితమయినదనియు విదిక్కులకు వ్యాపించినయడల మరణము కలుగుననియు తెలియనగును. ॥౨౨౦॥

ఇతి చిత్రాగదసంగ్రహాఖ్యే శ్రీ సోమయాజిసత్పథే
(సత్పథ ప్రకరణేషు)
పరిభాషా ప్రకరణమ్. శ్రీ శ్రీ శ్రీ.

శ్రీగణేశాయ నమః

# చిత్రాగదసంగ్రహాఖ్యే

# సోమయాజిసత్పథే

## శరీరప్రకరణమ్



శ్లో॥ భవంతి సర్వాణి జగంతి యస్మా
త్పునర్విలీయంతి జగంతియస్మిన్।
త మక్షరం శాశ్వత మేవ వందే
సమీరమార్గైకవిరాజమానమ్॥ ॥౧॥

సమస్తలోకములు యెవనివలన పుట్టి తిరుగ యెవనియందు లీనమగుచున్నవో శాశ్వతుండును కేవల వాయుమార్గసంచారియునగు అట్టిపరమాత్మకు నమస్కారము.

శ్లో॥ అనుక్షణం ప్రాణిగణావనాయ
వేదస్సమస్తోపి శరీరముఖ్యః।
దేహ శ్చికిత్సార్థతయైవ యస్మా
త్పురా తదుత్పత్తి ముదాహరామః॥ ॥౨॥

ప్రతిక్షణము ప్రాణికోటిని సంరక్షించు వైద్యశాస్త్రమంతయు శరీరముపైన ఆధారపడియున్నది. ఆశరీరము అనేకవిధములైన రోగములకు మూలాధారమగుటచే ముందుగా శరీరోత్పత్తినిగురించి ఉదహరింపుచున్నాను ॥౨॥

### శరీరభాగములు

శ్లో॥ త్రేధా విభాజ్యం నృశరీరమాద్యం
శిర స్తథా గ్రీవగుదం ద్వితీయమ్।
హస్తౌ చ పాదౌ తదను తృతీయం
వక్ష్యంతి భాగా స్త్రితయే క్రమేణ॥ ॥3॥

మనుష్యశరీరమును మూడుభాగములుగా విభాగింపవచ్చును. అందు మొదటిభాగము తల, రెండవభాగము మొండెము, మూడవభాగము కాళ్ళు చేతులు వీటియందలిభాగములు క్రమముగా చెప్పబడుచున్నవి.

—♦ శిరస్సు ♦—

శ్లో॥ ధీమూలమస్తిష్క మముత్రశీర్షే
స్థితం ద్విభాగా స్థ ఇమోత్తమాంగే।
ఆద్యం కపాలం వలయాంకృతీకం
పేటీవ దష్టాస్థివినిర్మితంసత్॥ ॥౪॥

బుద్ధికి కారణమయిన మెదడు తలలోపలనున్నది. యీతలయందు రెండుభాగములుగలవు. అందు మొదటిది కపాలము (పుర్రె) ఇది యెనిమిది యెముకలచే నిర్మింపబడి గుండ్రనిఆకారముగలిగి పెట్టివలెనున్నది. ॥౪॥

శ్లో॥ అస్థీని తాని క్రకచస్థదంత
న్యూతాని వాన్యోన్యసమన్వితాని।
తత్సంధయః పోతకపోలభాగే
పశ్యంతి తేஉమీ క్రమశః ఖిలాస్స్యుః॥ ॥౫॥

ముందుచెప్పబడిన ఎముకలు యెనిమిదిన్ని అంపపుపండ్లవంటి పండ్లుకలిగి ఒకదానిలో ఒకటి ఇమిడియున్నవి యీఅతుకులు పశిబిడ్డలతలలో కనబడుచున్నవి. పెద్దవారయినకొలది యీఅతుకులు కానరావు ॥౫॥

శ్లో॥ ద్వితీయభాగం ముఖమేవశీర్ష
శ్చతుర్దశాస్థీని ముఖోర్ధ్వభాగే।
షట్సంఖ్యయా ద్వాదశపార్శ్వగాని
కపాలభాగం చుబుకాస్థిచైకమ్॥ ॥౬॥

తలయందలి రెండవభాగము ముఖము. యీముఖముయొక్క పైభాగమందు ఒక్కొక్కప్రక్కకు అరుచొప్పున పన్నెండుయెముకలు ఉన్నవి. గడ్డమంతయు ఒకటేయెముకగా ఉన్నది. ॥౬॥

శ్లో॥ చతుర్దశాస్థి ష్వధమాస్థి చైకం
చల త్యజస్రం శ్రవణాంత సూతమ్।
దంతా స్సమంతా దధరోర్ధ్వతాల్వో
శ్శరీరసంరక్షకభక్షణార్థాః॥ ॥౭॥

పైకెగానున్న మొదటిదియగు కపాలభాగమునందలి అడుగుయెముక ఒకటి ఇరుపార్శ్వములయందును పైదవడలకు సంబంధించిన యెముకలు పన్నెండు. గడ్డముగానున్న యెముక ఒకటి ఇవన్నియు కలసి పద్నాలుగు వీటిలో ఇరుప్రక్కలా ఉండు చెవులదగ్గర అమర్చబడి గడ్డపుటెముక మాత్రము కదలికగలిగియున్నది. దౌడలకు కిందిభాగమందును పైభాగమందును శరీరసంరక్షణకు కావలసిన పదార్థభక్షణముకు తగినపండ్లు ఇమిడియున్నవి. ॥౭॥

—♦ మొండెం ♦—

శ్లో॥ త్రయోత్తరత్రింశదియం కశేరు
ర్మాలేవ తత్రోర్ధ్వగతా న్యథాని।
ఏకత్ర తాని గ్రథితాని చేత్స్యు
రేకాస్థివ న్మధ్యబిలాన్వితాని॥ ॥౮॥

వెన్నెముక ముప్పదిమూడు పూసయెముకలచే దండగా నిర్మింపబడినది. యీ వెన్నెముకదండయందు పైపూసలు క్రమముగా చిన్నవి మధ్యభాగమున రంధ్రములుగల ఈపూసయెముకలు ఒకదండగానిర్మింపబడినచో ఒక్క ఎముకవలెనుండును

శ్లో॥ కశేరుకాయా ముపరిస్థితాని
సప్తాఽల్పకుల్యాని శిరోధిరాసన్।
శిరో వహత్యేష శిరోధిరస్యాఽ
ధస్తా స్థితో ద్వాదశకుల్యసంఘః॥ ॥౯॥

వెన్నెముకలలో పైభాగమందున్న ఏడుపూసలు మెడ అని చెప్పబడుచున్నది. ఇది తలనుమోయుచున్నది. ఈ మెడకు క్రిందిభాగమున పన్నెండుపూసలు ఉన్నవి.

శ్లో॥ తద్ద్వాదశాస్థీని చ పార్శ్వకుల్యైః
స్సంబంధ మాపాద్య వహంతి కాయమ్।
ఊర్ధ్వోర్ధ్వబద్ధాని వహంతి మధ్యం
పంచాల్పకుల్యా న్యధమస్థితాని॥ ॥౧౦॥

పైనిచెప్పబడిన పన్నెండుపూసలున్ను ప్రక్కయెముకలతో సంబంధముకలిగి శరీరమును మోయుచున్నవి. (అనగా నిలబెట్టుచున్నవి) వీటికి కింద భాగమందున్న అయిదుపూసలు నడ్డి అని చెప్పబడుచున్నవి. ॥౧౦॥

శ్లో॥ శిశౌ ప్రవృద్ధే సతి మధ్యమాధః
కుల్యాని పంచైక విధాస్థి భూయాత్।
త్రికం తదేవాస్యతురీయకుల్య
చతుష్టయం చైకవిధాస్థి సాగ్రమ్॥ ॥౧౧॥

పిల్లలు పెద్దవారయినప్పుడు నడుముక్రిందనున్న అయిదుపూసలుకలిసి ఒకపూసవలె అగును. దీనికే త్రికాస్థి అనిపేరు. ఈత్రికాస్థి చివరనుండు నాలుగుపూసలున్ను కలిసి తోకవంటి ఒకపూసవలె అగుచున్నవి ఇదియే తోంటిక ॥౧౧॥

శ్లో॥ త్రయోత్తరత్రింశదమూని భూయః
షడ్వింశదస్థీని భవంతి చైవమ్।
పార్శ్వాస్థితద్వాదశకుల్యసంఘా
కశేరుకాహ్వాత్తనుసప్తకుల్యా ॥౧౨॥

పైన చెప్పబడిన ముప్పదిమూడుపూసలున్ను మెడపూసలు ఏడు, మెడకింద పూసలు పన్నెండు. నడ్డిపూసలు అయిదు, త్రికాస్థి ఒకటి, తోంటిక ఒకటి, యీప్రకారము యిరువైఆరుగా మారిపోయినవి నడ్డివైపున ఒక్కొక్కప్రక్కకు పన్నెండుగా యున్న ఎముకలతోను రొమ్మువైపున ఏడుయెముకలతోను వెన్నెముక కలసియున్నది ॥౧౨॥

శ్లో॥ హృదగ్రసంయుక్త మృదూపకుల్య
స్యాత్ శ్చ పంచాస్థిచయ స్తతోహి।
ఉచ్ఛ్వాసనిశ్వాసగతౌ తదేత
త్పంచాస్థిబృందం చలతి ప్రకామమ్॥ ॥౧౩॥

రొమ్ముయొక్కచివరనుండెడు మెత్తని ఉపాస్థితో అయిదుయెముకలు ఇమిడియున్నవి. అందువల్లనే ఉచ్ఛ్వాసనిశ్వాసములయందు యీపంచాస్థిబృందము ధారాళముగా చలింపగలుగుచున్నది. ॥౧౩॥

శ్లో॥ కశేరుహృద్దండనిబద్ధ మేత
త్పార్శ్వాస్థిబృదం నలయాకృతీదం।
హృచ్ఛ్వాసకోశక్షతజాఽధినాళా
న్త్రిత్యజస్రం నిజమధ్యమస్థా ॥ ॥౧౪॥

వెన్నెముకతోను రొమ్మెముకతోను కట్టబడిన యీపార్శ్వస్థులగూట్టము పీపా కట్లవలె గుండ్రని ఆకారముకలిగియుండి తనమధ్యనున్న గుండెకాయనున్ను ఊపిరితిత్తులనున్ను పెద్దరక్తనాళములనున్ను కాపాడుచుండును. ॥౧౪॥

॥శ్లో॥ ఆద్యాది సప్తాంత మతిప్రవృద్ధం
అష్టాది చాఽద్వాదశ ఖర్వమేవం।
విశాలతల్పోన్నత పర్శుకాభ్యాం
హృదస్థిన స్తః ఖలు కంఠకుల్యే॥ ॥౧౫॥

యీపార్శ్వస్థులలో మొదటియెముక మొదలు ఏడవదానివరకు అంతకంతకు పొడవుగాను అచ్చటనుండి పన్నెండవదానివరకు అంతకంతకు చిన్నవిగాను ఉండును. విశాలముగాను బల్లపరుపుగాను ఉండు ప్రక్కఎముకలతో కంఠఎముకలు రొమ్మెముకనుండి వచ్చి కలియును ॥౧౫॥

—◆కాళ్ళు చేతులు◆—

శ్లో॥ ఏకైక పాదావయవే త్రిభాగా
ఊర్వస్థిజా న్వస్థిచ పాదకుల్యం।
ఏభ్యోన్యదల్పా స్థ్వభవ ద్ధిజానా
పూర్వాస్థి సజ్జీకృత మూర్ధ్వకాయాత్ ॥ ॥౧౬॥

ఒక్కొక్క కాలియందు తొడఎముక మోకాలుఎముక పాదపుఎముక అని మూడు భాగములు గలవు ఇవిగాక మోకాలుదగ్గిర ఒక చిన్నఎముక కలదు. తొడఎముకయొక్క పయిభాగము మొండెమునందు ఇమిడియున్నది ॥౧౬॥

శ్లో॥ అస్థిద్వయం తుంగ మతుంగ మేకం
తుంగంచ జానౌ పురతశ్చ వృత్తం।
అన్యోన్యసంబంధ మిదం ప్రసార
సంకోచయోగ్యం భవతి ప్రకామమ్ ॥ ॥౧౭॥

మోకాలియందు ఒకటి పెద్దదియు ఒకటి చిన్నదియు అగు రెండుఎముకలు ఉన్నవి, వీటికి ఎదుట గుండ్రముగానున్న ఇంకొక ఎముక ఉన్నది. దీనికి మోకాలుచిప్ప అనిపేరు. కాలు చాచుటకును ముడుచుటకును ఇది మిక్కిలి ఉపయోగించుచున్నది. ॥౧౭॥

శ్లో॥ అస్థీని షడ్వింశతి రంఘ్రిదేశే
జంఘేతు కుల్యాని భవంతి సప్త।
ఏకైకదోష్ణ్యంఘ్రివ దేవ భాగాః
ప్రగండకా పోఃశియాః కపోణ్యామ్ ॥ ॥౧౭॥

పాదములయందు యిరవైఆరు ఎముకలున్ను పిక్కలయందు ఏడుఎముకలున్ను కలవు. కాలివలె చేతియందున్ను మీచెయ్యి (జబ్బ) కూర్పరము (మోచెయి మొదలుగుత్తివరకు) అరిచెయ్యిఅని మూడుభాగములుగలవు ॥౧౭॥

శ్లో॥ ఏకాస్థివృత్తం ద్వితయం ప్రకోష్ఠే
త్వస్థీని చాష్టౌ మణిబంధభాగే।
ఏకోనవింశ చ్ఛయదేశ ఏవాం
ఉగుష్ఠేద్వయం చ త్రితయం విశిష్టె॥ ॥౧౮॥

మీచేతియందు గుండ్రనై పొడవైన ఒకఎముకయును కూర్పరమునందు రెండుఎముకలున్ను మణిబంధమందు (గుత్తియందు) యెనిమిది ఎముకలున్ను అరిచేతియందు పంధొమ్మిది యెముకలున్ను బొటనవ్రేలియంగు రెండుయెముకలున్ను మిగిలనవేళ్ళయందు మూడేసియెముకలున్ను కలవు. ॥౧౮॥

శ్లో॥ పంచైకయుగ్మాస్థియుతం నృకాయం
సర్వాంగసంధి ష్వపి సర్వతోపి।
బద్ధం సిరాభి స్తనుభి ర్మహద్భి
స్సంచారయోగ్యం సుఖజీవనార్హమ్॥ ॥౨౦॥

మానవుల జీవనమునకు తగి స్వేచ్ఛానుసారము సంచరించుటకు యోగ్యమైన శరీరము రెండువందలపదిహేను ఎముకలుగలిగి సర్వాంగసంధులయందున్ను సర్వశరీరమందున్ను సూక్ష్మమైనట్టియు దృఢమైనట్టియు సిరలచే కట్టబడి ఉన్నది ॥౨౦

—♦అస్థ్యాదివివరణము♦—

300 2 1 6 16 7 16 7 1 14
శ్లో॥అస్థ్యాం. తోర్ణం, ముక, కూర్చ, కండర, శలా, జాలా, శయు, ప్లీహ సం
7 3 2 1 1 14 1 7
ఘాత, త్వ, జ్మల వృక్క, పుప్పుస, యకృ, త్రీమంత, హృ, ద్ధాతవః
500 107 700 3 24 9 900
పేశీ, మర్మ, సిరా, శ్చ దోష, ధమనీ, స్రోతాంసి, చ స్నాయువ,
7 4 210
శ్వాస, స్సేవని, రజ్జు, సంధయు, అమీ, తే, సుమ్రతే, విస్తృతాః॥

యీశరీరమునగల అస్థులు, అంత్రములు, ఉందుకము, కూర్చలు, కండరములు శలలు, జాలములు, ఆశయములు, ప్లీహ, సంఘాతములు, త్వక్కులు, మలములు, వృక్కలు, పుప్ఫసము, యకృతు, సీమంతములు, హృదయము, ధాతువులు, పేశీలు, మర్మలు, సిరలు, దోషములు, ధమనులు. స్రోతస్సులు, స్నాయువులు, సేవనులు, రజ్జువులు, సంధులు, అనునవి సుశ్రుతశారీరభాగమున వివరింపబడినవి. ॥౨౧॥

## —♦ మూలప్రకృతి ♦—

శ్లో॥ మూలప్రకృతి రవ్యక్త మహద్గర్వాచలాదిగా।
చరాచరనిదానాభూ దష్టధా భోక్తృభోగ్యగా। ॥౨౨॥

మూలప్రకృతియనబడు అవ్యక్తము పృథివ్యాదిపంచభూతములకు కారణమై అవ్యక్తము, మహత్తు, అహంకారము, పృథివ్యప్తేజోవాయ్వాకాశ రూపమైన పంచతన్మాత్రలు అనబడు ఎనిమిదివిధములైన రూపమును పొంది స్థావరజంగమ స్వరూపమైన యీప్రపంచమునకు కారణమై సమస్తకర్మజీవులకు ఆధారమైయుండును

## —♦ మహదుత్పత్తి ♦—

శ్లో॥ ప్రకృత్యహంతా మమతాభిలాష
కర్మాత్మదుఃఖాని యథోత్తరాణి।
భవంతి దేహస్థితికారణాని।
సర్వాత్మనా గ్రంథివిభేదనే స్వమ్ ॥ ॥౨3॥

మూలప్రకృతివలన అహంకారము. దానివలన మమకారము, దానివలన విషయాభిలాష, దానివలన కర్మ, దానివలన శరీరము, దానివలన దుఃఖమును, యథాక్రమముగా ఒకదానివలన ఒకటి కలుగుచున్నవి. ఇవియే దేహధారణకున్ను దేహస్థితికిన్ని కారణములైయున్నవి. అన్నివిధములచేతనుకూడా గ్రంథిభేదమైనగాని స్వరూపవ్యాప్తి కలుగనేరదు. ॥౨౪॥

## —♦ అహంకారోత్పత్తి ♦—

శ్లో॥ త్రిగుణాత్మక మవ్యక్తా న్మహ త్తత్త్రిగుణాత్మకః।
అహంకార శ్చ త్రివిధః క్రమేణైవ ప్రజాయతే। ॥౨౫॥

అవ్యక్తము (మూలప్రకృతి) వలన సత్వ రజ స్తమోగుణాత్మకమయిన మహత్తత్వము (బుద్ధితత్వము)దానివలన సత్వ, రజ, స్తమో, గుణాత్మకమైన అహంకారమున్ను పుట్టుచున్నవి. ॥౨౦॥

—♦ పంచతన్మాత్రోత్పత్తి ♦—

శ్లో॥ సరాజసా త్సత్వయుతా త్తమోగుణా
త్తల్లక్షణోపేత సుఖాదిమాత్రాః।
భవ న్త్యమీషా మతిసూక్ష్మవత్వా
త్సుఖాదిభోగానుభవాతిరేకాః ॥ ॥౨౧॥

రాజసగుణసహాయము వలన సత్వగుణముతోకూడిన తామసాహంకారము వలన శబ్ద స్పర్శ రూప రస గంధములు అను పంచతన్మాత్రలు జనించును అవి అతి సూక్ష్మములగుట వలన సుఖ దుఃఖాతీత యోగ్యములయి ఉండును ॥౨౧॥

—♦ ఇంద్రియోత్పత్తి ♦—

శ్లో॥ సృష్టే ర్నిదాన మవ్యక్తం తన్మహ త్త్రిగుణాత్మకమ్।
అహంతా తతేంద్రియాణి మనసైకాదశా భవన్॥ ॥౨౨॥

అవ్యక్తమనగా సృష్టికిమూల కారణము అట్టి అవ్యక్తమువలన సత్వరజ స్తమో గుణాత్మకమైన మహత్తత్వము (బుద్ధితత్వము) జనించును. యీమహ త్తత్వమందు మమతయు, దానియందు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు, వాక్పాణి పాద పాయూపస్థలు మనస్సు అను పదమూడు ఇంద్రియములు జనించుచున్నవి. మహత్తత్వం (అహంకారము) అనగా హిరణ్యగర్భలింగదేహము మమత (అహంత) అనగా జీవునియొక్క లింగదేహము. ॥౨౨॥

—♦ ఇంద్రియస్వరూపమ్ ♦—

శ్లో॥ క్షేత్రజ్ఞ ఏష స్సుదుఃఖఃఖభోక్తా
కర్ణేంబరస్య త్వచి మారుతస్య।
దృశ్యర్చిషోపాం రసనేంద్రియే చ
ఘ్రాణే పృథివ్యాః ప్రథితాధిభాగః॥ ॥౨౩॥

సుఖదుఃఖభోక్తయగు క్షేత్రజ్ఞుడు శ్రోత్రమునందు ఆకాశభాగము, త్వక్కు (చర్మము) నందు వాయుభాగము, దృష్టియందు తేజోభాగము, జిహ్వాయందు ఉదకభాగము, ఘ్రాణమందు పృథివీభాగము, అధికముగాకలవాడై యుండును.౨౩॥

## —♦ఇంద్రియార్థ నిరూపణమ్♦—

శ్లో॥ త్వగాదికం తద్వ్యవహారశబ్ద
స్పర్శాదికం భౌతిక మామనంతి।
త ద్భ్వాది భూతప్రకృతే ర్వికారం
దధ్యాదిదుగ్ధా దివ త న్మయాఖ్యమ్ ॥ ॥౨౮॥

త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణములును ఈ ఇంద్రియముల యొక్క వ్యాపారము లయిన శబ్ద స్పర్శ రూప రస గంధములున్ను భౌతికములు. పృథివ్యాది పంచభూతముల యొక్కయు ప్రకృతి యొక్కయు వికారము పాలవలన పెరుగు మొదలయినవి వలె తన్మయమను పేరను పొందుచున్నవి. ॥౨౮॥

## —♦ ఇంద్రియములయొక్క విషయగ్రాహకత్వమ్♦—

శ్లో॥ ఇంద్రియే ణేంద్రియార్థం తు స్వం స్వం గృహ్ణాతి మానవః।
నియతం తుల్య యోనిత్వా న్నాన్యే నాన్య మితి స్థితిః ॥ ॥౨౯॥

జలము భూగానిర్మై జలప్రాంతమును పొందినట్లు భూతములుగూడ తమతమ యోనిప్రాంతములను పొందగలవగుటవలన మానవుడు శ్రోత్రాదీంద్రియములవలన శబ్దాది విషయములను నియతముగా గ్రహించుచుండును. గాని ఒక ఇంద్రియముచే అనియత మయిన మరియొక విషయమును గ్రహింపజాలడు ॥౨౯॥

## —♦బుద్ధ్యాద్యధిష్ఠాన దేవతలు♦—

శ్లో॥ వాయ్వ ర్క వరుణా వాని ధాత్రీ స్త్వగాదే
ర్వహ్ని శ్చేంద్రో విష్ణు మిత్రౌ స్వయంభూః।
బుద్ధే ర్బ్రహ్మాహంకృతే ర్మానసస్య
రుద్ర శ్చంద్ర స్స్వామిన స్స్యుః క్రమేణ ॥ ॥30॥

త్వక్కునకు వాయువు, చక్షుస్సునకు సూర్యుడు శ్రోత్రమునకు దిక్కులు జిహ్వకు వరుణుడు (ఉదకము) ఘ్రాణమునకు భూమి వాక్కునకు అగ్ని పాణికి ఇంద్రుడు, పాదమునకు విష్ణువు, పాయువునకు మిత్రుడు, ఉపస్థకు ప్రజాపతి, బుద్ధికి బ్రహ్మ, అహంకారమునకు రుద్రుడు, మనస్సునకు చంద్రుడు అధిపతులు,

—♦ తన్మాత్రవిశేషములు ♦—

శ్లో॥ శబ్ద స్స్పర్శ ంచ రూపంచ రసగంధా వనుక్రమాత్ ।
తన్మాత్రాణాం విశేషాస్స్యు స్థూలభావ ముపాగతాః ॥ ॥30॥

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, పంచతన్మాత్రలయొక్క విశేషంబులై యున్నవి. ఈశబ్దాదులు స్థూలభావమునుపొంది జీవకోటులనుభవించు సుఖదుఃఖమోహానుభవమునకు కారణములుగా ఉండును. ॥30॥

—♦ చతుర్వింశతితత్త్వములు ♦—

అవ్యక్తం మహ దప్యహంకృతి రథా చ్ఛబ్దాదయ స్తత్పరం
జ్ఞానాదీంద్రియపంచకంచ హృదయం కర్మేంద్రియా ణ్యద్వయః
భూతా ఇత్యుదితప్రకార మభవ త్తత్త్వై శ్చతుర్వింశతి
స్సర్వత్ర ప్రతిభాతి యోహి పురుషః పూర్వోక్తతత్త్వాధికః॥

అవ్యక్తము, మహత్తు, అహంకారము, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, త్వక్కు చక్షుస్సు శ్రోత్రము, జిహ్వ ఘ్రాణము, మనస్సు, వాక్కు పాణి, పాదము, పాయువు,(గుదస్థానము) ఉపస్థ, పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, అని యిరవైనాలుగుతత్త్వములు మూలప్రకృతియందును, తత్కారణములైన మహదాదులయందును (యిరవైనాలుగుతత్త్వములయందును) ప్రతిఫలించియుండును. యిరవైఅయిదవతత్త్వస్వరూపుడు పురుషుడు అని చెప్పబడుచున్నాడు. పృథివ్యాది పంచభూతములకు బదులుగా ప్రాణాదిపంచవాయువులు అను మతాంతరము కలదు. ॥31॥

—♦ జ్ఞానకర్మేంద్రియవిషయవివరణమ్ ♦—

శ్లో॥ జ్ఞానకర్మహృషీకాణాం శబ్దాద్యా విషయాః క్రమాత్ ।
భాషణాదానసంచార విసర్గానందనామకాః॥ ॥33॥

పై యిరవైనాలుగుతత్త్వములలో జ్ఞానేంద్రియములైన త్వగాదులకు క్రమముగా త్వక్కునకు స్పర్శము, చక్షుస్సునకు రూపము, శ్రోత్రమునకు శబ్దము జిహ్వకు రసము, ఘ్రాణమునకు గంధమును, కర్మేంద్రియములైన వాగాదులకు క్రమముగా, వాక్కునకు సంభాషణము, హస్తమునకు గ్రహణము, పాదమునకు గమనము, గుద

మునకు (పాయువునకు) మలోత్సర్జనము. ఉపస్థకు ఆనందమున్ను, (బుద్ధికి నిశ్చయము అంహంకారమునకు అభిమానము, మనస్సునకు సంకల్పవికల్పములు) విషయములు.॥33॥

## ప్రకృతివికృతిజన్య తాపత్రయమ్ (అధిభూతాదివివరణమ్)

శ్లో॥ శేముష్యహంకారమనోహృషీక
వర్గస్య తత్ర ద్విషయా స్స్వరూపాత్।
భోగాత్మకత్వా త్తుస్య రతోధిభూతా
ధ్యాత్మాధిదైవాః క్రియయా భవేయుః॥ ॥34॥

బుద్ధ్యహంకార, మనో, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములకు వాటివాటివిషయములగు నిశ్చయాదులు (జ్ఞానకర్మేంద్రియవిషయవివరణమున చెప్పబడినవి) విషయములు. యీబుద్ధ్యాదులు పంచభూతములయందు స్వరూపసంబంధముచే మిళితములై భోగసాధనములగుటవలన అధిభూతములనియు, శరీరమును ఆశ్రయించుటవలన ఆధ్యాత్మికములనియు, దేవతాసంబంధము కలిగియుండుటవలన అధిదైవతములనియు చెప్పబడును. ॥34॥

## ప్రకృతివికృతివివరణమ్

శ్లో॥ ప్రకృతి ర్నామ సర్వేషాం వికృతి ర్నామ తద్భవా।
ఉక్తేంద్రియాణి భూతాని వికారా షోడశాఽభవన్॥ ॥35॥

ప్రకృతి అనగా అన్నిటికిని (అవ్యక్తము, మహత్తు, అహంకారము, పృథివ్యాది పంచభూతములకున్ను) కారణము. వికృతి అనగా అవ్యక్తవ్యతిరిక్తములైన మహదాదులు ఏడున్ను పైన ఉదహరింపబడిన అవ్యక్తమునుండి పుట్టుటవలన యిదివరలో చెప్పబడిన ఇంద్రియములు పదకొండున్ను (జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, మనస్సులు) పృథివ్యాదివికారములు అయిదున్ను కలసి పదహారువికారము లగుచున్నవి.

## తత్త్వప్రకృతి

శ్లో॥ అచేతనావ్యక్తసముద్భవాని
తత్త్వాని భూయాన్సుగచేతనాని।
తథాపి తా న్యాయతనాని ఘ్రంస
స్సృగాదిమూలాని యథోదనాని॥ ॥36॥

అచేతనమైన అవ్యక్తమునుండి పుట్టుటచే అవ్యక్తదులైన యిరవైనాలుగు తత్త్వములుకూడ అవ్యక్తములే అగుచున్నవి. అయినప్పటికిన్ని అచేతనమైన ఆహారాది

కము జీవులయొక్క అభివృద్ధికొఱకు అయినట్టి యీతత్త్వములున్ను పురుషునికి సుఖ దుఃఖ కారణములు అగుచున్నవి. ॥౩౬॥

## —♦ ప్రకృతిపురుషసాధర్మ్యమ్ ♦—

శ్లో॥ ప్రకృతిః పురుష శ్చోభా వనాద్యంతా వలింగకౌ।
నిత్యా వస్యపరౌ సర్వ గతౌ వస్మా త్సధర్మకౌ॥ ॥౩౭॥

మూలప్రకృతి, పురుషుడు వీరిరువురున్ను కారణము, నాశము, ఆకారము, లే నివారున్ను, నిత్యులున్ను (అనగా భూతభవిష్యద్వర్తమాన కాలములయందుండువారు న్ను) వీరికంటె శ్రేష్ఠమైనదింకొకటి లేనివారున్ను అంతటను వ్యాపించియుండువా రున్ను అగుటచే ప్రకృతిపురుషులిరువురికిన్ని అనాదిత్వాదిధర్మములు, సమానములు గాన సాధర్మ్యము అని చెప్పబడుచున్నది ॥౩౭॥

## —♦ ప్రకృతిపురుషులకు వైధర్మ్యమ్ ♦—

శ్లో॥ మహదాదీనాం మూలత్వా చ్చరాచరవిజృంభణాత్।
సుఖాదిభుక్తే కేయం బీజప్రసవమధ్యగా॥ ॥౩౮॥

మూలప్రకృతి ఏకత్వసంఖ్యకలది మరియు మహదాదులకు కారణమగుటవ లన బీజధర్మముకలది. మహదహంకారాదిక్రమముగా చరాచరరూపముగా పరిణమిం చినందున ప్రసవధర్మముకలది సుఖదుఃఖము లనుభవించుచుండుటవలన మధ్యస్థధర్మ ముకలది గనుక పైన ఉదహరింపబడిన ఏకత్వ, బీజత్వ, ప్రసవత్వ, మధ్యస్థత్వధ ర్మములు పురుషులకు (జీవులకు) విరుద్ధధర్మంబులు అనగా యీధర్మములు పురుషుల యందు నిజముగా లేవు. ॥౩౮॥

## —♦ కేవలపురుషధర్మమ్ ♦—

శ్లో॥ వ్యాపారశూన్యోపి పుమా న్స్వభావా
త్సంక్రమ్య కార్యే మహదాదికే చ।
మూలప్రకృత్యాం భ్రమయ త్యజస్రం
జగంత్యయస్కాంతశిలేవ సూచిం॥ ॥౩౯॥

యీపురుషుడు స్వతహాగా వ్యాపారశూన్యుడైనను, ప్రకృతికార్యములైన మహదాదులయందు సంక్రమించి అయస్కాంతశిలసూదినివలె జగత్తును భ్రమింప చేయుచున్నాడు. ॥౩౯॥

## —♦ వ్రాతపురుషస్థితి ♦—

శ్లో॥ సృష్టిం మహత్త్వాదిభి రేత్య సూక్ష్మా
స్సంతస్థితా బ్రహ్మవిదేకదృశ్యే।
లింగే శరీరే పురుషాస్త ఏవ
మూలప్రకృత్యాయతనా స్సదామీ॥ ॥౮౦॥

మహదాదులచే సృజింపబడి సూక్ష్మరూపములనుపొంది బ్రహ్మవేత్తలకుమాత్రమే గోచరమైన లింగశరీరమున నివసించువారే పురుషులని వ్యవహరించబడుచున్నారు. స్థూలోపాధి దొరికేవరకు వీరు మూలప్రకృతియందు నివసించియుందురు.

శ్లో॥ అవ్యక్తతజ్జ ప్రతిబింబపంచ
వింశ త్స్వరూపస్య సమస్తతత్త్వైః।
తాదాత్మ్యకత్వా త్ప్రకృతిస్వభావ
గుణా స్తదీయానుభవశ్చ తస్య॥ ॥౮౧॥

అవ్యక్తమందున్ను, యీఅవ్యక్త కార్యములైన మహదాదులయందున్ను ప్రతిబింబించి యిరవైఅయిదవ తత్త్వస్వరూపుడైన పురుషునికి పూర్వోక్తములైన యిరవైనాలుగు (చతుర్వింశతి) తత్త్వములతోను తాదాత్మ్యము కలగియుండుటవలన ప్రకృతిగుణములైన సుఖదుఃఖాదికము ఆ పురుషునకుకూడా కలిగియుండును. "తత్త్వతాదాత్మ్యతో జీవ స్తత్త్వసాక్షిక ఈశ్వరః॥" అనగా జీవుడు తత్త్వతాదాత్మ్యధర్మము కలవాడు ఈశ్వరుడు తత్త్వసాక్షి అని తెలియవలెను. ॥౮౧।

శ్లో॥ భ్రాంత్యో ప్యాత్మజనేషు తిష్ఠతి యథా నోపైత్య తద్రూపతా
మన్నప్రాణమనోమయాదిషు జగత్సాక్షీ తథైవ స్థితః।
వేత్యాగామిగతాగతత్రిదశవా గాదీని గోళాంతర
స్సుప్తౌ పార్థివసూక్ష్మకారణవరః ప్రాగ్వాసనాధిష్ఠితః॥ ॥౮౨॥

మానవుడు తనకిష్టమైన దారాపుత్రాదులయందు భ్రాంతికలవాడైనను ఆదారపుత్రాదులయొక్క స్వరూపమును తానెట్లు పొందలేడో జగద్యోనియగు పురుషుడున్ను అన్నమయ, ప్రాణమయ, విజ్ఞానమయ, ఆనందమయ మనోమయములగు పంచకోశములయందును అట్లే విలక్షణముగాయుండి సుషుప్తియందు స్థూల, సూక్ష్మ కారణ దేహములనువిడచి సుషుప్త్యవస్థయందు (అనగా దేహమెరుగని గాఢ నిద్రయందు) యెవరికిన్ని శరీరపరిగ్రహముండదు. జాగ్రదవస్థరాగానే కలుగుచుం

డును. వాసనామాత్రాధిష్ఠాతయై భూతభవిష్యద్వర్తమానరూపములైన త్రిదశలను వాగాదులను తెలుసుకొనగలుగుచున్నాడు ॥౪౨॥

శ్లో॥ అవ్యక్తాదిత్యో భకశ్చ త్ప్రత్యగాత్మా
సూక్ష్మః ప్రాణావశ్య ఇత్యక్షరస్య
క్షేత్రజ్ఞో ఽణు స్తన్మయోఽతీంద్రియ శ్చ
జ్ఞాతా సాక్షీ విశ్వయోని స్స ఏవ॥ ॥౪౩॥

యీపురుషుడు ప్రకృతికి బోధకరుడు. ఈపురుషుడే ప్రత్యగాత్మ. సూక్ష్మరూపి, ప్రాణావస్యుడు, అక్షరుడు, క్షేత్రజ్ఞుడు, అణువు, తన్మయుడు, అతీంద్రియుడు, జ్ఞాత, సాక్షీ, విశ్వయోని, అని వ్యవహరింపబడుచున్నాడు. ॥౪౩॥

— క్షేత్రజ్ఞనిరూపణమ్ —

శ్లో॥ వినా గృహాచ్ఛాదనసూక్ష్మరంధ్ర
వ్యాప్తాతపేన త్రసరేణుపంక్తిః ।
తథైవ సూక్ష్మత్వపరత్ర పంచ
భూతాత్మక శ్శోణిత శుక్లయోగే। ॥౪౪॥

త్రసరేణువు స్థలాంతరములయందు గానరాక, గృహచ్ఛిద్రాగతాతపాంతరములయందు కనుపించుచుండునట్లు పంచభూతాత్మకశరీరసమవాయమైన క్షేత్రజ్ఞుడు శుక్లశోణితసంయోగమునందు కనుపించుచున్నాడు ॥౪౪॥

— క్షేత్రజ్ఞస్థితి —

శ్లో॥ అగోచరోవాపి సనాతనోను
మానప్రమాణవ్యవహారరీత్యా।
గర్భాశయే శోణితశుక్లయోగే
వ్యనక్తి సూక్ష్మేణ మరుత్ప్రకీర్ణః॥ ॥౪౫॥

సనాతనమైన ఆత్మ అగోచరమైనదైనను శుక్లశోణితవిశిష్టమైన గర్భాశయమునందు సూక్ష్మరూపమున వాయువుచే ప్రవేశపెట్టబడి అనుమానప్రమాణములచే తెలుసుకొనబడుచున్నది. ॥౪౫॥

శ్లో॥ స్వకర్మణా ప్రేరితచిత్తవృత్తేః
ప్రయాత్యయత్నా త్తృణరక్తవేవ।
క్షేత్రజ్ఞ ఏషః కరణాంతరాణి
తిర్యఙ్మనుష్యాదిషు సర్వనిత్యః॥ ॥౪౬॥

సనాతనమైన క్షేత్రజ్ఞుడు తనమనస్సుయొక్క పాపపుణ్యకర్మలచే ప్రవర్తించు మనోగతివలన జలగ ఒకతృణమునుపట్టుకొని తా నంతకుముందు పట్టుకొనివున్న తృణమును విడిచిపెట్టుచందమున తిర్యఙ్మనుష్యాదిరూపమైన ఒకదేహము నవలంబించి పూర్వదేహమును విడుచుచుండును ॥౪౬॥

—♦ క్షేత్రజ్ఞగుణములు ♦—

శ్లో॥ చరోర్ధ్వే, న్మేష, నిమేష, ధీ, విషయ, హృ, ద్విజ్ఞాన, యత్న, స్మృతి
ద్వేషే, చ్ఛాధ్యవసాయ, దుఃఖ, సుఖ, సంకల్పా, స్వపానా, ఇతి।
సంత స్సప్తదశప్రమాణగగుణా స్తానేవ చాహుః కలా
క్షేత్రజ్ఞే సహజా స్తఏవ తు గుణా స్థూలే వినానాశ్రయాః॥౪౭॥

ఆక్షేత్రజ్ఞునికి ఊహాపోహాలు, ఉన్మేషనిమేషములు, బుద్ధి, విషయజ్ఞానము (శబ్దాదివిషయకజ్ఞానము) మనస్సు, శిల్పాదిశాస్త్రజ్ఞానము, కార్యారంభోత్సాహము అనుభూతపదార్థవిజ్ఞానము, ద్వేషము, ఇచ్ఛ, అధ్యవసాయము, (శాస్త్రాదిజ్ఞానము) దుఃఖము, సుఖము, సంకల్పము, ప్రాణము, అపానము అను పదిహేడుగుణములు కలవు—వీటిని కలలు అనికూడచెప్పెదరు యీగుణములు క్షేత్రజ్ఞునికి సహజములైననూ స్థూలదేహమునందుగాని వ్యక్తములు కావు. ॥౪౭॥

—♦ కేవలపురుషస్థితి ♦—

శ్లో॥ తత్త్వేభ్యోన్యః పంచవింశ త్స్వరూప
స్ససాస్య జీవ స్తస్య కించిద్జ్ఞతైవ।
షడ్వింశో యః పంచవింశ త్పృథక్స
స్ససాస్త్యధీశ స్తస్య సర్వజ్ఞతైవ॥ ॥౪౮॥

చతుర్వింశతితత్త్వములకంటె ఇతరుడున్ను ఇరువదిఅయిదవ తత్త్వస్వరూపుడున్ను యెవడుకలడో వాడేజీవుడు, యీజీవునికి కించిజ్జ్ఞత్వమే కాని సర్వజ్ఞత్వములేదు. పంచవింశతత్త్వస్వరూపుడైన జీవునికంటె యితరుడును యిరువదిఆరవతత్త్వ (షడ్వింశ

త్రత్వ) స్వరూపుడును ఎవడుకలడో వాడే ఈశ్వరుడు. యీశ్వరునికి సర్వజ్ఞత్వమే కాని కించిద్జ్ఞత్వములేదు. ||౪౮||

శ్లో|| దీపప్రదీపయుగ మేక మపి స్వభావా
ద్దీపే ప్రదీపమతి మేతి నకోపి లోకే।
జీవంతథేశ ఇతి తత్ప్రభయేవకించి
త్సర్వజ్ఞతాయుగవశేనతు జీవ మీశమ్॥ ||౪౯||

స్వభావసిద్ధముగా దీపము, కాగడా ఈరెండును ఒకటే అయినప్పటికిన్ని దీపమును కాగడా అని కాని కాగడాను దీపము అని కాని ఎట్లనుకొనరో అట్లు జీవుడు ఈశ్వరుడు ఈరెండును ఒకటే అయినప్పటికినీ జీవుని ఈశ్వరునిగాను, ఈశ్వరుని జీవునిగాను యెవరును అనుకొనరు ముందు చెప్పబడిన దీపమును, కాగడాను కాంతి భేదముచేతనున్ను, జీవుని ఈశ్వరుని కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వముల చేతనున్ను తెలుసుకొనవలెను. ||౪౯||

—♦పురుషవాసన♦—

శ్లో|| పూర్వదేహానుభూతాంస్తు భూతాత్మా స్వపతః ప్రభుః ।
రజో యుక్తేన మనసా గృహ్ణాత్యర్థాం న్శుభా శుభాన్ ॥ ||౫౦||

నిద్రించునపుడు క్షేత్రజ్ఞుడు అనేకజన్మములయందు తాను పూర్వదేహముల తో అనుభవించిన శుభా శుభ రూపములయిన విషయములను సుఖ దుఃఖ భోగాసక్తుపయిన (రజోగుణభూయిష్ఠమైన ) మనస్సుచే వాసనా వశమున తెలుసుకొన కలుగుచున్నాడు ఇదియే స్వప్నము. ||౫౦||

—♦జాగ్రదవస్థావిశేషములు♦—

శ్లో|| సత్వేన జాగ్ర ద్రజసా జ్ఞ తా చ
క్షేత్రజ్ఞ యోగా త్తమసా సుషుప్తిః ।
త త్సన్నిధానా దగుణస్య తద్వ
త్కాచస్థదీపస్య చ కా చ కాంతిః ॥ ||౫౧||

ఆపురుషుడు సత్వగుణముతో కలిసినచో జాగ్రదవస్థయు రజోగుణముతో కలిసినచో మదావస్థయు (అజ్ఞానావస్థయు) తమోగుణముతో కలిసినచో నిద్రావస్థయు కలుగును. గుణవిహీనుడయిన ఆక్షేత్రజ్ఞునకు గాజుపాత్రలోని దీపమునకు గాజు కాంతివలె సత్వాది గుణసంపర్కముచే అవస్థాభేదము కలుగుచుండును. ||౫౧||

## —♦పంచీకరణమ్♦—

శ్లో॥ ద్విధా విధాయ ప్రతిభూత మాదౌ
విభాజయేత్తాని పరం చతుర్ధా ।
ఏకైక మాత్రార్థయుతం స్వభిన్నం
క్రమేణ పంచీకరణం తదేవ॥ ॥౧౨॥

అపంచీకృతపృథివ్యప్తేజోవాయ్వాకాశరూపము లైన పంచభూతములలోను ప్రతిభూతమును ముందుగా రెండేసి భాగములుగా చేసి, పిమ్మట ప్రతిభూతముయొక్క ఉత్తరార్థమును నాలుగు భాగములుగా చేయవలయును తనకంటె వేరైన భూతములయొక్క ఉత్తరార్థచతుర్థాంశములను క్రమముగా ప్రతిభూతముయొక్క పూర్వార్థభాగముతో కలుపవలెను అదియే పంచీకరణము. మనకు దృశ్యములగుచున్న భూతములన్నియు పంచీకృతములే, ప్రతిభూతమందును స్వభాగ మరపాలున్ను తనుగాక మిగిలిన నాలుగు భాగముల యొక్క భాగములలో ఎనిమిదవపాలు చొప్పునను ఉండును. ఈప్రకారము పంచీకృతములైనభూతములవలన జన్మకలిగి ప్రారబ్ధకర్మచే సంప్రాప్తమైన శరీరమే స్థూలశరీరము. ఇదియే సుఖదుఃఖాది భోగములకు సాధనము

## —♦పంచీకరణప్రస్తారమ్♦—

| | పృథివి | అప్పు | తేజస్సు | వాయువు | ఆకాశము |
|---|---|---|---|---|---|
| పృథివి | 4 | 1 | 1 | 1 | 1 |
| అప్పు | 1 | 4 | 1 | 1 | 1 |
| తేజస్సు | 1 | 1 | 4 | 1 | 1 |
| వాయువు | 1 | 1 | 1 | 4 | 1 |
| ఆకాశము | 1 | 1 | 1 | 1 | 4 |

ఇదియే పంచమహాభూత పరస్పరానుప్రవేశము. ॥౫౨॥

## —♦విద్యాసంక్రమణమ్♦—

శ్లో॥ యే పూర్వదేహేభ్యసితాః ప్రకామం
తా నాప్నుయా ద్భావిధ వేపి జంతుః ।
సంస్కారసంబంధవశా ద్బలీయా
న్గుణా స్స్వకీయాంతరమ్ప్రవిష్టాః ॥ ॥౧౩॥

పూర్వదేహములయందు విస్తారముగా అనుభవింపబడినట్టియు అంతఃకరణ యందు దృఢమైన సంస్కారముతో కూడినవియు అగు గుణములు భవిష్యజ్జన్మల యందు కూడ క్షేత్రజ్ఞునికి కలిగ యుండును ॥౫౩॥

—♦ దేహత్రయనిరూపణమ్ ♦—

శ్లో॥ స్థూలం పృథివ్యాది వికారరూపం
సూక్ష్మం స్వసత్త్వప్రగళాత్మరూపం ।
కేచిన్మనో బుద్ధ్యనిలాక్షరూపం
మూలాజ్ఞతాం కారణదేహమాహుః ॥ ॥౫౪॥

పాంచభౌతిక (పృథివ్యాది పంచభూతవికారమైన) దేహమును స్థూలశరీర మనియు ఇదివరలో పేర్కొనబడిన చర్మాది సప్తదశ గుణములతో కూడిన దేహమును సూక్ష్మశరీరమనియు మూలాజ్ఞానమునకు కారణశరీరమనియు కొంతమంది మనస్సు, బుద్ధి, ప్రాణాది పంచవాయువులు, ఇంద్రియములు, పది కలసి సూక్ష్మశరీర మనియు చెప్పుచున్నారు. మూలాజ్ఞానరూపమైన కారణశరీరము అనుభవైక వేద్యము.

—♦ సూక్ష్మదేహాస్తిజ్ఞానలింగమ్ ♦—

శ్లో॥ దగ్ధ్వా జరాయుం ముహురానయంతి
తదాస్యనాభేఽతియ త్ప్రసిద్ధిః ।
అరిష్టకే నాళనికృంతపూర్వం
దేహాద్ద్వయ స్యైతదలం ప్రమాణమ్ ॥ ॥౫౫॥

జన్మించినవెంటనే శిశువు ఏడవనియెడల బొడ్డుకోయనిముందు మావిని తగల బెట్టి పిమ్మట మావి దగ్గరనుండి శిశువుయొక్క బొడ్డువరకును చేదుదురు.( తోడుదురు) ఇట్లు చేసినతర్వాత శిశువు ఏడ్చుట కారంభించుట కూడ అచ్చటచ్చట కలదు. అట్లు చైతన్యము కలిగి శిశువు ఏడ్చినపిమ్మట బొడ్డు కోయుదురు. రెండు శరీరములు కలవని చెప్పుటకు యీ ఉదాహరణము చాలును. (సూచకప్రమాణమ్) ౫౫

శ్లో సర్వత్ర బాహ్యేషు విభాతి సూక్ష్మ
దేహప్రకాశోఽగ్ని రివేంధనేషు ।
తద్దేవ సూక్ష్మస్య గుణాత్రయం చ
జాగ్రత్సుషుప్తైః ప్రతిశయస్వభావాః ॥ ॥౫౬॥

సూక్ష్మదేహముయొక్క ప్రకాశ, కర్మలయం దిమిడియున్న అగ్నివలె స్థూలదేహం దంతటను ప్రకాశించుచున్నది ఆ సూక్ష్మదేహమునకు సత్వ, రజ, స్తమో గుణములున్ను జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలున్ను ప్రళయమున్ను సహజములు.

—♦నిద్రాస్వరూపం♦—

శ్లో॥ దైనందినప్రళయ మన్వహ మాత్మసంజ్ఞం
ప్రాహు ర్మహాప్రళయ మిత్యుభయ స్వభావః।
దైనం దినప్రళయగస్య పునః ప్రబోధో
నస్యా న్మహాప్రళయగస్య పునః ప్రబోధః॥ ॥౫౭॥

ఆత్మసంజ్ఞ కల పురుషునికి దైనందినప్రళయమనియు, మహాప్రళయమనియు రెండు స్వభావములు కలవు అని చెప్పుచున్నారు నిత్యప్రళయమును పొందిన ఆత్మకు తిరిగి దానంతట అదియే మెలకువ కలుగుచున్నది నిత్యప్రళయమనగా నిద్ర, ఇదియే దైనందినప్రళయము మహాప్రళయమును పొందిన ఆత్మకు తిరిగి మెలకువ కలుగదు. మహాప్రళయమనగా మృత్యువు ॥౫౭॥

శ్లో॥ సుప్తిస్తమో జాగరణాస్య బల్యా
నోచే ద్బలిష్ఠా ప్రకృతి స్త్రిధా సా।
శుభాదికర్మప్రతిబంధకీయం
వికారనైసర్గికతామసాఖ్యా॥ ॥౫౮॥

నిద్రావస్థకు తమోగుణమున్ను జాగ్రదవస్థకు సత్వగుణమున్ను లేక బలిష్ఠమైన స్వభావమున్ను కారణములు శుభాశుభకర్మప్రతిబంధకమైన యీనిద్ర వైకారికి, స్వాభావికి, తామసి, అని మూడువిధములు కలిగియున్నది. ॥౫౮॥

శ్లో॥ స్రోతస్సు సంజ్ఞావహనేషు సుప్తా
తమోయుతశ్లేష్మసమావృతేషు।
తామస్యభిఖ్యానవబోధినీ సా
సమస్తసుప్తౌ తమ ఏవ మూలమ్॥ ॥౫౯॥

నిద్రయందు సంజ్ఞావాహినులగు స్రోతస్సులు తమోగుణప్రధానమైన కఫముచే అడ్డగింపబడినవయ్యేనేని పునరుత్థానములేని తామసియను నిద్రకలుగును. అనగామరణము. పైనచెప్పబడిన మూడువిధములైన నిద్రలకును తమస్సే కారణము.

శ్లో॥ నైశాకికీ జాతు యదా సుషుప్తి
స్స్వాభావికీ దేహసహోద్భవేయమ్।
స్యాత్తామసీ సర్వసుషుప్తిమూలా
నిద్రా తు మాయా ఖలు వైష్ణవైవ॥ ॥౬౦॥

అప్పుడప్పుడు (రాత్రి)కాలమందుగాక ఆ కాలమందు) జనించెడు నిద్ర నైశాకికి అనియు, సహజమైన (రాత్రి)భాగమందు) నిద్ర స్వాభావికి అనియు, సమస్తసుషుప్తులకు సామాన్యకారణమైననిద్ర తామసి అనియు చెప్పబడును నిద్ర అనగా విష్ణుసంబంధమైన మాయయే అయివున్నది ॥౬౦॥

॥శ్లో॥ అర్థాప్తితత్సంస్కృతిదస్యభోగాః
జ్ఞానైః క్రమాజ్జాగరణాద్యవస్థాః।
దేహత్రయే తస్య తు విశ్వతైజః
ప్రాజ్ఞాభిధానాని దశాక్రమాత్స్యుః॥ ॥౬౧॥

జ్ఞానకర్మేంద్రియములచే ప్రయోజనములను (తత్తద్వ్యాపారములను) గ్రహించుట జాగ్రదవస్థ. ఆజాగ్రదవస్థయందలి సంస్కారమువలనపుట్టిన ప్రయోజనములను నిద్రయందుగ్రహించుట స్వప్నావస్థ ఏవిషయమును గ్రహింపలేక గాఢనిద్రనొందుట సుషుప్త్యవస్థ. జాగ్రదవస్థయందు స్థూలదేహాభిమానియగు జీవునికి విశ్వుడనియు స్వప్నావస్థయందు సూక్ష్మశరీరాభిమానియగు జీవునికి తైజసుడనియు. సుషుప్త్యవస్థయందు కారణశరీరాభిమానియగు జీవునికి ప్రాజ్ఞుడనియు పేరు.

శ్లో॥ కరణానాంతు వైకల్యే తమసాభిపరివర్తితే।
అస్వపన్నపి భూతాత్మా ప్రసుప్త ఇవ లక్ష్యతే॥ ॥౬౨॥

తమోగుణమువలన ఇంద్రియములు వైకల్యమునుపొందియుండగా క్షేత్రజ్ఞుడు మేలుకువకలిగియు నిద్రించువానివలె ఉండును. ॥౬౨॥

— ♦ ప్రాణవాయుకృత్యము ♦ —

శ్లో॥ నాభిస్థితః ప్రాణమరుద్ధృదబ్జ
వ్యాపగళా ద్విష్ణుపదామృతస్య।
సంయు వేగాత్పునరేత్య నాభిం
ప్రీణాతి దేహం జఠరానలం చ॥ ॥౬౩॥

నాభిస్థానము నాశ్రయించియుండు ప్రాణవాయువు హృదయకమలమును వ్యాపించియుండి, ఆకాశమందలి విష్ణుపాదామృతమును పానముచేయునిమిత్తము కంఠస్థానమునుంచి పైకివచ్చి విష్ణుపాదామృతమును పానముచేసి మరల శరీరములో ప్రవేశించి శరీరమునందుగల రక్తమును శుభ్రపరచి దేహమునకును జఠరాగ్నికిన్ని బలమును ఇచ్చుచుండును ॥౬౩॥

—♦ జాగ్రత్స్వరూపమ్ ♦—

శ్లో॥ స్వపతః ప్రాణ మరుతః కంఠబాహ్యా గతస్యహా।
శబ్దసంఘర్షణా త్స్పర్శా త్త్వచో జాగ్రత్ప్రజాయతే॥ ॥౬౪॥

నిద్రించుచున్నవానియొక్క కంఠమునుండి బాహ్యగతమైన (విష్ణుపాదామృతపానమునిమిత్తము పైకివచ్చిన) ప్రాణవాయువునకు శబ్దసంయోగముచేతగాని త్వగింద్రియస్పర్శచేతగాని తిరిగి జాగ్రదవస్థ కలుగుచున్నది. ॥౬౪॥

—♦ ఆయుర్మరణలక్షణమ్ ♦—

శ్లో॥ ప్రాణస్య దేహస్య చ యోగ మేవ
వమున్నయే దాయు రితి ధ్రువేణ।
తయో ర్వియోగం మృతి మేవ యస్మా
ద్గోళా స్సమానామృతజీవితానామ్॥ ॥౬౫॥

ప్రాణవాయువునకును దేహమునకునుగల సంబంధమునే ఆయువు (జీవితకాలము) అనియు, ఆప్రాణవాయువునకును దేహమునకునుగల వియోగమునే మరణమనియు తెలియనగును మృతినొందినవానికిన్ని, జీవించియున్నవానికిన్ని ప్రాణవాయుసంచారమే వ్యావర్తకము (అనవాలు) గోళములు సమానములే. ॥౬౫॥

—♦ హృదయస్వరూపమ్ ♦—

శ్లో॥ పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్।
జాగ్రత స్తద్వికసతి స్వపత స్తన్నిమీలతి॥ ॥౬౬॥

హృదయము తామరమొగ్గవలె ఉండి అధోముఖముగా ఉండును. ఆహృదయకమలము జాగ్రదవస్థయందు వికసించియు. నిద్రావస్థయందు ముకుళించియు ఉండును. ॥౬౬॥

శ్లో॥ చత్వార్యావరణాని సంతి హృదయే ద్వే ద్వే స్థితే పార్శ్వయో
ర్ద్వంద్వం దక్షిణ పత్రి సీరుధిరం సంగృహ్య శోధ్యత్యజేత్।
భూయః పుప్ఫుస ఏవ తత్ర సిరయా సంశుద్ధరక్తం వ్రజే
ద్ద్వంద్వం వామమితి స్మృతం సదభిత స్సంజీవయే ద్బృంహయేత్

హృదయమందు నాలుగుగదులుగలవు వాటిలో రెండు కుడిప్రక్కనున్నున్నను రెండు ఎడమప్రక్కనున్నను అమర్పబడియుండును కుడిప్రక్కగదులు మలిటెరక్తమును గ్రహించి శుద్ధిపరచి అక్కడనుండి సిరద్వారా అశుద్ధరక్తమును పుప్ఫుససంహతిలో విడిచిపెట్టును. అరక్తమక్కడనుండి ఎడమప్రక్కగదులలో ప్రవేశించి ఇక్కడనుంచి (బృహద్ధమనీద్వారా) శరీరమునకంతకును ప్రసరించి జీవనమును పోషణమును చేయుచుండును. ॥౬౭॥

శ్లో॥ హృదయం చేతనాస్థాన ముక్తం సర్వశ్రదేహినామ్।
జ్ఞానకర్మేంద్రియవ్యాప్తం మన స్స్యా దుభయాత్మకమ్ ॥౬౮॥

సర్వజీవులకు హృదయము చేతనస్థానము. (ప్రాణాధారమైనస్థలము) మనస్సు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు పరస్పరసంబంధము కలుగజేయుచున్నదగుటచే ఉభయాత్మకమగుచున్నది ॥౬౮॥

## —♦ చికిత్సార్హ పురుషలక్షణమ్ ♦—

శ్లో॥ శుక్లశోణితసంయోగా త్పంచభూతప్రధానజః।
పుమా న్ప్రకృతిమూలత్వా చ్చికిత్సార్హో భవత్యసౌ॥ ॥౬౯॥

శుక్లశోణితసంయోగమువలన పంచభూతములే ప్రధానముగాకలిగి జన్మించినట్టియు, ప్రకృతియే కారణముగా కలిగినట్టియు పురుషుడు (స్థూలశరీరము) చికిత్సార్హుడగుచున్నాడు ॥౬౯॥

## —♦ శరీరపోషణమ్ ♦—

శ్లో॥ సిరాధమన్యో నాభిస్థా స్సర్వం వ్యాప్య స్థితా స్తనుం।
పుష్ణంతి చానిశం వాయో స్సంయోగా త్సర్వధాతుభిః॥ ॥౭౦॥

నాభిస్థానమును ఆశ్రయించియుండుసిరలు, ధమనులు సర్వశరీరమును వ్యాపించియుండి వాతసంబంధమువలన సప్తధాతువులుచేతను పోషింపబడుచున్నవి.॥ ౭౦॥

—♦ ఆహారగతి ♦—

శ్లో॥ ఆహారస్తు చతుర్విధోఽఖిల రసః ప్రాక్ప్రాణసంచోదితః
ప్రాప్యామాశయమత్ర పాకమధురం ఫేనత్వ మేత్యక్రమాత్
అంత్రే పాచకపిత్తవహ్నితఽనా దామ్ల స్సమానానిలా
త్సంప్రాప్యగ్రహణీ మితస్తు కటుతాం కోష్టాగ్నినా పాచితః॥

షడ్రసయుక్తమై అశిత, ఖాదిత, పీత, లీఢ, రూపమున చతుర్విధమగు ఆహారము ముందుగా ప్రాణవాయువుచే ప్రేరేపింపబడి అమాశయమును పొంది అక్కడ మధురపాకమును, ఫేనత్వమును (నురుగువలె అగుటను) పొందును. పిమ్మట చిన్నపేగులయందు ప్రవేశించి అనూత్క్రాంత్రములయందు పాచకపిత్తముచే విదగ్ధమై అమ్లత్వమును (పులుసుకలుగుటను) పొందును తర్వాత సమానవాయుప్రేరితంబై గ్రహణిని పొంది అచ్చట కోష్ఠాగ్నిచే పాచితంబై కటుత్వము పొందును. యీగ్రహణి ముందుచెప్పబడుచున్నది ॥౮౧॥

శ్లో॥ కుఠూ విహామా శయ పచ్యమాన
పక్వాశయా స్స్యు ర్దశహ స్తమాత్రాః।
అగ్రాంతయో ర్హా స్తమితం చ గుహ్యా
ద్వాత్రింశ దాంత్రం గళ ఏవ మాసీత్॥ ॥౮౨॥

ఉదరమున ముప్పదిరెండుమూరల పరిమాణముగల నాడియున్నది ఇందొక మూర కంఠమందును, దానికిదిగువ పదిమూరలలో అమాశయమును, దానికి పదిమూరలలో పచ్యమానాశయమును, దానికి పదిమూరలలో పక్వాశయమును దానికిదిగువ నొకమూర గుదస్థానమందును ఉన్నది ॥౮౨॥

శ్లో॥ భుక్తం జారరవహ్నినా సుపచితం స్యాచ్చే ద్రస చ్చాన్యథా
త్వామ స్తత్ర స ఏవ జారరబలా త్స్నిగ్ధత్వమాధుర్యతాం।
ప్రాప్యైవామృతసమ్మిత స్సుఖకరః పుష్ణాతి ధాతూ న్నవై
మందాగ్నే ర్యది పాచితో విషసమః కట్వాఽమ్లసంమిశ్రితః॥

భుజింపబడిన ఆహారము జఠరాగ్నిచే చక్కగా పచనమైనచో రసధాతువుగామారును. అట్లు పచనము కానియెడల అమము అగును. పూర్వోక్తరసము జాఠర బలముచే మాధుర్య, స్నిగ్ధభావములను పొంది, అమృతతుల్యమై రసాదిధాతువులకు బలమును కలిగించును. ఆరసము మందాగ్నిచే పచితంబాయెనేని కటు, అమ్ల, రసవిశిష్టంబై విషసమమగును. లేనియెడల రోగములనైనను పుట్టించును. ॥౮౩॥

శ్లో॥ ఆహారేషు బలం రసశ్చ విబలం కిట్టం భవేత్తన్మలం
వస్తౌ వేష్యతి మూత్రతాం మలగతిం పక్వాశయే స్రంసితం।
తద్విడ్యాతిబహిర్వళిత్రయపథా చ్చాపానవాతేరణా
ద్ధృత్వాప్రోక్తరస స్సమానకలితో యాత్యగ్రతాం పాచితః॥

భుజింపబడిన ఆహారమునందలి సారము అయినది రసముగాను, సారములేనిది మలముగాను మారును. సారహీనమైన ద్రవము మూత్రవాహినిరలనుండి ప్రవహించి వస్తియందుచేరును. సారహీనమైనకిట్టము (పిప్పి) పక్వాశయమున పరిణమించును ఆమలము అపానవాయుప్రేరితమై గుదస్థానమందున్న వళిత్రయమార్గమునుండి బయటకువచ్చును. పూర్వోక్తరసము సమానవాయుప్రేరితమై ఊర్ధ్వముఖంబుగా హృదయమునుచేరి యకృత్, ప్లీహల యందలి పిత్తముచే పచితంబై రక్తధాతువుగా మారును. ॥౨౪॥

శ్లో॥ తద్రక్త మాధార మశేషదేహ
సంచారజీవస్య విదగ్ధ మన్యత్।
రసశ్చ పిత్తా త్పచితం క్రమేణ
శుక్రత్వ మాయాతి రజశ్చ మాసాత్॥ ॥౨౫॥

ఆరక్తము సర్వదేహమందును సంచరించు ప్రాణమున కాధారమైయుండును అది విదగ్ధమైనచో పిత్తమువలె రోగమును పుట్టించును. పూర్వోక్తరసమున్ను పిత్త ద్రవముచే పచితమగుచు క్రమక్రమముగా రక్తాదిధాతువులయొక్క స్వరూపమును పొందుచు ఒకమాసము నాటికి పురుషులకు శుక్రధాతువుగాను స్త్రీలకు రజస్సుగాను పరిణమించును. ॥౨౫॥

శ్లో॥ సప్తభి ర్దివసైః కేచి త్త్రిభి రేకేన చక్రమాత్।
సప్తభి ర్ఘటికాభి శ్చ ధాతుః పరిణమే దితి॥ ॥౨౬

భుజింపబడిన ఆహారము ఏడేసిదినములకును, మూడేసిదినములకును ఒక్కొక్కదినమునకును, ఏడేసిగడియలకును, ఒక్కొక్క ధాతువుగా మారునని ఇట్లనేకమంది గ్రంథకారులచే అనేకవిధములుగా కాలనిర్ణయము నిరూపింపబడినది కాల విషయమై ఇట్టిభేదములు ఆహారద్రవ్యనిష్ఠములగు గురుత్వలఘుత్వాది గుణములచేతను ప్రభావాదులచేతను కలుగునని యూహింపదగియున్నది. ॥౨౬॥

## —♦ గ్రహణీనిర్ణయం ♦—

శ్లో॥ అగ్న్యధిష్ఠాన మన్నస్య గ్రహణా ద్గ్రహణీమతా
నాభేరుపరిసాహ్యాగ్ని బలోప స్తంబ బృంహితా।
అపక్వా ధారయత్యన్నం పక్వం త్యజతి చాప్యధః।
షష్ఠీపి త్ధరా నామ యా కలా పరికీర్తితా॥
పక్వామశయమధ్యస్థా గ్రహణి సా ప్రకీర్తితా॥ ॥౭౭॥

గ్రహణి యనునాడి నాభికి పైభాగమందుడును. యిది జఠరాగ్నికి ముఖ్య స్థానమై భుజింపబడిన ఆహారపదార్థములను గ్రహించి జఠరాగ్నిబలముచే తాను బలిష్ఠమై పక్వముగాని ఆహారపదార్థమును ధరించుచు, పక్వమయినదానిని గుదస్థానము నుండి అ మార్గమున వెలుపలకు త్రోయుచుండును. ఇదే పచ్యమానాశయము. మరియు గ్రహణి అనునది పక్వాశయమునకును, అమాశయమునకును మధ్యభాగము నందుండెడు కల అయి వున్నది. ॥౭౭॥

## —♦ వళిత్రయవివరణం ♦—

శ్లో॥ ప్రవాహిణీ ప్రసరణా త్సర్జనా చ్చ విసర్జనీ।
క్లిష్టే స్సంవరణీ త్యేవం గుదస్థానవళిత్రయం॥ ॥౭౮॥

మలమును స్రవింపచేయుటవలన ప్రవాహిని అనియు, విసర్జింపచేయుటవలన విసర్జని అనియు, సంకుచింపచేయుటవలన సంవరణి అనియు గుదస్థానమున మూడు మడతలు కలవు. ॥౭౮॥

## —♦ సప్తత్వగ్వివరణం ♦—

శ్లో॥ పంచభూతాత్మసంయోగా త్పక్వాస్ప చ్ఛుక్లధర్మతః।
తప్తదుగ్ధే పయస్యం స్యా త్త్వచో జాయంతి సప్తధా॥ ॥౭౯॥

ఆత్మను పంచభూతములయొక్క సంయోగమువలన పక్వమయిన శుక్లశోణితవికారముచే కాచినపాలయందు మీగడ మొదలయినవి పుట్టినట్లు శరీరముపైన (అంతరాంతిక దేహమున) ఏడుచర్మములు పుట్టుచున్నవి. అంతరాంతిక దేహమనగా గర్భాశయమందు శుక్లార్తవములు ఒక్కటిగా ప్రవేశించి ఘనీభావమును పొందిన ఆకృతి అని తెలియవలయును ॥౭౯॥

శ్లో॥ అద్యావరః భాసినీ పశ్చాత్ లోహితశ్వేతతామ్రికాః।
వేదినీ రోహిణీ మాంస ధరాఃప్రోక్తాః కలాస్స్మృతాః॥ ॥౮౦॥

యీయేడు చర్మములలోను మొదటిది అవభాసిని రెండవది లోహిత మూడవది శ్వేత నాల్గవది తామ్ర ఐదవది వేదిని ఆరవది రోహిణి యేడవది మాంసధర యనబడును. ॥౮౦॥

—♦సప్తధాతుసప్తాశయవివరణము♦—

శ్లో॥ రసాసృఙ్మాంసమేదోస్థి మజ్జాశుక్రాంతరేష్వమీ।
వాతాగ్ని శ్లేష్మామమల మూత్రరక్తాశయాంతరే॥ ॥౮౧॥

రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము, అను సప్తధాతువులకును, వాత, పిత్త, శ్లేష్మ, అమ, మల, మూత్ర, రక్తాశయములకును, మధ్యభాగమందు యీ ఏడుకలలున్ను ఉండును. ॥౮౧॥

—♦సప్తకలావివరణం♦—

శ్లో॥ మాంసాసృఙ్మేద శ్లేష్మావి ట్పిత్తశుక్రధరాః కలాః ॥౮౨॥
కలలలో మొదటిది మాంసధర, రెండవది రక్తధర, మూడవది మేదోధర, నాలుగవది శ్లేష్మధర, అయిదవది పురీషధర అరవది పిత్తధర, ఏడవది శుక్లధర, అనబడును ॥౮౨॥

శ్లో॥ యథా బిసమృణాళాని వివర్ధంతే సమంతతః।
భూమౌ పంకోదకాయాం తథా మాంసే సిరాదయః॥ ॥౮౩॥

బురదయు, ఉదకమున్ను కలసిన స్థలమందు తీగెలు, అకులు, పూవులు మొదలయినవి వృద్ధిచెందెడువిధమున మొదటిదియగు మాంసధరయను కల నాశ్రయించి శిరలు మొదలయినవి వృద్ధిపొందును ॥౮౩॥

శ్లో॥ వృక్షాద్యథాభిప్రహతాత్ క్షీరిణః క్షీర మావహేత్।
మాంసాదేవం క్షతాత్ క్షిప్రం శోణితం సంప్రసిచ్యతే॥ ॥౮౪॥

పాలతోకూడిన వృక్షమును భేదించినయెడల దానియందు తక్షణమే పాలు స్రవించినట్లు, మాంసమునుభేదించిన తక్షణమే రెండవకలయగు రక్తము స్రవించును. ॥౮౪॥

శ్లో॥ స్థూలాస్థిషు విశేషేణ మజ్జాత్వభ్యంతరాశ్రితా॥
అథేతరేషు సర్వేషు సరక్తం మేద ఉచ్యతే॥ ॥౮౫॥

లావుగానుండు ఎముకల లోపలభాగమందు మజ్జ అను పదార్థము ఉండును, సన్నని ఇతరఎముకల లోపలభాగమందు మేదస్సు అను మూడవకల, రక్తముకలిసి యుండును. ॥౮౫॥

శ్లో॥ స్నేహాఽభ్యక్తే యథాహ్యక్షే చక్రంసాధుప్రవర్తతే।
సంధయ స్సాధు వర్తంతే సంశ్లిష్టా శ్లేష్మణా తథా॥ ॥౮౬॥

యిరుసు నాళ్ళియించియుండుచక్రము చమురుచే తడుపబడి బాగుగా తిరుగునట్లు హస్తపాదాదిసంధులుకూడ నాలుగవకలయగు శ్లేష్మముచే వ్యాప్తములై బాగుగ చలించుచుండును. ॥౮౬॥

శ్లో॥ యకృత్స్నమంతా త్కోష్ఠం చ తథాంత్రాణి సమాశ్రితా।
ఉండుకస్థం విభజతే మలం మలధరా కలా॥ ॥౮౭॥

మలధరయను అయిదవకల కోష్ఠాంతర్గతస్థన యకృత్, ప్లీహము, హృదయము, పుప్ఫుసము, పేగులు అనువానియందంతటను వ్యాపించి ఉండుకమందుండు మలమును విభజనచేయుచుండును ॥౮౭॥

శ్లో॥ అశితం ఖాదితం పీతం లీఢం కోష్ఠగతం నృణాం।
త జ్జీర్యతి యథాకాలం శోషితం పిత్తతేజసా ॥౮౮॥

అశితము అనగా దంతములపని విశేషముగా అవసరములేక తినబడు అన్నాదులు ఖాదితంఅనగా దంతములచే నమిలి భక్షింపబడు పిండివంటలు మొదలైనవి. పీతంఅనగా పానముచేయబడు పాలుమొదలయిన ద్రవపదార్థములు, లీఢముఅనగా నాలుకతో చప్పరించబడు పచ్చళ్ళు మొదలయినవి, యీనాలుగువిధములయిన అన్నపానాదులున్ను, కోష్ఠమును చెంది ఆరవదియగు పిత్తకలయొక్క తేజస్సుచే శోషితమై ఉచితకాలము నతిక్రమింపక జీర్ణమును చెందును. (దీనినే గ్రహణి యందురు.) ॥౮౮॥

శ్లో॥ యథా పయసి సర్పిస్తు గుడశ్చేక్షురసే యథా।
శరీరేషు తథాశుక్రం నృణాం విద్యా ద్భిషగ్వరః॥
ద్వ్యంగులే దక్షిణే పార్శ్వే వస్తిద్వారస్య చాప్యధః।
మూత్రస్రోతః పథాచ్ఛుక్రం పురుషస్యప్రవర్తతే॥ ॥౮౯॥

పాలయందు నెయ్యి, చెరకురసమందు బెల్లము, సర్వత్ర వ్యాపించియుండు నట్లు ప్రాణులయొక్క సర్వశరీరమందును, శుక్రకల వ్యాపించియుండును. వస్తి ద్వారమునకు రెండంగుళముల క్రిందుభాగమున కుడిప్రక్కనొకటియు, ఎడమప్రక్కనొకటియు మాత్రస్రోతస్సులు కలవు వాటినుండి పురుషునకు ఏడవకలయగు శుక్రము బయటకు వచ్చుచున్నది. ॥౭౯॥

— ♦ధాతుమలములు♦ —

శ్లో॥ రసనేత్రగండసంభవం
యకృదాలంబితపిత్తకోశకం।
శ్రవణజం రదమేఢ్రకక్షజం
నఖజం వక్త్రజ మేవ విందుజం॥ ॥౮౦॥

నాలుక, నేత్రములు, చెక్కిళ్ళు వీటనుండి స్రవించునది రసధాతుమలము. యకృత్తునాశ్రయించియుండు పిత్తకోశమున పుట్టునది రక్తమలము, చెవులనుండి పుట్టునది (గులిమి) మాంసమలము, దంతములు, చంకలు, మేఢ్రము, వీటినుండి పుట్టునది మేదోమలము, గోళ్ళు, నేత్రములు, వీటినుండి పుట్టునది అస్థిమలము, ముఖము నందుండు నునుపు మజ్జామలము, ముఖమందుపుట్టు మొటిమలు శుక్రమలము. ॥౮౦॥

— ♦ఉపధాతువులు♦ —

శ్లో॥ స్తన్యం రజో వసా స్వేదో దంతలోమాజస్స్నాయవః।
నారీణాం ప్రాద్వరం కాలా మ్భాయూ న్యేత్వాదిత్వచిత్॥

— ♦ రసాదిధాతువుల కృత్యం ♦ —

శ్లో॥ ప్రీణనం జీవనం లేప స్నేహధారణపూరణాః।
గర్భోత్పత్తిశ్చ ధాతూనాం కర్మ శ్రేష్ఠం స్మృతం క్రమాత్॥

రసధాతువువలన మనస్సుకు ప్రీతియు, రక్తధాతువువలన శరీరమునకు ఓజస్సును వృద్ధిపరచి జీవనాధారమును మాంసధాతువువలన అస్థులపై నంటిపెట్టుకొనియుండుట మేదోధాతువువలన శరీరమునకు జిడ్డును, అస్థిధాతువువలన శరీరమునకు ధారణాసామర్థ్యమును, మజ్జాధాతువువలన అస్థులయందలి రంధ్రములు పూరింపబడుట, శుక్రధాతువువలన గర్భోత్పత్తికలుగుట, అనునవి సంభవించుచున్నవి. ॥౮౨॥

## —♦యకృత్ ప్లీహాద్యుత్పత్తి♦—

శ్లో॥ అసృజ శ్శ్లేష్మణ శ్చాపి యః ప్రసాదః పరో మతః।
తం పచ్యమానం పిత్తేన వాయు శ్చా ప్యనుధావతి॥
తతోఽస్యాం త్రాణి జాయంతే గుదం బస్తిశ్చ దేహినః।
ఉదరే పచ్యమానానా మాధ్మానా ద్రుక్మ సారవత్॥
కఫశోణితమాంసానాం సారో జిహ్వా ప్రజాయతే।
యథార్థ మూష్మణా యుక్తో వాయు స్స్రోతాంసి దారయేత్॥
అనుప్రవిశ్య పిశితం పేశీ ర్విభజతే తథా।
మేదస స్స్నేహ మాదాయ సిరా స్నాయుత్వ మాప్నుయాత్।
సిరాణాంతు మృదుః పాక స్స్నాయూనాంతు తతః ఖరః।
అశయ్యాభ్యాసయోగేన కరో త్యాశయసంభవం॥ ॥౯౩॥

రక్తశ్లేష్మములయొక్క సారభాగము పిత్తముయొక్క ఊష్మచే పక్వమగు నప్పుడు దానియందు వాయువు ప్రవేశించుచున్నది ఇందువలన ప్రాణులకు పేగులు, గుదము, బస్తి, అనునవి జనించును బంగారమునకు సాగ్గు పుటముపెట్టుటచే దాని యందలిసారము (మేలిమి) బయలువెడలినట్లు ఉదరమందు పిత్తోష్మమువలన పచనమునుపొందు కఫరక్త, మాంసములవలన వాటిసారాంశమైన జిహ్వ జనించును. పిత్తోష్మముతోకూడియున్న వాయువు రసరక్తాదులను వహించు స్రోతస్సులను విభజన చేయును. అప్రకారమే మాంసమందుప్రవేశించి పేగులను విభజనచేయును. మేదస్సుయొక్క స్నేహామునుగ్రహించి గర్భస్థమయిన పిత్తోష్మముచే పచనము గావింపబడి, శిరలను స్నాయువులను బలంపచేయును యీ మేదస్సారముయొక్క మృదుపాకముచే సిరలును కఠినపాకముచే స్నాయువులును కలుగును. యీవాయువు తనయొక్క స్థితి సహవాసములచే ఆశయములను జనింపజేయును. ॥౯౩॥

శ్లో॥ మేదో ప్రవృక్కౌ కఫర క్తహృచ్చ
కఫాప్రమేదోనిలమాంసజాండౌ।
హృదాశ్రయాః ప్రాణవహాధమన్యః
ప్లీహా యకృచ్చాపి హృద స్త్వధస్తాత్॥ ॥౯౪॥

రక్తమేదస్సారమువలన వృక్కలు (కుక్షిగోళములు) ను, కఫరక్తసారమువలన హృదయమును, కఫరక్త, మేదో, వాయు, మాంస సారమువలన వృషణములున్ను,

జనించును. ప్రాణవాహినీధమనులు హృదయకమలము నాశ్రయించియుండును. ఆ హృదయమునకు క్రిందుగా ఎడమపార్శ్వమున ప్లీహము, కుడిభాగమున యకృత్క్లోమములున్ను ఉండును. ॥౯౪॥

శ్లో॥ యకృత్ప్లీహోందుకా రక్తా ద్రక్త ఫేనాచ్చ పుప్పుసః ॥ ॥౯౫॥

యకృత్, ప్లీహము, ఉందుకము అనునవి రక్తమువలన జనించును. పుప్పుసము (శ్వాసాశయము) రక్తముయొక్క నురుగువలన పుట్టుచున్నవి. ॥౯౫॥

## —♦ స్రోతోవివరణం ♦—

శ్లో॥ స్రోతాంసి నాసికాకర్ణౌ నేత్రే పాయ్వాస్యమేహనం।
స్తనౌ రక్తవహాశ్చేతి నారీణామధికం త్రయం॥ ॥౯౬॥

స్త్రీపురుషులకు నాసికారంధ్రములు, చెవులు, నేత్రములు, గుదము, నోరు మేఢ్రము, అను తొమ్మిదిస్రోతస్సులున్ను సమానముగానేయుండును. యివిగాక స్తనములు, ఆర్తవమునువహించు యోనిమధ్యమందుండు స్రోతస్సు అనునవి మూడు స్రోతస్సులుమాత్రం పురుషులకంటె స్త్రీలకు అధికముగానుండును. ॥౯౬

## —♦ మనుష్యాదిజన్మకారణం ♦—

శ్లో॥ జీవినో భూతసంయోగా త్తరుక్రిమినృపక్షిణః।
ఉద్భిత్స్వేదజరాయ్వండా స్యథా యాంతి న శక్యతే॥ ॥౯౭॥

సూక్ష్మజీవులు పంచభూతసమావేశముచే తరు, గుల్మరూపములయిన ఉద్భిజ్జములుగాను, క్రిమిరూపములయిన స్వేదజములుగాను, మనుష్యపశ్వాదిరూపములయిన జరాయుజములుగాను, పక్ష్యాదిరూపములయిన అండజములుగాను ఎట్లు పుట్టుచున్నవో తెలియబడదు. ॥౯౭॥

శ్లో॥ సూక్ష్మాః ప్రతీక్షంతి జనేరతోయ
స్వస్థో న గచ్ఛే ద్గృహిణీం పవిత్రాం।
తతస్సూక్ష్మజన్మ ప్రతిబంధకత్వా
ద్భవ త్యవశ్యం సతుబాలగోఘ్నః॥ ॥౯౮॥

సూక్ష్మదేహధారులయినజీవులు ఎల్లప్పుడున్ను జన్మకొరకై నిరీక్షించుచుందురు. కాన ఆరోగ్యవంతుడై ఎన్నడు ఋతుస్నానముచే (గర్భధారణకొరకు) పవిత్ర

రాలయిన తనభార్యతో కలుసుకొనడో అట్టివాడు స్ఫూరోక్త సూక్ష్మజీవుల జన్మకు ప్రతిబంధకమును కలుగజేసినవాడు అగుచున్నాడు. కనుకనే ఇతడు బాలకులను గోవులను చంపినపాపములుగలవాడగుచున్నాడు ॥౯౮॥

## —♦ నారకజీవ కర్మజీవనిర్ణయః ♦—

శ్లో॥ అనాయుషా గర్భగతా అజాతా
స్తర్వాదిగా నారకజీవినస్స్యుః।
చరా స్తదన్యే ఖలు కర్మజీవా
స్తస్మా ద్ద్వివిధా జీవగణః ప్రదిష్టః॥ ॥౯౯॥

పుట్టినవెంటనే చచ్చెడివారున్ను, గర్భమందే మృతినొందెడివారున్ను, తరుగుల్మలతాదిరూపములను పొందినవారున్ను నారకజీవులనియు, మిగిలిన తిర్యఙ్మనుష్యాదులు కర్మజీవులనియు జీవగణము రెండువిధములు. ॥౯౯॥

## —♦ కర్మజీవులకు జన్మసంప్రాప్తి ♦—

శ్లో॥ బీజాని శస్తాని భవంతు తేషు
రోహంతి వై కాని చి దేవ భూమ్యామ్।
తద్వదేవ జీవాణుషు శుక్లగేషు
భువి ప్రజాయంతి హి కర్మజీవాః॥ ॥౧౦౦॥

విత్తనములు ప్రశస్తమైనవయినను వాటిలో కొన్నిమాత్రమే భూమియందు ఎట్లు మొలచుచున్నవో అట్లే సూక్ష్మజీవులలో కొంతమంది కర్మజీవులుమాత్రమే శుక్లశోణితగతులై జన్మించుచున్నారు ॥౧౦౦॥

## —♦ గర్భోత్పత్తిసామాగ్రి ♦—

శ్లో॥ ఋత్వంబుబీజక్షితిసంగమేన
యథాంకురాణి ప్రభవంతి నూనమ్।
ఋత్వ స్నసారేంద్రియ రక్తగర్భా
త్తథైక యోగా దపి గర్భయోగః॥ ॥౧౦౧॥

వర్షాదిఋతువు, ఉదకము, బీజము, క్షేత్రము యీనాలుగింటిసమావేశము చేతను అంకురము లెట్లుమొలచుచున్నవో అట్లే ఋతుకాలము జఠరాగ్నిచే బక్వము

గావింపబడిన అన్నరసము, శుక్లశోణితములు, గర్భాశయము అను ఈనాలుగింటియొక్క సమావేశముచేతను గర్భోత్పత్తి కలుగుచున్నది. ॥౧౦౧

శ్లో॥ ఋతౌ గతే ప్రాగ్దివసత్రయే స్యాం
ప్రాచీనరక్తం ప్రవినశ్య పశ్చాత్।
నవార్తవాసృక్ప్రవరుద్భవేన
నారీ స్వపత్యార్హవతీ ప్రభూయాత్॥ ॥౧౦౨॥

స్త్రీలకు ఋతుకాలమున మూడురోజులు గడిచినపిమ్మట ప్రాచీనమయిన శోణితము నశించి నవీనశోణితము ప్రతిమాసమునను ఉత్పత్తియగుటచే స్త్రీ పరిశుద్ధురాలై సంతానార్హతి కలది యగుచున్నది ॥౧౦౨॥

—♦ ఋతుస్త్రీ నియమం ♦—

శ్లో॥ నవార్తవా యాదృశమీక్షతే ప్రా
క్స్నాతే యత స్తాదృశమేవ పుత్రమ్।
తదార్తవే న్యం న నిరీక్షయేత్సా
శుద్ధా విపశ్యేత పతిం పురైవ॥ ॥౧౦౩॥

ఋతుస్నాతయగు స్త్రీ ముందుగా ఎట్టిపురుషుని నిరీక్షించునో అట్టిరూపలావణ్యములుగల బిడ్డనే కనుచున్నది గాన ఋతుస్నానానంతరము (ముట్టునీళ్ళుపోసుకున్నతరువాత) సోదరులు తండ్రి మున్నగువారిని చూడక ముందుగా భర్తనే చూడవలయును

—♦ ఋతుస్త్రీ సంభోగనిషేధం ♦—

శ్లో॥ రమంతి చేత్ప్రాగ్దివసత్రయేస్యాం
మూఢా వినశ్యంతి హి గర్భనాశః।
నోచేదసంపూర్ణహృషీకయుక్తా
స్స్వల్పాయుషో వా ప్రభవంతి నూనమ్॥ ॥౧౦౪॥

స్త్రీ ఋతుమతిఅయిన మొదటిమూడురోజులలోను రమించినయెడల అట్టి మూఢునకు ఆయుర్దాయమునశించును మరియు గర్భముకూడ నశించును. ఒకవేళ అట్లునశించక నిలచినను అంగవైకల్యము కలిగినట్టిగాని ఆయుర్దాయము లేనట్టిగాని, సంతానము కలుగుట నిశ్చయము ॥౧౦౪॥

శ్లో॥ నదీప్రవాహాభిముఖప్రయాంతా
యథా నివర్తంతి ఋతూర్ధరక్తా।
నిక్షిప్తశుక్రం బహిరేవయాయా
న్నత్రదమేత్ప్రాగ్దివసత్రయేస్యాత్॥ ॥౧౦౪॥

నదీప్రవాహమునకు ఎదురుగా వేయబడిన తృణకాష్ఠాదులు ప్రవాహవేగమున కెదురుగా పోలేక తిరిగివచ్చిన చందమున ఋతుకాలమున మొదటిమూడురోజులలో ను ఋతురక్తప్రవాహమున కెదురుగా వుంచబడిన శుక్లము గర్భకోశమును చెందక బయటకువచ్చును గాన ఋతుప్రారంభమున మొదటిమూడురోజులలోనూ స్త్రీని ముట్టరాదు ॥౧౦౫॥

శ్లో॥ సద్యోబలహరానారీ పయస్సద్యోబలప్రదం।
స్త్రియం గచ్ఛేత్పయః పీత్వా స్త్రియం త్యక్త్వా పయఃపిబేత్॥

స్త్రీ బలమును తత్‌క్షణమే హరించును పాలు తత్‌క్షణమే బలమునుకలుగజే యును. కాన స్త్రీసంగమమునకు ముందున, అనంతరమునకూడా పాలు త్రాగవలెను.

శ్లో॥ సంకోచం ప్రతిపద్యతేఽ హనిగతే యోనిఃకదాప్యార్తవే
తస్మాన్నేంద్రియ మాదదాతి ముకుళీధర్మం ప్రపద్యధ్రువమ్।
స్త్రీణాంద్వాదశవత్సరాత్ప్రభృతిచాఽపంచాశదబ్దాత్త్ర్యహం
మాసస్య ప్రసరేద్రజః పరమతి స్సంక్షీయతే కేవలమ్॥౧౦౬

ఋతుదివసములు గతించినవెనుక యోని ముకుళీభావమునుపొంది శుక్రమును గ్రహింపసమర్థము కాదు, స్త్రీలకు ఋతుప్రాదుర్భావకాలమయిన పన్నెండవసంవత్సరము మొదలు యేబదియవసంవత్సరం వచ్చువరకు ప్రతిమాసమునందును మూడు రోజులు రజస్సు స్రవించును ముదిమిచే సప్తధాతువులు శరీరమున వాడిపోవుటచే యేబదిసంవత్సరములకుపిమ్మట రజస్సు క్షయమగును ॥౧౦౬॥

## —♦ స్త్రీపురుషజన్మనిర్ణయం ♦—

శ్లో॥ శుక్లాధికే జన్మసుతస్య భూయా
ద్రక్తాధికే జన్మ భవేత్సుతాయాః।
శుద్ధేర్దినం ద్వాదశరాత్రయశ్చ
రోభ్యాగ్యా న పర్వస్వపివా దివాచ॥ ॥౧౦౭

భార్యాభర్తల సంయోగ కాలమున శుక్లభాగమధికమయినచో పురుషుడున్ను, శోణితభాగమధికమైనచో స్త్రీయున్ను జన్మింతురు. పర్వదినంబులు, పగటిభాగము ఋతుప్రారంభమున మొదటిమూడురోజులు ఇవిగాక శుద్ధదివసమున్ను పిమ్మట పన్నెండురాత్రులున్ను (స్నానదివసముతోసహా పదమూడురాత్రులు) సంభోగార్హములు ॥౧౦౭॥

శ్లో॥ యోగ్యా చతుర్థేహని భర్తృయోగే
హవ్యాదికర్మ స్వపి పంచమేతు।
కేషాంచి దస్యేవ మత శ్చతుర్థే
యోగ్యా న చేత్యే ష ఉపేక్షణీయః॥ ॥౧౦౮॥

భర్తృసంయోగవిషయమై నాలుగవదివసమందున్ను (స్నానదివసమందున్ను) హవ్యకవ్యాదికర్మలయందుమాత్రము అయిదవదివసమందున్ను అర్హురాలగుచున్నది. నాలుగవదివసమందు సంభోగార్హురాలు కాదనెడుకొందఱి దియొక్క పక్షము అనుసరింపతగినది కాదు ॥౧౦౮॥

శ్లో॥ ప్రాగ్దక్షిణ స్తనపయోధరా దక్షిణాంగాధికా పుమాన్।
జాయేత విషమా నారీ మధ్యనిమ్నోదరా యమౌ॥ ॥౧౧౦॥

దక్షిణస్తనమందు ముందుగా పాలుపడుట, దక్షిణభాగము బరువుగానుండుట, వీటిచే పుత్రజననమున్ను, ఎడమస్తనమునందు ముందుగా పాలుపడుట, ఎడమపార్శ్వము బరువుగానుండుట వీటిచే పుత్రికాజననమున్ను గర్భముయొక్క మధ్యభాగము, పల్లమైయుండిన కవలపిల్లలున్ను కలుగుదురు. ॥౧౧౧॥

—♦ యమళోత్పత్తికారణం ♦—

శ్లో॥ వీజేంతరా వాయునా భిన్నే ద్వౌ జీవౌ కుక్షిమాగతౌ।
యమా విత్యభిధీయేతే ధర్మేతరపురస్సరౌ॥ ॥౧౧౧॥

గర్భాశయమున శుక్లశోణితము ఏకమయ్యెడు కాలమున అంతర్వాయువు గర్భమున ప్రవేశించి ఒకానొకప్పుడు భిన్నమును కలుగచేయును. అప్పుడాశుక్లశోణితసముదాయము రెండుఖండములుగా విడిపోవును. తదనంతర మారెండుఖండములయందును రెండుకర్మజీవులు ప్రవేశించుటవలన కవలలు జనింతురు. ॥౧౧౧॥

—♦అంగోత్పత్తి♦—

శ్లో॥ అంగప్రత్యంగనిర్వృత్తి స్స్వభావా దేవ జాయతే।
అంగప్రత్యంగవైషమ్యం పూర్వకర్మ నిమిత్తజమ్ ॥ ॥౧౧౨॥

హస్తపాదాద్యవయవములున్ను, అంగుళ్యాది ప్రత్యంగములున్ను గర్భస్థపిండమునకు స్వభావసిద్ధముగానే (సహజముగానే)జనించును. సౌందర్యాదులున్ను, అంగవైకల్యాదులున్ను గర్భస్థపిండములకు వారివారి పూర్వకర్మానుసారముగ సంప్రాప్తములగుచుండును. ॥౧౧౨॥

శ్లో॥ సన్నివేశ శ్శరీరాణాం దంతానాం పతనోద్భవౌ।
తలేష్వసంభవోయస్య లోమ్నా మేత త్స్వభావతః॥ ॥౧౧౩॥

కరచరణాదులయొక్క ఆకారము, దంతములు మొలచుట, ఊడుట అరిచేతులయందును, అరికాళ్ళయందును రోమములు మొలవకుండుట మొదలయిన వన్నియు స్వభావముగానే కలుగునవైయున్నవి ॥౧౧౩॥

—♦గర్భమునకు మలాద్యభావకారణము♦—

శ్లో॥ మలాఽల్పపక్వాశయవాయుసూక్ష్మ
న్నాఽమీ జరాయో ర్ముఖవాయుమార్గా।
కంఠం కఫా ద్రోదితి నావృతత్వా
చ్ఛ్వాసాదికం మాతృవశా ద్భవంతి॥ ॥౧౧౪॥

గర్భస్థ శిశువునకు మలమున్ను పక్వాశయ సబంధమయిన వాయువున్ను అల్పమై యుండుటవలన వాత మూత్ర పురీష విసర్జనములు ఉండవు ముఖమున్ను వాయుమార్గమున్ను జరాయువుచేతనున్ను కంఠము కఫముచేతనున్ను అడ్డగింపబడుట వలన రోదనముచేయకుండును. తల్లియొక్క ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాదులచేతనే గర్భస్థశిశువునకు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు చలనము నిద్ర మొదలయినవి కలుగును. ౧౧౪॥

—♦గర్భప్రాణవివరణం♦—

శ్లో॥ మనశ్శిలాగంధకచిత్రభాను
క్షారాదిసంయోగవశా ద్యథాగ్నిః।
అంగా న్యవకాశ్రంతమయే సకాలే
స్వయం తథా ప్రాణ ఉదేతి జంతోః॥ ॥౧౧౫॥

మనశ్శిల, గంధకము, నూరేకారము మొదలయిన తెలోరాదుల సంయోగముచే అగ్ని దానంతటదియే పుట్టినట్లు అవకాంతికదేహమున అంగ ప్రత్యంగములవలె ప్రాణమున్ను దానంతటదియే గర్భస్థపిండమునకు యుక్తకాలమున కలుగుచున్నది.

—♦గర్భవృద్ధి♦—

శ్లో॥ గర్భస్థపిండం ప్రతిపద్య మాతృ
భుక్తాన్నసారో రసవాహనాడ్యాం।
మాతుర్నిబద్ధీకృతగర్భనాభి
నాళాధ్వనా గర్భశిశుం వివృద్ధ్యాత్ ॥ ॥౧౧౬॥

తల్లిచే భుజింపబడిన అహారరసము తల్లియొక్క రసవాహనాడియందు కట్టబడిన గర్భనాభినాళమార్గమున గర్భస్థపిండమును చెంది ఆశిశువును వృద్ధిచేయును.

శ్లో॥ వాయు స్సనో త్యఙ్గవిభాగమగ్ని
పచత్యముం సించతి వారి పృథ్వీ।
సంహంతి తం వర్ధయతి ద్యు రేష
శ్శాఖాశిరో మధ్యపడంగజుష్టః ॥ ॥౧౧౭॥

వాయువు ప్రసవకాలపర్యంతమున్ను చేతనాసహితమయిన గర్భముయొక్క వాతాది దోషములను, రక్తాదిధాతువులను, మలములనుకరచరణాద్యంగములను, అంగుళ్యాది ప్రత్యంగములను, విభజనచేయుచుండును తేజస్సు గర్భమునకు రూపాంతరమును గలుగజేయును. ఈప్రకారము వాయువు వలన విభక్తమై తేజస్సంబంధమువలన పరిణామమును (రూపాంతరమును) పొందిన గర్భమును తేజస్సు శోషింపచేయుచుండగా దానిని ఉదకము తడుపుచుండును. ఉదకసంబంధమువలన స్రవించు గర్భమును పృథివి గట్టిగాచేయుచుండును అట్టి గర్భమును ఆకాశము వృద్ధిచేయుచుండును యీవిధమున పంచమహాభూత సంబంధముచే అభివృద్ధినొందిన గర్భము కాళ్ళు, చేతులు, శిరస్సు మధ్యభాగము, (మొండెము) అను ఆరుఅంగములతో కూడుకొని యుండును. మరియు ఒకొక్కటిగానుండు తల, కడుపు, వీపు, నాభి, నుదురు, ముక్కు, గడ్డము, పొత్తికడుపు, కంఠము) అవయవములున్ను, జంటలుగానుండు (చెవులు, నేత్రములు, ముక్కురంధ్రములు, కనుబొమ్మలు, కణతలు, భుజశిరస్సులు, చెక్కిళ్ళు, చంకలు, స్తనములు, వృషణములు, ప్రక్కలు, పిరుదులు, మోకాళ్ళు, మోచేతులు, తొడలు, మొదలయిన) అవయవములున్ను అంగములనియు వ్రేళ్ళున్ను స్రోతస్సులున్ను ప్రత్యంగములనియు తెలియవలెను. ॥౧౧౮॥

## —♦గర్భిణీచ్ఛా పరిపూర్తి కారణమ్♦—

శ్లో॥ ప్రారబ్ధకర్మానుగుణేప్సితాని
స్యుర్దౌహృదే గర్భగతస్య దైవాత్ ।
గర్భాన్వితాయా యది తాన్యలభ్య
స్తద్వస్తు ముఖ్యేంద్రియగర్భలోపః ॥ ॥౧౧౮॥

గర్భస్థశిశువుయొక్క ప్రారబ్ధకర్మానుగుణ్యము లయిన కోరికలు గర్భిణీస్త్రీకి గర్భధారణా కాలమున దైవవశమున కలుగుచుండును మరియు, గర్భిణీస్త్రీకి దోహద కాలమున శ్రవణేంద్రియమునకు ప్రియమైన గానాది శ్రవణమునందిచ్ఛకలిగినప్పుడది గర్భిణీస్త్రీకి లభింపజేయనియెడల గర్భస్థశిశువుయొక్క శ్రోత్రేంద్రియమునకు బాధ. ఇట్లే ఏఇంద్రియమునకు ప్రధానమయిన వస్తువయందు ఇచ్ఛకలిగినప్పుడు ఆవస్తువ లభింపచేయనియెడల గర్భస్థశిశువునకు, ఆఇంద్రియమునకు బాధ కలుగుటయే కాక గర్భిణీస్త్రీకిగూడ పీడకలుగును గాన గర్భస్థశిశువుయొక్క బాధా నివారణార్థము గర్భిణీస్త్రీకోరెడు పదార్థములను తప్పక ఇవ్వవలయును. అప్రకారము ఇంద్రియార్థములయందు మనోరథపరిపూర్తి అయినయెడల గర్భిణీస్త్రీ సుఖప్రసవముగలిగి సుఖమునొందును ॥౧౧౮॥

## —♦గర్భిణీలక్షణములు♦—

శ్లో॥ గర్భే పిపాసా వమనాని కార్శ్యం
భ్రూమేళనం చూచుకకృష్ణవర్ణమ్ ।
గ్లానిశ్చ యోనిస్ఫురణం ప్రసేకం
రోమాళిదృష్టి రుధిరావబంధః ॥ ॥౧౧౯॥

దాహము, వమనములు, చిక్కిపోవుట, కనుబొమ్మలు కలుసుకొనుట, స్తనాగ్రములు నల్లబడుట, ఆయాసము, యోని స్ఫురించుట, నోట నీళ్ళు కారుట, నూగారు ప్రకాశించుట శుక్లశోణితములు బయలుపడలకుండుట. యిట్టిలక్షణములు గల స్త్రీకి గర్భధారణ కాబడినదని తెలిసికొనవలయును. ॥౧౧౯॥

## —♦గర్భిణీనియమములు♦—

శ్లో॥ వ్యవాయదుఃఖార్వ భయానపేక్షి
వ్యాయామనిమ్నోన్నత దేశసంస్థాః ।
త్యాజ్యా నిశా జాగరఘస్రసుప్తి
ప్రభోజనాదీని చ గర్భవత్యా ॥ ॥౧౨౦॥

గర్భవతియగు స్త్రీ మైథునము దుఃఖించుట, అశ్వాద్యారోహణము. భయంకరములయిన పనులను చూచుట, వినుట, శ్రమపడుట, మిట్టపల్లపు నేలయందు కూర్చుండుట, కాళ్ళు చేతులు ముడుచుకొని కుదియబడి కూర్చుండుట, రాత్రి మేలుకొనుట పగలు నిద్రించుట, అధికముగా భోజనముచేయుట, పలుమారు భుజించుట, మలమూత్రములను అనుమానముకలిగిన వెంటనే విడువక ఆటంకపెట్టుట మొదలయినపనులను మానవలెను. ॥౧౨౦॥

## —ప్రసవకాలవిజ్ఞానమ్—

శ్లో॥ క్రమేణ పశ్చాన్నవమాసపూర్తౌ
హృద్బంధముక్తౌ శిథిలేచ కుక్షౌ।
శూలాన్వితే తజ్జఘనేపురీష
మూత్రప్రవృత్తౌ సపది ప్రసూతిం॥ ॥౧౨౧॥

తొమ్మిదిమాసములు నిండినతరువాత హృదయబంధము విడిపోయి కడుపు దిగబడి (వ్రేలబడి) పిరుదులయందును, ప్రక్కలయందును, శూల (పోటు) కలిగి మాటి మాటికిన్ని మూత్రపురీషములను విడిచిపెట్టవలసినఅవసరము కలిగియుండుట, మొదలయిన లక్షణములచే ప్రసవకాలసామీప్యము తెలియనగును. ॥౧౨౧॥

## —ప్రసవకాల కృత్యం—

శ్లో॥ ఉష్ణోదకాభ్యంగకృతాంచశాల
పరీవృతాం ప్రాశితసద్యవాగూమ్।
ప్రసూయమానానాం తు కృతోపధానా
ముక్తాసనాయాం చ విసమ్రసక్థిమ్॥ ॥౧౨౨॥

గర్భిణీస్త్రీకి ప్రసవకాలము సమీపించినతోడనే ఉష్ణోదకముతో అభ్యంగనముగావించి బాలకులతో చుట్టువారుకొని యుండునట్లుగాచేసి, మధురములైన పాయసాదుల యథానుకూలముగా తినిపించి, మృదువైనశయ్యలయందు దిండ్లుమొదలైనవివేసి వాటియందానుకొని పరుండునట్లు చేయవలయును. ॥౧౨౨॥

శ్లో॥ అశంకినీయా అచలా శ్చతస్రో
వృద్ధాః స్వమర్థాః ప్రసవోపచారే।
వికర్తితస్వీయనఖాః ప్రకామం
గర్భాన్వితాం తాముపచారయంతి॥ ॥౧౨౩॥

నమ్మతగినవారును, వృద్ధురాండ్రున్ను, ప్రసవసంబంధమయినవ్యాపారమం దు నేర్పుకలవారున్ను అయిన నలుగురు మంత్రసానులు గోళ్ళు బాగుగా తీసివేసుకొనినవారై ప్రసవకాలమున గర్భిణీస్త్రీకి ఉపచారములు చేయుచుండవలెను.

శ్లో॥ తైలాదికం యోనిముఖేభిషిచ్య
గర్భాన్వితాం వీక్ష్య వదే దధికా।
స్వస్థేప్రవాహ స్వతతో విముక్తే
త్వద్గర్భబంధే చ పునః పున స్త్వమ్। ॥౧౨౪॥

ఆనలుగురిలో ఒకమంత్రసాని గర్భవతియొక్క - యోనిద్వారమున సుఖముగా నుండునట్లు జిడ్డుగల అముదము మొదలైన తైలాదులను లేపనముచేసి పిమ్మట గర్భిణీస్త్రీనిచూచి, అమ్మా! నీవు స్వస్థచిత్తముకలదానవై అధైర్యమునొందక క్రమక్రమముగా ముక్కుటచే నీగర్భనాడీబంధము శిథిలమై నీగర్భస్థితమైన శిశువు బయలువెడలునటుల ప్రయత్నింపుము (ముక్కుట అనగా ముక్కుశ్వాసను బిగించి వాయువును అధోముఖముగా ప్రవర్తింపజేయుట) నీగర్భస్థితమైనశిశువు గర్భాశయమునువిడచి కొంతవరకు బయటపడినయెడల దృఢముగా ముక్కుము. గర్భము (శిశువు) యోనిముఖమును పొందినయెడల మరింత అధికముగా ముక్కుము అనిచెప్పవలయును. ౧౨౪

శ్లో॥ ప్రవాహణా ద్వ్యర్థకృతా దకాలే
గర్భాంగవైకల్య మనేకధా స్యాత్।
తద్గర్భవత్యా సమయే వినైవ
ప్రవాహణం నైవ చరే దకాలే॥ ॥౧౨౫

ప్రసవవేదన పూర్తిగా కలుగకుండ ప్రప్రథమమునుండియే ముక్కినచో గర్భస్థపిండమునకు చెవుడు, మూగ, వక్రములయిన అంగసంధులు, శిరోభిఘాతము, కాస, శ్వాస శోష మొదలైన పలువిధంబులగు అంగవికారములున్ను, రోగములున్ను కలుగగలవు గాన ప్రసవబాధ అధికమై గర్భస్థపిండము గర్భాశయమును విడిచినట్లు గ్రహించి ఆట్టిసమయములయందు ముక్కవలయునేగాని అకాలములయందు ముక్కరాదు. ॥౧౨౫॥

## సద్యోజాతశిశూపచారం

శ్లో॥ శిశౌ ప్రజాతే సతి తజ్జరాయుం
నిమృజ్య కంఠస్థకఫం చ సూతాత్।

బద్ధ్వైవ నాభ్యంగుళదూర దేశే
నికృంత్య సించే దుగ్ధచకంచ దద్యాత్॥ ॥౧౨౬॥

శిశువు జన్మించగానే శరీరముమీదనుండెడు మావిని జాగ్రతగా తొలగించి చేతివ్రేలితో నెఱ్ఱగా శిశువుయొక్క కంఠమునందున్న కఫమునంతయు మిక్కిలి జాగ్రతగాతీసి తర్వాత (నాభినాళమును లాగకుండా) నాభిః వరకు అంగుళముదూరము నకుపైగా దారముతో కట్టి మిగిలిన నాభినాళమును (అనగా కట్టుపైని) పదునైనకత్తితో బొడ్డు లాగకుండాకోసి ఆపైని స్నానముచేయించి అమృతమును త్రాగించవలయును. సున్నిపిండి వగైరాలతో నలుగుపెట్టకుండా పెద్దపురుడు పదిరోజులున్ను సమశీతోష్ణమైన వేడినీటితోనే శిశువునకు అభ్యంగనము చేయించుచుండవలయును.

శ్లో॥ త్రస్తస్స్య త్ప్రతిబోధనేన సహసా సంభ్రామణా ద్బాలక
శ్శీఘ్ర దాహరణా త్త్రిదోషవిషమవ్యా ప్తి స్తథోత్క్షేపణాత్।
కుబ్జ స్స్యాదుపవేశనా దసమయే తస్మాదిమా న్వర్జయే
న్మాతా బాలహితార్థినీ పరిజనా స్తద్బంధుతా జాత్వపి॥౧౨౭॥

బాలురు హఠాత్తుగా లేపబడినచో భయపడుదురు భయపెట్టుట-శీఘ్రముగా తీసుకొనుట, ఎగరవేయుట, వీటిచే వాతపిత్తశ్లేష్మములయొక్క వైషమ్యస్థితి తటస్థించును. కూర్చుండతగినవయస్సు రాకుండగనే కూర్చుండపెట్టినయెడల గూను రాగలదు గాన బాలురహితవునుగోరుతల్లులు, సేవకులు, బంధువులు యెప్పుడున్ను పయిన చెప్పినపనులు చేయరాదు. ॥౧౨౭॥

## —♦ జన్మప్రయోజనం ♦—

శ్లో॥ జ్ఞానం హి సంపాద్య ఫలం జనేస్తు
జ్ఞానం తు విద్యాభి రిమా స్తు దేహాత్।
దేహం సదారోగ్యవశేన లభ్యం
స్యారోగ్య మారోదితసద్విధానైః॥ ॥౧౨౮

జన్మ దొరికినందులకుగాను ప్రతిమానవుడున్ను సంపాదించుకొనవలసినది జ్ఞానము. ఈజ్ఞానము విద్యలవల్లను విద్యలు దేహధారణమువల్లను, దేహము ఆరోగ్యవిధులచేతను, ఆరోగ్యవిధులు పెద్దలు ఏర్పరచిన విధానాదులచేతను లభ్యములు.॥౧౨౮॥

— ♦ శరీరోపయోగం ♦ —

శ్లో॥ వసే త్సదారోగ్యయుతే కళేబరే
పరత్ర చేహాపి చ సాధనం మనః।
తస్మా త్సదారోగ్యయుతం కళేబరం
జీవస్య చాధార ముశంతి సంతః॥ ॥౧౨౯

ఇహపరములకు సాధనమైన మనస్సు ఆరోగ్యముగలదేహమందేగాని సరిగా యుండదు కాన ఆరోగ్యముగలిగియున్నదేహమే మానవునియొక్క జీవితమునకు మూలాధారము ॥౧౨౯॥

— ♦ ఆరోగ్యావశ్యకత ♦ —

శ్లో॥ చిత్తస్య నిర్వర్తయితుం ప్రవృత్తీః
కళేబరం ప్రాతినిధిత్వసృష్టమ్।
తస్మా చ్ఛరీరస్య సుఖం నిదానం
యథాస్థితే ర్వా మనసః ప్రకామమ్। ॥౧౩౦॥

మనస్సుయొక్క ఊహలను (ప్రవృత్తులను) నెరవేర్చుటకు శరీరము ప్రతినిధిగా ఏర్పరుపబడినది కాన మనస్సు సరిగానుండుటకు శరీరారోగ్యమే కారణమైయున్నది ॥౧౩౦॥

— ♦ అవయవములకు సహజకృత్యం ♦ —

శ్లో॥ దేహస్య సర్వావయవాని సైన్య
కల్పాని తా న్యన్యపదార్థమోక్షే।
కుర్వంతి తత్సంగర మేవ దేహే
ప్రయాతి నానావికృతిస్వరూపమ్॥ ॥౧౩౧॥

దేహపంజరమునందుగల అవయవములన్నియు దేహమునకు సైనికులవంటివి. సైనికకల్పములయిన యీఅవయవములన్నియు దేహమందు ప్రవేశించియున్న చెడు పదార్థములను తొలగించివేయుటకుగాను చేయుపోరాటమే అనేకవిధములయిన రోగస్వరూపములుగా మారిపోవుచున్నది ॥౧౩౧॥

—♦ మనశ్శరీరములకుగలసంబంధము ♦—

శ్లో॥ శరీరసంరక్షకజీవధారణా
శక్తిం తు చైతన్య మశంతి పండితాః।
వినాస్య సాహాయ్య మధోపయుజ్యతే
మన శ్శరీరం న కదాపి లేశతః॥ ॥౧౩౨

శరీరమును కాపాడుచున్న ప్రాణధారణాశక్తియే చైతన్యమనిచెప్పబడుచున్నది ఈచైతన్యసహాయములేక మనస్సుగాని శరీరముగాని లేశమాత్రమయినను ఉపయోగపడజాలవు. ॥౧౩౨॥

—♦ చైతన్యనిర్ణయం ♦—

శ్లో॥ చైతన్య మిత్యత్ర న శోచనీయం
బ్రహ్మండచైతన్య మితి ప్రమాదాత్।
అరూపిణ స్తస్య కుత శ్చికిత్సా
సర్వత్రపూర్ణస్య కుతో౽థవాపి॥ ॥౧౩౩

చైతన్యమనగా బ్రహ్మండచైతన్యమని ఆలోచింపరాదు ఏలననగా బ్రహ్మండచైతన్యము స్వరూపములేనిదనిన్ని, సర్వవ్యాప్తమైనదనిన్ని రెండుపక్షములు యీ రెండుపక్షములయందునుకూడ చికిత్స అసంభవము ॥౧౩౩॥

—♦ చైతన్యప్రకాశ ♦—

శ్లో॥ న భా త్యగారే విశదే సధూమే
యథా న దీపం ఖలుకాంతిమ ద్వా।
చైతన్యశక్తి ర్న విభాతి తద్వ
ద్దోషేషు వైషమ్యగతేషు దేహే॥ ॥౧౩౪॥

దీపము కాంతికలదైనను స్వచ్ఛమైనయింటియందు ప్రకాశించినట్లు పొగ చూరినయింటియందు ఎట్లుప్రకాశించదో చైతన్యశక్తికూడ అట్లే ధాతుత్రయ (వాత పిత్తశ్లేష్మ) సామ్యముగలదేహమున ప్రకాశించినట్లు ధాతుత్రయవైషమ్యముగల దేహమునందు ప్రకాశింపదు. ॥౧౩౪॥

శ్లో॥ చైతన్యశక్తే ర్విషమస్థితి ర్గ
దారోగ్య మస్యైవ యథాస్థితి స్స్యాత్।
అన్యోన్యసంబంధవశా చ్ఛరీర
చైతన్యయో స్స్యా దుభయోరు క్రమాపి॥ ॥౧౩౪॥

యీ చైతన్యశక్తియొక్క విషమస్థితియే రోగము సమానస్థితియే ఆరోగ్యము దేహమునకున్ను చైతన్యమునకున్ను గల పరస్పరసంబంధము వలననే రోగముయొక్కయు, ఆరోగ్యము యొక్కయు స్థితిగతులు తెలుసుకొనబడుచున్నవి. ॥౧౩౫

— ♦ స్థూలదేహ సూక్ష్మ దేహములకుగలసంబంధము ♦ —

శ్లో॥ లోహస్య సూచే రివ సర్వదాపి
స్థూలస్య సూక్ష్మస్య తథానుబంధః।
స దేహసంరక్షకజీవశక్తి
ర్బంధభిన్నే సతి నైవ జీవః॥ ॥౧౩౬॥

సూదిగంటి రాతికిన్ని సూదికిన్ని ఉన్న సంబంధమువంటి సంబంధమే స్థూలదేహమునకున్ను సూక్ష్మదేహమునకున్ను కలదు. ఇదియే దేహమును కాపాడుచున్న ప్రాణధారణాశక్తి (చైతన్యము) యీసంబంధము విడిపోయినచో ప్రాణము దేహమును యెడబాయును, ॥౧౩౭॥

శ్లో॥ యథాతితప్తేఽయసి పిండ గోళే
సర్వత్ర పూర్ణః పరిదృశ్యతేఽగ్నిః।
స్థూలే సమంతా దపి సూక్ష్మదేహ
ప్రకాశసంబంధ మపి ప్రకాసున్॥ ॥౧౩౮॥

యర్రగా కాల్చబడిన అయఃపిండమునం దగ్నియొక్క ప్రకాశమంతటను యెట్లుకలుగుచున్నదో సూక్ష్మదేహము యొక్క ప్రకాశస్థూలదేహమందును అటులనే కలుగుచున్నది. ॥౧౩౯॥

శ్లో॥ ఉష్ణం కృశానౌ ప్రసవే సుగంధ
స్స్పర్శో౽నిలేంతర్బహి రంతరిక్షమ్।
బీజేంకుర స్త్రీరుధిరే పయో వా
చైతన్య మేవం మిళితం శరీరే॥ ॥౧౪౦॥

అగ్నియందు వేడిమి, పుష్పమందు సువాసన, వాయువునందు స్పర్శ, బాహ్యాభ్యంతరములయందు ఆకాశము, బీజములయందంకురము స్త్రీరుధిరమందు పాలు, ఎట్లుమిళితములైయున్నవో అటులే చైతన్యశక్తియు శరీరమున మిళితమైయున్నది.

—♦ సృష్టిస్థితిలయ విషయం ♦—

శ్లో॥ ప్రజాయతే వర్ధతి నశ్యతే సా
యథా చరశ్చా ప్యచరశ్చ విశ్వః॥
న జ్ఞాయతే కేనచి దత్ర తథ్యం
తమేక మీశంచ వినా తథా రుక్॥ ॥౧౩౯॥

చరాచరస్వరూపమైన యీ ప్రపంచ మెట్లుపుట్టుచున్నదో యెట్లు వృద్ధినొందుచున్నదో యెట్లు నశించుచున్నదో ఆపరమేశ్వరునికితప్ప యెవరికిన్ని తెలుసుకొనుట కెట్లుశక్యముగాదో రోగమును అప్రకారమే యెట్లు ఉత్పత్తియగుచున్నదో యెట్లు అభివృద్ధినొందుచున్నదో యెట్లునివారణఅగుచున్నదో తెలుసుకొనుటకు శక్యముకాదు ॥౧౩౯॥

శ్లో॥ జాఠరో భగవానగ్ని రీశ్వరో న్నస్య పాచకః।
సౌక్ష్మ్యా ద్రసా నాదదానో వివేక్తుం నైవశక్యతే॥ ॥౧౪౦॥

షడ్గుణైశ్వర్యసంపన్నుడయిన ఈశ్వరుడే జఠరాగ్నిస్వరూపుడై భుజింపబడిన ఆహారమును పచనముగావించి ఆఆహారరసమును గ్రహించుచుండును. ఈ కార్యమును జఠరాగ్నిస్వరూపమైన చైతన్యశక్తి యెట్లు నెరవేర్చుచున్నదో తెలుసుకొనుటకు శక్యముకాదు. ॥౧౪౦॥

శ్లో॥ బలస్యమూలం జఠరో జీవితస్య బలం తథా॥
అజ్ఞానా ద్బంధ మేత్యాత్మ జ్ఞానా న్ముక్తిం చ మానవః॥౧౪౧॥

బలమునకు జఠరాగ్నియు, జీవితమునకు బలమును కారణములు. అజ్ఞానమువల్ల బంధమును ఆత్మజ్ఞానమువలన ముక్తియును కలుగును ॥౧౪౧॥

శ్లో॥ జీవ శ్చతుర్వింశతితత్త్వరూపే
వపుర్గృహే పాపసుఖాదిరూపైః।
దేహేంద్రియైః కే మనసా చ బుద్ధ్యా
కామాదిభి స్తైర్దశభిః ప్రబద్ధః॥ ॥౧౪౨॥

జీవుడు చతుర్వింశతితత్వస్వరూపమైన శరీరమునుగృహముగ పాపము, పుణ్యము దుఃఖము, సుఖము, మనస్సు, బుద్ధి, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, (అహంకారము) జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు అనువానిచే కట్టబడి దేహి అనబడును ॥౧౮౨॥

## శరీరపోషణమ్

శ్లో॥ పలాశరేఖాకృతయశ్చ భిన్నా
సూక్ష్మా స్సిరా స్సర్వతనౌ ప్రకీర్ణాః।
తథా మృణాళాంతరరంధ్రరూప
స్స్రోతాంసి భిన్నాని విస్తృత్వరాణి॥ ॥౧౮౨॥

సన్ననినరంబులు మిక్కిలిసూక్ష్మంబులై ఆకులయందలి రేఖలనుబోలియు పెద్దనరంబులు తామరనాళములనుబోలియు శరీరమునందంతటను వ్యాపించియున్నవి

శ్లో॥ నద్య స్స్వతోయై ర్జలధిం యథైవ
తా స్తర్పయం త్యన్నరసై శ్శరీరమ్।
స్థూలాత్మికా తాసు సహస్రపూర్వా
వ్యాన ప్రతి గ్రాహ్రసమాశ్రితాసు॥ ॥౧౮౩॥

నదులు నిజజలంబుచే సముద్రమును పెంపొందించునట్టులు పైన ఉదహరింపబడిననాడులు దేహి సేవించు ఆహారరసముచే దేహమును వృద్ధినొందించుచున్నవి. వాటిలో పదివందలడెబ్బదిరెండునాడులు స్థూలనాడులు అయియున్నవి ॥౧౮౩॥

శ్లో॥ పంచేంద్రియాణాం చ గుణగ్రహో స్స్య
ర్థన్యా హి తా ఏవ సిరా శ్శరీరే।
మూలాశ్రితాః పంచ సిరాః పురోక్తా
నాభౌ ప్రవిష్టాః ఖలునాభిచక్రే॥ ॥౧౮౪॥

పైనచెప్పబడిననాడులలో శబ్ద స్పర్శ రూప రస గంధాత్మకమైన పంచేంద్రియములయొక్కయు గుణములను గ్రహింపగలిగిననాడులే మిక్కిలిప్రశస్తములు ఈనాడులైదున్ను మూలాధారము నాశ్రయించి నాభిచక్రమునందు ప్రవేశించియున్నవి. ॥౧౮౪

శ్లో॥ నాభే స్తాసు దశోర్ధ్వ మేత్య విషయాన్వ్యాసోక్తి జృంభాదికా
చ్చేత్రో మూత్రవిడార్తవాది చ దశ పాశ్చ్యైవ నాభేరథః ।
తిర్యగ్వ్యాప్తచతుర్భవా స్తనుగతా శ్చిన్వంతి భుక్తద్రవం
స్వీకుర్వంతి చ రోమకూపవివరైః స్వేదాది ఘర్మం బహిః॥౧౪౫॥

పూర్వోక్తములయిన నాడులయందు పదినాడులు నాభియొక్క ఊర్ధ్వభాగమందు వ్యాపించి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను గ్రహించుచు శ్వాస, మాటలాడుట, ఆవలింత, తుమ్ము, నవ్వు మొదలయినవాటినిన్ని పదినాడులు నాభియొక్క అధోభాగమందు వ్యాపించి రేతస్సు, మూత్రము, మలము, ఆర్తవము, మొదలయినవాటినిన్ని అడ్డముగా వ్యాపించిన నాలుగునాడులయందు బయలుదేరిన అనేకములగు నాడులు రోమకూపములయందు ప్రతిబద్ధములయి దేహమంతటను వ్యాపించి భుజింపబడిన అన్నపానసారమును దేహమంతటను పెదజిమ్ముచున్నవి మరియు స్నానాభ్యంగలేపనాదులను రోమకూపములనుండి దేహములోని కాక ర్షిం చుచున్నవి దేహములోని చమటను స్వేదమును) వెలికి త్రోయుచున్నవి. ॥౧౪౫॥

శ్లో॥ బద్ధో యథాంగైరివ చక్రనాభి
ర్బద్ధ స్సిరాభి ర్మనుజస్య నాభిః ।
ప్రాణాశ్చ నాభీ స్సహజానుబంధాః
పరస్పరేణైవ కృశానుదారోః ॥ ॥౧౪౬॥

ఆకులచే బండి కింటెనడిమితూమువలెనే నిరలచే మనుజులయొక్క నాభియు కట్టబడియున్నది అగ్నియు అరణియువలె ప్రాణములు నాభియు సహజానుబంధము. (అవిచ్ఛిన్నానుబంధము కలిగియున్నవి ॥౧౪౬॥

శ్లో॥ వ్యాప్నువంత్యభితో దేహంనాభితః ప్రసృతా స్సిరాః ।
ప్రతానాః పద్మినీకండా ద్బిసాదీనాం యథాజలమ్ ॥ ॥౧౪౭॥

తామరకాడ మొదలయినవి దుంపనుండి బయలుదేరి నీటియందంతటను వ్యాపించినట్టుల నిరలు నాభినుండి బయలుదేరి శరీరమంతటను వ్యాపించును ॥౧౪౭॥

శ్లో॥ ఆపాదతః ప్రభృతి గాత్రమశేష మాసా
మామస్తకా దపి చ నాభిపురస్థితేన ।
ఏతన్మృదంగ ఇవ చర్మమయేన బద్ధా
దేహం నృణామిహసిరాశతసప్తకేన॥ ॥౧౪౮॥

నాభిస్థానము నాశ్రయించి పాదము మొదలు శిరఃపర్యంతము వ్యాపించియుండెడు ఏడువందల నాడులచే మానవుని శరీరము మృదంగము చర్మముచే కట్టబడినట్లు బంధింపబడియున్నది ||౧౪౮||

## —♦ నాడిపరిజ్ఞానం ♦—

శ్లో॥ అనామికాతర్జనిమధ్యమాసు
ద్వంద్వేషు వాతాగ్నికఫాంశ్చ మిశ్రాన్।
మందా దజీర్ణం సమశ స్త్వరోగ
మసాధ్యసన్నిద్ధ్యగద్యక్త్రితాజ్ఞాత్॥ ||౧౪౯||

అనామిక వ్రేలియందు వాతనాడియు తర్జనీ వ్రేలియందు పిత్తనాడియు, మధ్యమ వ్రేలియందు శ్లేష్మనాడియు, మందగతివలన అజీర్ణనాడియు, ద్వంద్వాంగుళులయందు మిశ్రనాడియు, సమగతిచే ఆరోగ్యనాడియు ఒకమారు కనుపించియు ఒకమారు కనుపించనియెడల అసాధ్యనాడియు, వాతపిత్తశ్లేష్మములలో ఫలాని నాడి అని తెలుసుకొనుటకు వీలులేనిదియైనచో గుప్తనాడి యని, వాతనాడియనియు తెలియవలయును. ||౧౪౯||

## —♦ నవనాడీనిర్ణయం ♦—

శ్లో॥ పిత్తశ్లేష్మానిలాజీర్ణారోగ్యసన్నికనామకాః।
శ్లేష్మపైత్య శ్లేష్మవాత స్సీతపైత్యాః ప్రకీర్తితాః॥ ||౧౫౦||

(1) పిత్తనాడి (2) శ్లేష్మనాడి (3) వాతనాడి (4) అజీర్ణనాడి (5) ఆరోగ్యనాడి (6) సన్నిపాతనాడి (7) శ్లేష్మపైత్యనాడి (8) శ్లేష్మవాతనాడి (9) సీతపిత్తనాడి అని నాడీభేదము తొమ్మిదివిధములైయున్నది ||౧౫౦||

## —♦ స్త్రీపురుషనాడీభేద వివరం ♦—

శ్లో॥ అధోముఖ స్త్రిపతి యాభినార్యః
పుంసాం సదా పూర్ధ్వముఖో వధూనామ్।
అసూతివానం నిరపాయమేవ
బిభర్తినారీ కలౌ ముతస్తత్॥ ||౧౫౧||

నాభికమలము పురుషులకు అధోముఖముగాను స్త్రీలకు ఊర్ధ్వముఖముగాను (సంపుటముగా) ఉండును. గనుకనే స్త్రీ ప్రసవకాలమువరకు గర్భస్థపిండమునకు ఎట్టిఅపాయము కలుగకుండా తొమ్మిదిమాసములు మోయగలుగుచున్నది ॥౧౫౧

శ్లో॥ తత్కూర్మాకృతేనైవ స్థానభేదేన నాడీ

వామేవధూనామపి దక్షిణే చ।
పుంసాం ప్రకోష్ఠే పరిగృహ్యతే రు
గ్బలాబలజ్ఞాన నిదానయోగ్యా। ॥౧౪౨॥

ఆనాభికమలముయొక్క భేదముచేతనే నాడి స్త్రీలకు ఎడమపార్శ్వమందు పురుషులకు కుడిపార్శ్వమందున్న ఉంగి రోగములయొక్క సాధ్యత్వాసాధ్యత్వము లను తెలియజేయుచున్నది. గాన ముంజేయి (మణికట్టుదగ్గర) పరీక్షింపబడుచున్నది.

—♦ నాడీపరీక్షాక్రమం ♦—

శ్లో॥ నాడీ యస్య స్పందతే నైకధైవ
త్రింశద్వారం జీవితం తస్యలోకే।
స్థిత్వాస్థిత్వా స్పందతే చేత్తథైవ
క్షిప్రం వైద్యాస్త్యజేత్తస్య సుధీః॥ ॥౧౪౩॥

ఏరోగియొక్క నాడి ఏకరీతిగా ముప్పదిత్రుటికాలములు హెచ్చుతగ్గులు లేక ముప్పదిదెబ్బలు వరుసగా కొట్టుచుండునో అట్టిరోగి ఎంతఅపాయస్థితిలోనున్నను తప్పకజీవించును ఏరోగినాడి ఆగిఆగి కొట్టుచుండునో అట్టిరోగిని వైద్యుడు శీఘ్ర కాలముననే విడిచిపెట్టవలెను ॥౧౫౩॥

శ్లో॥ వాద్యైరనేకైర్భుజగపక్షిమూర్తై
ర్గ్రంథేషునాడీ గతి రీతిరాపి।
విజ్ఞాయ తేనాధునికైర్గుణేభ్యో
వినా తదభ్యాసకృతప్రయత్నైః॥ ॥౧౪౪॥

వైద్యగ్రంథములయందు నాడీగమనము, సర్పగములయొక్కయు. పక్షుల యొక్కయు, నడకలతోను, వాద్యభేదములతోను, నరపోల్చి చెప్పబడినది. అయిన

ప్పటికిన్ని ఆఉదాహరణములవలన నాడీగమనము తెలియబడుటదుర్లభము. గుణముల ననుసరించియే తెలియబడవలయును ॥౧౫౪॥

శ్లో॥ యథాక్షరాణా మనుభూతిమాత్రా
త్సమ స్తశా స్త్రవ్యవహారశ క్తిః।
నాడీపరిజ్ఞానవశా త్సమ స్త
రూపామయానా మనుభూతిసిద్ధిః॥ ॥౧౫౫॥

కేవల అక్షరజ్ఞానమాత్రముచే సమస్తశాస్త్రపఠనపాఠసామర్థ్యము అలవడుచున్నట్లు నాడీపరిజ్ఞానమలవడినరో సమస్తరోగనిరూపణాశక్తియు కలుగును

శ్లో॥ నాడీపరీక్షార్జనధీ ర్విన ష్టా
సర్వత్ర లభ్యై ర్జ్వర మాన యంత్రైః।
దీక్షావతోపి శ్రమసాధనీయ
ఇవ స్వపాకే పరపాకభు క్తేః॥ ॥౧౫౬॥

భోజననియమముగలవానికికూడ పరపాకభోజనమువలన శ్రమసాధ్యమైన స్వయంపాకభోజనమందు శ్రద్ధతగ్గినట్లు సర్వత్ర లభ్యముగుచున్న జ్వరమానయంత్రము (థర్మామీటరు) చే నాడీజ్ఞానసంపాదనశ్రద్ధ ప్రస్తుతకాలమం దడుగంటి నదని చెప్పవచ్చును. ॥౧౫౬॥

శ్లో॥ జ్ఞాతోపి వా స్వేన పురా స ఏవ
స్థానం త్వర త్రైవ నిరీక్షిత శ్చేత్।
యథాచరాయ స్మృతిగోచర స్స్యా
న్నాడీ తథా ద్విత్రినిరీక్షణేన॥ ॥౧౫౭॥

పూర్వము తనచే తెలియబడినవాడయినను ఆస్థానమందుతప్ప తదితరస్థానమందున్నప్పుడు అతనినిపోల్చుటకు చాలాకాలమువరకు శక్యము కాదు. అప్రకారమే నాడీసంచారముకూడా రెండుమూడుపర్యాయములు చూచినగాని పోల్చుటకు శక్యము కాదు, ॥౧౫౭॥

శ్లో॥ స్త్రీచే దార్తవగర్భిణీ వివరణాదీ న్యాయుశ్శికాలం విషం
మూత్రం తత్స్వగతిం పురీషసుఖనిద్రా జీర్ణశ క్తిం క్రిమీన్।
వ్యాధే ర్లక్షణ మింద్రియం సుఖరుజో భుక్తౌషధం తత్ఫలం
రూపస్పర్శనశబ్దనేత్ర రసనా నాడీ జ్వరాభ్యాసకాన్॥ ॥౧౫౮॥

లేక స్త్రీ అయినచో ఋతుసంబంధమైనట్టియు, గర్భిణీసంబంధమైనట్టియు ప్రసవసంబంధమయినట్టియు కాలభేదములను, కాలపరిమితులను - టిలోవచ్చిన లేక వాటిలోయుండెడు వైషమ్యస్థితులనున్ను స్త్రీపురుషులకు అందరకును వ్యాధి ఎంతకాలమునుంచి ఉన్నదియు, విషప్రయోగముతగిలిన అనుమానమును, మాత్ర మయొక్క-స్థితిని, తత్వమును (వేడితత్వమయినది, లేక వాతతత్వమయినది, శ్లేష్మతత్వమయినది, ద్వంద్వతత్వమయినది) వివేచనముయొక్క-స్థితిని, నిద్రపట్టుచున్నది లేనిదిన్ని, జీర్ణశక్తి సరిగానున్నది లేనిదిన్ని, క్రిములను వ్యాధియొక్క-స్వభావమును, ఇంద్రియస్థితిని, సుఖవ్యాధులువివరమును, రోగోపశాంతికొరకు లోగడపుచ్చుకున్న మందులను, వాటివలనకలిగినఫలితమును, రూపము, స్పర్శ, శబ్దము, నేత్రములు, నాలుక, నాడి, అప్పుడప్పుడు జ్వరమువచ్చుఅలవాటు, నల్లమందు మొదలైనవస్తువుల యొక్క- అలవాటు వీటినన్నింటిని ముందుగా తెలుసుకొనవలయును. ॥౧౫౭

## నాడీదేవతలు

శ్లో॥ వాతనాడ్యా భవే ద్బ్రహ్మ
పిత్తనాడ్యా శ్చ శంకరః।
శ్లేష్మనాడ్యా భవే ద్విష్ణు
ర్నాడీదేవా స్త్రయో మతాః। ॥౧౫౮॥

వాతనాడికి బ్రహ్మ, పిత్తనాడికి శంకరుడు, శ్లేష్మనాడికి విష్ణువు అధిపతులు

## వాతాదులకుస్థానములు వాటిగతులు

శ్లో॥ వాతస్య పక్వాశయ మేవ ముఖ్యం
పిత్తస్య నాభి ర్హృదయం కఫస్య।
వృద్ధిః క్షయ స్థ్సాన మథోర్ధ్వ గతిర్య
క్త్వక్కోష్ఠమర్మాస్థి విబంధనేషు। ॥౧౫౦॥

వాతమునకు పక్వాశయమున్ను, పిత్తమునకు నాభిస్థానమున్ను కఫమునకు హృదయమున్ను ముఖ్యస్థానములు. వాతాదిత్రిదోషములయొక్క-గతులు వృద్ధి, క్షయము, స్థానము, అని మూడువిధములు. వాతాదులు తమతమస్థానములయందు అధికముగా వృద్ధినొందుట వృద్ధి,తగ్గియుండుటక్షయము, వృద్ధిక్షయములు లేకుండుట స్థానము. మరియు యీవాతాదులు శరీరమున కిందికిని పైకిని అడ్డముగాను, వ్యాపించుగతిభేదములు మూడు. త్వక్కు-లయందును, కోష్ఠముయందును మర్మములయొక్క-యు, అస్థులయొక్క-యు సంధులయందును సంచరించుగతిభేదములు మూడు. యీవిధముగా దో

షములకు గతిభేదములు తొమ్మిదివిధములు. యీగతిభేదము ననుసరించి చికిత్సకూడా భిన్నమైయుండును. ॥౧౬౦॥

## —♦ అష్టస్థానపరీక్ష ♦—

శ్లో॥ రోగాక్రాంత శరీరస్య స్థానా న్యష్టౌ పరీక్షయేత్।
నాడీం మూత్రం మలం జిహ్వాం శబ్దస్పర్శరుగాకృతీః॥ ॥౧౬౧

ప్రతిరోగమందు వైద్యుడు ముందుగా రోగియొక్క నాడి, మూత్రము, మలము, నాలుక, మాట, స్పర్శము (తను కాక) నేత్రములు, ఆకారము అను అష్టస్థానములను బహునేర్పుతో పరీక్షింపవలెను ॥౧౬౧॥

## —♦ నాడి తెలియనివారు ♦—

శ్లో॥ కలంజమాంసా సిలమద్యపాయినాం
సుప్తగ్రహావేశిత రాజయక్ష్మణామ్।
స్నాతాశిత శ్రాంతకృశోపవాసినాం
నాక్రందితోన్మత్తనితంబసంగినామ్॥ ॥౧౬౨॥

గంజాయి, మాంసము, ప్రాణాయామము, మద్యపానముకలవాడు, నిద్రించినవాడు, గ్రహావేశముకలవాడు, క్షయరోగముగలవాడు, స్నానముచేసినవాడు, రోదనముచేసినవాడు, అలసినవాడు, కృశించినవాడు, ఉపవాసముచేసినవాడు, భోజనముచేసినవాడు, ఉన్మాదముకలవాడు, స్త్రీసంభోగముచేసినవాడు, వీరలకునాడి సరిగా తెలియదు గాన ఇట్టిపనులనుచేసినవారికి వైద్యుడు (వెంటనే) నాడీపరీక్ష చేయకూడదు. ॥౧౬౨॥

## —♦ నాడులయొక్క ఉత్పత్తి ♦—

శ్లో॥ హృదంతరప్రాణమరుత్ప్రకంపా
చ్ఛ్రవంతి నాడ్యో రుధిరం శరీరే।
రక్తప్రసారవ్యవహారదృష్టా
నాడ్యో భవేయు ర్యది రుక్తదైవ॥ ॥౧౬౩॥

హృదాకాశవర్తియగు ప్రాణవాయువుయొక్క గతివిశేషముచే రక్తవాహినులు అగునాడులు రక్తమును శరీరమునందంతటను ప్రసరింపజేయుచున్నది. ఆనాడులు రక్తప్రసరణవ్యవహారమునందసమర్థములైనయడల అప్పుడే రోగము సంభ

వించుచున్నది. ఉదాహరణ—ఒకానొకప్పుడు కొన్నిచోట్ల ప్రసవభారముచేజనించినశిశువునకు అలజడికలుగుటవలన ప్రాణవాయువు చలించనికారణముచే ఏడవనియడల ఆశిశువుయొక్క—గుండెలమీదనున్ను, గుండెలకెదురుగా వెన్నుమీదనున్ను చరిచెదరు ఇట్లు చరిచినతరువాత ప్రాణవాయువు చలించుట కారంభించి శిశువు ఏడ్చుట మొదలుపెట్టును. దీనినిపట్టి ఆలోచించగా ప్రాణవాయువుయొక్క—చలనమే జీవితము అని తేటబడుచున్నది. గుండెలపైనిచరిచెడుఆచారమును వినుచున్నాము

—♦ వాతాదులకు నామసార్థక్యం ♦—

శ్లో॥ శరీరదూషణాద్దోషా ధాతవో దేహధారణాత్।
వాతపిత్తకఫాజ్ఞేయా మలినీకరణా న్మలాః॥ ॥౧౬౪॥

వాత పిత్త కఫములను యీమూడుధాతువులున్ను శరీరమును దూషించుటచే. దోషములనియు, దేహమును ధరించుటచే ధాతువులనియు, రసాదిధాతువులను మాలిన్యపరచుటచే మలంబులనియు చెప్పబడుచున్నవి ॥౧౬౪॥

—♦ వాతవివరణం ♦—

శ్లో॥ శ్వాసానాఽదిక మాదధాతి హృది యః ప్రాణో భవత్పంచధా
నాభా వాత్మగతాని జీర్యతి యథాకాలం సమాన స్తథా।
జీర్ణాగ హాతి గుదే త్వపానపవనః కంఠే హ్యుదాన స్వనం
వ్యాన స్స్వేదన మస్సృజ్ఞ్యుత్ప మేషా పిని సూతేనిశమ్॥

వాతపిత్తశ్లేష్మంబులు స్థానభేదముచే ప్రత్యేక ప్రత్యేకముగా ఐదువిధములుగా నుండును. వీటిలో వాతము హృదయమునుండి గర్భాశయమందన్నాదులను ప్రవేశింపజేయుచు ఉచ్ఛ్వాస నిశ్వాసములను కలుగచేయుచుప్రాణవాయువనియు నాభియందుండి అన్నాదులనుజీర్ణింపజేయుచు సమానవాయువనియు గుదమందుండిమలమూత్రరేతస్సులను అ ముఖమునొందించుచు అపానవాయువనియు కంఠమందుండి సంభాషణాదులను పుట్టించుచు ఉదానవాయువనియు సర్వశరీరమును వ్యాపించి స్వేదాస్సృక్స్రమేహాదులను పుట్టించుచు వ్యానవాయువనియు చెప్పబడును

—♦ పిత్తవివరణం ♦—

శ్లో॥ అగ్న్యాశయాత్వగ్యకృదక్షిహృత్సు
స్యా త్పాచకభ్రాజకరంజనాని।
ఆలోచకం సాధక మేవ జీర్ణ
ప్రభాస్విరుజ్ఞానధయః కరోతి॥ ॥౧౬౬॥

ఆగ్న్యాశయమందుండి అన్నాదులను పచనంబు గావించుచు పాచకపిత్తమనియు చర్మమునుండి అభ్యంగలేపాదులను పచనంబు గావించుచు శరీరమునకు కాంతిని కలుగజేయుచు భ్రాజకపిత్తమనియును యకృత్తునందుండి రసధాతువును రక్తధాతువుగా పరిణమింపజేయుచు రంజకపిత్తమనియును నేత్రములయందుండి నీల, పీత, సూక్ష్మ, స్థూలరూపాదిభేదవిజ్ఞానమును కలుగజేయుచు ఆలోచకపిత్త మనియును హృదయమందుండి మేధ, ప్రజ్ఞ వీటిని కలుగజేయుచు సాధకపిత్త మనియును చెప్పబడును. ||౧౬౬||

## —♦ శ్లేష్మ వివరణం ♦—

శ్లో|| తనౌ సదా మాశయశీర్షకంఠ
హృత్సంధిషు క్లేదకస్నేహనాఖ్యౌ।
స్థైర్యం పటుత్వం రసనావలంబ
శ్లేష్మాణి కుర్వంతి యథోచితేన । ||౧౬౭||

ఆమాశయమందుండి క్లేదమనియును శిరస్సునుండి స్నేహనమనియును కంఠమునుండి రసనమనియును హృదయమునుండి అవలంబకమనియును సంధులయందుండి శ్లేష్మకమనియును చెప్పబడును శరీరమునకు స్థిరత్వమును, పటుత్వమును కలుగజేయుచున్నది ||౧౬౭||

శ్లో|| అరుక్సమస్తానిరసత్ప్రసారా
త్వత్కేవలద్విత్రిచతుర్బహూనామ్।
స్యాత్స్వస్థలే గుర్వమమప్రసారా
త్తద్వాయుచారః ప్రతిబింబనాడ్యా|| ||౧౬౮||

ప్రాణాది పంచవాయువులును తమ తమ స్వస్థానములయందు యథోచితముగా ప్రసరించుచుండుటవలన ఆరోగ్యము, వీటిలో ఒకటిగాని రెండుగాని మూడుగాని నాలుగుగాని అయిదుగాని హెచ్చుగాగాని తక్కువగాగాని ప్రసరించుటవలన అనారోగ్యమున్ను గలుగుచుండెను. ఆవాయుసంచారము ప్రతిబింబస్వరూపమయిన నాడిచే తెలియబడుచున్నది ||౧౬౮||

## —♦ శ్వాసవివరణం ♦—

శ్లో|| శ్వాసాష్టథా రోగవతాం భవంతి
హృత్స్పందతే తత్త్రిగుణా ద్విఘట్యాం ||
హృచ్ఛ్వాసత స్తత్రి చతుర్గుణేన
స్పందేద్వికారేషు విపర్యయేన|| ||౧౬౯||

ఆరోగ్యవంతునికి ఒక నిముడియ కాలములో అరు ఉచ్ఛ్వాస నిశ్వాసములును ఆఉచ్ఛ్వాసనిశ్వాసలకు మూడురెట్లధికముగా హృదయస్పందమును, అహృదయస్పందమునకు నాలుగురెట్లధికముగా నాడియుచలించుచుండును రోగవికారాదులయందు యీ చెప్పబడినరీతికి వ్యతిరేకముగా నుండును ॥౧౯౯॥

— కోష్ఠవివరణం —

శ్లో॥ స్థానా న్యామాగ్ని పక్వానాం మూత్రస్య రుధిరస్య చ।
హృదుణ్డుకః పుప్ఫుసశ్చ కోష్ఠ ఇత్యభిధీయతే॥ ॥౧౭౦॥

ఆమాశయము, అగ్న్యాశయము, పక్వాశయము, మూత్రాశయము, రక్తాశయము, హృదయము, ఉండుకము, పుప్ఫుసము, అనునవి కోష్ఠసంజ్ఞకములు ॥౧౭౦॥

— కోష్ఠవిశేషవివరణం —

శ్లో॥ సప్తాధ్వా స్వర పేటికాన్నసరణి ర్హృత్పుప్ఫుసౌ భాజకం
కాలేయం ద్విదళం యకృ త్తిలపకం జీర్ణాశయః ప్లీహకమ్।
అన్యోన్యానుగతాని పిత్తనిలయం చాంత్రాననం వృక్కకం
మూత్రాండౌ క్రిమికా పురీషనిలయః కోష్ఠేషు మూత్రాశయః

కోష్ఠమందు (కంఠము మొదలు అసనమువరకుగల మొండెమునందు) సప్తపథ, స్వరపేటిక, అన్నవాహిక, హృదయము, పుప్ఫుసములు, (ఊపిరితిత్తులు) భాజకము, హృదయకుహరమునకును గర్భకుహరమునకును మధ్యగానున్నపొర యకృత్ అనియు, తిలకమనియు, సంజ్ఞకల రెండుదళములుకల కాలేయము, జీర్ణాశయము, ప్లీహ పిత్తకోశము, అంత్రముఖము, వృక్కము మూత్రపిండములు క్రిమిక, మలకోశము, మూత్రాశయము కలవు. ॥౧౭౧॥

— దేహతత్వం —

శ్లో॥ షట్చక్రం షోడశాధారం త్రిలక్ష్యం భూతపంచకమ్।
దేహస్థం యో నజానాతి స వైద్య స్సకథం భవేత్॥ ॥౧౭౨॥

మూలాధారాదిచక్రములు అరు దశేంద్రియాద్యాధారములు పదహారు. ద్రష్టృదర్శనదృశ్యాత్యాదిలక్ష్యములు మూడు. పృథివ్యాద్యపంచీకృతభూతములు ఆయిదు. యీదేహమునందందరికిని యుండును. వీటిని తెలుసుకొననివాడు వైద్యుడెట్లగును. వీటిని తెలుసుకొననివాడు వైద్యుడుగాడనుమాట. ॥౧౭౨॥

— అష్టచక్రనామములు —

శ్లో॥ ఆధారం చాప్యధిష్ఠానం మణిపూర మనాహతం।
విశుద్ధాజ్ఞా సహస్రార ద్వాదశాంతాని తాని హి॥ ॥౧౭౩॥

మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరానాహత, విశుద్ధాజ్ఞా, సహస్రార, ద్వాదశాంతములని చక్రములు యెనిమిది. వీటిలో మొదటివి ఆరును షట్చక్రములు అనియు మొత్తమన్నియుకలసి అష్టచక్రములనియు వ్యవహరింపబడును. ॥౧౩౩॥

—♦ అష్టచక్రస్థానములు ♦—

శ్లో॥ పాయ్వంగనాభిహృదయ కంఠభ్రూమధ్యమస్తకాః।
స్కంధోపరి శిరోధస్తాత్ చక్రేమేతైన తనౌ నృణాం॥ ॥౧౭౪॥

గుదస్థానమున మూలాధారచక్రమును, మేఢ్రస్థానమున స్వాధిష్ఠానచక్రమును, నాభిస్థానమున మణిపూరచక్రమును, హృదయస్థానమున అనాహతచక్రమును కంఠస్థానమున విశుద్ధచక్రమును, భ్రూమధ్యమున అజ్ఞాచక్రమును, కపాలమందు సహస్రారచక్రమును ముచ్చిలికుంటయందు ద్వాదశాంతచక్రమును కలవు ॥౧౭౪॥

—♦ షట్చక్రస్వరూపం ♦—

శ్లో॥ ఆధారస్తు చతుర్దళోరుణరుచి ర్వాసాంతవర్ణాశ్రయ
స్స్వాధిష్ఠాన మనేకవైద్యుతనిభం బాలాన్తషట్పత్రకమ్।
రత్నాభం మణిపూరకం దశదళం ఆద్యం ఫకారాంతకం
వర్ణద్వాదశకం త్వనాహతపదం హైమం కరద్యోతకమ్॥౧౭౫॥

మూలాధారచక్రము నాలుగుదళములుకలిగి ఎర్రని కాంతికలిగి నాలుగుదళములయందు వరుసగా వ, శ, ష, స, అను నాలుగుఅక్షరములు కలిగియుండును స్వాధిష్ఠానచక్రము ఆరుదళములుకలిగి అనేకములైన మెరుపులవలె దేదీప్యమానమై ఆరుదళములయందు వరుసగా బ, భ, మ య, ర, ల అను ఆరుఅక్షరములుకలిగియుండును. మణిపూరచక్రము పదిదళములుకలిగి రత్నకాంతికలిగి పదిదళములయందు వరుసగా డ. ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ అను పదిఅక్షరములు కలిగియుండును. అనాహతచక్రము పండ్రెండుదళములుకలిగి బంగారువంటి పసుపురంగుకలిగి పండ్రెండుదళములయందు వరుసగా క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, అను పండ్రెండు అక్షరములు కలిగియుండును. ॥౧౭౫॥

శ్లో॥ మాతాదిస్వరషోడశాక్షరయుతం జ్యోతిర్విశుద్ధాంబుజం
హాంక్షం ద్వ్యక్షరసంయుతం ద్విదళకం రత్నాభమాజ్ఞాపురమ్
తస్మాదూర్ధ్వమధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం
నిత్యానందమయం సదాశివపదం జ్ఞేయం సమస్తైరిదమ్॥౧౭౬॥

విశుద్ధచక్రము పదహారుదళములు కలిగి ప్రకాశమానమై పదహారుదళముల యందు వరుసగా అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ అను పదహారు (అచ్చులు) అక్షరములు కలిగియుండును. అజ్ఞాచక్రము రెండుదళములుకలిగి రత్నవికారమయిన కాంతికలిగి రెండుదళములయందు వరుసగా హం, క్షం, అను అక్షరములుకలిగియుండును. అట్టి అజ్ఞాచక్రమునకుపైనున్న శిరోమధ్య భాగమందు సహస్రారకమలముండును. యిది వేయిదళములుకలిగి అధోముఖమై వికశించిన పద్మాకారముకలిగి నిత్యానందస్వరూపమై పరమేశ్వరస్థానమైయుండును. యిదియే ముముక్షువులచే తెలుసుకొనతగినదైయున్నది, యిదిగాక ద్వాదశాంతమనుపేరుగల చక్రము మూర్ధ్నిగుంటయందుకలదు. ద్వాదశాంతమనగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదియు, మనోబుద్ధులు రెండును కలసి పండ్రెండు ఇవి ఇక్కడ లయమగును గాన ద్వాదశాంతమనిపేరు యిందుదహరింపబడిన యెనిమిదిచక్రములును యోగశాస్త్రమునకు సంబంధించినవి. ||౧౪౬||

## —♦ షోడశాధారములు ♦—

శ్లో॥ దశేంద్రియాణి చిత్తంచ మహాభూతాని పంచచ।
ఆధారాష్షోడశ జ్ఞేయా స్సర్వం వ్యాప్యం జగత్త్రిశమ్॥ ౧౭౭॥

జ్ఞానేంద్రియకర్మేంద్రియములు పది. చిత్తము, అపంచీకృతపృథివ్యాదిభూతములు అయిదు, ఇవి పదహారును ఆధారములు ప్రపంచమంతయు వీటిచే వ్యాప్తమైయుండును. ||౧౪౭||

## —♦ త్రిలక్ష్యములు ♦—

శ్లో॥ వక్తృవచనవాక్యాది ద్రష్టృదర్శనదృశ్యకమ్।
శ్రోతృశ్రవణశ్రావ్యాది త్రిలక్ష్యం త్రిపుటిస్మృతమ్॥ ౧౭౮

వక్త, వచనము, వాక్యము ద్రష్ట. దర్శనము, దృశ్యము, శ్రోత, శ్రవణము, శ్రావ్యము, యీ మొదలైన త్రిలక్ష్యములే త్రిపుటిఅనియు, పంచీకృతపృధివ్యాదులు భూతపంచకము అనియు చెప్పబడుచున్నది. ||౧౪౮

ఇతి శ్రీ చితాగ్రదసంగ్రహాఖ్యే శ్రీ సోమయాజిసత్పథే
(సత్పథ ప్రకరణేషు)
శరీర ప్రకరణమ్॥

(శ్రీగణేశాయ నమః.)

# చిత్రాగదసంగ్రహాఖ్యే
# శ్రీసోమయాజిసత్పథే
## నిదానప్రకరణమ్



శ్లో॥ శంఖం చక్ర ముపర్యధశ్చ కరయో ర్దివ్యౌషధం దక్షిణే
వామే స్వాన్యకరే చ సంభృతసుధాకుంభం జగత్ప్రాణదం।
బిభ్రాణః కరుణాకర శ్శుభకర స్సర్వామయధ్వంసక
స్సర్వం నో దురితం భినత్తు భగవా న్ధన్వంతరి ర్ధార్మికః॥ ॥౧॥

పైభాగమందున్న రెండుచేతులతోను, దక్షిణహస్తమున శంఖమును, వామహస్తమున చక్రమును, క్రిందిభాగమందున్న రెండుచేతులతోను దక్షిణహస్తమున దివ్యౌషధములనున్ను, వామహస్తమున లోకమునకు ప్రాణప్రదమైన అమృతకలశమును ధరించినవాడు, దయాస్వరూపుడు, శుభసంధాయకుడు, సమస్త రోగాపహారకుడు, ధార్మికుడు అయినధన్వంతరిభగవానుడు మనలయొక్క రోగానుభవరూపమైన దురితమును పోగొట్టుగాక! ॥౧॥

### — నిదానశబ్దవివక్ష —

శ్లో॥ హేతులక్షణజాయూనాం స్కంధా స్యత్రాగదాగమే।
హేతులక్షణయో స్స్కంధే నిదాన మితి కథ్యతే॥ ॥౨॥

వైద్యశాస్త్రమున రోగోత్పత్తికి కారణములను తెలుపుభాగము హేతుస్కంధము. ఆరోగములయొక్క లక్షణములను నిర్దేశించి వివరించుభాగము లక్షణస్కంధము. ఔషధములయొక్క నిర్మాణగుణాదులను వివరంపుచు ఆయా వ్యాధుల యందు ఉపయోగింపవలసిన చికిత్సావిధానాదుల వివరించుభాగము ఔషధస్కంధము. రోగలక్షణములను, రోగహేతువులను వివరించుభాగము నిదానము అనియు చెప్పబడును. ॥౨॥

### — రోగ విభాగక్రమమ్ —

శ్లో॥ జ్వరత్రిదోషక్రిమిసన్నిమూర్ఛా
హృదా మశూలాశ్మరిశోఫహిక్కాః।

అజీర్ణగుల్మోదరకాసమేహా
తీసారఛర్దిక్షయపాండుసంగాః॥ ॥౩॥

జ్వరము, వాతము, పిత్తము, శ్లేష్మము, క్రిమి, సన్నిపాతము, హృద్రోగము
అమరోగము, శూల, అశ్మరి, శోఫ, హిక్క, అజీర్ణము, గుల్మము, ఉదరరోగము,
కాస, మేహము, అతిసారము, ఛర్ది, పాండువు, సంగమదోషము. ॥౩॥

శ్లో॥ ఏత త్క్రమేణైవ విస్తృణ్మ హేతి
సుఖప్రవేశాయ పురా ర్భకానాం।
సాధర్మ్యమూహ్యైవ చరే చ్చికిత్సాం
తత్కాలసంప్రాప్తరుజా ముపాయాత్॥ ॥౪॥

బాలకులకు ముందుగా వైద్యశాస్త్రప్రవేశము సులభముగా కలుగుటకొరకు
పైన పేర్కొనబడిన ప్రకారము రోగవివరణము చేయబడుచున్నది. ఆయా కాలముల
యందు సంప్రాప్తములయ్యెడు రోగములయొక్క రూపసాదృశ్యమును ఊహించి
ఉపాయముచే చికిత్సను నెరవేర్చుచుండవలెను. ॥౪॥

## ——♦ రోగ విజ్ఞేయము. ♦——

శ్లో॥ నిదాన మాద్యా వధ లక్షణాని
భేదం ప్రమాణం రుగహః ప్రమాదం।
సాధ్యం తథాఽసాధ్య మపి క్రియాం చ
సమున్నయే ద్వైద్య కృ దామయేషు॥ ॥౫॥

వైద్యు డగువాడు ప్రతిరోగమందును, రోగకారణము. రోగలక్షణములు,
రోగభేదము, రోగోక్తప్రమాదదినములు, సాధ్యత్వము, అసాధ్యత్వము, చికిత్స
అనువాటిని ఊహించవలెను. ॥౫॥

శ్లో॥ కస్యాం చి దుత్రి వా వ్యగోచరతయా గ్రంథోక్తతల్లక్షణాం
కించి ద్జ్ఞాపకశక్తివిభ్రమతయా గ్రంథప్రపంచస్య చ ।
ప్రాథాన్యామయసాముదాయకగుణా ఏవాత్ర సంభాషితా
స్తత్తత్కాలరుగుత్థితేతరగుణా స్తర్క్యా భిషగ్భి ర్ధియా ॥౬॥

గ్రంథోక్తలక్షణములు పూర్తిగా ఒకానొక వ్యాధియందును గానరాకపో
వుటచేతను, గ్రంథవిస్తరణము బాలకులకు జ్ఞాపకశక్తిని పోగొట్టును దగుటచేతను,

ప్రధానవ్యాధులయొక్క కొన్ని కొన్ని సముదాయగుణములు మాత్రమే యిందుద హరింపబడినవి. యిం దుదహరింపబడినవాటికంటె ఇతరములైనట్టియు, తత్తత్కా లసంప్రాప్తములైనట్టియు రోగములయందు కలిగెడు గుణములను వైద్యులు తమ బుద్ధిచేతనే యూహింపదగియున్నది. ||౧||

## —♦త్రిదోషసామాన్యవిజ్ఞానమ్♦—

శ్లో|| న వాతేన వినా శూలా న కండూ శ్లేష్మణా వినా ।
న పిత్తేన వినా ఛర్ద్ది ర్నాజీర్ణేన వినా జ్వరః|| ||౨||

వాతదోషము లేకుండ శూలయు, శ్లేష్మదోషములేకుండ దురదయు, పిత్తదోషములేకుండ ఛర్ద్దియు, అజీర్ణదోషము (ఆమదోషము) లేకుండ జ్వరమును కలుగవు ||౨||

## —♦జ్వరసంప్రాప్తి♦—

శ్లో|| మిథ్యాహారవిహారాభ్యాం దోషా హ్యామాశయాశ్రయాః ।
బహి ర్నిరస్య కోష్ఠాగ్నిం జ్వరదాస్స్యూ రసానుగాః|| ||౩||

ప్రకృతికి విరుద్ధములైన (తత్త్వమునకు సరిపడని) ఆహారవిహారములవలన వాతపిత్తశ్లేష్మములు జఠరాగ్నికి మాంద్యమును కలుగజేసి రసధాతువు నాశ్రయించి జఠరాగ్నిని వెలికిత్రోసి జ్వరమును కలుగజేయును. ||౩||

శ్లో|| వాతాదిదోషాః కుపితాః ప్రకామ
మామాశయం ప్రాప్య చ తత్ర కోష్ఠే ।
అజీర్ణితాహారరసేనయుక్తా
స్స్రోతాంసి కూపాని పిధాయ నూనమ్||
బహి ర్నిరస్యాగ్ని మమీ తు తేన
వ్యాప్తా స్సమంతా జ్జ్వరదా శ్శరీరే ।
స్రోతో నిబంధా జ్జ్వరసంయుతేషు
జ్వరో న భూయా ద్బహుళామయేషు|| ||౪||

వాతాదిదోషములు తమ తమ స్థానములయందు వృద్ధిచెంది, జీర్ణాశయమున ప్రవేశించి, అక్కడ నున్న అన్నరసముతో కలిసిపోయి నాడీద్వారముల నడ్డగించి, అంతర్గతమైన జఠరాగ్నిని బహిర్గతము గావించి, ఆజఠరాగ్నితోపాటు తామూకూడ శరీర మంతయు వ్యాపించి జ్వరమును కలుగజేయుచున్నవి. నాడీద్వారములు అజీ

ష్ఠీవాహారరసముచే (ఆమదోషముచే) ఆచ్ఛాదింపబడుటవలన వివిధములైన రోగములు గల జ్వరితులకు చమట పట్టదు. ‖౯‖

—♦జ్వరసామాన్యలక్షణమ్♦—

శ్లో॥ స్వేదావరోధ స్సంతాప స్సర్వాంగగ్రహణం తథా ।
యుగపద్యత్ర రోగే చ స జ్వరో వ్యపదిశ్యతే॥ ‖౧౦‖

చమట పట్టకపోవుట. దేహము, మనస్సు, ఇంద్రియములు, వీటియందు సంతాపము, సమస్తేంద్రియములయందు వేదన, యీలక్షణములు ఏకకాలమునం దెప్పుడు కలుగుచున్నవో, అదియే జ్వర మని చెప్పబడుచున్నది. ‖౧౦‖

—♦జ్వరమున కవస్థాచతుష్టయం♦—

శ్లో॥ ఆమా త్రిభి స్సప్తభి రేవ పచ్య
మానా తథా దోషవినశ్యమానా ।
దినై ర్నిరామేతి దశోర్ధ్వమానై
ర్దశా వివిక్తా స్సకలజ్వరేషు॥ ‖౧౧‖

సర్వవిధజ్వరములయందును మూడు రోజులవరకు ఆమావస్థ, ఏడురోజులవరకు పచ్యమానావస్థ, పదిరోజులవరకు దోషవినశ్యమానావస్థ, పదిరోజులకు పిమ్మట నిరామావస్థ అని యీప్రకారముగా నాలుగువిధము లయిన అవస్థలు నిర్ణయింపబడినవి. ‖౧౧‖

—♦ఆమావస్థాలక్షణం♦—

శ్లో॥ హృల్లాస-శశూలా పమిగాత్రభార
మూత్రాధికాలస్య విపాకతంద్రాః ।
క్షున్నాశవై రస్య హృషీకవర్గ
స్తబ్ధత్వ మామస్య వదం త్యవస్థామ్॥ ‖౧౨‖

రసాదిధాతువులయందలి మలములున్ను, వాతాదిదోషములున్ను, పక్వము గావంతవరకుండు జ్వరము ఆమ మనియు, పక్వమైనపిదప నిరామ మనియు చెప్పబడును. ఆమజ్వరమందు పసరు కలిగిన బాధ, నోట చొల్లు కారుట, ఓకిరింత, శరీరము బరువుగా నుండుట, మూత్రము అనేకసార్లు విడుచుట, పనులయం దాసక్తి లేకుండుట, అజీర్ణము, మైకము, ఆకలి లేకుండుట, రుచి తెలియకుండుట. అవయవములు

పెంద్రపారి యుండుట యిట్టి లక్షణములు కలిగియుండును. అనుజ్వర మనగా అపక్వజ్వరము. ||౧౨||

## —♦ పచ్యమానావస్థాలక్షణం ♦—

శ్లో|| జ్వరస్య శీఘ్రాగమనప్రలాప
శ్వాసభ్రమతృణ్మలవిట్ప్రవృత్తిః।
పక్వేషు దోషాదిషు పచ్యమానా
వస్థాం నిగద్యంతి వమిప్రసూతిం॥ ||౧౩||

పచ్యమానజ్వరమందు దోషములున్ను, మలములున్ను, పరిపాకమును పొందుచుండ జ్వరము వేగముగావచ్చుట, అసందర్భముగా మాట్లాడుట, శ్వాస, (ఆయాసము,) ఒడలుతిరుగుట, దాహము, మలమూత్రవిసర్జనము, (మలమూత్రములు ధారాళముగాపోవుట,) వాంతిగుణము (డోకుర బోవునట్లుండుట) కలిగియుండును. పచ్యమానజ్వరమనగా పాకోన్ముఖమైనజ్వరము. ||౧౩||

## —♦ దోషవినశ్యమానావస్థాలక్షణం ♦—

శ్లో|| దంతాః కుందసమానకాంతికలితా నాడీగతిర్నిర్మలా
జిహ్వాఘ్రాణరుచిజ్ఞతా శుభమతి శ్వేదోద్భవః ప్రాశనే॥
రేఖాపఙ్క్తినఖాక్షిరక్తజననం సంతోషసంభాషణం
ప్రజ్ఞాదోషవినశ్యమానవియమావస్థా నిరామాంతికా॥ ||౧౪||

నిరామావస్థకు సమీపమునందున్న దోషవినశ్యమానావస్థయందు; దంతములు మల్లెమొగ్గలవలె తెల్లగానుండుట, నాడి నిర్మలముగానడచుట నాలుకకు రుచియు, ముక్కునకు వాసనయు తెలియుట. ధారాళమైన తెలివి దాహముపొందనైనవి (భుచ్చుకొ)నినవెంటనే చెమటపట్టుట. అరిచేతులు. అరికాళ్ళు వీటియందుగల రేఖలు, కంటిరెప్పలు గోళ్ళు, కన్నులు వీటియందు రక్తముకనుపించుట, సంతోషముగా మాట్లాడుట, జ్ఞాపకశక్తి యిట్టిలక్షణములుకలిగియుండును. ||౧౪||

## —♦ నిరామావస్థాలక్షణం ♦—

శ్లో|| లఘుత్వ మంగేషు శరీరశక్తి
ర్మ్రదన్నలిప్సా గమనాభిలాషః।
త్రిదోషసామ్యం నిఘసాఽజరత్వా
క్రాంతి ర్నిరామస్య వదం త్యవస్థాం॥ ||౧౫||

నిరామజ్వరము (మలములున్ను, దోషములున్ను సంపూర్తిగా పరిపాకమును పొందినజ్వరము)నందు అవయవములన్నియు తేలికగానుండుట, శరీరము పటుత్వముగానుండు, సంతోషము, అన్నమందభిలాష, (తినుబండారములయందువాంఛ) లేచి నడువవలెననుకోరిక, వాతపిత్తశ్లేష్మములు హెచ్చుతగ్గులులేక సరసముగానుండుట, భుజించినపిమ్మట జ్వరమురాకుండుట, శరీరకాంతి యిట్టిలక్షణములుకలిగియుండును.

## —♦ అంతర్వేగ (జ్వర) లక్షణం ♦—

శ్లో॥ అంతర్దాహోఽధిక స్తృష్ణా ప్రలాప శ్శ్వసనం భ్రమః।
అస్వేదసన్ధ్యస్థితాప దోషవర్చో వినిగ్రహాః॥ ॥౧౬॥

దేహాంతర్గతములైన హృదయాదులయందు వేగమునుచూపుజ్వరము అంతర్వేగజ్వరము. దీనియందు అంతరవయవములయందు తాపము, దప్పిక, అసందర్భప్రలాపము, శ్వాస మతిభ్రమ (చిత్తచాంచల్యము) చెమటపట్టకుండుట, కీళ్ళసంధులయందును. ఎముకలయందును, నొప్పి, వాతాదిదోషములు, మలములు, మందగించి యుండుట యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౧౬॥

## —♦ బహిర్వేగ (జ్వర) లక్షణం ♦—

శ్లో॥ సంతాప స్త్వధికో బాహ్యా స్తృష్ణాదీనాం సుమార్దవం।
బహిర్వేగస్య లింగాని సుఖసాధ్యత్వ మేవ చ॥ ॥౧౭॥

చర్మముపైన వ్యాపించినజ్వరము, బహిర్వేగజ్వరము, దీనియందు శరీరముయొక్క పైభాగమందు వేడిమి, (సంతాపము) స్వల్పమైనదాహము, ప్రలాపము, శ్వాస, భ్రమ, చెమట, సంధులయందు నొప్పికలిగియుండి చికిత్సకు సులభసాధ్యమై యుండును. ॥౧౭॥

## —♦ జ్వరభేదములు. ♦—

శ్లో॥ జ్వరా స్సమస్తాః పరిదృశ్యమానా
స్సామాన్యత స్సప్తవిధాః ప్రదిష్టాః।
దంద్వాభిఘాతానిలపిత్తభూత
శ్లేష్మో రజీర్ణేన సదా నరాణాం॥ ॥౧౮॥

ద్వంద్వజ్వరము, అభిఘాతజ్వరము, వాతజ్వరము, పిత్తజ్వరము, భూత (పిశాచ) జ్వరము, శ్లేష్మజ్వరము, అజీర్ణజ్వరము, అవి సామాన్యముగా జ్వరములు ఏడు విధములు. ॥౧౮॥

## —♦ శ్లేష్మ పైత్య జ్వరలక్షణం ♦—

శ్లో॥ ఉద్గారవాంతిజ్వరసోఫమూర్ఛా-
నాహోతి దాహాక్షి జలాతితాపాః।
అనిద్రతారాసనకంటకాశ్చ
స శ్లేష్మపిత్తజ్వరలక్షనాని॥ ॥౧౯॥

పైనచెప్పబడిన సప్తవిధజ్వరములలో చేరిన ద్వంద్వజ్వరములలో శ్లేష్మపిత్త జ్వరమునందు, ఓకిరింత, వాంతులు, జ్వరము, శోఫ (వాపు) మూర్ఛ, అనాహము, (కడుపుబ్బరము), అతిదాహము, కళ్ళు నీరుకారుట, తాపము, నిద్రపట్టకుండుట, నాలుకయందుముండ్లు యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౧౯॥

## —♦ శ్లేష్మ వాతజ్వరక్షణం ♦—

శ్లో॥ అంగవ్యధా శ్లేష్మముఖాగ్నిమాంద్య
ప్రలాపరోమాంచ మలావరోధాః।
అనాహకంప శ్రవణాక్షిశూలా
శ్లేష్మానిలోత్థజ్వరలక్షణాని॥ ॥౨౦॥

శ్లేష్మవాతజ్వరమునందు శరీరమంతయు బాధ, శ్లేష్మసంబధమైన అగ్నిమాంద్యము, కలవాట్లు, (పలవరింతలు,) దేహము గరిపొడుచుట, మలబంధము, అనాహము, దేహము వణకుట, చెవులయందును, నేత్రములయందునుశూల ఇట్టిలక్షణములు కలిగియుండును. ॥౨౦॥

## —♦ సీత పైత్యజ్వరలక్షణం ♦—

శ్లో॥ అంగవ్యధా సీలముఖాగ్నిమాంద్య
ప్రలాపనేత్రాంబుమలావరోధాః।
ఉద్గారనిద్రావమనాతిదాహా
పిత్తానిలోత్థజ్వరలక్షణాని॥ ॥౨౧॥

సీతపైత్యజ్వరమందు దేహామునందు బాధ, ముఖము వల్లబారుట, అగ్నిమాంద్యము, కలవాట్లు, కన్నులు నీరుకారుట, మలబంధము. వోకిరింత, నిద్ర, వాంతులు. అధికమైనదాహము కలిగియుండును. ॥౨౧॥

—♦ అభిఘాతజ్వరలక్షణం ♦—

శ్లో. మతిభ్రమస్వేదసమస్తదేహ
వైకల్యశైత్యాశనదాహవాంఛాః
జ్వరేభిఘాతే బహుదూరమార్గ
ప్రయాణజే వ్యాపకసంభవేస్మిన్॥ ॥౨౨॥

దూరప్రయాణము చేయుటవల్లను, అధికమైన వ్యాపకముచేయుటవల్లను, సంభవించు స్వభావముగల అభిఘాతజ్వరమందు మతిభ్రమణము, చెమట, శరీరమంతయు నొప్పులు, దేహము చల్లబడుట, భోజనమందును, దాహమందును, అభిలాష యిట్టిలక్షణములు కలిగియుండును ॥౨౨॥

—♦ వాతజ్వరలక్షణం ♦—

శ్లో॥ ప్రలాపరోమాంచవిదాహకండూ
నీలాస్యవైకల్యమలావరోధాః।
అత్యుష్ణతాశీతలతాతితృష్ణా
ప్రోక్తాని వాతజ్వరలక్షణాని॥ ॥౨౩॥

వాతజ్వరమందు కలవాట్లు, శరీరము గరిపొడుచుట, విదాహము, దురదలు, ముఖమునలుపెక్కుట, మలబంధము, శరీరము మిక్కిలి వేడిగాగాని లేక మిక్కిలి చల్లగాగాని ఉండుట, నాలుక పెనిదేయుట, యిట్టిలక్షణములు కలిగియుండును.

—♦ పిత్తజ్వరలక్షణం ♦—

శ్లో॥ క్రోధాతినిద్రాధికదాహవాంతి
ప్రలాపహిక్కాస్యవిశోషమూర్ఛాః॥
పురీషమూత్రారుణతాతితాపా
స్త్వమూని పిత్తజ్వరలక్షణాని॥ ॥౨౪॥

పైత్యజ్వరమందు దద్దుర్లు, అధికమైననిద్ర, విదాహము, వాంతులు, కలవాట్లు, ఎక్కిళ్ళు, ముఖము ఎండిపోవుట, మూర్ఛ, మూత్రపురీషములు యెఱ్ఱగానుండుట, యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౨౪॥

—♦ భూతజ్వరలక్షణం ♦—

శ్లో॥ ఉన్మాదకంపజ్వరభోజనాశా
విరూపదృజ్నర్తనహాస్యగీతాః।

ప్రలాపరోమాంచశిరోతిబాధా
స్వేదశ్చ భూతజ్వరలక్షణాని॥ ॥౨౫॥

భూతజ్వరమునందు ఉన్మాదము (పిచ్చి) కణకుట, జ్వరము, భోజనమందాశ భయంకరమైనచూపు, ఆడుట, పాడుట, నవ్వుట, కలవాట్లు, గగుర్పాటు, శిరోవేదన, చెమట యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౨౫॥

## —♦ శ్లేష్మజ్వరలక్షణం ♦—

శ్లో॥ అనాహపైత్యప్రలపాగ్నిమాంద్య
శ్వేతాస్యనిద్రావిరహాంగశూలాః।
శ్వాసాఽతికాసజ్వరవాంతిహిక్కా
శ్లేష్మప్రియుక్తజ్వరలక్షణాని॥ ॥౨౬॥

శ్లేష్మజ్వరమందు అనాహము పైత్యము, (పసరు) కలవాట్లు, అగ్నిమాంద్యము, ముఖము రక్తవిహీనమై తెల్లబారుట, నిద్రలేమి, దేహమునందుపోట్లు, శ్వాస అధికముగా పడలుట, దగ్గు, జ్వరము, వాంతులు, ఎక్కిళ్ళు, యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౨౬॥

## —♦ అజీర్ణజ్వరలక్షణం ♦—

శ్లో॥ అంగవ్యథా కాంతివిహీనదాహ
హిధ్మాఽరుచిశ్వాసమలావరోధాః।
హిక్కాన్నవిద్వేషశిరోవ్యథాతి
జృంభాహ్యజీర్ణజ్వరలక్షణాని॥ ॥౨౭॥

అజీర్ణజ్వరమందు శరీరమునబాధ, శరీరము కాంతివిహీనమైయుండును. దాహము, ఊపిరిగొట్టునొప్పి, అరుచి, శ్వాసతొందరగానడచుట, మలబంధము, ఎక్కిళ్ళు, అన్నమునందయిష్టము, శిరోవేదన, (తలనొప్పిలేకపోటు) ఆవలింతలు కలిగియుండును. ॥౨౭॥

## —♦ విశేషజ్వరములు ♦—

శ్లో॥భూతస్వేదాఽభిఘాతాఽనిశ,విషమనిశా,స్ఫోటకా,గంతుకామ,
క్రోధా,నిద్రా,భిచారా,మధ,వమన,పురాణా,తపా,నాహా,కాసాః ।
మూర్ఛాం,తద్రాహా,శోష,వ్రణ,పికట,హారిద్రా,ప్రలాపా,పచార
పాత్రరక్తధ్యాహ్నసాయం,క్రిమి,ఎవవిధనాడీజశస్త్రాహికాద్యాః ॥

(1) ధూతజ్వరము, (2) స్వేదజ్వరము, (3) అభిఘాతజ్వరము, (4) అనిలజ్వరము, (5) విషజ్వరము, (6) నిశాజ్వరము, (7) స్ఫోటకజ్వరము. (8) ఆగంతుక జ్వరము, (9) ఆమజ్వరము, (10) క్రోధజ్వరము, (11) అనిద్రాజ్వరము, (12) అభిచారజ్వరము, (13) ఔషధజ్వరము, (14) శమకజ్వరము, (15) ప్రాణజ్వరము, (16) ఆతపజ్వరము, (17) ఆగాహజ్వరము, (18) కాసజ్వరము, (19) మూర్ఛాజ్వరము, (20) అంతర్దాహజ్వరము, (21) శోషజ్వరము, (22) క్షీణజ్వరము, (23) పిటకాజ్వరము, (24) హారిద్రాజ్వరము, (25) ప్రలాపజ్వరము, (26) అపచారజ్వరము, (27) ప్రాతఃకాలజ్వరము, (28) మధ్యాహ్నకాలజ్వరము, (29) సాయంకాలజ్వరము, (30) క్రిమిజ్వరము, (31) పిత్తజ్వరము, (32) శ్లేష్మజ్వరము, (33) వాతజ్వరము, (34) అజీర్ణజ్వరము, (35) కంఠకుబ్జజ్వరము. (36) సన్నిపాతజ్వరము, (37) శ్లేష్మపైత్యజ్వరము, (38) శ్లేష్మవాతజ్వరము, (39) వాతపైత్యజ్వరము, (40) శుష్క-జ్వరము, (41) ఆహికజ్వరము, (ఏకాహికజ్వరము, ద్వ్యాహికజ్వరము, త్ర్యాహికజ్వరము, చాతుర్థికజ్వరము, అని ఆహికజ్వరము నాలుగువిధములు.) ఆదిశబ్దముచే (42) దశాంత, (43) మాసాంత, (44) వర్షాంత, (45) సంతతజ్వరంబు లవ్యాఖ్యంబులు. ॥౨౮॥

—♦ రోగవివక్షోపసంహారము. ♦—

శ్లో॥ పృథక్పృథగ్లక్ష్యవివక్షితా వా
రుజ స్త్వనంతాకృతయ స్సమాహ్యః।
వైద్యై ర్యత స్తత్తదభిఖ్యయేతి
గ్రంథః ప్రపంచీకృత ఏవ నాత్ర॥ ॥౨౯॥

ప్రత్యేక ప్రత్యేకలక్షణములతో వేరువేరుగా వివరింపబడినను, రోగములు అనంతములైన రూపములుకలుగుటవలన వైద్యులచే వాటివాటి పేరులననుసరించియే ఊహింపతగియున్న రోగవివరణవిషయమై గ్రంథము విస్తరింపబడలేదు. అనగా సామాన్యాకారేణ చెప్పబడినదనుట. ॥౨౯॥

—♦ సప్తవిధదోషము ♦—

శ్లో॥ విషమశ్వేతకృష్ణాఽఽరక్తపీతజిహ్వాకనంగమాః॥
విషమార్ద్రి స్సప్తధైవ మపథ్యా ద్దోషసంభవః॥ ॥30॥

జ్వరములయందు అపథ్యదోషముకలనను (1) విషమదోషము, (2) శ్వేతజిహ్వాకదోషము, (3) కృష్ణజిహ్వాకదోషము, (4) రక్తజిహ్వాకదోషము, (5) పీతజిహ్వాక

దోషము, (6) సంగమదోషము. (7) విషమశీతదోషముఅని ఏడువిధములైన దోషములు కలుగుచున్నవి. మరియు,

విషమదోషమున — నాడి వక్రగతిగానుండుట. మూర్ఛ, దాహము, తాపము, కడుపులోమంట, జ్వరమున్ను,

శ్వేతజిహ్వాకదోషమున — నాలుక తెల్లగానుండుట, గొంతుక పగులుట, (గొంతుకలో ఉడికినట్లుండుట,) శరీరము నొచ్చుట, కంపము, భ్రమ, చమట, అతిసారము, కక్కుట, మూర్ఛయున్ను,

కృష్ణజిహ్వాకదోషమున — నాలుక నలుపెక్కి పిదకకలెనుండుట, నాలుకపై ముండ్లు, తాపము, కలవరింతలు, అయాసము శరీరము దురదగానుండుట, దాహము,

రక్తజిహ్వాకదోషమున — నాలుక ఎరుపు, నాలుకపైముండ్లు, జ్వరము, దాహము, తాపమును.

పీతజిహ్వాకదోషమున — నాలుక పసుపు, నాలుకపగిలి తడిలేక ముండ్లుకలిగియుండుట, జ్వరము, భ్రమ, మూర్ఛ, ఎక్కిళ్ళును.

స్త్రీసంగమదోషమున — శరీరము చితుకకొట్టినట్లుండుట, దగ్గు, గుండెలో మంట, కలవరింతలు, తాపము, కాళ్ళు, చేతులు చల్లబడుట,

విషమశీతదోషమున — రోజునకు నాలుగైదుపాళ్లు చలియు, జ్వరమును, నొచ్చుట, దాహము, భ్రమ, తలనొప్పి, నాలుక కరినమై ముండ్లుకలిగియుండుట, ఇట్టిలక్షణములు కలిగియుండును యీవిధముగా దోషలక్షణసంగ్రహము తెలియవలెను. ॥౩౦॥

## —♦ జ్వరదినపరిమాణం ♦—

శ్లో॥ పిత్తజ్వరే పఙ్దివసాని సప్త
వాతే నవ శ్లేష్మణి దోషజేషు।
పక్షం వదంతే జ్వరతో విముక్తి
ర్నస్యాత్తతో స్యాత్పురాణజ్వరసాధనాని॥ ॥౩౧॥

పిత్తజ్వరమునకు ఆరు, వాతజ్వరమునకుఏడు, శ్లేష్మజ్వరమునకు తొమ్మిది దోషజ్వరమునకుపదిహేను, పరిమాణదివసములైయున్నవి, యీపరిమాణప్రకారముల యీజ్వరములు విడవనిచో పురాణజ్వరములకుచేయు చికిత్సలను చేయవలయును ॥౩౧.

శ్లో॥ సప్తాహేనైవ పచ్యన్తే సప్తధాతుగతా మాలాః
నిరామ శ్చాప్యతః ప్రోక్తో జ్వరః ప్రాయో ఽష్టమే హని॥ ॥౩౨॥

రస, రక్త, మాంస, మేదో, స్థి, మజ్జా, శుక్ర, ము లని ధాతువులు ఏడు। వీటికి సంబంధించిన మలములు జ్వరప్రారంభము మొదలు క్రమక్రమముగా ఏడువిధ

ములకు పక్వమగుచున్నది. యీరేడుదినములవరకు జ్వరము అపక్వమైయుండి యెనిమిదవనాటికి నిరామత్వమును(పరిపక్వతను)పొందును। ॥౩౨॥

శ్లో॥ సప్తాహాఽభ్యంతరే తస్మాన్న దద్యాద్భేషజం భిషక్।
దత్తం చేదామదోషే తు పునర్జనయతి జ్వరం॥ ॥౩౩॥

పూర్వోక్తప్రకారము జ్వరారంభము మొదలుకొని ఏడుదినములవరకు రసాది ధాతువులు ఆమదోషసహితములైయుండును, గాన ఆఏడురోజులలోగా జ్వరమునకు చికిత్స చేయరాదు, అట్లుచికిత్సచేయుట మానక ఆమాశయమందు ఔషధమునుయిచ్చినయెడల ఆఔషధముకూడ జీర్ణముగాక తిరిగి జ్వరమును పుట్టించును। ॥౩౩॥

ఔషధప్రయోగకాలము.

శ్లో॥ సప్తరాత్రాత్పరం కేచిన్మన్యంతే దేయమౌషధం।
దశరాత్రాత్పరం కేచిద్దాతవ్యమితి నిశ్చితం॥ ॥౩౪॥

ఏడురాత్రులుగడచిన పిమ్మట ఔషధమిచ్చుట మంచిదని కొందరు, పదిరాత్రులకు పిమ్మట ఔషధమునిచ్చుట మంచిదని కొందరు నిశ్చయించుచున్నారు. ॥౩౪॥

జ్వరప్రమాదదినములు.

శ్లో॥ త్రిపంచసప్తాంకదిగీశసూర్య
స్వభూపురాణాధ్వరసంజ్ఞకాని
ప్రమాదికాఽహాని బహుజ్వరేషు
స్యుస్సన్నిపాతే ష్వధికామయేషు॥ ॥౩౫॥

బహువిధములైన జ్వరములయందును, సన్నిపాతసంబంధమైన రోగముల యందును, యింకా అనేకవిధములైన రోగములయందును మూడు, అయిదు, ఏడు, తొమ్మిది, మొదలుపన్నెండు, పద్నాలుగు, పద్దెనిమిది, యిరవైఒకటి ఈరోజులు ప్రమాదకరములైనవి. యీరోజులలో క్రొత్తక్రొత్తవికారములు కలుగుచుండును. ॥౩౫॥

జ్వరాంతలక్షణములు.

శ్లో॥ ధాతూన్ స్రోతోభయాద్దోషో మోక్షకాలే తు దీపవత్॥
తతో నర శ్శ్వసన్ ఖిద్యన్నూజ న్వామతి చేష్టతే। ॥౩౬॥

దీపము తైలమంతయు హరించి ఆరిపోవుటకు సంసిద్ధముగానున్న సమయమున, ధగధగలాడుచు ఆరిపోవు చందమున, జ్వరమువిడుచుటకుముందు, వాతాదిదోషములు

ప్రీలములై, రసాదిధాతువుల నల్లకల్లోలముచేయును, అట్టిసమయమున రోగి, శ్వాస నధికముగా విడచును, చమటపట్టును, మూలుగును, వాంతిఅగును, యింకనుఅనేకవిధములైన చేష్టలుకలిగియుండును, యీవిధముగా అకలతనుపొంది జ్వరము పూర్తిగావిడచుసరికి యీచేష్టలన్నియు తగ్గి దీపమువలె శాంతినొందును ||3౬||

శ్లో॥ దాహ స్స్వేదో భ్రమ స్తృష్ణా కఫవిడ్భేదసంజ్ఞితా।
కూజనం చాస్య వైగన్ధ్య మాకృతి ర్జ్వరమోక్షణే॥ ||3౭||

దేహమునాశ్రయించియున్న జ్వరము విడుచుటకు ముందు, శిరస్సునందు మంట, దాహము, కణకు, మలమునరళముగా బయలువెడలుట, ఒడలుతెలియకుండుట, మూలుగుచుండుట, నోరు జ్వరవాసనకలిగియుండుట, దేహముచమటకంపుకొట్టుట యిట్టిలక్షణములుకలిగియుండును, ఇట్టిభయోత్పాతలక్షణములుకలిగినప్పుడు జ్వరము విడుచుటకు అభిముఖముగానున్నదని తెలియవలెను ||3౭||

## జ్వరిత వర్జ్యములు.

శ్లో॥ త్యజే ద్దివా స్వాపన సూపభక్ష్య
గుర్వన్నశీతోదకకందమూలాన్ ।
వ్యాయామచింతా ఉర్వ్యభయోడ్డనాధ్వ
స్నానవ్యవాయా న్జ్వరితః ప్రకామం॥ ||3౮||

జ్వరపీడితుడు పగటినిద్ర, పప్పు, పిండివంటలు, కఠినపదార్థములు, చల్లని (కాచని)నీళ్లు, కందమూలములు (దుంపజాతి)శ్రమపడుట, విచారము, గుఱ్ఱము మొదలైనవాహనములనెక్కుట, భయంకరములైనపనులనుచూచుట. మార్గమునడచుట. స్నానము, సంభోగము వీటిని విడువవలెను ||3౮||

## చికిత్స అవసరములేని జ్వరములు

శ్లో॥ భూతాఽజీర్ణాభిఘాతాఖ్యా స్తత్కాలోపశమాత్మికాః ।
వైషమ్యక్రియయా వాపి జాతు శామ్యం త్యమీ స్వయం॥ ||3౯||

భూతజ్వరము, అజీర్ణజ్వరము, అభిఘాతజ్వరము, మొదలైనవి చికిత్స అవసరములేకుండా వాటంతట అవియే తత్కాలముందుపశమించు స్వభావముకలవి। యివికొన్నొకప్పుడు వైషమ్యక్రియలచే కూడా శాంతించినట్లు కనుపించును. ||3౯||

## సర్వరోగసంప్రాప్తికి సామాన్యలక్షణం.

శ్లో॥ వైషమ్యాశనసంగమా ఉతపజలక్రీడా దివా స్వాపను
క్రోధాదిశ్రమవేగవారణసురా పానక్షపా జాగరాః ।

మధ్యాద్యుష్ణఘనాతిశీతపిశితా పథ్యాదయ స్సర్వరు
క్కాలాః ప్రోక్తవిలక్షణా ప్రతిరుజి స్యుః కేచి దన్యే గుణాః ౪౦

విషమాశనము (ఎక్కువగాని. తక్కువగాని తినుట) స్త్రీసంభోగము, ఎండ లోతిరుగుట, నీటిలోయీదుట లేక నానుట. పగలునిద్రించుట ఏడ్చుట, క్రోధము మొదలైనవి కలుగుట, మలమూత్రములను నిరోధించుట, కల్లుత్రాగుట, రాత్రిమే ల్కొనుట. తీపి మొదలైన షడ్రసములయొక్కయు, మిక్కిలి వేడిగానున్నట్టియు, మిక్కిలిగట్టిగానున్నట్టియు, మిక్కిలిచల్లగానున్నట్టియు, అహారము, మాంసము, తత్త్వమునకు సరిపడనిపదార్థము, మొదలైనవి సర్వరోగములకు కారణమై యుండును. యివిగాక ప్రతిరోగమునకు ప్రధానములైన యితర గుణములుకూడా కలిగియుండునుర౪౦

త్రిదోషసంప్రాప్తి

శ్లో॥ విషౌషధక్రోధపిశాచపాత
స్రావావమానాఽభిభయాతితాపైః
పాతాదికా చ్చాత్ర దనిలోతికోపా
త్పిత్తం చ తద్వేగవశా త్కఫోఽపి॥ ॥౪౧॥

విషము, ఔషధము, క్రోధము, పిశాచము, గర్భపాతము గర్భస్రావము అవ మానము, మొదలైనవి, భయము, పీడ (బాధ) తాపము, పడుట, మొదలైనవి, వీటి వల్లనుంచి వాతమున్ను యీవాత ప్రకోపమువల్ల పిత్తమున్ను పిత్తప్రకోపమువల్ల శ్లేష్మ మున్ను పుట్టుచున్నది. ॥౪౧॥

సర్వరోగసామాన్యలక్షణం.

శ్లో॥ వేగావగ్రహశోఫకాసగురుతా వైవర్ణ్యనేత్రప్లవా
స్సంతోక్త్యప్రియతాతపానిలజలే ష్విచ్ఛా ప్యనిచ్ఛాఽరుచిః
రోమాంచశ్రమసిద్రతాఽతిశిర శ్శూలాంగజానుక్లమా
వాతే జృంభణ మక్షిదాహ మనలేఽన్నద్వేషణం శ్లేష్మణి॥॥౪౨॥

మల మూత్రములను నిరోధించుట, వాపు, కాస, శరీరము బరువుగానుండుట, శరీరము వివర్ణముగా (పాలిపోయిగాని కాంతి విహీనమైగాని) ఉండుటకన్నులు నీరుకారుట, మంచిమాటలను కూడవినుటకుఇష్టములేకుండుట (సంభాషణమునంద యిష్టము, మాటిమాటికి ఎండయందుగాని, గాలియందుగాని, నీటియందుగానిఇచ్ఛక లుగుట లేక అయిష్టముకలుగుట, అరుచి గగుర్పాటు, శ్రమ (బడలిక) నిద్ర, (మంద

కొడితనము) సుఖములేకుండుట, శిరోవేదన, శరీరముపిక్కలు, పీటియందుబాధ యీలక్షణములు సామాన్యముగా సర్వరోగములయందును కలిగియుండును, వాతప్రధానరోగమం దావలింతలు, పిత్తప్రధానరోగమందు కన్నులు పకపక లాడుట శ్లేష్మప్రధానరోగమున అన్నము నందయిష్టమును కలిగియుండును. ॥౪౨॥

—♦వాతభేదములు♦—

శ్లో॥ జిహ్వాంగస్కంధపాదస్ఖలనకటివసాపక్షఘాతాష్ఠజాను
త్వగ్గోభగాజీర్ణసంధిభ్రమణముఖవిధూమామఽఽమగుల్ఫానులోమాః।
ఉన్మాదోర్ధ్వాస్థిమజ్జాక్షుతనయనదధిశృంఖలా స్నాయుగృధ్ర
స్త్యానాగ్న్యేకాంగమందక్షతబధిరకలాకుక్షికార్థాంగగుల్ఫాః॥

శ్లో॥ కోష్ఠాఢ్యజంఘనాసాసిరమధుకఫరక్తోరువిస్ఫోటపార్శ్వ
శ్మష్కోరుస్తంభఖంజాఽఽతపతిమిరధనుస్సూతికామూత్రబద్ధాః।
వస్త్యంగుళ్యంగధూమాః కికసమలవిబంధౌ శిరః పంగుకర్ణౌ
శుక్లం కంపో విలోమ శ్వసనగళశిరోబాహుకంపాదికా స్స్యుః॥

(1) జిహ్వాంగవాతము, (2) స్కంధవాతము, (3) పాదవాతము, (4) స్ఖలనవాతము, (5) కటివాతము, (6) వసావాతము, (7) పక్షఘాతవాతము, (8) అష్ఠవాతము, (9) జానువాతము, (10) త్వగ్వాతము. (11) భగవాతము, (12) అజీర్ణవాతము, (13) సంధివాతము, (14) భ్రమణవాతము, (15) ముఖవాతము, (16) విధూమవాతము, (17) ఆమవాతము, (18) గుల్ఫవాతము, (19) అనులోమవాతము, (20) ఉన్మాదవాతము, (21) ఊర్ధ్వవాతము, (ఎగురువాతము) (22) అస్థివాతము, (23) మజ్జావాతము, (24) క్షుతవాతము, (25) నయనవాతము, (26) దధివాతము (27) శృంఖలావాతము, (28) స్నాయువాతము, (29) గృధ్రవాతము, (30) స్త్యానవాతము, (31) అగ్నివాతము, (32) ఏకాంగవాతము, (33) మందవాతము, (34) క్షతవాతము (35) బధిరవాతము, (36) కలావాతము (37) కుక్షివాతము (38) అర్థాంగవాతము, (39) గుల్ఫవాతము (40) కోష్ఠవాతము (41) ఆఢ్యవాతము (42) జంఘావాతము (43) నాసావాతము (44) సిరావాతము (45) మధువాతము (46) కఫవాతము (47) రక్తవాతము (48) ఊరువాతము (49) విస్ఫోటవాతము (50) పార్శ్వవాతము (51) శుష్కవాతము (52) ఊరుస్తంభవాతము (53) ఖంజావాతము (54) ఆతపవాతము (55) తిమిరవాతము (56) ధనుర్వాతము (57) సూతికావాతము (58) మూత్రబంధవాతము (59) వస్తివాతము (60) అంగుళివాతము (61) సర్వాంగవాతము (62) ధూమవాతము (63) కికసవాతము (64) మలబంధవాతము (65) శిరోవాత

ము (66) పంగువాతము (67) కర్ణవాతము (68) శుక్లవాతము (69) కంపవాతము (70) విలోమవాతము (71) సుప్తవాతము (72) గళవాతము (73) క్షీణవాతము (74) బాహుకంపవాతము అదికబ్గముచే (75) అణువాతము (76) పాంశువాతము (77) స్వరహీనవాతము (78) దంతవాతము (79) కాకవాతము (80) సాధ్యవాతంబు లాఖ్యాంబులు. ఇట్లు వాతభేదములు 80 విధములు. ॥43॥

జిహ్వాంగవాతమున:— నాలుక వెనుకకు లాగుకొనిపోవుట, తాపము, బధిరము, జ్వరము, భ్రమ, మాటలాడకుండుట, దాహమును,

స్కంధవాతంబున — జ్వరము, కన్నులు చీకట్లు కమ్ముట, తలతిరుగుట, మెడగుళ్లలో నొప్పియును,

పాదవాతంబున — కడుపు, పాదములు. మొల, కుంట్లు, గజ్జలు, గుహ్యము, కన్నులు, చెవులు, తల, వీటియందు శూల, శరీరమున సూదులు గుచ్చినట్లుండుట, కణతను,

స్ఖలనవాతంబున — శుక్లపతనానంతరము శరీరము చల్లదనము కలిగియుండుట, కణత, శ్వాస, తాపము, మూర్ఛ, చమట, అరిపాదములయందు నొప్పియు,

కటివాతమున:— దుష్ప్రలాపము, కటిప్రదేశమంతయు బద్దలకొట్టినట్లు లుండుట, నొప్పి, క్రోధము, మూర్ఛయును,

నసావాతమున:— వాపు, నిద్రలేమి, తలనొప్పి, నస, (తొవ్వ) తుమ్ముచుటయును,

పక్షఘాతవాతమున — పాదాదిశిరఃపర్యంతము ఒకపార్శ్వమున శూల, శరీరమంతయు నొప్పియును,

అమ్లవాతమున — శరీరబరువు, పులితేన్పులు, అరుచి, అజీర్ణమును,

జానువాతంబున — కలవరింతలు, గుండెలలో మంట, మోకాళ్ళు ఎండిపోవుట, నొప్పులు, వాంతి, కణుత, మూర్ఛయును,

త్వగ్వాతంబున:— కాళ్ళు చేతులు మంటలు, పార్ష్ణిభాగము (మడమలు) యితరావయవములు పగులుటయును,

భోగవాతంబున:— శరరము నొప్పులు, తేన్పులు, శరీరమంతయు పులుసుకంపు, మంట, కణత, నొప్పి, వాతప్రకోపమును,

అజీర్ణవాతంబున:— అజీర్ణము, ఒళ్ళు నెప్పులు, మలబద్ధము, తలనొప్పి, కార్శ్యము, (చిక్కుట) ఆకలిలేకుండుట, ఒడలికయును,

సంధివాతంబున.— శరీరము మాటిమాటికి గరిపోడుచుట, ఒడలంతయు పోట్లు, కలవాట్లుకీళ్ళన్నియు నొప్పులున్న,

భ్రమణవాతంబున — ఒడలు తిరుగుట, మూర్ఛ, దాహము, వికారము, కీళ్ళు వాచుట, కార్శ్యము, గుల్మముగాని, ఉదరముగాని, గలుగుటయును

ముఖవాతంబున:— కృశత్వము, తెమడ పడలుట, మరద, ఉబ్బసమును,

విధూమవాతమున:— జ్వరము, విదాహము, కలపోటు, కళ్ళు ఎరుపును,

అమవాతమున:— వాంతి, జ్వరము, శరీరము మాత్రము తెలుపుగానుండుట, కన్నులు పసుపురంగు కలిగి యుండుటయును,

గుల్మవాతంబున:— అజీర్ణము, తలనొప్పి, కడుపులో పోటు, వికారము, అన్నమందయిష్టము, మలములు శుష్కించుటయును,

అనులోమవాతంబున:— శరీరము పాండిచుట, ధాతువులు (రసరక్తమాంసమేదోస్థిమజ్జామాంసములు) శోషించుట, తల దురద, వాంతి, భ్రమ, చమట, శ్వాస, మగతయును,

ఉన్మాదవాతమున:— పిచ్చివానిచేష్టలు లక్షణములును.

ఊర్ధ్వవాతమున:— మలబంధము, శోషము, దగ్గు, అన్నమందయిష్టము, అరుచి, అగ్నిమాంద్యము, ఒద్దకమును,

అస్థివాతమున — చెమట, ఒధిరము, ఎముకల నొప్పి, వణకు, తాపము, జఠరాగ్ని మందముగానుండుటయును,

మజ్జావాతమున — కీళ్ళవాపు, ఎక్కిళ్ళు, భ్రమ, (ఒళ్ళుతిరుగుట) శూల, వణుకును

శూతవాతమున — తుమ్ములు, అన్నమందయిష్టము, వికారము, జ్వరము, దాహము, నీరసమును,

నయనవాతమున:— కన్నులెఱ్ఱరుట, మండుట, నీళ్ళుకారుట, వాతప్రకోపము కలిగియుండుటయును,

దధివాతమున — అతిసారము, ఊర్ధ్వాంగబిలములు, (చెవులు, కన్నులు, ముక్కులు,) శూలకలిగియుండుట, ఎక్కిళ్ళు, తలత్రిప్పును,

శృంఖలావాతమున — పొందుకట్టము తలనొప్పి, నిద్రలేకుండుట, వాంతి, శరీరమున కలిసట్లుబొబ్బలు, కార్శ్యమును,

స్నాయువాతమున:— శరీరము పగులుట, పీడ, కంటినొప్పియును,

గృధ్రివాతమున:— వాతప్రకోపము, నడక తడబడుట, కాళ్ళు, చేతులు, మండుట, చమటపట్టుట, వాచుట, కలవాట్లు, దాహమును,

సామాన్యవాతమున:— వాతప్రకోపము, ఒళ్ళంతయుపోట్లు, ఆకలి మందగించుట, చమటయును,

అగ్నివాతమున:— దేహము కాల్చబడినట్లుండుట తలనొప్పి, దాహము, వికారము, కాంతిహీనత, మూర్ఛయును,

ఏకాంగవాతమున:— వాతప్రకోపము, జ్వరము వణుకు, వికారము, వాంతి తలతిరుగుట, మలబంధము, కడుపులోమంట, తుమ్ములును,

మందవాతమున:— కలవరింతలు, భ్రమ, కాంతిరాబోవునట్లుండుట, పాండువర్ణము, కంఠమందు చముటయును,

శుక్రవాతమున.— కడుపుబ్బరము, ఒళ్లునంట, వణుకు, కడుపులోమంట, మూత్రసంకోచమును, (బొట్లుబొట్లుగా గాని, కొంచెముకొంచెముగా గాని, వెడలుటయును)

రుధిరవాతమున:— చెముడు, చెవులలోహోరును,

కలావాతమున,— కళ్లుఎరుపు, నాలుకనలుపు, కాంతిహీనత, పాండువర్ణము, శరీరమంతయు పోట్లును,

కుక్షివాతమున:— కడుపులోపోటు, కళ్లు మొంగము కరుగుట, శరీరము వాచుటయును,

అర్ధాంగవాతమున:— సగముశరీరము స్తంభించుట, నిద్రలేమి. మలబంధము కడుపులోమంటయును,

గుల్మవాతమున:— నిద్రలేమి, కళ్లుమంట తాపమును,

కోష్ఠవాతమున:— శరీరముపచ్చబడుట, చముట, మలబంధము, వికారము, అన్నమందయిష్టము, క్షీణత్వమును;

అధ్యవాతమున:— కళ్లుముఖముతిరుగుట, కంఠము, చెవులయందు, పాదములయందు, పోట్లును;

జంఘావాతమున:— భయము, గరిపొడుచుట అనిమిషత్వము (రెప్పపాటు లేకుండుట) కనుబొమ్మలమధ్యను, ఒళ్లంతయును, పోట్లు, మూర్ఛయును,

నాసావాతమున:— ముక్కునుండి రక్తము కారుట, దౌర్బల్యము, భయము, పిత్తప్రకోపమును,

శిరావాతమున:— నరములుపోట్లు, నీరసము, పాండిమ, లేత పచ్చని, శరీరకాంతి కలుగుటయును,

మధువాతమున:— హిక్క, పాండిమ, ముక్కులనుండి రక్తముస్రవించుట మూర్ఛ, దగ్గును,

కఫవాతమున:— వాపు, దగ్గు, జ్వరము, స్వరము హీనమగుట, చిక్కిపోవుట, లేకబలియుటయును,

రక్తవాతమున:— రక్తముకక్కొనుట, ఎక్కిళ్లు, దాహము, కాంతిహీనతయును,

ఊరువాతమున:— తెల్లటిదేహకాంతి, తెల్లటిమూత్రము నురుగుకట్టివెడలుట, కళ్లు మొంగముతిరుగుట, వికారమును,

విస్ఫోటవాతమున:— భ్రమ, బొబ్బలు తలత్రిప్పు, బాధయును,

పార్శ్వవాతమున:— సగముశరీరముచల్లగాఉండుట, తలతిప్పు, ఉన్మాదము;

కుబ్జవాతమున:— వాతప్రకోపమునందుండు ఉపద్రవములు, కృశత్వము వణకు, తాపము, చెమట, చెముడు, భ్రమయును,

ఊరుస్తంభవాతమున:— తొడలు కదలకుండుట, నోటినుండి రక్తము పడుట, గోళ్లునొప్పి శోధము, గుదము, పాదములు, పీటియందు, పోటును,

ఖంజావాతమున:— రాత్రినిద్ర లేకుండుట, పగలునిద్రించుట, అజీర్ణము కడుపులోనుండుట శరీరము స్వాధీనములోనుండక పోవుటయును,

ఆతపవాతమున.— కళ్లు తెల్లబడుట, వికారము, ప్రాణభీతి, చెప్పుటకలవి గాని అనేకవిధములైనబాధలును,

తిమిరవాతమున — దగ్గరనున్నది కనబడక స్వప్నజ్ఞానము తెలియకుండుట, కృశత్వము, ఒళ్లుమంటలును,

ధనుర్వాతమున:— శరీరము విల్లువలె వంగిపోవుట, మూతపెట్టుట, మూర్ఛ అగ్నిమాంద్యమును,

సూతికావాతమున:— జ్వరము, వణుకు, దాహము, కన్నులు నీరుకారుట, శరీరము బరువుగానుండుట, చల్లగానుండుట, వాపుకలిగియుండుటయును.

మూత్రబంధవాతమున — కాంతివిహీనత, కడుపుబ్బరము, గుండెలలోనొప్పి మూర్ఛలు, మూత్రనాళమున మంటయును,

వస్తివాతమున — జ్వరము, విదాహము, బద్ధకము, ఒళ్ళునొప్పులు, తలత్రిప్ప శరీరము చల్లగానుండుట, మెడ నిలబడకపోవుట, నిద్రలేమియు,

అంగుళీవాతమున — వ్రేళ్ళు, శరీరము, పీటియందు మంటయు, జూలిక యవములు ముడగలాగుటయును,

సర్వాంగవాతమున — (అవయవాంగవాతమున) ఒళ్ళునొప్పులు, మంటలు, మలమూత్రబద్ధము. తలనొప్పి, నిద్రలేమియును,

భూషువాతము. విషూచి (కలరావంటిది) వాంతి, తాపము, జ్వరము, పిత్త ప్రకోపము, మూర్ఛ, భ్రమ, వికారమును,

కికటవాతమున.— నడుము మోకాళ్లు, ప్రతికీలు పట్టుపట్టుట, శిరస్సు, పాదములు పీటియందు శూలలయు,

మలబద్ధవాతమున:— మలమూత్రబంధము, కడుపుబ్బరము, తలవణుకు, గుండెలలో మంటయు,

శిరోవాతమున:— తలనొప్పి. కృశత్వము, ఒళ్ళుమంటలు, గుండెలోనొప్పి గగుర్పాటును,

పంగువాతమున:— రెండుతొడలు యిరుకునబడి నడచుటకు సాధకాలము లేకుండుటయును,

కర్ణవాతమున:— చెవులుపోటు, వినబడకుండుటయును,

శుక్లవాతమున:— శుక్లము బయటకురాక శరీరమునందేయునుకట, శిరస్సులో మంట, వికారమును,

కంపవాతమున:— చేతులు, కాళ్ళు, వణకుట, తోచకుండుట, నిద్రలేమియు

విలోమవాతమున:— శ్వాసము, నేత్రశూల, ఎక్కిళ్ళు, ఓకిరింత పొందుటయును,

సుప్తవాతమున:— చెవికొనలయందు నొప్పి, స్పర్శజ్ఞానశూన్యత, వికారము, భయము, క్రోధము, కృశత్వము, చెమటయును,

గళవాతమున — (కంధరవాతమున) తాపము. వాపు, నిద్ర, కలవాట్లు, దాహము, జ్వరమును,

క్షీణవాతమున.— కృశత్వము, తల, ముక్కు, గోళ్ళు, అవయవములు, కపాలము, కన్నులు, వీటియందు నొప్పి (లేక) పోట్లు, నిద్ర బొత్తిగా పట్టకుండుటయు,

బాహుకంపవాతమున — ఒంటిచెయ్యి వణకుట, వికారమును,

అణువాతమున:— శరీరము మణగలాగుకొనిపోయి గిడసబారుట, ఒళ్ళు విరుపు, నడుము వంగిపోవుట, నడచుటకు సామర్థ్యములేకపోవుటయును,

పాంశువాతమున — గుదస్థానమందును, మేఢ్రస్థానమందును, వీర్యస్రావము, చెమట, భ్రమ, మూర్ఛ, దాహము చేతులు కాళ్లు మండుటయును,

స్వరహీనవాతమున — స్వరము హీనమగుట, జ్వరము, కలవాట్లు, చెవిపోటు, కృశత్వమును,

దండవాతమున — శరీరము కర్రవలె కదలకుండుట, వాతప్రకోపము, దగ్గు పొందిము, నిద్ర, కడుపుయందు గంధలేపనచేసినవాసన, అగ్నిమాంద్యమును,

కాకవాతమున కాళ్లు, చేతులు, వణకు, తలతిప్పు, కళ్ళుగిరగిరలాడుటయు,

సాధ్యవాతమున — గుదద్వారము బధిరము, ఒళ్ళుపోట్లు, తలతిప్పు, మాంద్యమును కలిగియుండును

పైత్యభేదములు.

శ్లో॥ సూర్యావర్తః కుసుమమధుర స్వేదదుర్గంధశీతాః
క్రోధోన్మాదా౽మ్లమదనశిర శ్చర్మమూర్ఛా వివర్ణాః।
భ్రాంశావర్తే కరపదభుజంగే క్షుధా పుండరీకే
తృష్ణా రక్తే నిగదిత మిదం కామిలా దుష్టభాషే॥ ॥౮౮॥

(1) సూర్యావర్తపైత్యము (2) కుసుమపైత్యము (3) మధురపైత్యము (4) స్వేదపైత్యము (5) దుర్గంధపైత్యము (6) శీతపైత్యము (7) క్రోధపైత్యము (8) ఉన్మాదపైత్యము (9) అమ్లపైత్యం (10) మదనపైత్యం (11) శిరఃపైత్యం (12) చర్మపైత్యం

(13) మూర్ఛాపైత్యం (14) వివర్ణపైత్యం (15) భ్రమపైత్యం (16) అగ్నిపైత్యం (17) కరపాదపైత్యం (18) భుజంగపైత్యం (19) క్షుధాపైత్యం (20) పుండరీకపైత్యం (21) తృష్ణాపైత్యం (22) రక్తపైత్యం (23) కామిలాపైత్యం (24) సుర్భాపాపైత్యం అనిపైత్యములు యిరువదినాలుగు విధములు.

సూర్యావర్తపైత్యమున — కన్నులుతిరుగుట, మూర్ఛ విదాహము,

కుసుమపైత్యమున — నోటినుండిగాని ముక్కునుండిగాని రక్తము కక్కుకొనుట విదాహము ఎండనుసహించుకొనలేకపోవుటయును,

మధురపైత్యమున — అరుచి, ప్రాతఃకాలమందు కోపోద్రేకముకలుగుచుండుట, తలతిరుగుట, నోరుతియ్యగానుండుట, వాంతి. రోమాంచమును

స్వేదపైత్యమున — ఎక్కువగాచమటపట్టుట, నిస్సత్తువవడలు నీరుపట్టుటయును,

దుర్గంధపైత్యము.— అంతర్దాహము (తాపము) శరీరముపైభాగమంతయు చల్లగానుండుట, చమట, దేహముదుర్గంధం కలిగియుండుటయును.

శీతపైత్యమున:— అరుచి, శరీరముచల్లగానుండుట, అగ్నిమాంద్యము అజీర్ణము, భ్రమ, మూర్ఛ, చమట,

క్రోధపైత్యమున — తామసము, మూర్ఛవణములు, క్రోధాధిక్యమును,

ఉన్మాదపైత్యమున — విదాహము వికారము, వాంతి, మూర్ఛ, శరీముచ్చిపుట, మలమూత్రములు శీఘ్రముగా వెడలుట, పిచ్చిమాటలున్ను,

అమ్లపైత్యమున — పుల్లగాను, చేదుగాను ఉండు త్రేనుపులు, పులుపుగలిగినవాంతి, దాహము, అరుచి. కాంతిహీనత, నాలుక, చర్మము అదురుట, అజీర్ణము, ఆయాసము, శరీరము వగులుట, ఒడలుబరువు, గొంతుక ఎండిపోవుట, తాపము, మోహము, ఉబ్బసము, ఓకిరింత, కలవాట్లు, కడుపునొప్పి, తలనొప్పి, జ్వరము, చిక్కిపోవుట, గుండెలలోను కడుపులోను, మంట, చమట, శ్లేష్మసహితమైన పుల్లనివాంతి, నోటినుండియు, ముక్కునుండియు, పుల్లని రసమువెడలుట, దురదదద్దుర్లును,

మదనపైత్యమున — తాంబూలము పడకపోవుట, సంభోగమందభిలాష, మూర్ఛ, చెమట, తలతిరుగుటయును

శిరఃపైత్యమున.— సర్వకాల సర్వావస్థలయందు తలతిరుగుట. నోటనీళ్లు కారుట, అరుచి, వాంతి, పులుసు పదార్థములయందయిష్టము, శరీరతాపమును

చర్మపైత్యమున.— నాలుక, శరీరము, అరిచేతులు, అరికాళ్లు, పెదవులు మొదలైనప్రదేశములయందు చర్మముఊడుట, శరీరమంతయు అపారమైన దురదకలిగియుండుట, నిస్సత్తువ, ఎక్కిళ్లును,

మూర్ఛాపైత్యమున — అరుచి, నోరుతియ్యగానుండుట, నోటనీళ్లుకారుట,

తలత్రిప్పు, వాంతి, గుర్పాటును,

విశీర్ణపైత్యమున:— చెమట, కాంతివిహీనత, చప్పి, దేహము దుర్గంధముగాను యుండుట రోమములూడిపోవుట తలత్రిప్పుటయును,

భ్రాంతపైత్యమున — మాటల తడబడుట తోచకపోవుట, విచారము, రెప్పపాటు కలుగకుండుట, గర్జనమాటలును,

అవర్ణపైత్యమున --- ఒళ్లు కన్నులు, తల తిరుగుట, మూర్ఛ, చెమట, దాహము, మలమూత్రములు తొందరగాను, శీఘ్రముగాను వెడలుటయును.

కరపాదపయిత్యమున — కాళ్లు, చేతులు మండుట, దేహకార్శ్యము, వేదనయు,

భుజంగపయిత్యమున.— దేహము పయి చర్మము పాముకుబుసమువలె నుండుట కాంతిహీనత, శిరోవాతము, అరుచి, కుష్ఠరోగమువలె ఆకారము కలుగుట, దాహమును,

క్షుధాపయిత్యమున --- మిక్కిలి ఆకలి కలిగియుండుట, పిదాహముభుజించిన వెంటనే అన్నము జీర్ణమై ఆకలిగానుండుట కళ్లుపోటు ఎక్కిళ్లును,

పుండరీకపయిత్యమున --- తామరదుద్దు వంటి దద్దుర్లు, గుర్పాటు మరద ఉష్ణాధిక్యము దాహమును.

తృష్ణాపయిత్యమున -.- ఉగయకాలమున దాహాధిక్యత రొమ్ములోను కంఠములోను మంటయును,

కామిలాపయిత్యమున --- ముఖము గోళ్లు మలమూత్రములు పచ్చగా నుండుట దాహము ఆకలిలేకుండుటయును,

దుర్భాషాపయిత్యమున --- దేహముకృశించి యుండుట దేనియందు ఇష్టము లేకుంట స్వప్నమున కలవాట్లునగములు పట్టు లేక దుర్భాషలాడుటయును కలిగియుండును ॥౪౪॥

## శ్లేష్మభేదములు.

శ్లో॥ కృష్ణోపజిహ్వాకఫజిహ్వాకకంఠజిహ్వా
శ్లేష్మోర్ధ్వచిప్పికదధిక్షయపిత్తజిహ్వాః
పూర్వానురక్తకఫభంగకపాండుశుక్తి
వాతక్షతౌ చ కఫకుష్ఠ ఇతి ప్రసిద్ధాః॥ ॥౪౫॥

(1) కృష్ణకాస (2) ఉపజిహ్వకాస (3) శ్లేష్మజిహ్వకాస (4) కంఠజిహ్వకాస (5) శ్లేష్మకాస (6) ఊర్ధ్వకాస (7) చిప్పకాస (8) దధికాస (9) క్షయకాస (10) పిత్తకాస (11) జిహ్వకాస (12) పూర్వకాస (13) అనుకాస (14) ర

లేకుండుటయును,

ఆమ కాసయందు:--- శైత్యము దగ్గు పెరుగునందసహ్యము తలనొప్పి కృశత్వము దాహమును,

రక్త కాసయందు --- దగ్గినప్పుడు కఫరక్తములు వుమియుట గుండెలలో పోట కాంతిహీనత శరీరము మిక్కిలి వేడిగానుండుట దౌర్బల్యమును.

శ్లేష్మభంగ కాసయందు --- నోటియందు కొంక తెమడ క్షీణించి తెఱుడ దేహము కష్టములుపచ్చగానుండుట చెవుడు దిబ్బిబ్బుమాటలు మూర్ఛ శ్రమ అయాసమును,

పాండు కాసయందు,-- పాండువర్ణము నేత్రభాగమందు దగ్గును.

శుక్తికా కాసయందు:--- అగ్నిమాంద్యము కఠుకయందు తెమడ ఇంద్రియములు పట్టులేకుండుటయు,

వాత కాసయందు --- రొమ్ము కణతలు శిరస్సు కడుపు పార్శ్వములు వీటియందుశూల నోటతడి లేకుండుట ధాతువులుక్షీణించుట స్వరభేదము మాటిమాటికి పొడిదగ్గును.

క్షత కాసయందు (అధిక సంగమము) మోయజాలని బరువుమోయుట యుద్ధముచేయుట గుర్రములుమొదలైనజంతువులు పరుగెత్తునప్పుడు వాటివడ్డముదగులుట వీటిచే రొమ్ము విస్తరింపనొంది దానియందు వాతము ప్రబలమై కాసనుపుట్టించును యీదగ్గుపుట్టుటకుముందు పొడిదగ్గు రక్తముతోకూడినకఫముపడుట కంఠమునొప్పి శూలచే రొమ్ము తప్పింపనలవిగాకుండుట పర్వ-లయందు అనిర్వాచ్యమైన వేదన శూల కీళ్ళవిసంఘులు విడిపోయినట్లుండుట జ్వరము శ్వాస (అయాసము) దాహము స్వరభేదమును,

శ్లేష్మ కాసయందు --- గొంతుక శ్లేష్మపూరితము గానుండుట రాత్రింబగళ్ళు దగ్గును,

క్షయ కాసయందు --- అనుగుపాటు వికారాకారము అవయవములయందు బాధ మిగుల పొందించుట కలిగియుండును. ॥౪౫॥

## క్రిమిరోగసంప్రాప్తి

శ్లో॥ అజీర్ణభోజీ మధురామ్లనిత్యో
ద్రవప్రియః పిష్టగుడోపభోక్తా
వ్యాయామహీనశ్చ దివా శయానో
విరుద్ధభుక్సంలభతే క్రిమీంస్తు। ॥౪౬॥

భుజింపబడిన అన్నము జీర్ణము కాకుండ తిరిగి భోజనముచేయుట తియ్యనిపదార్థములు, పుల్లనిపదార్థములు ద్రవపదార్థములు చలిమిడి బెల్లము వీటినితినుట పని చే

యుకుండుట పాల్లులుమాలిక పగలునిద్రపోవుట విషమ శనము వీటివలన క్రిమిరోగము పుట్టును. ॥౪౧॥

## —♦ క్రిమిరోగలక్షణాం ♦—

శ్లో॥ విడ్భేదశూలావిష్టంభ కార్శ్య పారుష్యపాండుతాః।
రోమహర్షాగ్నిసదనం కండూ ర్వ్రమార్గతా॥ ॥౪౨॥

క్రిమిరోగమందు మలము ఉండలు ఉండ గాకడుట శూల మలబద్ధము కృశత్వము శరీరము గరగరలాడుట తెల్లపారుట (పాండించుట) రోమాంచము వాంతులు అగ్నిమాంద్యము గుదప్రదేశమునదురద యిట్టిలక్షణములుకలిగియుండును.॥౪౨॥

## —♦ క్రిమిభేదములు ♦—

శ్లో॥ కేశాదరోమ నఖాద్యాః పురీషజాతాః
స్వే స్థానవర్ణాః ఖలు యూకవిశాః
కఫాసృగ్విట్ప్రభవాః త్రిధా తే
రిక్తాంకురాణుపృథుచిత్రవర్ణాః॥ ॥౪౩॥

బాహ్యములనగా నమట మొదలైనవాటివలన పుట్టినవి తిలప్రమాణముకలిగి నలుపు తెలుపురంగుకలిగి పేలుగానియు యీళ్ళుగానియు కఫము రక్తము మలము మూత్రము వీటియందుపుట్టినవి త్రోళ్ళవలెను మొలకలవలెలు చిన్నవిగాను పెద్దవిగాను అనేకరంగులుకలిగియుండును స్థానభేదప్రకారము యీక్రిములు రెండువిధములైయున్నవి. ॥౪౩॥

## —♦ సన్నిపాతసంప్రాప్తి ♦—

శ్లో॥ అపథ్యదోషా జ్జ్వరితస్య జాతు
దోషాణి దోషైః రభి సన్నిపాతాః।
దోషేషు పక్షం పరిమాణ మాహుః
కాలావధి ర్నైవ యదా కదాచిత్॥ ॥౪౪॥

జ్వరితునికి అపథ్యదోషమువలన ఒకానొకప్పుడు దోషములుపుట్టి వాటిచే సన్నిపాతజ్వరములు సంభవించును. దోషవికారములకు సామాన్యముగా పదిహేను రోజులు పరిమాణము అయియున్నది అయినను ఒకానొకప్పుడు యీకాలపరిమాణము సరిపడకపోవచ్చును ॥౪౪॥

## —♦ సర్వసన్నిపాతసామాన్యలక్షణం ♦—

శ్లో॥ రాత్రౌ జాగరణం దివా చ కృశతా మూర్ఛాఽతిదాహో మరు
ద్ధావ్యం స్వేదమతిప్రలాప మరతి ర్మాంద్యం చ హృత్పీడనం
శ్వాసశ్వాసవివర్ణశైత్యతపన శ్లేష్మోత్తమాంగవ్యథా
జిహ్వాదగ్ధకృశత్వ మంగపులకా శ్చ సన్నిపాతజ్వరే॥ ॥౫౦॥

రాత్రియందు నిద్రపట్టకపోవుట పగలు ఒద్దికముగానుండుట మూర్ఛ విదాహము వాతము వృద్ధిచెందుట నలి నవ్వుట. చెమటపట్టుట అసంబద్ధముగా మాటలాడుట సుఖములేకుండుట మాంద్యము రొమ్మునొప్పుట దగ్గు ఆయాసము రూపు మారురూపుపడుట దేహము చల్లగానుండుట జ్వరము గొంతుగినిండ శ్లేష్మము శిరోవేదన నాలుక పిడచకట్టుట యీలక్షణములు సామాన్యముగా అన్ని సన్నిపాతములలోను కలిగియుండును. ॥౫౦॥

### సన్నిపాతభేదములు

శ్లో॥ హృద్దాహచిత్తభ్రమకంఠకుబ్జ
ప్రలాపరక్తోష్ఠకభుగ్ననేత్రాః।
శీతాంగతంద్రాంతకసన్నికాభి
న్యాసాః పరం కర్ణికజిహ్వకాఖ్యాః ॥ ॥౫౧

(1) హృద్దాహసన్నిపాతము, (2) చిత్తభ్రమసన్నిపాతము (3) కంఠకుబ్జసన్నిపాతము (4) ప్రలాపసన్నిపాతము (5) రక్తోష్ఠకసన్నిపాతము (6) భుగ్ననేత్రసన్నిపాతము (7) శీతాంగసన్నిపాతము (8) తాంద్రికసన్నిపాతము (9) అంతకసన్నిపాతము (10) సంధికసన్నిపాతము (11) అభిన్యాసన్నిపాతము (12) కర్ణికసన్నిపాతము (13) జిహ్వకసన్నిపాతము అని సన్నిపాతములు 13 విధములు.

హృద్దాహసన్నిపాతమున.— అధికముగా మాటలాడుట, తాపము, మోహము, గొంతునొప్పి, మనస్థిమితము లేకుండుట, విదాహము, పెదవు లెండుట, దగ్గు, మాంద్యము, వణకు, కలవాట్లు, కంరము, అలాటము, వీటియందు చెమటయును.

చిత్తవిభ్రమసన్నిపాతమున — నగ్గినగాయు పట్లు కలిసినట్లుండుట, వాతపిత్తములు ప్రకోపమును చెందుట, స్థిమితము లేకుండుట, స్మృతితప్పుట, కనుబొమ్మలు ముడుచుకొనుట, పాడుట, ఆడుట, కలవరి తలుచు,

కంఠకుబ్జసన్నిపాతమున — విదాహము, తల తిరుగుట, (తలవిసుగు) మెడ కుదియబడుట, విస్తారముగా మాటలాడుట, తాపము, మూర్ఛ, అవయవములు పట్లు లేకుండుట, వణుకు, వాంతి, ఎక్కిళ్ళు, గద్గదస్వరముతో మాట్లాడుట, శిరోవేదనయును,

ప్రలాపసన్నిపాతమున - శ్లేష్మము, అతిసంభాషణ, తాపము, వాతశ్లేష్మ ప్రకోపము, ఎక్కిళ్ళు జ్వరమును

రక్తష్ఠీవసన్నిపాతమున — నాలుక, పెదవులుపగిలి రక్తము కారుట దగ్గు, వణకు, తలత్రిరుగుట, నాలుకనలుపెక్కి ముళ్ళుకలిగియును,

భగ్ననేత్రసన్నిపాతమున — కన్నులు ఊడిపడిపోవునట్లుండుట. నీళ్ళు కారుట, చూపు కనబడకుండుట, అతిభాషణము, వణుకు, భ్రమయు,

శీతాంగసన్నిపాతమున — దేహము చల్లగానుండుట, దగ్గు, ఆయాసము, ఎక్కిళ్ళు, ఏకీలును పట్టులేకుండుట, వాంతి, తాపము, మూర్ఛ, విరోచనము, వణుకుటయును,

అంతకసన్నిపాతమున — దాహము, మోహము, తలవణకు, కలవరింతలు, వాంతి, ఎక్కిళ్ళు, జ్వరమును,

సంధికసన్నిపాతమున — శరీరము ముఖ్యాప్రకటముగా నేయుచుండుట, శూల శరీరము వాచుట, వాతము, బాధ, దగ్గు, సోమరితనము, తాపమును,

అభిన్యాసన్నిపాతమున — త్రిదోషములును ఏకీభవించియుండుట, జ్వరము ఆయాసము, ముఖము జిడ్డుగానుండుట, అమితమైననిద్ర, కాంతిహీనత, తాపము, నిస్సత్తువ, దాహము, వణుకుటయు,

కర్ణికసన్నిపాతమున — అతిభాషణము, నాలుక బీటలుతీయుట, ఎక్కిళ్లు దగ్గు వణకు, చెవికొనలయందువాపు, తాపమును,

జిహ్వకసన్నిపాతమున — నిట్టూర్పు తొందరగా నుండుట, తాపము, దగ్గు నాలుక కఠినమై ముండ్లుకలిగియుండుట, మాటలుడిగిపోవుట, చెముడు, మాంద్యము, ఇట్టిలక్షణములు కలిగియుండును. ॥౫౧॥

## —♦ కర్ణికలక్షణం ♦—

శ్లో॥ జ్వరాస్య పూర్వం జరమధ్యకాలే
జ్వరాంతిమేవా శ్రుతిమూలశోధః।
క్రమా దసాధ్యః ఖలు కష్టసాధ్య
స్సుఖేన సాధ్యో మునిభిః ప్రదిష్టః॥

సన్నిపాతసంబంధమైన జ్వరములలో చెవులకింద వాపుకలుగును ఇది కొంత మందికి ఒక చెవికిందనుమాత్రమే కలుగును కొంతమందికి రెండుచెవులకిందనుకలుగును దీనివలన కొంతమంది జీవించక పోవుటకూడ కలదు. యీవాపు జ్వరమువచ్చు మొదటనేఉన్నయెడల అసాధ్యమనియు, మధ్యకలిగినయెడల కష్టసాధ్యమనియు, అఖరున కలిగినయెడల సులభసాధ్యమనియు, తెలుసుకొనవలెను. ॥౫౨॥

—♦ సన్నిపాతదినప్రమాణం ♦—

శ్లో॥ నఖాధ్వరే సన్నిమనూధిగష్టౌ
పక్షం చ తత్త్వం చ దిగబ్ధిపక్షాః।
మాసత్రయం షోడశవాసరాణి
యదా కదాచి న్మనితాంద్రికే స్యాత్॥ ॥౫౩॥

హృద్దాహసన్నిపాతమునకు (20) చిత్తభ్రమసన్నిపాతమునకు, (21) కంఠకుబ్జ సన్నిపాతమునకు, (13) ప్రలాపసన్నిపాతమునకు, (14) రక్తష్ఠసన్నిపాతమునకు, 10 భుగ్ననేత్రసన్నిపాతమునకు, (8) శీతాంగసన్నిపాతమునకు, (15) తాంద్రిక సన్నిపాతమునకు,(25) అంతకసన్నిపాతమునకు,(10) సంధికసన్నిపాతమునకు(7)అభిన్యాససన్నిపాతమునకు, (15) కర్ణికసన్నిపాతమునకు,(90) జిహ్వకసన్నిపాతమునకు,(16) తాంద్రికసన్నిపాత మునకు ఒక్కొక్కప్పుడు, (7)పరిమాణదినములుఅయియున్నవి,

సాధ్యసన్నిపాతనామములు.

శ్లో॥ స్యుస్తాంద్రిక సన్ని కకర్ణికే చ
ప్రలాపచిత్తభ్రమజిహ్వకాఖ్యాః
షట్సన్నికావాతకఫ ప్రధానా
స్సాధ్యా స్స్యు రేతా స్సుచికిత్సకస్య॥ ॥౫౪॥

ఇదివఱలో చెప్పబడిన పదమూడు సన్నిపాతములలోను, (1) తాంద్రికసన్నిపాతము (2) సంధికసన్నిపాతము (3) కర్ణికసన్నిపాతము (4) ప్రలాపసన్నిపాతము (5)చిత్తభ్రమసన్నిపాతము (6) జిహ్వకసన్నిపాతము అను ఆరున్ను శ్లేష్మవాతప్రధానములు యివి చికిత్సకుసాధ్యములు ॥౫౪॥

అసాధ్యసన్నిపాతములు.

శ్లో॥ హృద్దాహరక్తష్ఠకకంఠకుబ్జా
భిన్యాసశీతాంతకభుగ్ననేత్రాః
పిత్తాధికాదాహవిరేకయుక్తా
స్సువైద్యకస్యాపి భవం త్యసాధ్యాః॥ ॥౫౫॥

(1) హృద్దాహసన్నిపాతము (2) రక్తష్ఠకసన్నిపాతము (3) కంఠకుబ్జసన్నిపాతము (4) అభిన్యాససన్నిపాతము (5) శీతాంగసన్నిపాతము (6) అంతకసన్ని

పాతము (7) భగ్న నేత్రసన్నిపాతము. అనుఏడున్ను పిత్తప్రధానములు యివిచికిత్స కుసాధ్యములు కావు. ॥౫౫॥

## హృద్రోగసంప్రాప్తి

శ్లో॥ అత్యుష్ణగుర్వమ్లకషాయతిక్త
శ్రమాభిఘాతాఽధ్యయనప్రసంగైః
స్త్రీసంగమాద్వేగనిరోధనేన
హృదామయః పంచవిధః ప్రదిష్టః॥ ॥౫౬॥

మిక్కిలి వేడిచేయునట్టియు, అజీర్ణము లైనట్టియు, పులుపు, వగరు, చేదు కలిగిన పదార్థములు, పరిశ్రమ, అభిఘాతము, మితిమీరిన కువుట, విగ్రహ గామాట్లాడుట, సంభోగము, మలమూత్రనిరోధనము వీటిచేహృద్రోగం జనించును,యీహృద్రోగ మా అయిదు విధములు ॥౫౭॥

## హృద్రోగలక్షణము

శ్లో॥ వాతే హృది స్ఫోటనభేదనాని
పిత్తే తృడుష్మాఽస్యవిశోషమూర్ఛాః
కఫేఽగ్నిమాంద్యారుచిహృద్గురుత్వం
స్యాత్సన్నిపాతక్రిమిసర్వలింగం॥ ॥౫౮॥

వాతసంబంధమైన హృద్రోగమందు — హృదయమునందు అంపములతోడో చినట్లు బాధ, గుండెలుఁగుటయు,

పిత్తసంబంధమైన హృద్రోగమందు — దాహము, శరీరమునకు వేడిమి, నోరెండుట, గాతుకలోపాగ వచ్చినట్లుండుటయు ను

కఫసంబంధమైనహృద్రోగమందు -- అగ్నిమాంద్యము, అరుచి, గుండెలలో బరువును,

సన్నిపాతదోషము వల్లనున్ను క్రిమివల్లనున్ను సంబంధించిన హృద్రోగము యందు వాతాదులకు వేరు వేరుగా చెప్పబడిన లక్షణములను కలిగియుండును, హృద్రోగము గుల్మరోగమువలె హృదయమందుపుట్టును. ॥౫౯॥

## ఆమదోషప్రాప్తి

శ్లో॥ యదైవ పాకస్త్వం దోషాణాం మలానాం చ రసాదిషు।
తమేవాఽమస్య సంప్రాప్తిం విజానీయాత్సదా భిషక్॥ ॥౬౦॥

రస, రక్త, మాంస, మేధో౽స్థి, మజ్జా, శుక్రములను, సప్తధాతువులను ఆశ్రయించియున్న వాతాదిదోషములున్ను, మలములున్ను, యెప్పుడు పక్వములు గావో, అదియే ఆమదోషసంప్రాప్తి అని సర్వరోగములయందు తెలియవలెను ౫౮॥

ఆమదోషలక్షణం.

శ్లో॥ ఆలస్యతంద్రాహృదయా౽విశుద్ధి
ర్దోషా౽ప్రవృత్త్యా౽నిలమూలభావైః
గురూదరత్వా౽రుచిసుప్తతా౽భి
రామాన్వితం వ్యాధి ముదాహరంతి॥ ॥౫౯॥

ఆలస్యము, నిద్ర ము, హృదయము విశుద్ధము గాకుండుట, త్రికాలమున విరేచనములు, మనోవ్యాకులత, మూత్రరోగములు, కడుపుబరువు, అరుచి, నిద్ర యనినవి (ఆమ) దోషలక్షణములు ౫౯॥

శూలరోగసంప్రాప్తి

శ్లో॥ ఆరోహణా౽యాసపరిశ్రమాద్య
ర్గుర్వన్నరూక్షోదకపానసంగైః
శీతోష్ణగాహో౽గ్రహహాస్యనృత్తై
స్త్రిదోషసంభ్యాజ సృష్టభేదాః॥ ॥౬౦॥

గుర్రములు మొదలైనవాటిపై సవారిచేయుట తిక్కడకుంచిన ఆయాసపడుట పరిశ్రమచేయుట మొదలైనవి కఠినపదార్థములు తినుట మురికినీరు త్రాగుట, సంభోగము తప్పుతినుట, మిక్కిలి వేడిగానున్న నీరు త్రాగుట, రోదనము, నవ్వుట, నృత్యము చేయుట. వీటివలన శూలరోగము జనించును. యీశూలరోగము వాత, పిత్త, శ్లేష్మ, శ్లేష్మపిత్త, శ్లేష్మవాత, శీతపైత్య, సన్నిపాత, ఆమ, భేదములచే ఎనిమిదివిధంబులై యుండును. ౬౦॥

—♦ శూలరోగ సామాన్యలక్షణం ♦—

శ్లో॥ శంఖుస్ఫోటనవ త్తస్య యస్యా త్తీవ్రా౽తివేదనా।
శూలాసక్తస్య భవతి తస్మా చ్ఛూలేతి కథ్యతే॥ ॥౬౧॥

ఇనపమేకుదిగగొట్టినట్లు తీవ్రమైనబాధకలిగియుండుటవలన, ఇది శూలవ్యాధి అని చెప్పబడుచున్నది. ౬౧॥

(1) మూత్రకృచ్ఛ్ర, (2) మూత్రాఘాత,
(3) మూత్రాఽశ్మరీరోగసంప్రాప్తి }

శ్లో॥ పృథఙ్మలా స్స్వైః కుపితా నిదానై
స్సర్వేఽథవా కోప ముపేత్య వస్తౌ।
మూత్రస్య మార్గం పరిపీడయంతి
యదా తదా మూత్రయతీహ కృచ్ఛ్రాత్॥ ॥౬౨॥

వాత, పిత్త, శ్లేష్మములు, ప్రత్యేక ప్రత్యేకముగా గాని, అన్నియు కలిసియు గాని, ప్రకోపమును పొంది వస్తియందు (పొత్తికడుపు యందు) చేరి మూత్రమునడ్డగించును. ఇట్టిసమయమున మిక్కిలి కష్టముచే మూత్రము బయలువెడలును. ॥౬౨॥

శ్లో॥ ద్రుతాఽధ్వలంఘనాయాసై రభిఘాతా త్ప్రపీడనాత్॥
స్వస్థానా ద్వస్తి రుద్వృత్త స్థూల స్తిష్ఠతి గర్భవత్ ॥౬౩॥

తొందరగా త్రవ్వడచినను, కాలవలు మొదలైనవాటిని దాటినను, శక్తికిమించి ఆయాసపడినను, వస్తిప్రదేశమునందభిఘాతము (దెబ్బ) కలిగినను, వస్తిప్రదేశమును (పొత్తికడుపును) పిసికినను, మూత్రపిండము స్వస్థానమునుండి కదలి గర్భమువలె స్థూలముగా పెరుగును.

మూత్రకృచ్ఛ్రమునకును, మూత్రాఘాతమునకు, స్వల్పమైన తారతమ్యము కలిగియుండును. మూత్రకృచ్ఛ్రమున మూత్రబంధము స్వల్పము, బాధలు అధికముగాను, కలిగియుండును. మూత్రాఘాతమున బాధలు స్వల్పము, మూత్రబంధము అధికముగాను కలిగియుండును. వలమూత్రాదులయొక్క వేగమును అడ్డగచుటచే వాత, పిత్త, కఫములు, ప్రకోపమును జెంది మూత్రాఘాతము కలుగుచున్నది మూత్రాశ్మరియందు శ్లేష్మము ముఖ్యముగా కారణమైయుండును త్రిదోషములలో వాతము ప్రకోపించి వస్తియందుండు మూత్రపిండమునందు చేరి వస్తిద్వారమునడ్డగించి శుక్రముతో కూడినమూత్రమును గాని, గరళస్వరూపమైన పిత్తముతో కూడిన మూత్రమును గాని, కఫముతో కూడిన మూత్రమును గాని, కేవల మూత్రమును గాని, శోషింప జేయును. అట్లు శోషింపబడినమూత్రమునందు గోవు యొక్క పిత్తమున గోరోచనము వలె కఠినమైన రాతివంటి గడ్డబయలుదేరును. ఇదే మూత్రాశ్మరి అనబడును

(1) వాతజము, (2) పిత్తజము, (3) శ్లేష్మజము, (4) సన్నిపాతజము, (5) శల్యజము, (6) పురీషజము, (7) అశ్మరీజము, (8) శుక్రజము, అని మూత్రకృచ్ఛ్రము యెనిమిదివిధములు.

(1) మూత్రగ్రంధి, (2) మూత్రోత్సంగము, (3) మూత్రజము (4)మూత్ర

నాదము (5) మూత్రశుక్రము (6) మూత్రధర (7) మూత్రాతీతము (8) మూత్రక్షయము (9) అష్ఠీల (10) విడ్విఘాతము (11) ఉష్ణవాతము (12) వస్తికుండలి (13) వాతబస్తి (14) వాతకుండలి అని మూత్రాఘాతము పదునాలుగువిధములు (1) వాతజము (2) పిత్తజము (3) శ్లేష్మజము (4) శ్లేష్మపైత్యజము (5) శ్లేష్మవాతజము (6) శిత పైత్యజము (7) శర్కరాశ్మరి (8) బాలాశరి (9) శుక్రాశ్మరి అదిమూత్రాశ్మరి తొమ్మిదివిధములు కయినప్పటికిన్ని యీమూడువిధములైన మూత్రవ్యాధులు మూత్రమునకే సంబంధించిన వగుటచేతను పోల్చ శక్యము కానిదగుటచేతను విశేషించి ప్రత్యేక లక్షణములతో వివరించి వ్రాయలేదు ||౬౩||

శోఫరోగసంప్రాప్తి

శ్లో|| శుద్ధ్యామయాఽభోజనకర్శనాద్యైః
క్షారాఽమ్లతీక్ష్ణోష్ణగురూపసేవాత్ |
దధ్యాఽమమృచ్ఛాకవిరోధిదుష్ట
గరోపసృష్టాన్ననిషేవణేన|| ||౬౪||

శమనవిరేచనాదులచే శరీరమును ఎక్కువగాశోధించినను, రోగముచేతను ఉపవాసాదుల నధికముగాచేయుటచేతను, శరీరబలము క్షీణించిపోవుటచేతను ఉప్పులును, తీక్ష్ణములైనవి (అలస్యముగా అరుగునవి) వేడిచేయునవి, అగుపదార్థములను మితిమీరి భుజించుటచేతను, పెరుగు, పచ్చిడి, (పక్వములుకానివి) మట్టి, ఆకుకూరలు పరస్పరవిరుద్ధములగు, (క్షీరదధ్యాదులు) పదార్థములు, దుష్టజంతువులయొక్కయు విషములయొక్కయు, స్పర్శకలిగినపదార్థములు వీటని సేవించుటచే శోఫ, (వాపు) రోగము జనించును. ||౬౪||

శోఫరోగసామాన్యలక్షణం

శ్లో|| సగౌరవం స్యాదనవస్థితత్వం
సోత్సేధమూష్మాఽథసిరా తనుత్వం|
స లోమహర్షశ్చ వివర్ణతాపి
సామాన్యలింగం శ్వయథోః ప్రణీతం|| ||౬౫||

వాపు నిలకడగా ఒకచోటనేఉండక వాచుచుండుట, వేడికల్గుట, నరలు సన్నగిలియుండుట వెంట్రుకలు గగిపొడుచుకొనియుండుట, వాపుకలచోటున దేహకాంతి మారియుండుట, ఇవి శోఫరోగమునకు సామాన్యలక్షణములు. ||౬౫||

## —♦ శోఫరోగభేదములు. ♦—

శ్లో॥ త్రిదోషైశ్చ ద్వయై స్సర్వై రభిఘాతా ద్విషా త్తథా।
శోథం న వాత్మకం విద్యా త్ప్రియ స్త్వజ్మాం స సంశ్రితం॥

వాత, పిత్త, కఫరూపమైన ఒక్కొక్కదోషముచేతను, రెండేసిదోషముల సంసర్గముచేతను, అన్నిదోషముల సమిష్టిచేతను, అభిఘాతముచేతను, విషముచేతను శోఫరోగము జనించును యీశోఫరోగము పైని వివరించినప్రకారము తొమ్మిదివిధములు. మరియు, సామాన్యముగా, శోఫము త్వక్కును, మాంసమును, స్థానములు

వాతజశోఫయందు — వాపు ఒక్కొక్కచోటనే నిలకడగానుండక వాపుగల ప్రదేశమందు చర్మము రంగుమారి పలచనై స్పర్శతెలియక రోమములనిగడ్చి నొప్పితో కూడియుండును ఒక్కొక్కప్పుడు దానంతట అదియే తగ్గుచుండును. వేలితో నొక్కినయెడల గుంటపడి మరల శీఘ్రముగా పూడిపోవును.

పిత్తజశోఫయందు — వాపుగలప్రదేశము మెత్తదనముకలిగి రంగుమారి చమటకలిగియుండును. మరియు జ్వరము, దాహము, స్తిమితములేకుండుట మలబంధము వాపుగలప్రదేశమున నొప్పి, మంట, ఒక్కొక్కప్పుడు కూడా కలిగియుండును.

శ్లేష్మజశోఫయందు — వాపుగలప్రదేశమున బరువు, కాఠిన్యము, తెలుపురంగు కలిగియుండును మరియు, దురదయుండును ఇష్టములేకుండుట, (అరుచి) నోట నీళ్ళుకారుట, నిద్రలేమి, వాంతి, అగ్నిమాంద్యము, ఇట్టిలక్షణములు కలిగియుండును

ద్వంద్వజసన్నిపాతశోఫలయందు — పూర్వోక్తలక్షణములు మిశ్రమములై యుండును

అభిఘాతజశోఫయందు — కర్రదెబ్బలు, శస్త్రఘాతము తడిగాలి, సముద్రపుగాలి, జీడిగింజలరసము లేక పొగ, దూలకుండమూలు, ఇవి ఆగంతుకకారణములు గాన వీటివలనకలుగు శోఫ ఆగంతుకశోఫ, వాపుగలప్రదేశమునందు ఎరుపు, వేడికలిగియుండుట, పిత్తజశోఫలక్షణములను కలిగియుండుట, వాపు ఒకచోటనే ఉండకపోవుట, యిట్టిలక్షణములు కలిగియుండును. అభిఘాతశోఫ అన్నను, ఆగంతుకశోఫ అన్నను, ఒకటే అని తెలియవలెను.

విషజశోఫయందు — వాపుగలప్రదేశమందు మెత్తగాను, చంచలముగాను, జీరలాడుచునుండి మంటయు, నొప్పియు, కలిగియుండును విషజశోఫ అనగా విషముగలజంతువులు దేహమునప్రాకుట, విషజంతువులతాలూకు మలమూత్రములు దేహమునకుతగులుట, విషజంతువులయొక్క పళ్ళు, దంతములు, గోళ్ళు, వీటిచే అభిఘాతముకలుగుట, విషజంతువుల మలమూత్ర శుక్రములతో కలసిన వస్త్రములను ధరించుట, విషవృక్షసమీపమున సంచరించుట, విషపూరితమైన గాలినిపీల్చుట, విషయుక్తమైన ద్రవ్యమును శరీరమున పూసుకొనుట మొదలైనవాటివలన కలుగునది అని తెలియవలయును. ॥౨౬॥

శ్లో॥ యస్తు పాదాభినిర్వృత్త శ్శోథ స్సర్వాంగగో భవేత్।
పురుషం హంతి నారీంచ ముఖజో గుహ్యజో ద్వయం॥ ॥౬౭॥

క్రిందినుంచి మీదుగావ్యాపించువాఁడు పురుషులను, పైనుండి క్రిందుగా వ్యాపించువాఁడు స్త్రీలను, గుహ్యస్థలమున వ్యాపించినవాఁడు స్త్రీపురుషులను చంపును.

శ్లో॥ శ్వాసః పిపాసా దౌర్బల్యం జ్వర శ్ఛర్ది రరోచకః।
హిక్కాతిసారకాసాశ్చ శోథినం క్షపయం త్యమీ॥ ॥౬౮॥

శ్వాస, దాహము, నీరసము, జ్వరము వాంతి, అరోచకము, ఎక్కిళ్ళు, అతిసారము, దగ్గు, యీలక్షణములుగల శోథరోగము రోగులను హింసించును. ॥౬౮॥

— హిక్కారోగసంప్రాప్తి —

శ్లో॥ శాలూక పిష్టాన్న విదాహి తైల
పిణ్యాకదధ్యాది నిషేవణేన।
స్రోతస్సు సంజ్ఞావహనేషు వాయుః
ప్రకుప్య హిక్కాం జనయే త్ప్రకామం॥ ॥౬౯॥

కందమూలములు, పిండివంటలు, విదాహమును కలుగ జేయుపదార్థములు, నువ్వులనూనె, తెలకపిండి, పెరుగు మొదలైన పదార్థములను సేవించుటచే వాతము ప్రకోపించి ప్రాణవహస్రోతస్సులయందు వ్యాపించి హిక్కను పుట్టించును. ॥౬౯॥

— హిక్కాభేదములు —

శ్లో॥ క్షుద్రాన్నగంభీరమహాయుగాఖ్యై
ర్హిక్కామయః పంచవిధః ప్రణీతః॥ ॥౭౦॥

క్షుద్రహిక్క, అన్నజహిక్క, గంభీరహిక్క, మహాహిక్క, యమళహిక్క అని హిక్కారోగము అయిదువిధములు,

క్షుద్రజహిక్క:— గొంతుకయందుపుట్టి చాలా కాలము వేగమునుకలిగించి అయాసపడినప్పుడు అధికమైన ఆహారమును సేవించినపిమ్మట ఉపశమించును.

అన్నజహిక్క:— అమితభోజనమువల్ల జనించును ఉదకపానముచే ఉపశమించును.

గంభీరహిక్క.— బొడ్డుదగ్గరనుండి ఎక్కిళవేగముతో తీవ్రమైన ధ్వని కలిగి బయలుదేరును. ఇది ఒకానొకప్పుడు పక్వాశయమునుండికూడా బయలు

దేరును. దీనియందు దగ్గు, పక్షవాతము, దౌర్బల్యము, ఉచ్ఛ్వాసావరోధము కలిగియుండును.

మహాహిక్క:— తీవ్రమైన వేగముకలిగి ప్రబలమైనశబ్దముతో బయలువెడలును మరియు, కనుబొమ్మలు సడలుట, కణతలు స్తంభించుట, కన్నులవెంబడి నీరు కారుట, కలిగియుండును. ఇది ఒక్కొక్కటిగాగాని రెండేసిగాని, మూడేసిగాని, అనేక రకములుగాని, రావచ్చును యమళహిక్కకంటె యిది మిక్కిలి భయంకరమైనది.

యమళహిక్క:— (వ్యపేతహిక్క) రెండేసిచొప్పున బయలుదేరి చాలా కాలమువరకు ఉండును. ఆహారము జీర్ణమగుసమయమున పుట్టిన యమళహిక్కను వ్యపేతహిక్కయందురు. ॥౩౦॥

## —♦ అజీర్ణరోగసంప్రాప్తి ♦—

శ్లో॥ ఈర్ష్యాభయక్రోధపరిక్షతేన
లుబ్ధేన రుగ్దైన్యనిపీడితేన।
విద్వేషయుక్తేన చ సేవ్యమాన
మన్నం న సమ్యక్పరిపాక మేతి॥ ॥౨౧॥

ఇతరుల ఔన్నత్యమును సహింపలేకపోవుట, భయపడుట, పొందలేక్యము కానిదానిపయిని కోరికకలుగుట, కోపము, రోగము, దరిద్రము, లేకదీనత్వము, ద్వేషము, వీటితో భుజించినఆహారము జీర్ణముకాదు. అగ్నిమాంద్య, అలసక, విలంబిక విషూచి, ఛర్ది, అరోచకములు, అజీర్ణభేదములు ॥౩౧॥

శ్లో॥ అనాత్మవంతః పశువద్భుంజతే యేఽప్రమాణతః।
రోగానీకస్య తే మూలం అజీర్ణం ప్రాప్నువంతి తే॥ ॥౨౨॥

ఏమానవులు తమతమశరీరస్థితినిన్ని, అగ్నిబలమునున్ను, తెలుసుకొనక పశువులవలె మితిమీరి భుజించెదరో అట్టివారు రోగసమూహమునకు కారణమైన అజీర్ణరోగమును గురియగుచున్నారు. ॥౪౨॥

## —♦ జఠరాగ్నిభేదములు ♦—

శ్లో॥ మాంద్య స్తీక్ష్ణోఽథ విషమ స్సమశ్చేతి చతుర్విధః।
కఫపిత్తాఽనిలాధిక్యా త్తత్సామ్యా జ్జాఠరోఽనలః॥ ॥౨౩॥

జఠరాగ్ని, [illegible]బడినఆహారమును జీర్ణముచేయును. ఈజఠరాగ్ని మందము, తీక్ష్ణము, విషమము, సమము, అని నాలుగువిధములు. ఎట్లన శరీరమందుండు వాత,

పిత్త, కఫములలో శ్లేష్మము స్వప్రమాణముకంటె అధికముగానున్నయెడల కాయాగ్ని (దేహమందుండుజఠరాగ్ని) మందగించును. గాన ఇది మందాగ్నియగును పిత్తము అధికముగానున్నయెడల (పిత్తము ఆగ్నేయమగుటచే) కాయాగ్ని మరింత వృద్ధియగును గాన ఇది తీక్ష్ణాగ్నియగును. వాతము అధికముగ నున్నయెడల ఆవాతముచే జఠరాగ్ని (కాయాగ్ని) విషమగతిని పొందును. గాన ఇది విషమాగ్నియగును. వాత పిత్త, కఫములు మూడున్ను వృద్ధిక్షయములులేక స్వపరిమాణమునననుసరించి ఉన్నయెడల జఠరగ్ని సమానస్థితియందుండును. గాన ఇది సమాగ్నియగును. ॥23॥

## అజీర్ణభేదములు.

శ్లో॥ ఆమం విదగ్ధ విష్టబ్ధం కఫాగ్న్యనిలసంభవం।
అజీర్ణం కేచి దిచ్ఛంతి చతుర్థం రసశేషతః॥ ॥24॥

కఫప్రకోపముచే జఠరాగ్నిని మందగింపచేసి ఆహారమును జీర్ణము కానీయక, యుండునది ఆమాజీర్ణమనియు, పిత్త ప్రకోపముచే, జఠరగ్నిని ప్రజ్వలింపజేసి ఆహారమును జీర్ణము కానీయక యుండునది విదగ్ధాజీర్ణమనియు, వాతప్రకోపముచే జఠరాగ్నిని విషమముగ చేసి మలబంధమును కలుగజేయునది విష్టబ్ధాజీర్ణమనియు, భుజింపబడిన అన్నముయొక్క సారముఅయిన రసమును జీర్ణము కానీయకుండునది రసశేషాజీర్ణమనియు తెలియవలెను.

ఆమాజీర్ణమున — భుజింపబడిన అన్నాదికము రసధాతువుగామారక తియ్యటితేనుపులు, శరీరము బరువు నోటివెంటనీరు, చెక్కిళ్లువాపున్ను;

విదగ్ధాజీర్ణమున — చమట, మూర్ఛ, దప్పి, పైత్యాధిక్యము ఒడలుతిరుగుటయును,

విష్టబ్ధాజీర్ణమున — వాతసంబంధమైన వికారములు మలమూత్రనిరోధము శరీరమునస్తంభించుట, మూర్ఛ, కడుపులోగుడగుడలాడుట, కడుపులోనొప్పియును

రసశేషాజీర్ణమున — అన్నద్వేషము, ఒడలుబరువు, గుండెలలోబరువును కలిగియుండును, అగ్నిమాంద్య, ఛర్ది, అరోచకములు స్పష్టములు, కడుపుబ్బరముకలిగి దాహమునడంగక సహింపరానిబాధకలిగి తీవ్రమైన తేనుపులుగలది 'అలసక' అనియు, భుజింపబడిన ఆహారము జీర్ణముగాక వమనరూపమునగాని, విరేచనరూపమున గాని బలువెడలక ఆశయమందే నిలిచియుండునది 'విలంబిక' అనియు, నూదుల పోగుచ్చినవిధమున దేహమంతయు బాధకలిగియున్న అజీర్ణము 'విషూచి' అనియు తెలియవలయును. ॥24॥

## గుల్మరోగసంప్రాప్తి

శ్లో॥ దుష్టవాతాదయోత్యర్థం మిథ్యాహారవిహారతః।
కుర్వంతి పంచధా గుల్మం కోష్ఠాంతర్గ్రంథిరూపిణమ్॥ ॥25॥

ప్రకృతికి సరిపడని ఆహారవిహారాదులచే వాతపిత్తశ్లేష్మములు ప్రకోపించి కోష్ఠముయొక్క లోపలిభాగమున గడ్డవలెనుండు గుల్మమును కలిగించును, ఇవి త్రిదోషజములు, సన్నిపాతజము, రక్తజముఅను భేదములచేతయిదువిధములైయుండును

## గుల్మరోగలక్షణములు.

శ్లో॥ అరుచిఃకృఛ్రవిణ్మూత్రవాతతాంత్రవికూజనం।
అనాహశ్చోర్ధ్వవాతత్వం సర్వగుల్మేషు లక్షయేత్॥ ॥౭౬॥

అరోచకము, మల, మూత్ర, అపానవాతము,అతికష్టముగా వెడలుట, పేగులరచుట. కడుపుబ్బరము, త్రేనుపులు గా వెడలుట, ఇవిసామాన్యముగా సర్వవిధగుల్మములకు ముఖ్యలక్షణములు, అయి, ఉన్నవి యీగుల్మరోగము వెనుక చెప్పబడిన వాత పిత్త, కఫములచే వేరువేరుగాను సన్నిపాతముచేతను, రండేసికోపములచేతను సర్వ సామాన్యముగా అందరికిని కలుగును స్త్రీలకుమాత్రము ఋతురక్తము ప్రతినెల లోను యథాక్రమముగా వెలువెడలక గర్భమందేనిలిచియుండి గ్రంధిరూపమును ధరించును, ఇదియేరక్తగుల్మము, ఇది పురుషులకు కలుగుటకవకాశములేదు, యీరక్త గుల్మమున ఋతురక్తముప్రతిమాసముందును వెలువెడలక గర్భమందు నిలచియున్నను పదిమాసములకు పిమ్మటగాని చికిత్సకట్టను, గనపదిమాసములకుపైన అగా పదకొండ వమాసము మొదలుకొని,గర్భలక్షణములతోకూడిన గుల్మమును గర్భము కాదని రూఢిగా తెలుసుకొని చికిత్సచేయవలయును గర్భిణీకాలమున సంభవించు కుచా గ్రనైల్యము పాలుపడుట మొదలయినవి రక్తగుల్మరోగమునందుకూడా ఉండును అయితేగర్భము, కాళ్లుచేతులు, మొదలుగాగల భేదములచలనముతో అప్పుడప్పుడు బాధలేకకదలును, రక్తగుల్మముఎండా రక్తము అవయవభేదములేక కొంతదిబాధకలిగి కదలును, గర్భిణీకాలమున గర్భముదినదినాభివృద్ధినొందును, రక్తగుల్మరోగమున గుల్మముమాత్రమే వృద్ధినొందును, ఇట్టిపరస్పరభేదములను విచారించి గర్భమైనది, రక్తగుల్మమైనది తెలుసుకొనవలెను, ఒకానొకప్పుడు కాలనియమములేకయే గర్భ ధారణ చేయబడుచున్నది అట్టితరి రక్తగుల్మమును భ్రాంతినొందక పూర్వోక్తలక్షణ ములన్నిటిని చక్కగా తెలిసికొనిరక్తగుల్మమునకుచికిత్స చేయవలసియుండును॥ ॥౭౬॥

## ఉదరరోగసంప్రాప్తి.

శ్లో॥ అతిసంచితదోషాణాం పాపంకర్మచికీర్షతాం।
ఉదరాణ్యుపజాయంతే మందాగ్నీనాం విశేషతః॥ ॥౭౭॥

మిక్కిలివృద్ధిపొందిన మూత్రపురీషాది దోషములున్ను వాతాదిదోషములున్ను కాయాగ్నిమందగింపచేసి దోషములను వృద్ధినొందించుటచే ఉదరవ్యాధి జనించును॥

## ఉదరరోగలక్షణములు

శ్లో॥ ఆధ్మానదౌర్బల్యవిదాహతంద్రా
శోథాగ్నిమాంద్యకృశవేగరోధాః।
గతా వశక్తి ర్జఠరామయేషు
భవంతి దోషేషు బలాధికేషు। ॥౨౮॥

పయిన చెప్పినప్రకారముదోషములువృద్ధిపొంది నప్పుడు, కడుపుబ్బరము, బలహీనము, దాహము, (తాపము) మైకము, వాపు, అగ్నిమాంద్యము, శరీరము కృశించుట, మలమూత్రనిరోధము, నడువశక్తిలేకుండుట, అన్నివిధములైన ఉదరవ్యాధులయందు ఉండును. ॥౩౮॥

## ఉదరరోగభేదములు

శ్లో॥ త్రిదోషైః స్సన్నిపాతేన ప్లీహాబద్ధక్షతోదకైః।
అష్టధే త్యుదరవ్యాధి ర్విజ్ఞేయస్సర్వవైద్యకైః ॥౨౯॥

వాత, పిత్త, కఫ భేదములచే ప్రత్యేక ప్రత్యేకముగాను, సన్నిపాతము చేతను ప్లీహావృద్ధిచేతను, ప్లీహ వృద్ధినొందుటచేతను, బద్ధగుదోదరము క్షతోదరము జలోదరము, అను భేదములచేతను యెనిమిదివిధములు. అనితెలియ వలయును.

వాతోదరమున — కడుపు తోలుత్రిత్తిరిబిగిసి నల్లనినరములతో నిండియుండుట, ఖాతులుగుచ్చివట్లు, కడుపులోను, ఇరుప్రక్కలయందును, బాధ, మీగాళ్ళు మోచేతులు, నాభి, వీటియందు వాపు, కీళ్లునొప్పి, మలబంధమును,

పిత్తోదరమున — కడుపు పచ్చని, లేక ఎర్రనిరంగుగల నరములతో నిండియుండుట, జ్వరము, తాపము, మూర్ఛ, దాహము, భ్రమ, అతిసారము. నోరు చేదుగానుండుటయును,

శ్లేష్మోదరమున — కడుపునీటితోడవలె మెండుబారి తెల్లటినరములతో నిండియుండుట, దేహకార్శ్యము స్పర్శజ్ఞానము లేకుండుట, వాపు, గురుత్వము, నిద్ర, వాంతిరాబోవునట్లుండుట, అరుచి, ఆయాసము, దగ్గు, శరీరము తెల్లబారుటయును,

సన్నిపాతోదరమున.— (దూష్యోదరమున) వాతాదులకు వేరువేరుగా చెప్పినలక్షణములుకలిగియుండుట, శీతకాల, వర్షాకాలములయందును, దుర్దినములయందును, (సూర్యదర్శనము కాక, మేఘములతో ఆకాశము నిండియున్నదినములందును, పరితోపించుట, తాపము, మూర్ఛ, దేహకార్శ్యము, నోటతడిలేకుండుట, ఇట్టి లక్షణములుకలిగియుండును విషమమిళితములైన అన్నపానాదుల సేవించుటచే రక్తము చెడి దానివలన పుట్టుటచే దూష్యోదరమని చెప్పబడుచున్నది.

ప్లీహోదరమునః— తాపమును, ద్రవమును పుట్టించు పదార్థములను అమితముగా సేవించుటచే రక్తశ్లేష్మములు పాడై ప్లీహముగాని, యకృత్తుగాని, వృద్ధినొందుటచే జనించును. యిది త్రిదోషలక్షణములు కలిగియుండును.

బద్ధగుదోదరము:— ఇంద్రుకలు మొదలయినవికల అన్నాదికము, జిగురుగల పదార్థములు వీటిని భుజించుటచే పేగులయందలి రంధ్రములు మూసుకొనిపోయి మలములు సంచితములై హృదయమునకును, బొడ్డునకును, మధ్యభాగమున జనించును

క్షతోదరము:— పేగులయందు రంధ్రములు కలుగుటచే ఆట్టిరంధ్రముల నుండి నీరు స్రవించి గుదస్థానమునుంచి బయలువెడలును యిట్టితెరి పొత్తికడుపున ఉదరము జనించును. యిదియు త్రిదోషలక్షణములతో కలిగియుండును.

జలోదరము — పొటకరించిన (బుడగవలె ఆకారమును ధరించిన) గొడ్డుకదలినప్పుడు కడుపులో బొళుకు బొళుకుమనుశబ్దము, క్లోమస్థానమున (యకృత్ స్థానమున) జలాధిక్యముగలిగియుండుట, దాహము, కడుపుమీద అనేకరకములైన నరములు వ్యాపించియుండుట, యిట్టిలక్షణములుకలిగి త్రిదోషలక్షణముల ధరించియుండునని తెలియవలయును. ॥౭౯॥

— సాధ్యాఽసాధ్యోదరనిర్ణయము —

శ్లో॥ సర్వేఽప్యసాధ్యా ఉదరామయాః స్యుః
ప్రాయ స్స్వభావేన తథాఽపి జాతు।
బలాన్వితస్యాభినవోత్థితం య
త్ప్రయత్నసాధ్యం విజలం యది స్యాత్॥ ॥౮౦॥

యిదివరలో చెప్పబడిన సర్వవిధములయిన ఉదరవ్యాధులున్ను, స్వభావముగానే చికిత్సకు శక్యముకానివైయుండును. ఆయినప్పటికిన్ని బలాఢ్యునకు నవీనముగా బయలుదేరి జలములేనియుదరము కానోప్పుడు తగినచికిత్సచే సాధ్యము కావచ్చును. ॥౮౦॥

— కాసరోగసంప్రాప్తి —

శ్లో॥ రసస్య ధూమస్య నిరోధనేన
దుష్టాన్నభుక్త్యాఽతిపరిశ్రమేణ।
విమార్గయానా దసితస్య వేగ
క్షుతావరోధేన చ కాసరోగః॥ ॥౮౧॥

శరీరమునగల అమరసము, శరీరాంతర్గతమైన వాతముచే పొగను నోటితో

గాని, ముక్కుతోగాని, ఊర్ధ్వముఖము గాంచిపబడుట, అరికట్టుట, విరుద్ధాన్నభక్షణము, శక్తికిమించి ఆయాసపడుట, భుజించునప్పుడాహారము యితరమార్గమున పోవుట, మలము, మూత్రము, తుమ్ము వీటినాపుకొనుట, వీటివలన కాసరోగము జనించును.

## — ♦ కాసరోగభేదములు ♦ —

శ్లో॥ పంచకాసా స్స్మృతా వాతపిత్తశ్లేష్మక్షతక్షయైః।
క్షయాయోపేక్షితా స్సర్వే బలినశ్చోత్తరోత్తరం॥ ॥౮౩॥

వాతము, పిత్తము, శ్లేష్మము, క్షతము, క్షయ, వీటిచే కాసరోగము, (దగ్గురోగము) జనించును. యివి ఒకదానికంటె ఒకటి ఉత్తరోత్తరముగా ప్రబలములు. వీటిని యుక్తకాలమందు చికిత్సచేయక ఊరకున్నచో క్షయరోగమును (శాశ్వతముగా) కలుగజేయును.

వాతకాసయందు — కంఠస్వరము హీనముగానుండుట, కణతలు, హృదయము, కడుపు, తల, పక్కలు, వీటియందునొప్పి, కృశత్వము, పొడిదగ్గును,

పిత్తకాసయందు — నోట తడిలేకుండుట, దాహము, నోరుచేదు, రొమ్ములో మంట, జ్వరము, పసరు, పాండువర్ణము, దగ్గినప్పుడు పసరుతోకూడిన కఫమును

శ్లేష్మకాసయందు — నాలుకజిగురు, అరుచి, మాంద్యము, తలనొప్పి, దేహమంతటనుజిల. దగ్గినపుడు కఫమును.

క్షతకాసయందు — (అభిఘాతాదులచే హృదయమున పుండుకలిగిన కాసయును) ఉమ్మివేసినప్పుడు రక్తముతోకూడిన తెమడవెడలుట, రొమ్మునొప్పి, సూదులు గుచ్చినట్లుండుట, కీళ్ళనొప్పులు, జ్వరము, శ్వాస, దాహము, స్వరభేదము, గొంతుకలో పిల్లికూతలును,

క్షయకాసయందు — మూర్ఛ, జ్వరము, దేహమంతయునొప్పి, మంట, కృశత్వము, ఉమ్మివేసినప్పుడు రక్తముతోకలసిన చీమును,కలిగియుండును. వాత, పిత్త శ్లేష్మజములయిన మొదటి మూడువిధములగు కాసలు నవీనజములయినచో ఒకానొకప్పుడు చికిత్సకుసాధ్యములగును, మిగిలినరెండును రోగిజీవించియున్నంతవరకు తత్సానుకూలములైన ఔషధాహార, విహారములచేగడుపుకొనవలసినవియునుఅయివున్నవి

## — ♦ మహారోగసంప్రాప్తి ♦ —

శ్లో॥ శశ్వచ్ఛ్వఖం స్వప్నసుఖం దధీని
గ్రామ్యోదకానూపరసాః పయాంసి।

యెడల మరుచటి ఉదయమునకు చిక్కపడునట్టి మూత్రమును,

క్షౌద్రమేహమున:— కషాయ, మధుర, గంధములుగల మూత్రమును,

హస్తిమేహమున:— గజమదముతో సమానవర్ణము కలిగి, వేగరహితమైన మూత్రమును

వసామేహమున:— మాంసము కడిగిన నీటివంటి మూత్రమును,

హారిద్రామేహమున:— పచ్చనిరంగు కలిగి మంటతో కూడిన మూత్రమును,

మజ్జామేహమున:— కొవ్వు కలసిన మూత్రమును,

సురామేహమున:— కల్లువంటి మూత్రమును, మరియు, పిడచిన మూత్రము పైన తేరి తేటగలెను, అడుగుభాగమున మడ్డిగాను, ఉదకమేహమున, స్వచ్ఛమై, గంధశూన్యమైన మూత్రమును,

శనైర్మేహమున:— బొట్లుబొట్లుగాగాని, స్వల్పముగా గాని మెల్లగా గాని వెడలునట్టి మూత్రమును,

రక్తమేహమున:— రక్తవర్ణము కలిగియుండి, దుర్గంధయుక్తముగాను, వేడిగాను వెడలునట్టి మూత్రమును,

శీతమేహమున:— మధు గంధయుక్తమై చల్లదనము కలిగి మిక్కిలి అధికము గా వెడలునట్టి మూత్రమును,

లాలామేహమున:— చొల్లువలె జిగురు కలిగి తీగెలుసాగు మూత్రమును,

కాలమేహమున:— బొగ్గునీళ్ళవంటి మూత్రమును,

నీలమేహమున:— ఆకాశరంగుగల మూత్రమును కలిగియుండును. పైని ఉదహరింపబడిన మేహరోగములు. యుక్తకాలమున చికిత్సింపబడనిచో క్రమ క్రమముగా మూత్రమునందు తీపిచేరి కొంతకాలమునకు మధుమేహముగా మారును. దీనికే అతిమూత్రమనియు, బహుమూత్రమనియు, చెప్పుదురు. శరీరమునగల తీపిచే మూత్రమున తీపిచేరిన ప్రతిమేహమును, మధుమేహము అని చెప్పబడుచున్నది. ॥౭౪॥

## —♦ బహుమూత్రలక్షణములు ♦—

శ్లో॥ దుర్గంధస్వేదకార్శ్యశ్రమతిశయగసనాపాదనేత్రోపతాపా
శ్చైతేచ్ఛాపాండువర్ణక్షతధుశిథిలతాకంఠతాల్వోష్ఠశోషః।
వక్త్రేసహ్యాతిదాహస్ఫుటతరపిటకాగాత్రతాపీతమూత్రం
మూత్రస్థామాక్షికాద్యాః ఖలు నను బహుమూత్రేమయే
సంభవంతి॥ ॥౭౫॥

బహుమూత్రరోగమున శరీరమునందు దుర్గంధమును, చెమట, కృశత్వము, చెవులు, అరిచేతులు, కాలుక, ఒరికాళ్ళు, నేత్రములు వీటియందు తాపము, చల్లటి

పదార్థములయందభిలాష, శరీరము శోషించుట, దగ్గు, శరీరము పట్టులేకుండుట, కంఠము, కళ్ళు, పెదవులు, ఇవి ఎండుట, నోరుఅసహ్యముగానుండుట, విదాహము, శరీరమునందు పిటకలుజనించుట, మూత్రము పచ్చగానుండుట, మూత్రమునందు యీగలు, చీమలు, ముసురుట, ఇట్టిలక్షణములుకలిగియుండును.

## అతిసారరోగసంప్రాప్తి

దేహప్రవృద్ధద్రవరూపధాతు
ర్విధాయ మాంద్యం మలసంప్రయుక్తం।
అపానవిద్ధం సరతిప్రకామం
జ్ఞేయం హ్యతీసార మిదం సుఘోరం॥ ॥౧౬॥

దేహమునందు మితిమీరి వృద్ధినొందిన ద్రవధాతువులు (రసము, జలము, మూత్రము, చమట, మేదస్సు, కఫము, పిత్తము, రక్తము, మొదలైనధాతువులు) జఠరాగ్నిని చల్లార్చి మలముతోకూడినవై అపానవాయువుచే ప్రేరేపింపబడి మాటిమాటికి బయలువెడలుచుండును యీఅతిసారవ్యాధిని మిక్కిలి ఘోరమైనదానినిగా తెలియనగును. ॥౧౬॥

## అతిసారరోగలక్షణం

శ్లో॥ సామం శకృ న్నిరామం వా కేన వా ప్యతిసార్యతే।
సోతిసారో౽తిసరణా దాశుకారీ స్వభావతః॥ ॥౧౭॥

ఏవ్యాధిచేతనైనను పక్వముగానట్టిగాని, పక్వమైనట్టిగాని, మలము అధోమార్గమున వెడలింపబడునో అదియే అతిసారరోగము. ఇది అధికముగా వెడలుటవలన అతిసారముఅని చెప్పబడుచున్నది. యీఅతిసారరోగమందు స్మరణకు వచ్చినంతమాత్రముననే మలము వెలువడుచుండును. ॥౧౭॥

## అతిసారరోగభేదములు

శ్లో॥ పృథక్కళ త్రిదోషై శ్చ శోకేనా మేన షడ్విధః।
అతిసారం విజానీయా ద్ద్వంద్వభేదేన కేచన॥ ॥౧౮॥

యీఅతిసారరోగము వాత, పిత్త, శ్లేష్మములచే ప్రత్యేకముగాను, త్రిదోషసముదాయముచేతను, దుఃఖాదికముచేతను, అజీర్ణముచేతను, ఆరువిధములైనదానినిగా

తెలుసుకొనవలెను మరియు, కడుపుతో గడగడ శబ్దము, గుదము, బొడ్డు, పొత్తికడుపు, కాళ్ళు చేతులు, కోష్ఠము, వీటియందు నొప్పి, అపానవాయువు, మలము ధారాళముగా బయలు వెడలకుండుట, భుజించిన పదార్థము యుక్తకాలములో జీర్ణము కాకుండుట, యీలక్షణములు సామాన్యముగా అన్నివిధములైన అతిసారరోగములయందును ఉండును.

వాతాతిసారమున — మలము వెడలునప్పుడు సహింపరాని బాధ, శబ్దము, ఎర్రని నురుగతో కూడినమలము, పక్వముగానిమలము, కొంచెము కొంచెముగా వెడలుటయును.

పిత్తాతిసారమున — గుదస్థానము పుండు, పచ్చని లేక ఎర్రని లేక నల్లని, రంగుగల మలము మాటిమాటికి వెడలుటయు, దాహమును,

కఫాతిసారమున — దుర్గంధయుక్తమై జిగురుగల తెల్లటిమలమును. సన్నిపాతాతిసారమున (త్రిదోషాతిసారమున) పయిన చెప్పిన లక్షణములలో కొన్నిగాని అన్నియుగాని కలిగియుండుటయు, మలము, మాంసము, కలిగిన నీటివలెనుండుటయు

శోకాతిసారమున — ధననాశము, పుత్ర, మిత్ర, కళత్రాదుల నాశము, వీరివియోగము, వీటిచే అహోరాత్రిక సుందయుక్తమై కలిగి దేహమునందు ఒకవిధమైన ఆవిరిబయలుదేరుట, జఠరాగ్నియందు ప్రవేశించి రక్తమును పాడుచేసి స్వస్థానము నుండి ఆరక్తమును కదలింపచేయును. ఇట్టితరి మలసంయుక్తమైనట్టిగాని, ఎర్రని మలము, అనేకసారు బయలు వెడలుట, కలిగియుండును. భుజింపబడిన ఆహారము జీర్ణము గాక అనేకవిధములైన రంగులుకలిగినట్టి మాటిమాటికి మలము వెడలినయెడల ఆమాజీర్ణమనియు పిత్త, రక్తములకు భేదాభేదంగున పిత్తాతిసారమే రక్తాతిసారమనియు, తత్వమునకు సరిపడని ఆహారములచే మలము స్వస్థానమున సంచితమై బలాత్కారముగ బయలు వెడలినయెడల ప్రవాహికయనియు, జ్వరమును అతిసారమునుకూడ ఏకకాలమునందే జనించినయెడల జ్వరాతిసారమనియు, మలమును నీటిలో వేసినయెడల మునిగిన సరిగా పక్వము కాలేదనియు, మునుగక పైకితేలిన సరిగా పక్వమైనదనియు, మలమూత్రములు ఒకేగా వెళ్ళుట మొదలిడినచో అతిసారవ్యాధి మళ్ళుగల పట్టినదనియు, తెలుసుకొనవలెను ॥౩౫॥

## ఛర్దిరోగసంప్రాప్తి

శ్లో॥ స్నిగ్ధై రహృద్యై ర్లవణై రతిద్రవైః
కాలాతిరిక్తై రమితైశ్చ భోజనైః
ఛర్ది ర్భవే ద్భీత్యధిక శ్రమాదిభి
శ్చామాశయస్థ క్రిమిణాం చ గుర్విణాం॥ ॥౩౬॥

జిడ్డుగలిగినవి, మనస్సుకింపులేనివి, ఉప్పు ఎక్కువగాకలవి, మిక్కిలి వేడిగల రూపముగలవి, సరియైన కాలనియమములేనివి, తినగలిగినమితి నతిక్రమించినను, ఇట్టి భోజనములచేతను భయము, శ్రమపడుట, మొదలైనవాటిచేతను ఆమాశయము పాములుగాని, పురుగులుగాని ఉండుటచేతను, గర్భధారణచేతను, ఛర్దిరోగము కలుగును. ॥౨౯॥

శ్లో॥ ఉద్గారరోధో హృల్లాసః ప్రసేకో లవణాఽస్యతా।
అన్నే పానేఽసహ్యతా చ ఛర్దిరోగస్య లక్షణం॥ ॥౩౦॥

తేన్పులు సరిగారాక లోపలనే అణగిపోవుట వికారములు, నోట నీళ్ళు కారుట. నోరుఉప్పగానుండుట, అన్నముగాని, పానముగాని, అసహ్యము, ఛర్దిరోగమున ఇట్టిలక్షణములు కలిగియుండును ॥౩౦॥

—• ఛర్దిభేదములు •—

శ్లో॥ పంచధాఽఽగంతుక శ్ఛర్ది స్త్రిదోష స్సన్నిపాతజః।
అసహ్యాదర్శనా ద్యన్నా త్సపవాఽఽగంతుకీ స్మృతః॥ ॥౩౧॥

వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, ఆగంతుకభేదములచే ప్రత్యేక ప్రత్యేకముగా ఛర్దిరోగము ఐయిదువిధమున

వాతఛర్దియందు — హృదయము పక్కలు, డొక్కలు, వీటియందు నొప్పియు తలనొప్పి, నోరెండుట, కంఠమునందగును, శరీరమునందమును, దగ్గు స్వరము మారిపోవుట, స్వల్పముగాను, కష్టముగాను వాంతియగుటయును,

పిత్తఛర్దియందు — దప్పి, మొగము తిరుగుట, నోటతడిలేకుండుట, దాహము, మూర్ఛ, కన్నులుమండుట, చేదుగాను వేడిగాను ఉండుట, పసరు నోటినుండి వెడలుటయును,

శ్లేష్మఛర్దియందు — రుచితెలియకుండుట. భుజించినట్లు మందముగానుండుట, నోరు తియ్యగానుండుట. నిద్ర, ఒళ్ళుబరువు, తెల్లనితెమడ నోటనుండి వెడలుటయును,

సన్నిపాత త్రిదోషఛర్దియందు — ఆజీర్ణము, దాహము, ఆయాసము, కడుపునొప్పి ఒళ్ళుతెలియకుండుట, అరుచి, పుల్లని లేక ఉప్పనివాంతి చిక్కగా నగుటయును కలిగియుండును

ఆగంతుకఛర్దియందు — ఛర్దిరోగసంప్రాప్తియందు చెప్పబడినలక్షణము లన్నియు. ఆగంతుక కారణములేయగుటవలన వాటివల్లనుంచి పుట్టుటచే ఆగంతుక ఛర్దిఅని చెప్పబడుచున్నది. ॥౩౨॥

## —♦ క్షయరోగసంప్రాప్తి ♦—

శ్లో॥ వేగావరోధా ద్వనితావిహారా
ద్వ్యాయామయోగా ద్విషమాశనాచ్చ।
ప్రజాయతే హేతుచతుష్టయేన
క్షయస్త్రిదోషప్రబల సకామం॥ ॥౯౨॥

మలమూత్ర అపానవాతాదులను అరికట్టుట, అధికమైన వనితావిహారము,తన శక్తికిమించిన పనులనుచేయుట, మితినివిడిచి ఎక్కువగాగాని, తక్కువగాని భుజించుట, యీనాలుగు కారణములచేగను, త్రిదోషప్రకోపమైన (సాన్నిపాతకమైన) క్షయవ్యాధికలుగుచున్నది. ॥౯౨॥

## —♦ క్షయరోగలక్షణములు ♦—

శ్లో॥ కార్శ్యాఽజీర్ణశిరోభ్రమాఽరుచికఫోద్రేకాఽగ్నిమాంద్యజ్వరో
న్మాదాఽయాసవినిద్రతాగ్రహణిహృల్లాస స్వరవ్యత్యయాః।
హృత్తాపక్షపధుభ్రమాఽబలమురుద్యాంత్యన్నవిద్వేషణాఽ
నాహోత్తాపవిశూలాంరతనుతా హృన్మా భవేయుః క్షయే॥ ॥౯౩॥

చిక్కుట, అజీర్ణము, తలతిరుగుట అరుచి, మిక్కుటముగా కఫము బయలు వెడలుట, అగ్నిమాంద్యము, జ్వరము, ఉన్మాదము, ఉబ్బసము, నిద్రపట్టకుండుట, గ్రహణి, ఓకిరింతలు, స్వరహీనమగుట, లేక స్వరముమారుట, గుండెలలోమంట, దగ్గు, ఒళ్ళుతిరుగుట, నీరసము, వాంతులు, చలి, అన్నముందయిష్టము. కడుపుబ్బరము (మలమూత్రసంకోచము) తాపము, శూల, ఓంరమెండుట, ఊపిరిగొట్టునొప్పి, యివి సాధారణముగా అన్నివిధములైన క్షయలయందును ఉండును త్రిదోషజనితములైన యీక్షయలన్నియు,

ఏకాదశరూపములు — (1) స్వరభేదము, (2) శూల, (3) భుజములు, (4) జ్వరము, (5) దాహము, (6) అతిసారము. (7) నోటినుండిగాని, ముక్కునుండిగాని, రక్తముబెడలుట, (8) శిరోభారము (9) అన్నద్వేషము (10) దగ్గు (11) మెడ నిలబడకుండుట, గలవియు,

షడ్రూపములు:— (1) పార్శ్వములయందు నొప్పి, (2) స్వరభేదము, (3) అతిసారము, (4) జ్వరము, (5) దగ్గు, (6) అరుచి గలవియు,

త్రిరూపములు:— (1) జ్వరము, (2) దగ్గు, (3) రక్తవికారము, గలవియు అయివున్నవి. యీమొంతముఏకవింశతిక్షయలని చెప్పబడుచున్నవి, ॥౯౩॥

## క్షయరోగభేదములు

శ్లో॥ యక్ష్మాఽజీర్ణగ్రహణివమనోద్గారదాహాతిసారా
హిక్కాహిధ్మా కృశకఫహరిద్రక్తమందాగ్నిమూర్ఛాః।
శోషా పాండు స్సకలవిధరుగ్రూపగా యాతి శాంత్యై
శ్శక్యో నాయం పరిణతిగత శ్శోఫసంతాపతంద్రాః॥ ॥౯౪॥

రాజయక్ష్మ (క్షయరోగము) అజీర్ణము. గ్రహణి, వమనము, ఉద్గారము(దగ్గు) దాహము అతిసారము, హిక్క (ఎక్కిళ్లు) హిధ్మ (ఊపిరిగొట్టునొప్పి) కృశత్వము, కఫము, హరిద్ర (పసుపుపచ్చపారుట) రక్తము, మందాగ్ని, మూర్ఛ, శోషపాండువు శోఫ, సంతాపము. తంద్ర, అనువివిధవ్యాధులయొక్క రూపమునుపొంది, ఆయా రోగవికారములను ధరించి పోల్చుటకుగాని చికిత్సకుగాని శక్యముకాదు, యీ క్షయ రోగము అనులోమ, ప్రతిలోమభేదములచే రెండువిధములు, మలమూత్రాదుల నిరోధముచే వాతాదులు కుపితములై రసధాతునాడులను అడ్డగించును, అందువలన రసధాతువు స్వస్థానమందేయుండి రక్తాది ధాతువులకుబలమును కలుగచేయజాలదు, గాన మిగిలిన ధాతువులన్నియు శుక్రమువరకు అనులోమక్రమమున క్షీణించును (ఇదే అనులోమక్షయ) మితిమీరిన స్త్రీసంపర్కముచే శుక్రధాతువు క్షీణించినచో మిగిలినధాతువులన్నియు రసమువరకు ప్రతిలోమక్రమమున క్షీణించును, (ఇదే ప్రతిలోమక్షయ)

## పాండురోగసంప్రాప్తి

శ్లో॥ వ్యాయామ (వ్యయామ) మామ్లం లవణం చ మద్యం
మృదం దివా స్వాప మతీవ తీక్ష్ణం
నిషేవ్యమాణస్య విదూష్య రక్తం
కుర్వంతి దోషా స్త్వచి పాండు మేతే॥ ॥౯౫॥

మితిమీరిన, దేహపరిశ్రమ (మితిమీరిన స్త్రీసంగమము) పులుసు, ఉప్పు, మద్యము, మన్ను, పగటినిద్ర, కారము, లేక తీక్ష్ణమైన (కఠినమైన) పదార్థములు, వీటిని మిక్కుటముగా సేవించుట, వలన, వాతాదిదోషములు, శరీరమునందలి రక్తమును, పాడుచేసి, చర్మమునందు పాండువర్ణమును కలుగజేయును, కామిల, కుంభకామిల, హలీమకములు పాండురోగభేదములైయున్నవి॥ ॥౯౬॥

## పాండురోగలక్షణములు

శ్లో॥ హృత్స్పందనిష్ఠీవనమాంస్యకార్శ్యాఽ
స్వేదశ్రమప్రేక్షణకూటశోథాః

త్వక్స్ఫోటమృద్భక్షణపీతవేగాః
న్నద్వేషకర్ణధ్వనిలోమశాతాః॥ ॥౯౬॥

పాండురోగమునగుండెలలోదుడుకు, నోటుచొ్ఁ, అగ్నిమాంద్యము, చిక్కుట చవుటపట్టకుండుట, ఆయాసము, కంటికొలికిలయందువాపు, చర్మముగలుట మట్టి తినుట, మలమూత్రములు పచ్చగానుండుట, అన్నద్వేషము, చెవులలోహోరు, శరీరమునందలి వెంట్రుకలూడిపోవుట ఇట్టిలక్షణములు కలిగియుండును. ॥౯౭॥

—♦ పాండురోగభేదములు ♦—

శ్లో॥ పాండురోగాః పంచవిధా వాతపిత్తకఫైస్త్రయః ।
సన్నిపాతా చ్చతుర్థశ్చ పంచమో భక్షణాన్మృదః ॥౯౮॥

వాత, పిత్త, శ్లేష్మభేదములచే ప్రత్యేకముగాను, త్రిదోషసముదాయము (సన్నిపాతము) చేతను, మట్టితినుటచేతను, కలుగుటవలన యీపాండురోగము అయిదువిధములైయున్నది,

వాతజపాండువునందు — మలమూత్రములు, కన్నులు, చర్మము మొదలైనవి, నునుపులేక, యెఱుపెక్కి, పోటు, వణుకు,కడుపుబ్బరము, ఒళ్లుతిరుగుట మొదలైనలక్షణములును,

పిత్తపాండువునందు— మలమూత్రములు, కన్నులు, శరీరముపచ్చనివర్ణము కలిగియుండుట, తాపము దాహము, జ్వరము, మూర్ఛ, చెమట, చల్లదనమందు యిష్టము, అన్నద్వేషము, నోరుచేదు, మలము ఉడుకుగా పెట్టుటయును,

శ్లేష్మజపాండువునందు— నోటినుండి తెమడ వెడలుచుండుట, వాపు, నిరుత్సాహము, ఒళ్లుబరవు, మలమూత్రములు, కన్నులు, శరీరము, తెలుపుకలిగియుండుట, శ్వాస, దగ్గు, నోరుచప్పగానుండుట, వేడిని, కారమును సహించుటయును,

సన్నిపాతపాండువునందు— వాతాదిపాండురోగలక్షణమును కలిగియుండుట, జ్వరము, అరోచకము, ఓకిరింత, వాంతి, దాహము, బడలిక, దౌర్బల్యము చక్షురాదీంద్రియములకు పాటవము లేకుండుటయును,

మృత్పాండువునందు— నిస్సత్తువ, కన్నులు, చెక్కిళ్లు, కనుబొమ్మలు, పాదములు, బొడ్డు, గుహ్యప్రదేశము వీటియందు వాపును, కడుపులో పాములుపుట్టుట యిట్టిలక్షణములుకలిగియుండును, పాండురోగమున స్వతస్సిద్ధముగాగాని కేవలపిత్తాధిక్యముచేగాని కామిలావ్యాధి జనించును,

యీకామిల వ్యాధియందు— కన్నులు, చర్మము, గోళ్లు, ముఖము పచ్చగానుండుట మలమూత్రములు పచ్చగాగాని, ఎర్రగాగాని, యుండుట, చిక్కుట, పనిపాటలయందు అసామర్థ్యము ఒళ్లునొప్పులు యిట్టిలక్షణములు కలిగియుండును, కామి

లారోగమునందు తగినచికిత్సచేయక కాలయాపనచేసినచో ఆకామిలావ్యాధి కోష్ఠగతమై స్థిరరూపమునొందుటవలన కుంభకామిలయగును

యీకుంభకామిలయందు — కామిలాలక్షణములే కలిగియుండును, పాండురోగమున శరీరము ఆకుపసుపు లేక నలుపు లేక పసుపు రంగులలో ఏదో ఒకరంగు కలిగి విశృతముగానున్నచో హాలీమకమని చెప్పబడును,

యీహాలీమకవ్యాధియందు — బలము, ఉత్సాహము, జఠరాగ్ని, జ్వరము సందగించుట (తగ్గిపోవుట) జ్వరము స్వల్పముగావచ్చినచో అట్టిసమయమున స్మృతి లేకుండుట, ఒళ్లునొప్పులు, దాహము, ఒళ్లుమంటలు, అరుచి, ఒళ్లుతిరుగుట, యిట్టిలక్షణములు కలిగియుండును, యీపానకవ్యాధికే, లోఢరమనియు, అలసమనియు, నామాంతరములు చూడబడుచున్న వస్తువులన్నియు పచ్చగా గానిలేక తెల్లగా గాని కనుపించుట, మలమూత్రములు పచ్చగాగాని తెల్లగాగాని, కొంచెము కొంచముకొంచముగా అనేకసార్లు వెడలుట, తెల్లబడుట, బొత్తిగాబలములేకుండుట, వాంతి మూర్ఛ, దంతములప్రక్కమాంసము, గోళ్లు, కనురెప్పలు, శరీరము, నీటియందు, రక్తము పూర్తిగానశించుట అంగుళాంతములై, మోగాళ్లు మీచేతులు, కన్నువాచి మిగిలిన శరీరమధ్యప్రదేశము ఎండిపోవుట లేక అండయాంత ప్రదేశములు కృశించి, శరీరమధ్యభాగము వాచుట, గుహ్యము, వృషణములు వాచుట అతిసారము ఇట్టిలక్షణములు ఏపాండువునందున్నను, అట్టిపాండువ్యాధి అసాధ్యము. ||౯౪||

## — స్త్రీసంగమదోషలక్షణములు —

శ్లో|| సర్వాంగవైకల్యవికంపతాప్యా
త్తాపప్రలాపభ్రమదాహవాతాః।
శిరోవ్యథాహస్తపదాతిశైత్య
త్రిదోషకోపా రతిజా గుణాస్స్యుః॥ ||౯౫||

స్త్రీసంగమదోషమున శరీరమంతయు విరుగగొట్టినట్లుండుట, వణుకు, గుండెలోమంట, అసంబద్ధమైనమాటలు, (పేలాపన) ఒడలుతిరుగుట, దాహము, చలి, తలపోటు, కాళ్లు, చేతులు చల్లగానుండుట, వాత, పిత్త, శ్లేష్మములు ప్రకోపించుట ఇట్టిలక్షణములు కలిగియుండును. ||౯౫||

## — స్వస్థలక్షణమ్ —

శ్లో|| సమదోషసమాగ్నిశ్చ సమధాతుమలక్రియః।
ప్రసన్నాత్మేంద్రియమనా స్వస్థ ఇత్యభిధీయతే। ||౯౬||

వాత, పిత్త, శ్లేష్మములు, జఠరాగ్ని, రసాదిధాతువులు, మలము. చర్యలు, (నిత్యకృత్యత్యవహారములు) ఇవి సరిగా (హెచ్చుతగ్గులులేక యథాప్రకారముగా) నుండుట, నిర్మలమైన ఆత్మ, ఇంద్రియములు, మనస్సు, ప్రసన్నములై యుండుట, ఇట్టిలక్షణములుకలవాడు స్వస్థుడు, (నీరోగి) అని చెప్పబడుచున్నాడు. ॥౯౯॥

శ్లో॥ ఇత్యేకవింశద్విధరుక్స్వరూపం
బాలప్రబోధాయ లఘుప్రణీతం।
ఇతః క్రమాఽభ్యాసజపారిపాట్యా
సమున్నయేచ్ఛాఽనుభవా దనుక్తాన్। ॥౧౦౦॥

ఈప్రకారము బాలకులకు సులభముగా తెలియునిమిత్తమై యిరవైయొక్కవిధములైన వ్యాధులయొక్కపోలిక సంగ్రహముగాను, (సులభముగాను,) చెప్పబడినదిగాన బాలకులు యీగ్రంథపఠనము క్రమక్రమముగా అలవడిన అభ్యాసపాటవము. స్వానుభవము, అనువాటిచే యీగ్రంథమున చేర్కొనబడనివియు, తమకు, తటస్థపడునవియు, అగు సర్వవిధవ్యాధులను ఊహాబలముచే తెలుసుకొనవలెను.॥ ॥౧౦౦॥

ఇతి శ్రీచిత్రాగదసంగ్రహాఖ్యే శ్రీసోమయాజిసత్పథే

సత్పథప్రకరణేషు

నిదానప్రకరణమ్.



శ్రీగణేశాయ నమః.

# చిత్రాంగదసంగ్రహాఖ్యే
# శ్రీ సోమయాజిసత్పథే
# వర్ణాంగదప్రకరణమ్



## —♦ వర్ణాఽంగదప్రకరణమ్ ♦—

శ్లో॥ నమామి ధన్వంతరి మాదిదేవం
సురాసురై ర్వందితపాదపద్మం
లోకే జరారుగ్భయమృత్యునాశం
దాతార మీశం వివిధౌషధీనాం॥ ॥౧॥

దేవతలలో మొదటివాడు, దేవదానవులచే నమస్కరింపబడు పాదపద్మము కలవాడు. ముదిమి, వ్యాధులు, అపమృత్యువు, వీటియొక్క భయమును పోగొట్టువాడు సమస్తవిధములయిన ఓషధులను ఇచ్చువాడు, ఐశ్వర్యసంపన్నుడు అయిన ధన్వంతరిని నమస్కరించుచున్నాను॥

శ్లో॥ బాలానాం సుఖధారణాయ గృహిణాం సంప్రాప్తరుక్శాంతయే
వైద్యానా మఖిలామయ ప్రశమనప్రజ్ఞోపలంభాయ చ।
ఆమూలాగ్రవిలోకనం మతిమతాం సర్వక్రియాసిద్ధయే
ప్రాయేణాఽల మముష్య ముఖ్యవిషయప్రజ్ఞానసంపత్తయే। ॥౨॥

యీగ్రంథముయొక్క ఆమూలాగ్రపఠనము, బాలకులకు సుఖధారణ. గృహస్థులకు వారాత్సిద్ధములయిన రోగములను పోగొట్టుకొనుట వైద్యులకు, సమస్తరోగములయొక్క ఉపశాంతిని కలుగజేయు ప్రజ్ఞ సంపాదించుకొనుట, వైద్యశాస్త్రమునందుగల ముఖ్యవిషయములయొక్క చిహ్నములను గ్రహించుట, అనువాటికొరకు చాలును. ॥౨॥

## —♦ వర్ణాఽంగదప్రకరణమ్ ♦—

శ్లో॥ సౌభాగ్యం ప్రకటీకరోతి లఘు వా మాంగల్యసూత్రం ధృతం
మూల్యా న్యాభరణాని చంచలదృశాం సర్వాణ్యతిక్రమ్య న।

వైద్యత్వం ప్రకటీకరోతి పరితం కావ్యం సదేత త్రధా
సాధ్యాసాధ్యమయోహ్యా భేషజయుతగ్రంధా నతిక్రమ్యచ॥ ।3॥

సూక్ష్మమయిన దయినప్పటికి (తక్కువ వెలకలదయినప్పటికి) మంగళసూత్రము, ధరింపబడినదగుచు, గొప్పఖరీదుకలిగి, అధరణములు నతిక్రమించి. స్త్రీల యొక్క సౌభాగ్యమును ఎట్లుప్రకటన చేయుచున్నదో, అట్లేసూక్ష్మమయినద యినప్పటికి యీకావ్యము పరి పఠించినదగుచు కొన్నిసాధ్యములున్ను, కొన్నిఅసాధ్యములున్ను ఆయి ఊహించుటకకూడా సాధ్యముకాని రోగములతో కూడిన గ్రంధముల నతిక్రమించి పాఠకులయొక్క వైద్యత్వమును ప్రకటనచేయుచున్నది॥

శ్లో॥ సామాన్యరోగేషు నిమజ్జితాని
యాన్యల్పయత్నాని గుణాధికాని
ఉద్ధృత్య తాని ప్రకటీకృతాని
వర్ణోపమా నాగదసంజ్ఞయాత్ర॥ ॥౪॥

సామాన్యములయిన రోగములతో కలసిపోయినవి స్వల్పమయిన వ్యయ ప్రయాసలు కలవి అధికమైన గుణములు కలవి అయిన రోగములుఏవి కలవోఅవియే, ఎత్తి వర్ణాగదములు (అక్షరములతోపోల్చతగినమందులు) అనుసంజ్ఞతో యిక్కడ, ప్రకటన, చేయబడినవి ॥౪॥

శ్లో॥ బాలానాం ప్రథమప్రవేశసమయే వర్ణా ఇవాఽత్రాగదాః
పంచాశత్సముదీరితాః ప్రథమత స్తానభ్యసే ద్యత్నతః।
ప్రాగ్వర్ణగ్రహణాత్సమ స్తనిగమప్రాజ్ఞాభవేయుర్యథా
నాతోక్తౌషధకల్పనోచితధియ స్సర్వాగదజ్ఞానినః॥ ॥౫॥

బాలకులకు అక్షరాభ్యాసకాలమున అక్షరములవలె (50) మందులుచెప్పబడినవి గానవాటియొక్క నిర్మాణ ప్రయోగోప సంహారములను అభ్యసింపవలెను పంచాశద్వర్ణ విజ్ఞానముచే వివిధశాస్త్ర పారంగతు లెట్లగుచున్నారో, అట్లేయిక్కడ చెప్పబడిన పంచాశదగద విజ్ఞానముచే సకలగ్రంథోదితౌషధవిజ్ఞాన పారంగతు లగుచున్నారు॥ ॥౫॥

శ్లో॥ సర్వే ప్యేకవిధౌషధాని కతిచి ద్వ్యానైవ కుర్యుర్యత
స్తస్మిన్నస్మిన్నియ (స్వస్వ) మతైక్యతాతదఖిలైః కార్యాహివర్ణాగదాః

తద్వర్ణాగదసంప్రయోగశమనజ్ఞానప్రపద్యైః పరం
సంపాద్యాస్సకలాగదాః ప్రతిభయా వర్ణై రివాఽన్యాఃకరాః॥

వైద్యులందరున్నుకలసి ఒకేవిధమయిన మందులను కొన్నిటినయినా తయారుచేయకపోవుటవలన యీవైద్యులకు ఏకమతావలంబనము పొత్తిగా లేకపోవుచున్నది, గాన ప్రతివైద్యుడున్ను ముందుగా వర్ణాగద సంజ్ఞౌషధములను వాటి విజ్ఞానమును అలవరుచుకొని, తదనంతరము వారివారి ప్రజ్ఞావిశేషము ననుసరించి యథేష్టౌషధములను పంచాశద్వర్ణ విజ్ఞానముచే, ఇతరతరలవలె సంపాదింపవలయును॥ ॥౧॥

శ్లో॥ ఆరోగ్యానుభవేచ రోగశమనే సృష్టా స్విధాత్రా నృణాం
కాంత్యంబుశ్వసనానపాన్య యుతతే ప్రాగేవ జాయా న్నృతి।
పూర్వారోగ్య మపి త్యజం త్యనుచితై ర్జాయుప్రయోగై స్తత
స్సేవ న్నానవశిష్టరోగశమనే జాయా న్భజేత్సర్వదా ॥౨॥

మానవులయొక్క ఆరోగ్యానుభవముకొరకున్ను రోగోపసంహారముకొరకున్ను బ్రహ్మదేవునిచే సృజింపబడిన వెలుతురు వాయువు అనువాటినివిడిచి పెట్టి ముందుగానే మందులకొరకున్ను వైద్యులకొరకున్ను ప్రయిత్నించి రోగానుచితము అయిన మందులుమొదలయినవాటిచే పూర్వారోగ్యమునుకూడా కోలుపోవుటతటస్థపడు చున్నదిగాన వ్యాధి అంకురించగానే మానవులసౌఖ్యముకొరకు సృజింపబడిన వెలుతురు గాలి అనువాటినియథోక్తముగా సేవించి అట్లుసేవించినను ఉపశాంతి నొందక నిలిచియున్నరోగోపశాంతికొరకు మందులను సేవింపవలయును ॥౩॥

శ్లో॥ వర్ణాంకాగదశిక్షితేన భిషజా నవ్యౌషధవ్యాకృతి
ర్గ్రంథేభ్యః కులవైద్యకేభ్య ఇతి హా విశ్రాయికేభ్యోన్వహం।
జ్ఞేయః కింతు ఫలప్రతిప్రమరణవ్యాన ర్థకై శ్శ్రద్ధయా
రుగ్మి ష్వామయశాంతయే ప్రతిభయాసంయోజయేదూహయా

వైద్యుడగువాడు వర్ణసంజ్ఞాగద విజ్ఞానమును సంపాదించి అటుపిమ్మట గ్రంథాభ్యాసము వంశపరంపరాగత వైద్యాభ్యాసముకలవారు పరంపరోపదేశము వర్తకులు ఆమందుయొక్క గుణాగుణములు మొదలయినవాటిని తెలుపు ప్రచారణములు వీటిచేకొత్తమందులయొక్క విజ్ఞానమును సంపాదింపవలయును ఇట్లువిజ్ఞానమునుసంపాదించి తనయూహచే రోగోపశాంతికి తగినమందుయివ్వవలయును ॥౪॥

—♦ అగ్నికుమారం ♦—

శ్లో॥ సూతం గంధకటంక మేక ముదితం త్ర్యంశం వరాటం విషం
శంఖం చాష్టగుణం మరీచమఖిలం జాభైం ర్దినంమర్దయేత్।
తాంబూలీదళసంయుతం పరిమితంఖాద్యం పిబే చ్ఛీతకం
హన్యా దగ్నికుమార మాశు సకలాజీర్ణా న్విషూచీ రపి॥ ॥౯॥

పాదరసము గంధకము వెలిగారము ఒక్కొక్క భాగము వాభిగవ్వభస్మ శంఖభస్మమూడేసిభాగములు మిరియములు ఎనిమిదిభాగములు వీటిని నిమ్మపండ్లరసముతో మర్దింపబడియునుఇదిఅగ్నికుమారము దీనిని. తమలపాకులతోనమలి శీతోదకమును త్రాగినచో సమస్తవిధములైన అజీర్ణములు విషూచిరోగములు శాంతించును ॥౯॥

—♦ ఆనందభైరవి ♦—

శ్లో॥ సౌభాగ్యహింగుళశటుంచ విషం మరీచం
సమ్మర్ద్య నింబకరసేన దినత్రయంచ।
ఆనంద భైరవమిదం తు వరీపత్రిమాణం
నానానుపానసహితం సకలామయఘ్నం ॥౧౦॥

వెలిగారం ఇంగిలీకం పిప్పళ్లు వాభి మిరియాలు వీటిని వేపచెక్కరసముతో మూడుదినములు మర్దించి కందిగింజపరిమాణమును రోగయుక్తానుపానములతో సేవించినయెడల సమస్తవిధములయిన రోగములు శాంతినొందును. ॥౧౦॥

—♦ (3) ఆనందరసం ♦—

శ్లో॥ వరాటజాతీఫలసైంధవాఽ-ప్రికణాంచశుంఠీవిషహేమబీజం।
ధుత్తూరమూలస్యరసేన మర్ద్యం యామంతథాఽనందరసంప్రదిష్టం।

గవ్వభస్మ జాజికాయ సైంధవలవణము ఇంగిలీకము పిప్పళ్లుశొంఠి వాభి ఉమ్మెత్తగింజలు వీటిని ఉమ్మెత్తవేళ్లరసముతో ఒకయామము మర్దించబడెను ఆనందరసము॥ ॥౧౧॥

శ్లో॥ గుంజాప్రమాణంజరరామయఘ్నంనిహంతివాతంకఫశూలదోషాన్
ఆమాతిసారంగ్రహణీవికారం నిహంతి కార్శ్యంసితయాసమేతం॥

యీఆనందరసమును గురిగింజ ప్రమాణము సేవించిన జఠరరోగములు వాత

కఫ శూలలు హరించును పంచదార అనుపానముతో సేవించిన అమాతిసారము గ్రహణీవికారము కార్శ్యము హరించును. ॥౧౨॥

## — (4) కనకసుందరరసం —

శ్లో॥ ఉన్మత్తటంకణమరీచికణా రసేంద్ర
వేమీవిషాణిననుయామయుగం సుమర్ద్య
భృంగద్రవైః కనకసుందర ఏష హాన్యా
ద్వాతాతిసారందధిపథ్యమాజం॥ ॥౧౩॥

ఉమ్మెత్తగింజలు వెలిగారం మిరియాలు పిప్పళ్లు రసము గంధకము నాభి వీటిని గుంటగలగరాకురసముతో రెండుయామములు మర్దింపవలెను ఇదికనకసుందర రసము వాతాతిసారములను శమింపచేయును పెరుగు అన్నము పథ్యము. ॥౧౩॥

## — (5) కాలకూటం —

శ్లో॥ హింగూగ్రోశ్వరతామ్రగంధకశిలాటంకం హరిద్రాద్వికం
సంమర్ద్యం త్రిఫలం కటుత్రయవిషం ప్రత్యేకయామం పృథక్।
వస్త్రైకత్రిచతుర్మరుద్భృగునసబ్రహ్మాంక దిగ్భాగశ
స్తాన్యాంశై రనిలామయప్రశమనం సంమర్దయే ద్భావిభిః ॥౧౪॥

ఇంగువ రస ఒక్కొక్క భాగము రసము మూడుభాగములు తామ్రభస్మము నాలుగుభాగములు గంధకము అయిదుభాగములు మణిశిల వెలిగారము ఆరేసిభాగములు హరిదళము చిత్రమూలము 9భా॥ త్రిఫలములు 10భా॥ త్రికటుకములు పన్నెండుభా॥ నాభిపదరెండుభాగములు వీటిని యీదిగువరసములతో ఒక్కొక్కదానితో ఒక్కొక్క యామము మర్దింపవలయును ఇది కాలకూటము ॥౧౪॥

శ్లో॥ శిగ్రుగ్రాహ్యనలార్ద్రలాంగలిగిరివిప్రల్హాదిశీ తామ్రికా
తాంబూలీసితకోలమూలలశునాజంభాటవీశిగ్రుకైః
క్షుణ్ణం మర్ద్యచ కాలకూట మగదం శామ్యంతి సర్వామయా
స్నానం చందన లేపనం దధి భజే త్తాపే ప్రజా తేసతి॥ ॥౧౫॥

ములగ ఊడుగు చిత్రమూలము అల్లము చిన్నచర్లగడ్డ జిల్లేడు హంసపాది గులివింద తమలపాకు వావిలి పంచకోలములు (పిప్పలిపిప్పలిమూలము చవ్యము చిత్రమూలము శొంఠి) పంచమూలములు (ముయ్యాకుపొన్న కోలపొన్న ములక వాకుడు

వల్లేరు) తెల్లుల్లి నిమ్మరసము అడవిగుములగ వీటిరసములతో (కషాయములతో) ప్రత్యే కప్రత్యేకముగా ఒక్కొక్క జాము మర్దించి గురిగింజప్రమాణము రోగయుక్తాను పానములతో సేవింపవలయును దీనిని సేవించుకాలమున స్నానము మంచిగంధము పూసుకొనుట పెరుగుపోసుకొనట మొదలయిన పథ్యములు లిగియుండవలెను ||౧౫||

## — (6) కాంతవల్లభరసం —

శ్లో॥ కిట్టం కాంత మయో రజో మనుశిలా టంకం శిలాజ త్రిధా
పశ్చాత్సూర్య కలా చతుర్దశగజా౽శా షట్క్రమా త్సంగ్రహేత్।
పూతం సర్వసమంచ గధకమపి క్షిప్త్వా౽ర్ద్రమూషోదరే
సప్తాహేనతు కాంతవల్లభరస స్స్యా ద్వాలుకాయంత్రకే॥ ||౧౬||

మండూరభస్మ పన్నెండుభాగములు కాంతభస్మపదహారుభాగములు ఖడ్గలోహ భస్మ పద్నాలుగుభాగములు మణిశిల యెనిమిదిభాగములు వెలిగారము పదిభాగములు కర్పూరశిలాజిత్తు ఆరుభాగములు పాదరసము వీటికన్నిటికినిసమానము గంధకము రసమునకుసమానము వీటినన్నిటిని ఏకముచేసి ఆర్ద్రమూసయందుంచి వాలుకాయంత్ర మున ఏడురోజులు వండవలయును. ||౧౭||

శ్లో॥ పాండుశ్వాసభగందరక్షయధురుక్ప్లీహోదరా౽ర్శో౽నిలా౽
జీర్ణారోచకశూలకుష్ఠవమిసంతాపగ్రహణ్యామయాన్।
శోషంహంతిచవీర్యవృద్ధి మమితం పుష్టిం తథా జాఠరం
సంతోషం వితనోతి మాక్షికయుతో నిష్కప్రమాణంభజేత్॥

యీ కాంతవల్లభరసమును నిష్కప్రమాణము తేనెతో సేవించిన పాండువు శ్వాస భగందరము దగ్గు ప్లీహరోగము మూలశంక వాతవ్యాధి అజీర్ణము అరోచకము శూల కుష్ఠరోగము వాంతి జ్వరము గ్రహణి శోష మొదలయినవ్యాధులు ఉపశ మించును వీర్యవృద్ధి పుష్టి బలము అగ్నిదీపనము సంతోషము కలుగును. ||౧౮||

## — (7) క్రిమిముద్గరరసం —

శ్లో॥ క్రిమూత్రరం పారదగంధమోద
విడంగముష్టిశ్వసనఘ్నబీజం।
సిపేయ నిష్కంమధునా౽థ పేయం
ముస్తాకషాయం క్రిమిముద్గరోయం॥ ||౧౯||

వస్త్రే ర్మంజుభుజంగవల్లిజనితై ర్నిక్షిప్య ఖాతే పుటం
దత్వా కుక్కుటసంజ్ఞకం సహ దళై స్సంచూర్ణ్య లిప్తే క్షిపేత్ ॥ ౨౧॥

పాదరసము గంధకము కృష్ణాభ్రకము విమలము (మాక్షికభేదము) సమాన భాగములు పాదరసములో సగము నాభి నాభిలో మూడవవంతు నేపాలగింజల వప్పు వీటిని చూర్ణించి చింతపండులో పొదిగి దానిచుట్టూ తమలపాకులు చుట్టి గోతి యందుంచి దానికయిని కుక్కుటపుటము పెట్టవలయును అపుటముపక్వము కాగానే తీసి దానికి చుట్టినతమలపాకులతో కూడా నూరవలెను. ॥౨౧॥

శ్లో॥ భాగార్ధం జయపాలబీజ ముమ్మృతం తత్తుల్యమే కాన్వితం
గుంజానాగరసింధుచిత్రకయుత శ్చింతామణి ర్నామకః।
శూలం సంగ్రహణీగదం చ జఠరం సర్వజ్వరా న్నాశయే
త్తాపే సేచన మాచరే ద్గదవతాం పథ్యంతు దధ్యోదనం।

అట్లు నూరినదానితో భాగమున్నరచొప్పున నేపాళపుగింజలవప్పును, గరి కమున్ను యీరెండింటిని ఏకముచేసి దానితో సమానము గురిగింజవప్పు, శొంఠి, సైంధవలవణము, చిత్రమూలము వీటిచూర్ణములనున్ను, పైఔషధములనున్ను, ఏకము చేసి తమలపాకురసముతో మర్దింపవలెను ఇది చింతామణి ఇది శూల, గ్రహణి ఉదరరోగము, తాపము, సర్వవిధజ్వరములు, వీటిని పోగొట్టును. ఈమందు పుచ్చు కొనుటవలన తాపముకలిగినచో స్నానముచేయుచుండుటగాని, తడిబట్టలతో తుడు చుకొనుటగాని చేయవలెను. యీమందుపుచ్చుకొన్నవెంటనే పెరుగుఅన్నము తినవలయును. ॥౨౨॥

శ్లో॥ భూశయ్యాసముపాగతేఽపి చ మృతప్రాయే ప్రకృష్టామయే
మాంద్యాజీర్ణమరుత్త్రిదోషవిషమే సర్వజ్వరే దుర్విధే।
ఆధ్మానామయమూలరోగసహితే వాతాఽతిసారాదికే
దేయం భేషజ మేత దేవ భిషజా సద్యో గుణం దృశ్యతే॥ ౨౩॥

భూశయనముచేసినవానికిన్ని, ప్రాణముమీదకువచ్చి బ్రతుకుట సంశయము యినవానికిన్ని, రోగము అసాధ్యస్థితిలోనున్నవానికిన్ని, అగ్నిమాంద్యము, అజీర్ణ వాతము, త్రిదోషవిపర్యయము, కొత్తరకజ్వరములు, ముఖ్యమూలములులేని (తుద మొదలులేని) రోగములు, కడుపుబ్బరము, మూలశంక, వాతాతిసారము మొదలయి నవి వీటికి యీమందిచ్చినచో వెంటనే గుణమిచ్చును. ॥౨౩॥

## —♦ (11) జ్వరాంకుశం ♦—

శ్లో॥ పక్వైకభాగం రసగంధకం చ
గోదంతశుంఠీ విషటంకమర్ధం!
దినత్రయం భృంగరసేన మర్ద్యం
జ్వరాంకుశం స్యాదుచితానుపానం॥ ॥౨౪॥

పాదరసము, గంధకము ఒక్కొక్కభాగము హారిదళము, శొంఠి, వెలిగారము, నాభి అర్ధభాగము చొప్పున వీటిని గుంటగలగరాకురసముతో మూడురోజులు మర్దించవలెను. ఇది జ్వరాంకుశము దీనిని సకలవిధజ్వరములయందును యుక్తానుపానములతో ఇవ్వవలెను. ॥౨౪॥

## —♦ (12) జోగినీరసం ♦—

శ్లో॥ గంధటంకణవిషాణిపారదం
వ్యోషదంతికఫలాని తాళకం
భృంగరాజసమర్దితం భజే
జ్జోగినీరస మసుప్రదాయకం॥ ॥౨౫॥

గంధకము వెలిగారము నాభి పాదరసము త్రికటుకములు నేపాళములు త్రిఫలములు ఇవి సమానభాగములు. వీటిని గుంటగలగరసముతో మర్దించవలెను. ఇది జోగినీరసము. ప్రాణమును ఇచ్చును. పనిబిడ్డల కమోఘమయినమందు. ॥౨౫॥

## —♦ (13) తారకేశ్వరరసం ♦—

శ్లో॥ మర్ద్యాతుభ్రమకరసం దివసంత్రిపు
ర్మాక్షికేన సహ మాష మితం భజేత్!
తారకేశ్వరరసో బహుమూత్రజి
ద్దేమదుగ్ధఫలచూర్ణసమన్వితం॥ ॥౨౬॥

అభ్రకభస్మము రసభస్మము వంగభస్మము వీటిని తేనెతో ఒకరోజు మర్దించవలెను. ఇది తారకేశ్వరరసము. దీనిని మేడిపండ్లచూర్ణముతో తేనెకలిపి సేవించిన బహుమూత్రము ఉపశమించును. ॥౨౬॥

గశ్వభస్మము (యీరెండుకలిపి సమానము) వీటిని త్రికటికములు కచ్చూరాల దేవ దారు వృద్ధదారు ఏలకతీగెలు కస కరక్కాయ పిప్పలిమోళ్ళు వాయువిడంగాలు చిరుబొద్ది బోడసరము చవ్యము త్రిఫలములు అనువాటికషాయముతో ప్రత్యేక ప్రత్యేకముగా శుద్ధింపవలయును. ఇది నిత్యానందరసము. ॥౨౯॥

శ్లో॥ వాతశ్లేష్మభవం చ రక్తపలలవ్యాప్తం చ మజ్జాశ్రితం
హన్యాచ్ఛ్లీపదమాంత్రవృద్ధి మనిలవ్యాధిం క్రిమీనర్బుదం।
అర్శోరోగభగందరామయగుదవ్యాధీ నశేషా నిదం
దద్యాద్వైద్యవర్యదాత్మశక్తినిపుణ శ్శీతాంబునా శ్లీపదే॥

యీనిత్యానందరసమును చల్లనినీటితో సేవింపవలయును. వాతశ్లేష్మములవల్ల పుట్టి రక్తమాంసములనాశ్రితమయిన శ్లీపదవ్యాధిని (బోదను) అంత్రవృద్ధిని వాత వ్యాధిని క్రిములను అర్బుదములను మూలవ్యాధిని భగందరములు గుదరోగమును పోగొట్టును. తెలివిగలవైద్యుడు శ్లీపదవ్యాధియందు ముఖ్యముగా దీనినే వాడవలయును. ॥30॥

## —♦ (17) ప్రతాపలంకేశ్వరం ♦—

శ్లో॥ ఏకాంశం విషగంధసూతపటలం శఖం చ లోహం కటు
ర్నస్యబ్ద్యగ్నిమితం క్రమైకమటవీషష్ఠం క్రమాత్పేషయేత్
దంతాఽర్శోనిలసూతికాగ్రహణికు ష్ఠేష్మజ్వరాన్నాశయే
ద్భంరీకృష్ణఫలత్రయాఽర్ద్రకరసైః ప్రాతాపలంకేశ్వరమ్॥ ॥౩౧॥

వాళి గంధకం పాదరసము అభ్రకము ఒక్కొక్కభాగము శంఖభస్మము తొమ్మిదిభాగములు లోహభస్మము నాలుగుభాగములు పిప్పళ్లుమూడుభాగములు అడవిపిడకలు (ఏడుపిడకలభస్మ) పదహారుభాగము వీటిని కలిపి నూరవలయును ఇదిప్రతాపలంకేశ్వరము దీనివలన దంతరోగములు మూలవ్యాధులు వాతవ్యాధులు సూతికావాతము గ్రహణిరోగము శ్లేష్మజ్వరములు శమించును యీఔషధమును తెంత్రి మిరియాలు శంకతాడి పునిరికలు అల్లము వీటిరసములతోను కషాయముతోను తత్త్వానుకూలమును అనుసరించి సేవింపవగును॥ ॥3౧॥

## —♦ (18) ప్రసరాంశకరసం ♦—

శ్లో॥ క్షారాబ్రసమాగాం ... ంశం ప...భు
త్రవ్యచ్ఛగంధాః ... రవరాటకం॥

వోహం తులాత్ర్యంశక మేకవారం
కన్యాజలై ర్మర్ద్య మసృగ్దరాంతకం। ॥32॥

రసము శంగము రజతము గంధకము కపరిగత్వభస్మము ఒక్కొక్క భాగము లోహభస్మము తులములో మూడవవంతు వీటిని కలబందరసములో ఒకరోజు మర్దింప వలెను ఇది ప్రదరాంతకరసము దీనిని యుక్తానుపానములతో సేవించుటవలన స్త్రీల కుసంభవించు అన్నివిధములైన కుసుమరోగములు శమించును. ॥32॥

## —♦ (19) పూర్ణచంద్రోదయం ♦—

శ్లో॥ గంధస్వర్ణరసంక లైకవసుభిః కన్యాఽుఽపరికార్పాసజై
స్సమ్మర్ద్యాథ నిధాయ కాచవివరే సంవేష్ట్య మృత్కర్పటైః
అగ్నౌ త్రీణి పచే ద్దినాని సికతాయంత్రే చ చంద్రోదయం
యోషిద్దర్పనుదుత్తమౌషధమిదం తాంబూలపత్రాశితం।

మూరిఎంతమాత్రమునవే భస్మము తారిగిఎంత కలుచనయిన బంగారపురేకలు ఒకపలము పాదరసము యెనిమిదిపలములు గంధకము పదహారుపలములు వీటినిచు త్రిపత్రిపూవులరసముతోనున్ను కలబందరసముతోనున్ను మర్దించి గాజుకుప్పియం దుంచి గుడ్డలుచుట్టి మట్టిపూసి మూడురోజులు వాలుకాయంత్రమునందు సామాన్య మయిన అగ్నితోపచనముచేయుగా చిగురుటాకువలె సుందరమయిన భస్మముఅగును ఇదిపూర్ణచంద్రోదయము దీనిని మాషప్రమాణము తమలపాకుమధ్యనుంచి నమిలిమిం గినయెడల మిక్కిలిదర్పోన్మత్తులయిన స్త్రీల గర్వమునణచును ॥33॥

## —♦ (20) పైత్యాంతకరసం ♦—

శ్లో॥ ఏకాంశం విషసైంధవం చ సుషవీశృంగం షడంశాన్వితం
ద్వ్యంశం సింధుర మప్రరూపదరదం త్ర్యంశం సుమర్ద్యంద్రుథం
జంభీరేణతు పైత్యకాంతికరసం మాషప్రమాణంభజే
త్పైత్యాజీర్ణముఖామయభ్రమువమీన్ హ్యాగ్నిమాంద్యాన్హరేత్

వాభి సైంధవలవణము ఒక్కొక్క భాగము తెల్లజీలకర్ర ఆల్లము ఆరేసిభా గములు. రససింధూరము రెండుభాగములు, ఇంగిలీకము మూడుభాగములు. వీటిని నిమ్మపండ్లరసముతో మర్దింపవలెను. ఇది పైత్యాంతకరసము దీనిని సేవించినయెడల పైత్యములు అజీర్ణములు నోటపూతలు భ్రమ (కళ్లుతిరుగుట) వాంతి ఎక్కిళ్లు అగ్ని మాంద్యము ఉపశమించును. ॥34॥

## —♦ (21) బాలసూర్యోదయం ♦—

శ్లో॥ ఏకాంశం దరదం రవిప్రియమమౌ ద్వ్యంశం త్రిభాగంవిషం
తుల్యం పర్వతసంభవం శరమితం చార్ధాంశకం గామరం
శ్యామం సర్వసమం సమీకృత మిదం శ్రీబాలసూర్యోదయం
నానావ్యాధిసమాగతజ్వరభయే యుక్తానుపానైర్న్యసేత్॥ ॥35॥

రసము ఒక భాగము తామ్రభస్మము శుక్రభస్మము రెండేసి భాగములు గంధకము వాళి మూడేసి భాగములు అభ్రకము అయిదు భాగములు ఇంగుళ అర్ధభాగము మిరియాలు వీటికన్నిటికిన్ని సమానము వీటిని ఏకము చేయవలయును ఇది బాలసూర్యోదయము దీనిని తగియుక్తానుపానములతో సేవించినయెడల అన్నివిధములయిన రోగములవల్లనుంచి పుట్టిన జ్వరములు శాంతినొందును॥

## —♦ (22) భేదిజ్వరాంకుశం ♦—

శ్లో॥ ఏకాంశం విషపారదం బలివసా ద్వ్యంశం చతుర్భాగ్యకం
పంచాంశం మరిచం షడంశముదితం దాంతంచ సామదద్వయం
మర్ద్యాత్త్రింహిఘదినై స్ద్వదిలం చానాతపే శోషయే
ద్దద్యాదార్ద్రకసానుపానసహితం భేదిజ్వరాద్యంకుశం॥ ॥36॥

వాళి పాదరసము ఒక్కొక్క భాగము గంధకము వెలిగారము రెండేసిభాగములు మిరియాలు అయిదు భాగములు నేపాళము ఆరుభాగములు వీటినిముంగ కొద్దిరసముతో రెండు యామములు మర్దింపవలయును ఇది భేదజ్వరాంకుశము దీనిని జ్వరపక్వకాలమందు అల్లపురసముతో ఇవ్వవలయును. ॥37॥

## —♦ (23) మాలినీవసంతరసం ♦—

శ్లో॥ రసకయుగళభాగం వేల్లజం చైకభాగం
ద్వితయమపి చ మర్ద్యం వాసరాణాం త్రియేణ।
రుగుచితమనుపానం నింబనీరేణ తావ
జ్జ్వరహర మథ కుర్యాన్మాలినీప్రాగ్వసంతం। ॥38॥

రసకర్పూరము రెండు భాగములు మిరియాలు ఒక భాగము వీటిని కంచెక్కరసముతో మూడుదినములు మర్దింపవలెను ఇదిమాలినీవసంతము దీనినితగ్గానుపానములతో సేవించినయెడల సమస్తవిధములయిన జ్వరములు శాంతించును॥ ॥39॥

కుంచా సర్షపహింగువేల్లవివదా తుల్యం విభాగం వరా।
చూర్ణం సర్వసమంచ గుగ్గులురజ స్సమ్మర్దయే న్మాక్షికాత్ ।

పసవాద్ది (చిరుబొద్ది) శొంఠి, చవ్యము, చిలకరి, పిప్పళ్ళు, గంటుభారంగి, వస, రేణుకలు, జాజికాయ, కొడిశపిత్తులు, వాము, కటుకరోహిణి, నాగదుంపలు, పిప్పలిమోడి, చిత్రమూలము, గజపిప్పలి, తెల్లగారాకు, ఇంగువ, వాయువిడంగాలు, అతివస, ఇవి సమానభాగములు, ఈఅన్నిటకిని, రెట్టించు త్రిఫలచూర్ణము, యీమొత్తమునకు సమానము గుగ్గిలము, వీటిని, తేనెతో మర్దింపవలయును ఇదియోగరాజ గుగ్గులు ॥౪౧॥

శ్లో॥ యోగరాజపురనామ భేషజం। కుష్ఠగుల్మహృదయామయా న్హరేత్
శూలమూలగుదపాండ్వపస్మృతి। శ్వాసకాస మపి యోనిపీడనం ॥

ఈయోగరాజగుగ్గలును సేవించుటచే, కుష్ఠరోగము, గుల్మము, వ్రణరోగము, శూల, మూలశంక, పాండువు, అపస్మారము, శ్వాస, కాస, యోనిశూల, శాంతించును. ॥౪౨॥

—♦ 27) రజతచంద్రోదయం ♦—

శ్లో॥ రౌప్యం భాగయుగం రసం గజమితం గంధం కలాసమ్మితం,
సమ్మర్ద్యా బలయా త్రివాసరమిదం సంపాచయే ద్వాలుకే।
హన్యా త్సర్వవిధానుపానసహితో రౌప్యాది చంద్రోదయం
శుక్లవ్యాధిసమస్తమేహదగదా౽౽యాసాగ్నిమాంద్యజ్వరాన్॥

రౌప్యభస్మ రెండుభాగములు, పాదరసము యెనిమిదిభాగములు, గంధకము, పదహారుభాగములు, వీటిని కలబంగరసముతో మర్దించి, వాలుకాయంత్రమున మూడురోజులు వండవలెను ఇది రజతచంద్రోదయము దీనిని తత్యానుకూలానుపానములతో సేవించినయెడల శుక్లనష్టము, సమస్తమేహములు, మేహగదాదోషములు, అగ్నిమాంద్యము, జ్వరములు శాంతించును ॥౪౩॥

—♦ (28) రసరాట్ ♦—

శ్లో॥ ఏకైకం రససిందురం చ దరదం కర్పూరకం హింగుళం
చాతుర్భాగమయో రజోబలివసా౽ష్టాంశం కుమారీద్రవైః।

సమ్మర్ద్యైవ పచే త్సరావపుటకే కన్యాద్రవైర్మర్దయే।
త్స్యాదేత ద్రసరాట్ప్రమస్తకఫజా న్వాతామయాన్నాశయేత్।

రససిందూరము, పాదరసము, రసకర్పూరము, ఇంగిలీకము ఒక్కొక్క భాగము లోహము నాలుగు భాగములు, గంధకము తొమ్మిది భాగములు వీటిని కలబందరసముతో మర్దించి మూకుళ్ళలో పుటము వేయవలయును ఇది రసరాట్. దీనిని యుక్తానుపానములతో సేవించుటవలన కఫజనితవ్యాధులన్ను, వాతజనితవ్యాధులన్ను ఉపశమించును.

## —♦ (29) రామబాణగుళిక ♦—

శ్లో॥ పారదామృతలవంగగంధకం భాగయుగ్మ మరిచేన మిశ్రితం।
అత్రజాతిఫల మర్ధభాగకం తింత్రిణీఫలరసేన గుళికమ్ ॥౭॥

పాదరసము, కరక్కాయపెచ్చులు, లవంగాలు, గంధకము, ఒక్కొక్క భాగములు, మిరియాలు రెండుభాగములు, జాజికాయ అరపాలు, వీటిని చింతపండు రసముతో మర్దింపవలయును

శ్లో॥ మాషమాత్ర మనుపానసేవితం రామబాణగుళికారసాయనం।
నాగవల్లి మరిచేన భక్షితం సద్య ఏవ జఠరాగ్నివర్ధకమ్ ॥౮॥

ఇది రామబాణగుళిక దీనిని మాషప్రమాణముగ అనుపానవిశేషములతోను మిరియాలు, తమలపాకులు, వీటి రసముతోను పుచ్చుకొనిన జఠరాగ్ని వృద్ధినొందును

## —♦ 30 లక్ష్మీవిలాసరసం ♦—

శ్లో॥ జంబీరేణతు హింగుళం దృఢతరం సమ్మర్ద్య సంశోషయే
దద్యా త్తే తదిదం నిధాయ సహసా నారంగనాఖ్యే ఫలే।
ఆవేష్ట్యాంశుకకర్పటేన తదుపరి మృల్లేప్య దద్యా త్పుటం।
హన్యా ద్దాలకఫామయా నతితరాం లక్ష్మీవిలాసో రసః ॥౭౭॥

ఇంగిలీకమును నిమ్మపండ్లరసముతో బాగుగా మర్దించి నీడ నారబెట్టి దానిని నారింజపండులో పెట్టి, పయిన గుడ్డచుట్టి, మట్టిపూసి, పుటము పెట్టవలెను. ఇది లక్ష్మీవిలాసరసము. దీనిని సేవించినయెడల చంటిపిల్లలకు కలిగెడు సమస్తవిధములైన శ్లేష్మరోగములు శమించును. ॥౭౨॥

## —♦ (31) లఘుక్రవ్యాదరసం ♦—

శ్లో॥ ఏకాంశంచ సువర్చలంతు దరదం ద్వ్యంశం మరీచం తథా
టంకం గంధకమేవ తుల్య మనలం శుంఠీలవంగం కణా।
లోహం మూల మమూని చామ్లజరసై స్సమ్మర్దయే త్సప్తధా
తక్రేణైవ పిబే దజీర్ణహరణం క్రవ్యాదనామౌషధమ్ ॥౪౮॥

సౌవర్చలవణము, పాదరసము ఒక్కొక్క భాగము మిరియాలు, వెలిగారము, గంధకము, చిత్రమూలము, శొంఠి, లవంగాలు, పిప్పళ్ళు, లోహము, పిప్పలిమూలము, రెండేసిభాగములు వీటిని ఆమ్లద్రవ్యములచే ఏడుభావనలు చేయవలయును ఇది లఘుక్రవ్యాదరసం [illegible] తో సేవించినయెడల సర్వవిధజీర్ణములు శాంతించును మాదీఫలము, నిమ్మ, నారింజ, [illegible], చింత పిట్టనము గాయము ఫల [illegible] ॥౪౮॥

## —♦ (32) లఘుచంద్రోదయం ♦—

శ్లో॥ గంధం పారద మభ్రకం గిరిభవం వంగం సమం చైలకం
రంభామూలజలేన యామమనియమా త్సమ్మర్దయే ద్యత్నతః।
పిత్తానేకసమస్తకామిలగదా మేహామయా న్సత్వరం
హన్యా త్సర్వవిధానుపానసహిత శ్చంద్రోదయో ఝం లఘుః॥

గంధకము, పాదరసము, అభ్రకము, శిలాజిత్తు, వంగభస్మ, ఏలకులు, సమానభాగములు, [illegible] ఇది లఘుచంద్రోదయము, దీనిని [illegible] తో సేవించుటవలన చాతుర్థ్యాది పైత్యములు, [illegible] విశతి మేహములు, శీఘ్రముగ శాంతినొందును ॥౪౯॥

## —♦ (33) లఘునారాయణకవచం ♦—

శ్లో॥ రససిందూరమయోఽభ్రక త్రికం త్రిఫుకం భూతుంభీవిమర్దితం।
నవఘస్రం సకలామయాపహం లఘునారాయణ వర్మనామకం॥

రససిందూరము, లోహము, ఇంగిలీకము, తామ్రభస్మము, వంగభస్మము, వీటిని భూతులసీరసముతో తొమ్మిదిరోజులు మర్దించవలయును ఇది లఘునారాయణ

కఫసగుల ఎపీన రోగ, యుయా [illegible] నేసి చిన [illegible] ప్లీహవు లయును, శ్వాస్త్ర వ్యాథులు నశించును. ||౫౦||

## —♦ (34) లోకనాథరసం ♦—

శ్లో॥ లోకనాథరస మేకభాగకం మారితాభ్రకం చ వరటాం మరీచకం ।
ద్వ్యంశకం ఘృతమాలపత్రజా స్మర్దయే త్ర్యమధునాక్షయాపహం

మాండూరభస్మము, గవ్వభస్మము ఒక్కొక్క భాగము, మిరియములు, రెండు భాగములు, వీటిని నెయ్యి, తమలపాకులరసము, వీటితో మర్దింపవలయును ఇది లోకనాథరసము, దీనిని తేనెతో సేవించినయెడల [illegible]ము ప్తవిధములయిన క్షయరోగములు, శమించును ||౫౧||

## —♦ (35) వసంతకుసుమాకరం ♦—

శ్లో॥ గాంగేయం రజతం ద్విభాగ మురగం కాంతం త్రిభస్త్ర్యంశకం
చాతుర్భాగక మభ్రవిద్రుమరసం ముక్తాఫలానాం రజః ।
గోక్షీ రేక్షురసాటరూష కదళీ శ్రీపీతనీరద్వయై
ర్రాజీపద్మసుమద్రవై రపి వృథ కస్తూరికామాద్భావయేత్ ।

సువర్ణభస్మము, [illegible]భస్మము [illegible] రెండేసిభాగములు సీసభస్మము, [illegible]హము, తగరభస్మము మూడేసిభాగములు [illegible], అభ్రకభస్మము, [illegible]భస్మము, [illegible]గసము, ముత్యాలభస్మము, నాలుగేసిభాగములు వీటిని ఆవుపాలు, చెఱకురసము, [illegible]ము, అరటిదుంపరసము, మంచిగంధము, పసుపు, పచ్చవేరు, వట్టివేరు, [illegible] సామానులతోను, మాలతీపువ్వులు (జాజిపువ్వులు) పద్మములు వీటి రసములతోను ప్రత్యే[illegible]కముగా ఏడేసిమార్లు [illegible] భావనచేయవలయును ||౫౨||

శ్లో॥ కస్తూర్యా లఘునా వసంతకుసుమప్రాగాకరం నామకం ।
సేవే చ్ఛర్కరయా ద్వివల్లవటికాం మాన్యాజ్జరాం పాండుతాం ।
శూలోన్మాదవిషప్రయోగసకలతృష్ణక్షయాసాగ్రమయా
న్కాంతా యౌవనగర్వభంగపటుకాం ప్రాప్నోతి తత్సేవకః ॥౧౫౩

[illegible] భావనజేసిన పమ్మట కస్తూరిని కలపవలయును. ఇది వసంతకుసుమాకరము, దీనిని రెండువల్లములు, పరిణామము, పంచదార [illegible] పానముతో, సేవించిన యెడల [illegible] పాండువు, శూల, ఉన్మాదము, విషప్రయోగజనితరోగము, తృష్ణారోగము, క్షయ, రక్తవ్యాధి, [illegible]చును మరియు దీనిని సేవించినవారు స్త్రీల యౌవనగర్వమును పోగొట్టు సామర్థ్యముకలవారగుదురు. ||౫౩||

## —♦ (36) వాతగజాంకుశం ♦—

శ్లో॥ అష్టాంశం విషముష్టిగంధకరసం ప్రత్యేకతః కేవలం
తస్త్ర్యంశం చ త్రిఫలం కటుత్రయమిదం జంభాంభసా మర్దయేత్ ।
నామ్నా వాతగజాంకుశో మునివరై ర్నిర్ధారితోఽయం రసః
వాతాశీతి వినాశనే రుగుచితై ర్యుక్తానుపానై ర్భజేత్ ॥౫౪॥

విషము [illegible], గంధకము, [illegible] యనిముగేలు [illegible], త్రిఫలము [illegible], త్రికటువ్యుల [illegible] ద్రవములో [illegible] యును ఇది [illegible] నుపానములతో నవి [illegible] 80 వాతములు [illegible] ॥౫౪॥

## —♦ (39) వాతరాక్షసం ♦—

శ్లో॥ కాంతం గంధకమభ్రకం మృతరసం తామ్రం సమాంశం తథా
వస్త్రాభూతకటుత్రయాగ్నితులసిభిర్నోద్భవానాం రసైః ।
సమ్మర్ద్య త్రిదినం పృథ గ్లఘుపుటం దత్వా పున స్సంచితం
విఖ్యాతం భువి వాతరాక్షస మిదం సర్వానిలోన్మూలనమ్ ॥౫౫॥

కాంతలోహము, గంధకము, అభ్రకభస్మము, రసభస్మము, తామ్రభస్మము, పెటివి తెల్లగలిజేరు, శొంఠి, పిప్పలి, మిరియాలు, చిత్రమూలము, తులసి, తిప్పతీగె వీటియొక్క నిజరసములతో ప్రత్యేక ప్రత్యేకముగా మూడేసి రోజులు మర్దనా చేసి సమ్మొట లఘుపుటం పెడవలయును ఇది వాతరాక్షసము దీని [illegible] నుపానములతో సేవించినయెడల సమస్త వాతవ్యాధులు శాంతించును ॥౫౫॥

## —♦ (38 వాతవిధ్వంసి ♦—

శ్లో॥ తామ్రాభ్రత్రపునాగగంధమరిచం లోహం రసం టంకణం
చైకైకాంశ ముదీరితం కటువిషం సార్ధం చతుర్భాగకం ।
సమ్మర్ద్య త్రిదినం పృథక్పృథగపి క్షుణ్ణం త్రివారం కణా
భూతాశానలనాగరోషణరుజా భృంగద్రవైః తత్పరమ్ ॥ ౫౬ ॥

తామ్రభస్మము అభ్రకభస్మము, వంగభస్మము, సీసభస్మము, గంధకభస్మము,

మిరియాలు, కాంతభస్మము, పాదరసము, గౌరిగరము, శొంఠి ఒక్కొక్కభాగము, నాభి నాలుగున్నరభాగములు, వీటిని ఎప్పటివలె నేలతాడిగడ్డలు, చిత్రమూలము శొంఠి, మిరియాల, పచ్చగల్వకోష్టు, గుంటగలగర వీటి రసములతోనున్ను,

శ్లో॥ నిర్గుండీవిజయార్ద్రవాసజరసై ర్జంబీరనీరై ర్దినం
సమ్మర్ద్యం వివిధానుపానసహితం స్యా ద్వాతవిధ్వంసకం।
ప్లీహాపస్మృతికుష్ఠమాంద్యకఫరు క్శూలగ్రహాణ్యామయా
న్సర్వాన్సర్వనసన్నిపాతజనితవ్యాధీ న్నిహన్యా ద్ధ్రువం ॥ ౩౮ ॥

వావిలి, గంజాయి, అల్లము, అడ్డసరము వీటి కషాయములతోను, నిమ్మపండ్ల [illegible]రసముతోను ప్రత్యేకప్రత్యేకముగా మూడేసిగోజు[illegible]లు [illegible] పలయును [illegible] వాత విధ్వంసి దీనిని అనుపానభేదములతో సేవించినయెడల ప్లీహరోగములు, అపస్మారము, కుష్ఠము, అగ్నిమాంద్యము, కఫరోగములు, శూలలు, గ్రహణి, [illegible] ములు, సన్నిపాతములు మొదలయినవి శాంతించును ॥౩౮॥

— ♦ (౩9) విజయసిందూరం ♦ —

శ్లో॥ త్ర్యంశం పారదనాగవంగరజతం చాష్టాదశాంశం నభ
స్సమ్మర్ద్యైవ నిధాయ కాచవివరే కన్యావిలాసద్రవైః।
పచ్చాద్వాలుకయంత్రకే సముచితం కాలం పున ర్మర్దయేత్
పూర్వాభ్యాం విజయాఖ్యసిందుర మిదం మేహానశేషా న్హరేత్ ॥

పాదరసము, సీసభస్మము, వంగభస్మము, [illegible] భస్మము, [illegible], గంధకము పద్దెనిమిదభాగములు, వీటని కలబందరసముతోను, [illegible], కషాయముతోను మర్దించి [illegible] [illegible] యీ ఔషధ మంతయు యుక్తముగా సిందూరించేవరకు [illegible] [illegible] మారల [illegible] మర్దించవలెను [illegible] విజయసింధూరము [illegible] సారానుపానములతో సేవింపగ సమస్తవిధములయిన మేహములు శాంతించును

—♦ (40) శీతాంశురసం ♦—

శ్లో॥ ఏకాంశం హరితాళకం మనశ్శిలా ద్వ్యంశం తథా వ్యోషకం
వర్ద్యం నింబజలేన సుందతరం శీతాంశునామా రసం।

హన్యాత్కాసవిషాఽరుచిజ్వరవమిశ్వాసాన్ నిలప్లీహరు
గ్గుల్మార్శనాహపిచండకామలముఖా స్తత్యానుకూలద్రవైః। (౫౯)

[illegible]రదశిలము, మణిశిల, ఒక్కొక్క భాగము, త్రికటుకములు రెండుభాగములు, వేప [illegible]క్కగసముతో నృగువుగా మర్దించవలెను ఇది శితా[illegible]రసము దీనిని [illegible]ను పాన పానములతో సేవించినయెడల [illegible], విషప్రయోగవిత వ్యాధి, అరుచి, జ్వరము, [illegible], శ్వాస, [illegible], ప్లీహ [illegible] గ్రహ[illegible], కడుపుబ్బరము, మూలరోగము, కామిలలు మొదలగు వ్యాధులు నశించును. (౫౯)

## —♦ (41) శూలకుఠారం ♦—

శ్లో॥ దంతీ బీజర సేంద్రగంధకవిషం గౌరం వరా త్ర్యూషణం
టంకం తామ్రముమూని మూర్కవరసై ప్సమ్మర్ద్య యేత్సుందరం।
సేవే త్సూలకుఠారమార్ద్రకరసై ర్గుంజాప్రమాణం తతో
హన్యాత్సూలశతాని రాజసగణం తద్విష్ణుచక్రం యథా ॥ 60

నేపాళబీజములు, [illegible], గంధకము, [illegible], [illegible]దశిల, త్రిఫలములు శొంఠి, పిప్పలి, మిరియాలు, వెలిగారము, తామ్రభస్మము, వీటిని గుంటగలగరాకు రసముతో మర్దింపవలయును, ఇది శూలకుఠారము దీనిని [illegible] సేవించుటవలన విష్ణు[illegible], [illegible], [illegible], మొదలగు సర్వవిధములయిన శూలలు నశించును ||౬౦||

## —♦ (42) షడ్గుణం ♦—

శ్లో॥ ఏకాంశం దరదం షడంశ ముదితం గంధం కుమారీద్రవై
ర్మర్ద్యం త్రింశదహాని కాచవివరే క్షిప్త్వా పచే ద్వాలుకే।
ఏత త్షడ్గుణనామ మామయోచితరసై స్సంసేవితం సత్వరం
హన్యా దింద్రియనష్టకార్శ్యవదన వ్యాధిప్రమేహజ్వరాన్ ॥

పాదరసము ఒకభాగము, గంధకము ఆరుభాగములు, వీటినికలబందరసముతో ముప్పదిరోజులు మర్దించి కాచకుప్పెయందుంచి, వాలుకాయంత్రమున, వండవలయును ఇది షడ్గుణము దీనిని రోగయుక్తానుపానములతో సేవించినయెడల శుక్లనష్టము, శుష్కించుట, నోటిపూతలు, ప్రమేహములు, జ్వరములు, శాంతించును. ||౬౧||

## —♦ (43) సన్నిపాతభైరవి ♦—

శ్లో॥ ఏకాంశం రసగంధతాళకశిలా టంకం విషం త్ర్యంశకం
వంగం సర్వసమం, హుతాశనభిష గ్జంబీరనీరైః పృథక్ ।
సమ్మర్ద్యం దినమేవ భైరవ మిదం స్యా త్సన్నిపాతా దిమం
త త్తద్రోగయుతానుపానసహితం హన్యాదనేకామయాన్ ॥

రసము, గంధకము, తాళకము, మణిశిల, వెలిగారము, ఒక్కొక్క భాగము, నాభి మూడుభాగములు, ఇంగిలీకము, వీటికన్నిటికి సమానము. వీటిని చిత్రమూలం కషాయము, అల్లపురసము, నిమ్మపండ్లరసములతో ప్రత్యేకప్రత్యేకముగ ఒక్కొక్క రోజు మర్దించవలయును. ఇది సన్నిపాతభైరవి దీనిని ఆయా రోగోచితానుపానము లతో సేవించినయెడల అనేకవిధములైన వ్యాధులు శాంతిపొందును ॥౬౨॥

## —♦ (44) స్వచ్ఛందభైరవి ♦—

శ్లో॥ ఏకైకాంశ ముదీరితం బలివసానూతం విషం జాతికం
త్వర్ధాంశం సకలై స్సమం కటరజ స్తాంబూలపత్రద్రవైః ।
స్వచ్ఛందాద్యకభైరవం భిషగిదం సంయోజయే (ద్యత్నతః) చ్ఛ్రద్ధయా
ఎల్లీద్రోణసుమార్కవ్రికోణ్థతిగసైరీర్ణజ్వరే పీనసే। ॥౬౩॥

గంధకము, పాదరసము, నాభి ఒక్కొక్క భాగము, జాజికాయ అర్ధభాగము, వీటికన్నిటికి సమానము పిప్పలిచూర్ణము, వీటిని తమలపాకులరసముతో మర్దింపవల యును ఇది స్వచ్ఛందభైరవి. దీనిని తమలపాకులు, తుమ్మిపువ్వులు, అల్లము, వీటి రసములలో దేనితోనయినను వైద్యుడు ప్రయత్నపూర్వముగా శ్రద్ధవహించి యిచ్చిన యెడల జీర్ణజ్వరములు, రొంప మొదలయినవి హరించును. ॥౬౩॥

## —♦ (45) సిందూరభూషణం ♦—

శ్లో॥ ఏకైకాంశమయో రజ స్త్రిపుశిలాజిద్గంధకం విద్రుమం
టంకం హింగుళ మభ్రకం సముదితం సర్వై స్సమం సిందూరం
మర్ద్యం హంసపదాంబునా సముచితం సిందూరకం భూషణం
గర్భిణ్యామయపైత్తికజ్వరవమీ స్తన్యా త్త్రిదోషజ్వరాన్ ॥౬౪॥

తా॥ కాంతలోహము, వంగభస్మము, శిలాజిత్తు, గంధకము, పగడభస్మము, వెలిగారము, ఇంగిలీకము, అభ్రకము ఇవి ఒక్కొక్క భాగము, వీటి కన్నిటికి సమానము రసచిందూరము; వీటిని హంసపాదియాకు రసముతో తగినంతసేపు మర్దింపవలయును. ఇది సిందూరభూషణము దీనిని రోగోచితానుపానములతో సేవించుటవలన గర్భిణీస్త్రీలకు సంభవించు సమస్తవ్యాధులున్ను, పైత్యసంబంధమయిన వ్యాధులున్ను జ్వరములున్ను, వాంతులున్ను, త్రిదోషజనితవ్యాధులున్ను ఉపశమించును. ౬౪॥

## —♦ (46) సింహప్రతీపాలనం ♦—

శ్లో॥ సూతం గంధకవత్సనాభగరళం చైవైకభాగాన్వితం
మర్ద్యం హంసపదాంబునా పరిమితం యుక్త్యానువాసైర్భజేత్ ।
అభ్యంగం చ జలోపచార ముదితం పథ్యం చ దధ్యోదనం
వాతశ్లేష్మజసర్వదోషశమనం సింహప్రతీపాలనం॥ ॥౬౫॥

తా॥ రసము, గంధకము, నాభి, గరళము, (పాషువిషము) వీటిని హంసపాదియాకు రసముతో మర్దింపవలయును. ఇది సింహప్రతీపాలనము. దీనిని మితప్రకారము రోగోచితానుపానములతో సేవించినయెడల వాతశ్లేష్మజనితము లయిన సకలవిధవ్యాధులను ఉపశమించును ॥౬౫॥

## — ♦ (47) సూతరాజీయం ♦—

శ్లో॥ షడ్భాగం తిలజం రసం రవిసుహృత్త్వాన్యత్షోడశాంశం తథా
గంధం సైంధవ మష్టభాగ ముదితం జంభారసైర్వాపరం।
సమ్మర్ద్యాఽఽతపశోషణేన రుచిరం సూతాదిరాజీయకం
సేవేతార్ద్రజలేన మారిచరసా శ్లేష్మామిలా న్నాశయేత్ ॥

తా॥ వెలిగారము 6 భాగములు, పాదరసము, తామ్రభస్మము 16 దేసి భాగములు, గంధకము. సైంధవలవణము 8 దేసి భాగములు వీటిని నిమ్మపండ్ల రసముతో ఒకరోజు మర్దించి, ఎండలో పెట్టవలయును. ఇది సూతరాజీయము. దీనిని అల్లము, లేక మిరియాలు వీటి కషాయముతో సేవించినయెడల సమస్తశ్లేష్మవ్యాధులు శమించును. ॥౬౬॥

## —♦ (48) సూతికాభరణం ♦—

శ్లో॥ సూతం శాణమితం విషం పలమితం సంచూర్ణ్య కాచాంతరే
క్షిప్త్వా యామయుగం పచే ల్లఘునచే స్స్యా చ్ఛూతికాభరణం।
సంగృహ్యార్ధశరావలగ్న మగదం సూచ్యా క్షిపే న్మూర్ధని
క్షీరేణాఢ్య విలేపనే ర్గుడసృజం తాపే దిశే న్మధురమ్ ॥౬౭॥

తా॥ పాదరసము ఒక శాణము, నా॰ ఒక ఫలము, వీటిని చూర్ణముచేసి గాజుపళ్ళమునందుంచి పైన మరియొక గాజుపళ్ళమును మూసి సంధిబంధముగావించి రెండుయామములు సూక్ష్మాగ్నిచే వండవలయును. ఇదిసూతికా (సూచికా) భరణము పైన బోర్లించిన పళ్ళమున కంటుకొనిన యీ ఔషధమును సూదిమొనతో తీసిఆసూదిమొనను వచ్చినంతమందును మూర్ఛితుడైన రోగియొక్క శిరస్సునందుంచి ఆసూదిగుచ్చిన స్థలమందు వచ్చిన రక్తముతో యీమందు కలియునట్లు వేలితో మర్దింపవలయును. పిమ్మట ఆవుపాలు కూడా పోసి మర్దింపవలయును. యీ చికిత్సవలన రోగికి తాపము కలిగినేని మధురపదార్థములను శీతలపదార్థములను భక్షింపవలెను. ౬౭॥

## —♦ (49) సూర్యావర్తి ♦—

శ్లో॥ ఏకైకాంశక మగ్ని సూతకరజః కార్పాసబీజాంకురం
టంకం రక్తఫలస్య బీజ ముదితం హేమాక్షికం త్ర్యంశకమ్ ।
భిన్నాసత్వకహింగుళం సురుచిరం జంభార్ద్రకై ర్మర్దయే
చ్ఛూర్యావర్తి రరోచపైత్యవమనశ్వాస కాసా న్నాశయేత్ ॥౬౮॥

తా॥ వస, మత్స్యభస్మము, వమిడిపత్తిగింజలలోని పప్పు, వెలిగారము, కాకిదొండగింజలలోని పప్పు, హేమ క్షీరభస్మము ఇవి ఒక్కొక్క-భాగము, తిప్పసత్తు, ఇంగిలీకము మూడేసిభాగములు, వీటిని నిమ్మపండ్లరసముతోను, అల్లపురసముతోను మర్దించవలెను. ఇది సూర్యావర్తి, దీనిని సేవించుటచే అరోచకము, పైత్యములు, వాంతులు, శ్వాస మొదలయిన సమస్తరోగములు నిర్మూలము లగును ॥౬౮॥

## —♦ (50) హుతాశనరసము ♦—

శ్లో॥ ఏకాంశం శివబీజటంకణబలి త్ర్యంశం విషం మారిచం
చాష్టాంశం వరజంభజాతపయసా సమ్మర్దయే ద్యాసరమ్ ।

సేవ్యం చార్ద్రరసా ధృతాశనరసం హన్యా దజీర్ణామయ
ప్లీహోదరారోచకసన్నిపాతపవనవ్యాధీ న్విషూచీ రసః ॥ ౯౯ ॥

తా॥ పాదరసము వెలిగారము, గంధకము, ఇవి ఒక్కొక్కభాగము. నాభి మూడుభాగములు, మిరియాలు ఎనిమిదిభాగములు, వీటిని నిమ్మపళ్ళ రసముతో ఒకరోజు మర్దింపవలయును ఇది హుతాశనరసము దీనిని అల్లపురసముతో సేవించిన యెడల అజీర్ణరోగములు, గుల్మరోగములు, అరోచకము, సన్నిపాతవ్యాధులు, విషూచి మొదలయిన వ్యాధు లన్నియు శమించును ॥౯౯॥

## — జ్వరనిర్వచనము —

శ్లో॥ జ్వరో భవే ద్వ్యాధికరోగరాజో
సదాగ్రగామీ సకలామయానాం ।
ప్రాయః ప్రభూణా మివ కేత్యభృత్యా
స్తస్మా జ్జ్వరస్యాస్య చికిత్సితం స్యాత్ ॥ ॥౧౦॥

తా॥ తరుచుగా ప్రభువులకు ముందు నడుచుచుండు సేవకులవలె రాబోవు రోగములకు ముఖ్యమయిన జ్వరము న్ని రోగములకంటె ముందుగా సంప్రాప్తమగుచుండును కాన ప్రతిరోగమందును ముందుగా యీజ్వరమునకు చికిత్స చేయవలయును. (బంటులను సేవించిన ప్రభువు వెనుకనున్న నట్లు జ్వరమునకు చికిత్స చేసిన తో తరుచుగా రోగము నివారణ మగుగల దనుట) ॥౧౦॥

శ్లో॥ జ్వరో భవే జ్జాఠరపావకస్య బహిర్గతత్వం సకలేంద్రియేషు ।
బహిర్గతాగ్నేః ప్రతిరాను చాంత ర్గతత్వ మేవ జ్వరవారణం హి ॥

తా॥ జఠరాగ్ని స్వస్థానమునుండి విడిచి సర్వేంద్రియములయందును బహిర్గల మగుటయే జ్వరము బహిర్గతమయిన యీ జఠరాగ్నిని తిరిగి స్వస్థానమునను చేగుకొనునట్లు చేయుటయే జ్వరనివారణము ॥౧౧॥

శ్లో॥ రోగస్య భావో విషమస్థితి స్స్యా
దారోగ్య మస్యైవ యథాస్థితి స్స్యాత్ ।
యయా సమత్వం ప్రతిపద్యతేఽసౌ
సా వై చికిత్సేతి వదంతి తజ్జ్ఞాః ॥ ॥౧౨॥

తా॥ వాతపిత్తశ్లేష్మములయొక్క వైషమ్యస్థితియే రోగమనియు, వీటియొక్క సమానస్థితియే ఆరోగ్యమనియు యే యే క్రియలవలన యీ ధాతువులు వైషమ్యస్థితిని విడిచి సమత్వమును పొందుచున్నవో, అదియే చికిత్స అనియు చెప్పబడుచున్నది.

శ్లో॥ సర్వేశ్వరానుగ్రహ వర్ధితానాం నైసర్గికాఽఽత్మక వైకృతీనాం । భూయోనుకూలీకరణం చికిత్సావిధాన మాహు స్సుచికిత్సకస్య ॥ 23॥

తా॥ ప్రాణికోటి పరమేశ్వరుని అనుగ్రహించిన ఇంద్రియములయొక్క సహజస్థితికి సంభవించిన పోరాటమూలమైన వికృతులయొక్క సరిచేయుటయే చికిత్స అని చెప్పబడుచున్నది అనగా దేహమునకు సరిపడని పదార్థమును ఇంద్రియములే బహిష్కరించుచుండును. ఇదియే ఇంద్రియములయొక్క పోరాటము 23॥

శ్లో॥ రసం విషం గంధకహింగుళాదీ । న్ముక్త్వా స్వయం క్షేపే చరేద్విశుద్ధాన్ । మితం సముక్త్వా పరిహారం పరిభాషితం । తైలాంబువాతాగ్నిశముదీరితం ప్రాక్॥ 24॥

తా॥ పాదరసము, నాభి, గంధకము ఇంగిలీకము మొదలయినవాటిని శుద్ధిచేయకుండ వాడరాదని చెప్పుచున్నారు, శుద్ధిచేసిన వాటనే ఉపయోగించవలెను ఔషధమర్దనమునకు కాలనిర్ణయమును చెప్పనిచో ఒకయామము మాత్రమే మర్దింపవలయును. ఔషధసేవకు కాలనిర్ణయమును చెప్పనిచో ప్రాతఃకాలమందు మాత్రమే పుచ్చుకొనవలయును। తైలము ఉదకము, సాత్ర, భాగములు, వీటిని గురించి పరిభాషాప్రకరణమున చెప్పబడినది 24॥

— ♦ దోషత్రియ వ్యాప్తకాలము ♦ —

శ్లో॥ రాత్రౌ దినేచప్రథమద్వితీయ । తృతీయభాగేః కఫపైత్యవాతాః। చరంతి దేహే సతతం నరాణాం। ప్రాయేణ విజ్ఞేయ మిదం భిషగ్భిః।

తా॥ రాత్రిగాని, పగలుగాని, మొదటిభాగమున కఫాధిక్యము, రెండవభాగమున పైత్యాధిక్యము, మూడవభాగమున వాతాధిక్యము, కలిగియుండును. అని వైద్యులచే గుర్తింపబడవలయును. ॥25॥

తా॥ తిప్పసత్తు, కరక తాడి పుశిరికలు, పాలసుగంధి, పిల్లితేగలు, జీలకర్ర, ధనియాలు, దానిమ్మ, తవాక్షీరి, ఏలకులు, ఉలుసు, పర్పాటకము, పేలాలు, పుశిరి కాయ ఇవి పిత్తమును హరించును ॥౨౯॥

## — శ్లేష్మహరానుపానములు —

శ్లో॥ దశమూలహింగు రాస్నా పిప్పలీ మరీచి । త్రిఫలా వాస్తుకి ఖరాశ్వ సింహీ । గుడూచికా సైంధవపత్రికాశ్చ । లవంగపథ్యా తులసీ కఫఘ్నాః । ॥౨౯॥

తా॥ ఇంగువ, దశమూలములు, రాస్న, పిప్పళ్లు, మిరియాలు, తెల్లతెగడ, మునగ, వాయు విడంగము, తిప్పతీగె, సైంధవలవణము ఆకుపత్రికము, లవంగాలు, కరక్కాయ, తులసి ఇవి శ్లేష్మమును హరించును ॥౩౦॥

## — రక్తవృద్ధ్యనుపానములు —

శ్లో॥ ద్రాక్షాఖర్జూరా క్షీరమధుశృంగాటికా । పలంకషా గోక్షురశర్కరా గోక్షురాః । నవోద్ధృతం సీతశివా చ జాతికా । ఫలం జహా రక్త వివృద్ధిదాయకాః ॥ ॥౩౧॥

తా॥ ద్రాక్షపండు, ఖర్జూరపుపండు, పాలు, తేనె, నేలగుమ్మడు, పల్లేరు, తుంగముస్తలు, పటికిబెల్లము, (లేక చీనాపంచదార) గొబ్బిగింజలు, వెన్న, సోపు, జాజికాయ, దూలగుండగింజలు, నేలతంగేడుపువ్వులు ఇవి రక్తమును వృద్ధిచేయును.

## — మాత్రాప్రమాణం —

శ్లో॥ మాత్రామానం ధాతువహ్నిం దోష మగ్నిం బలం వయ ।
వ్యాధిం ద్రవ్యం చ కోష్ఠంచ వీక్ష్య మాత్రాం ప్రయోజయేత్ ॥

తా॥ బుద్ధిమంతుడగు వైద్యుడు రోగము, జఠరాగ్ని, రోగియొక్క దేహ బలము వయస్సు, వ్యాధి, ద్రవ్యము, కోష్ఠము అను వాటిని బాగుగ గుర్తెరింగి సమయానుగుణ్యముగ మాత్రాప్రమాణమును ఊహించి కల్పించుకొనవలెను గాని మాత్రకు పరిమితి యథాస్థితిగ నుండదని తెలియవలయును. ॥౩౨॥

— ♦ క్రియా స్థితి ♦ —

శ్లో॥ రోగస్యానుచితం గదోక్తమపి తత్త్యాజ్యాదనుక్తం గదా-
నుక్తం రోగసమాజకం స్వమతితః సంయోజయే దౌషధే
సంపూర్ణానుభవప్రయుక్తభిషజా మాయత్తతాయా మిదం
న్యస్తం తత్సమయానుకూల మఖిలవ్యాధిప్రశాంత్యై సదా ॥

తా॥ ఎట్టి ఔషధయోగమం దైనను చెప్పబడిన ద్రవ్యము రోగోపశాంతికి అనుపయోగ మైనచో దానిని విడిచిపెట్టవలయును. చెప్పబడకపోయినను రోగోపశాంతికి ఉపయోగ మైనచో దానిని చేర్చవలయును ఇది అనుభవముకలిగి చికిత్స చేయు వైద్యుని అధీనమై యున్నది ॥౨౩॥

శ్లో॥ ప్రాగ్రోగా స్స్వచికిత్సితా స్తు కుపితాః కుర్వంత్యనేకాన్ రుజాన్
కేచి త్స్వంగదరూపహేతుకలితా భూత్వాఽన్యరుక్కారకాః ।
శామ్యంత్యేవ న కేచి దన్యవికారమూలా స్తువంతి స్వయం
రుక్సాంకర్య మనేకజైన మనిశం సంక్షోభయే ద్వైద్యకాన్ ॥౨౪॥

తా॥ తమంతట తాము స్వతంత్రముగ జనించి బాధించుచుండునప్పుడు వాటికి తగిన చికిత్స చేయక, ఉపేక్షించినయెడల ఆ రోగములే ప్రబలములై ఇతర విధములైనపెక్కురోగములను పుట్టించును అట్టి తరుణములయందు ఆ యితరరోగముల రోగహేతువును పోలియుండును వాటిలో ఒక రోగము ఇంకొకరోగమును పుట్టించి, తనను తానే శమించును మరియొక రోగము ఇంకొక రోగమునకు తాను కారణముగా నుండి మరియొకరోగమును పుట్టించుటలో శాంతినొందక, తాను పుట్టించిన ఆ యితరరోగముతో కూడి కలిసి బాధించును యీ ప్రకారముగా వ్యాధుల యొక్క సాంకర్యము చికిత్సచేయు విషయములో వైద్యులను మిక్కుటముగా కష్టమును కలిగించును, ఇట్టి సంకీర్ణవ్యాధులు లోకమునందు అనేకచోట్ల మిక్కుటముగా కనుపించుచున్నవి. ॥౨౪॥

శ్లో॥ స్వతంత్రతాయాః పరతంత్రతాయాం ప్రాధాన్య ముద్దిశ్య రుజ
శ్చరేత్ క్రియాం । తదా ప్రధానే సహాఽప్రధాన వ్యాధిశ్చ
శామ్యత్యనిశం క్రమేణ ॥ ॥౨౫॥

తా॥ జ్వరాదిరోగములయందు ఇతరరోగములు గలిగియున్నయెడల వాటిలో ప్రధానరోగ మేది? అప్రధానరోగ మేది? అని ఆలోచించి, ప్రధానవ్యాధిని గుర్తెరింగి, దానికి తగిన చికిత్సను చేయువలయును. అట్లు చేసినయెడల ప్రధానమైన రోగముతో పాటు అప్రధానమైన రోగమున్ను ఉపశమించును. అప్రధానరోగమునకు వేరే చికిత్స చేయునవసరము లేదు యీ సౌకర్యముకొరకే వైద్యుడు ప్రధానా-ప్రధాన రోగవిజ్ఞానమును సంపాదించుకొని యుండవలయును. ॥౮౫॥

శ్లో॥ కదాచి దాగంతుకజై రసూహ్యైః । ప్రాగ్దోషశూన్యేపి హఠాత్
త్ప్రకోపః । దోషత్రయస్య ప్రభవే దతీవ । తేనైవ సంప్రాప్తి
రుపద్రవస్య ॥ ॥౮౬॥

తా॥ ఒక్కొక్కప్పుడు ఆగంతుకములయిన శస్త్రక్షత అభిఘాతాదులచే అంతకు పూర్వము దోషసంబంధము లేకున్నను తక్షణమే వాతాదులు ప్రకోపమును పొంది పోటు, నొప్పి, మొదలయిన ఉపద్రవములను కలుగజేయును. ॥౮౬॥

శ్లో॥ ఏవం సంభవితాను మూస్తు జనయే ద్రోగాంతరం తద్యథా
సంతాపాదపి రక్తపిత్తమమునా తాప స్తతః శోషణమ్ ।
ప్లీహా తస్య మహోదరం శ్వయథురు గ్గుర్మామకం చోదరం
గుల్మం జాగరణాదిభి స్నశి దినా కాసః క్షయ శోషణమ్ ॥౮౭॥

తా॥ యీప్రకారము స్వస్వకారణము లయిన మిథ్యాహారవిహారాదులచేతనున్ను, శస్త్రక్షతాభిఘాతాదులచేతనున్ను, జనించినరోగము మరియొక రోగమును పుట్టించును ఎట్లనగా జ్వరసంతాపముచే రక్తపిత్తమున్ను, దానిచే జ్వరమున్ను, యీ రెండింటివలన శోషయు, దానిచే ప్లీహాభివృద్ధియు ఇట్లే మహోదరమున్ను శోథయు ఉదరరోగమున్ను, ఊపిరివ్యాధియు, గుల్మమున్ను కలుగును. ॥౮౭॥

## — ♦ పంచవిధస్వేదములు ♦ —

శ్లో॥ వాతప్రకోపేపి చ సన్నిపాతే । విష్ఠా జ్వరప్రాణవిముక్తికాలే ।
స్వేదోద్భవః ప్రాగ్ద్వయయో ర్మహను స్స్యా । ల్లలాటసర్వాంగగళ
ప్రదేశే ॥ ॥౮౮॥

తా॥ వాతప్రకోపము, సన్నిపాతవ్యాధి, మలవిసర్జనకాలము, జ్వరమువిడుచు సమయము, ప్రాణముపోవుసమయము యీ అయిదు కాలములయందును చెమట

పట్టును. వాతప్రకోపమునందు, సన్నిపాతమునందు పలుమారును, మలవిసర్జన కాలమందు లలాటమందును, జ్వరము విడచుసమయమునందు సర్వాంగముల యందున్ను, ప్రాణాపాయసమయన కంఠప్రదేశమందున్ను ఈప్రకారము అయిదువిధములుగా చెమట కలుగును.

## —♦ మాననిర్ణయము ♦—

శ్లో॥ గుంజం వ్రీహిచతుష్టయం ప్రభుమితత్ర్వీహిశ్చ చిన్నం క్రమా ।
న్మాషం షణ్మితగుంజకం సమభవ చ్ఛాణా చతుర్మాషకం ।
కోలం శాణయుగం పలం స్తనయుగం కర్షం తు కోలద్వయం
వింశన్మాషమితం తులం సముదితం శుక్తి ర్ద్వికర్షం భవేత్ ॥

నాలుగు వడ్లగింజలు ఒకగురిగింజ. పదహారు వడ్లగింజలు ఒకచిన్నము. ఆరు గురిగింజలు ఒక మాషము నాలుగుమాషములు ఒకశాణము. రెండుశాణములు ఒకకోలము. రెండుకోలములు ఒక కర్షము యిరవైమాషములు ఒకతులము. రెండుకర్షములు ఒక శుక్తి. రెండుకోలములు ఒకపలము. ఈరీతిగా తూనికలను గుర్తింపబడెను.

మాషమునకు హేమము, ధాన్యకము అనియు, శాణమునకు ధరణము, టంకము అనియు, కోలమునకు క్షుద్రభము, వటకము, వంక్షణము అనియు, కర్షమునకు పాణిమానికము, అక్షము, పిచువము, పాణితలము, కించిత్పాణి, తిందుకము, బిడాలపతనము, షోడశికము, కరమధ్యము, హంసపదము, సువర్ణము, కబళగ్రహము, ఉదుంబరము అనియు, శుక్తికి అర్థపలము, అష్టమిక అనియు, పలమునకు ముష్టి, ఆమ్రము, చతుర్థిక, ప్రకుంచము, షోడశీబిల్వము అనియు, పర్యాయపదములు.

| వడ్లగింజలు. | గురిగింజలు. | చిన్నము. | మాషము. | శాణము | కోలము | కర్షము | తులము | శుక్తి | పలము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 4 | 1 | | | . | | | . | . | . . |
| 16 | 4 | 1 | . | ... | ... | ... | .. | . . | ... |
| 24 | 6 | 1½ | 1 | | . . | ... | ... | ... | ... |
| 96 | 24 | 6 | 4 | 1 | ... | ... | ... | ... | ... |
| 192 | 48 | 12 | 8 | 2 | 1 | . . | ... | ... | ... |
| 384 | 96 | 24 | 16 | 4 | 2 | 1 | ... | ... | ... |
| 480 | 120 | 30 | 20 | 5 | ... | ... | 1 | ... | ... |
| 768 | 192 | . . | 32 | 8 | 4 | 2 | ... | 1 | ... |
| 1536 | 384 | ... | 64 | 16 | 8 | 4 | 3,1/5 | 2 | 1 |

## —♦ యంత్రములు ♦—

శ్లో॥ పాతాళవిద్యాధరటంకకోష్ఠ
డోలాతులాకచ్ఛపగర్భగార్యః ।
తేజఃపరో భూధరవాలుకాని
భైషజ్యయంత్రాణి సమీరితాని ।

1 పాతాళయంత్రము, 2 విద్యాధరయంత్రము, 3టంకయంత్రము (ఊర్ధ్వనళికాయంత్రము,) 4 కోష్ఠయంత్రము, 5 డోలాయంత్రము, (స్వేదనాయంత్రము,) 6 తులాయంత్రము, 7 కచ్ఛపయంత్రము, 8 గర్భయంత్రము, 9 గారీయంత్రము, 10 తేజోయంత్రము, (లంబికాయంత్రము,) 11 జలయంత్రము, 12 భూధరయంత్రము, 13 వాలుకాయంత్రము, ఇవి ఔషధములను తయారుచేయు యంత్రములు పదమూడు.

## —♦ (1) పాతాళయంత్రము ♦—

నోరు వెడల్పుగల మండిగను కుతికవరకు భూమిలో పాతిపెట్టి మరియొకకుండలో ఔషధద్రవ్యములనుంచి దానిపయిని చిన్నని రంధ్రములుగల మూకుడును అధోముఖముగా బోర్లించి యీరెండింటికి సంధిబంధము గావించి దానిని భూమిలో పాతిపెట్టిన మండిగపయిని బోర్లించి ఆబోర్లించిన కుండపై తంపటవేయగా మూకుడు యొక్క రంధ్రములద్వారా నేలయందు పాతిన మండిగలోనికి తైలము (ద్రావకము) స్రవించును. సాంగశీతలమున (క్రమముగా చల్లారినతర్వాత) దానిని ఉపాయముగా గ్రహించవలెను. ఇది పాతాళయంత్రము

## —♦ (2) విద్యాధరయంత్రము ♦—

పొయ్యిమీద నొక కుండనుంచి, దానిలో పాదరసముంచి, ఆ పాదరసము పోసిన కుండపయిని మరియొక కుండను ఊర్ధ్వముఖముగా పెట్టి యీ రెండుకుండలు కలిసినచోట సంధిబంధముచేసి పయికుండనిండా నీళ్ళు పోసి అయిదు జాములు పాకముచేసి సాంగశీతలమున అందలి రసమును గ్రహింపవలెను. ఇదివిద్యాధరయంత్రము.

## —♦ (3) టంకియంత్రము ♦—

పొయ్యిమీద ఔషధద్రవ్యములతో నిండింపబడిన కుండనుంచి దాని కుక్షికి క్రింద రంధ్రముచేసి ఆ రంధ్రమునకు సరిపడిన గొట్టమును యిమిడ్చి ఆకుండమూతికి సరిపడిన మూకుడును మూత పెట్టి సంధిబంధము చేసి యెడించి గొట్టముచివర నొక గ్లాసునుగాని సీసానుగాని ఉంచి పాకము చెడినయెడల కుండలోని ఔషధము నళికాముఖమున (గొట్టముద్వారా) గాజుపాత్రలోగాని సీసాలోగాని పడును. ఇది టంకియంత్రమనియు, ఊర్ధ్వనళికాయంత్రమనియు, చెప్పబడును

## — ♦ (4) కోష్ఠియంత్రము ♦ —

కొలిమిలో ద్రవ్యమును ఉంచి తిత్తితో ఊదవలెను. ఇది కోష్ఠియంత్రము

## —♦ (5) డోలాయంత్రము ♦—

ఔషధ ద్రవ్యమును వస్త్రమున మూటగట్టి ఆమూటకు దారముకట్టి పొయ్యిమీద నొక కుండపెట్టి అకుండలో పచనము చేయతగిన ద్రవ్యముల నుంచి ఆ మూటను కుండలో పోసిన పచనద్రవ్యముల నడుమ వ్రేలాడునట్లు కుండపయిని అడ్డముగా నొక పదురుబద్ద పరచి అబద్ద మధ్యభాగమున వ్రేలాడునట్లు కట్టి కుండ పైని మూకుడు బోర్లించి యోగమునందు చెప్పబడిన పరిమితిప్రకారము పచనము చేయవలయును. ఇది డోలాయంత్రమనియు, స్వేదనాయంత్రమనియు, చెప్పబడును. లేనిచో పొయ్యిమీద పెట్టినకుండమూతికి వస్త్రముకట్టి దానిపయిని స్వేదసంస్కారము చేయవలసిన ద్రవ్యముల నుంచి దానిపయిని మూకుడుబోర్లించి పాకముచేయుటకూడా స్వేదనాయంత్రమనియు, డోలాయంత్రమనియు, చెప్పబడును.

## — ♦ (6) వాలుకాయంత్రము ♦—

చిప్పబుడ్లవలె రెండుమూషలనుచేయించివానియందొకదానిలో పాదరసమును, రెండవదానిలో గంధకచూర్ణమును పోసి వాటినుఖమునంగు అరఅడుగు పరిమాణము గల గొట్టమును తగిలించి వాటిసంధులకు చీలమన్ను యిచ్చి దానిని వాలుకాయంత్రమందుంచి గంధకమున్న మూసక్రింద అగ్నిజ్వాల చేయవలయును. ఇది తులాయంత్రము. ఇది తాళకము, గంధకము, లోహము మొదలయినవాటి జారణక్రియయందుపయోగించును.

## —♦ (7) కచ్ఛపయంత్రము ♦—

ఒక ప్రమిదిలో పాదరసమును పోసి ఆప్రమిదిపయిని ఇంకొక ప్రమిది బోర్లించి చీలమన్ను యిచ్చి వెడల్పువాటి నోరుగల డాకలో బిడాలవణమును వేసి పాదుచేసి దానిపయిని చీలమన్నుయిచ్చిన ప్రమిదసంపుటమును పెట్టి ఆసంపుటము పైని ప్రమిద మునుగునట్లు మరల బిడాలవణముంచి ఆడాకను భూర్తిగా పిడకలతో నిండించి పుటం బిడిన (అగ్నినిడిన) రసగంధకములు రజాణమగును ఇది కచ్ఛప యంత్రము. బిడాలవణ మనగా మారేడుపిందిలను ముక్కలుగా తరిగి యెండించినవి. అని తెలియవలయును.

## —♦ (8) గర్భయంత్రము ♦—

పెద్దకుండ నొకదానిని పొయ్యిమీద నుంచి అకుండమధ్య యిటుకముక్క పెట్టి ఆయిటుకముక్కపయిని గాజుగిన్నె నుంచి ఆగాజుగిన్నెచుట్టూ కంఠమువరకు ఔషధద్రవ్యమునుంచి పెద్దకుండమూతిపై మరియొక కుండ నిలువబెట్టి చీలమన్ను ఇచ్చి పైకుండలో నీళ్ళుపోసి మందాగ్నిని జ్వాలింపచేయవలయును పైకుండలోనుంచి మసలకాగిననీటిని డోకి, బట్ట వగైరాలుముంచి చీలమన్నుకదలకుండా నేర్పుగా తీసి వేసి మరలమరల శీతోదకమును పోయుచుండవలయును యీవిధముగా చేయుచుం డిన పయినపెట్టిని కుండ అడుగుభాగమునందు అవిరిచేరి యిటుకముక్కపయిని పెట్టిన గాజుగిన్నెలో తైలాదులు స్రవించును ఆతైలమును యుక్తిచే గ్రహింప వలెను. ఇది గర్భ యంత్రము.

## —♦ (9) గారీయంత్రము ♦—

లండితెడు చతురముగల దళసరి యిటికను సంపాదించి దానిమధ్య మూపా కారముగా గోతిని చేసి ఆగోతికి సున్నము పూసి నున్నగాచేసి యెండించి పిమ్మట, వెండిగాని, బంగారముగాని, అభ్రకముగాని, అను వాటిసత్వములను నూరి పయిని చెప్పిన యిటికమూసలో పోసి ఆసత్వమునకు నాలుగవవంతు గంధకమును మూస యొక్క అడుగుభాగమందున్ను పైభాగమందున్ను పోసి ఆగంధకమధ్యమున పయిన ఉదహరించిన సత్వమునుంచి యిటికమూసపయిని ప్రమిదనుబోర్లించి చీలమన్ను యిచ్చి యెండించి గుర్రపుగిట్ట పరిమాణముగల యెరుపిడకలను పేర్చి పుటము పెట్టవ లయును. ఇది గారీయంత్రము.

## —♦ (10) తేజోయంత్రము ♦—

ఒక పెద్దకుండలో ఔషధ ద్రవ్యమును పోసి దాని కుతికలో రెండు గొట్టములుగల యంత్రమును యిమడ్చి యీ యంత్రమునకు పయిభాగమున చేర్చి కుండమూతిమీద మరియొక కుండ నుంచి చీలమన్ను యిచ్చి పయికుండలో నీళ్ళుపోసి అడుగుభాగమందున్న కుండకింద మందాగ్నిని జ్వలింప చేయవలెను. పయికుండలోని నీళ్ళు మసలకాగిన పిదప వాటిని చీలమన్ను కదలకుండా యుక్తిచే తీసివేసి మరల మరల శీతోదకమును పోయుచుండవలెను క్రిందనుండు నళికాముఖమున గాజుపాత్ర మొదలయిన వాటినుంచి ద్రావకమును గ్రహింపవలయును. ఇది తేజోయంత్రము. దీనినే లంబికాయంత్రమని చెప్పెదరు

## —♦ (11) జలయంత్రము ♦—

లోహసంబంధమయిన మూసను చేసి దానిలో రస, గంధకములనుంచి దాని మూతికి మరియొక లోహ సంబంధమయిన మరిమూతిగల మూసతో మూసి పాతయిటిక చూర్ణమును బెల్లమును తుమ్మచెక్క కషాయముతో నూరి దానిని మూస చుట్టూ పలుమారు పూతలు పూసి యెండించుచుండవలెను ఇట్లు చేసినచో నీళ్ళు ఆమూసను ఛేదింపకుండును. అటువంటి మూసను నీటితో నిండిన లోహ భాండమందుంచి ఆభాండమును పొయ్యిమీదనుంచి అగ్నిని జ్వలింప చేయవలెను ఇది జలయంత్రము ఇది దీర్ఘకాలమువరకు గాని సిద్ధించదు దీనిని స్పర్శ, గంధకాది చూర్ణముల కుపయోగింతురు.

## —♦ (12) భూధరయంత్రము ♦—

ఒక మూసలో పాదరసము నుంచి దానిపయిని యింకొక మూసబోర్లించి చీలమన్ను యిచ్చి, ఆసంపుటమును యిసుకతో నిండింపబడిన భాండ మధ్యమందుంచి ఆయిసుకపయిని పిడకలతో పుటము వేయవలయును. యిసుకపోసినకుండ సగము భాగమునకు ఊడగొట్టినదిగా ఉండవలయును. మూతిని ఊడగొట్టనిచో పిడకలతో పుటమువేయుటకు తగిన సావకాశము ఉండదు.

## —♦ (14) వాలుకాయంత్రము ♦—

జానెడు చతురముగల కుండను తెచ్చి దాని కడుగుభాగమున దబ్బనముతో లావుగా బెజ్జముచేసి ఆబెజ్జమునకు పైభాగమున ఔషధకుప్పెనుంచి ఆకుప్పెయొక్క

కంఠముదరకు యిసుకపోసి ఆకుండపయిని మూకుడు బోర్లించి చీలమన్ను యిచ్చి పొయ్యిమీదనుంచి చెప్పబడినంత కాలమున్ను పచనము చేయవలయును. ఇది వాలుకాయంత్రము.

### — ♦ పుటములు ♦ —

(1) గోవరపుటము, (2) కపోతపుటము, (3) వరాహపుటము, (4) గజపుటము, (5) మహాపుటము, (6) కుంభపుటము అని ఔషధములను తయారుచేయు పుటములు ఆరు కపోతపుటము లఘుపుటము, కుక్కుటపుటము వీటికిస్వల్పభేదము.

### — ♦ (1) గోవరపుటము ♦ —

ఏరుపిడకలను మెత్తగా నలగగొట్టి ఆచూర్ణమును నేలమీదపోసి దానిమధ్యయందు ఔషధముగల కుప్పెనుగాని, సంపుటమునుగాని, ఉంచి అగ్ని నుంచుట గోవరపుటము

### — ♦ (2) కపోతపుటము ♦ —

జానెడు చతురముగల గోతినిత్రవ్వి ఆగోతిలో రొమ్డు లేక యెనిమిది పిడకలను ముక్కలు ముక్కలుగా విరిచివేసి ఆముక్కలతో ఔషధమును పుటంబిడుట కపోతపుటమనబడును.

### — ♦ (3) వరాహపుటము ♦ —

మూరెడు చతురముగల గోతియందు ఏరుపిడకలను ఉంచి ఔషధమును పుటముచేయుట వరాహపుటము.

### — ♦ (4) గజపుటము ♦ —

మూరన్నర చతురముగల గోతియందు ఏరుపిడకలను ఉంచి ఔషధమును పుటముచేయుట గజపుటము

### — ♦ (5) మహాపుటము ♦ —

రెండుమూరల చతురముగల గోతియందు ఏరుపిడకలను ఉంచి దానియందు ఔషధమును పుటవేయుట మహాపుటము

### — ♦ (6) కుంభపుటము —

కుండకు అడుగుభాగమున అంగుళిము చతురముగల నలుబది రంధ్రములు చేసి ఆకుండలో సగముపరకు అనగా రంధ్రముల వరకు వరకు బొగ్గులుపోసి ఆబొగ్గుల పయిని ఔషధమును ఉంచి ఆకుండపైభాగమున మూకుడువుంచి చీలమన్ను యిచ్చి నీడనెండించి పిమ్మట ఆకుండను పొయ్యిమీద పెట్టి మూకుడుతో బొగ్గునిప్పులు పోసి కుండకు అడుగుభాగమున మందాగ్నిచే మూడుదినములు వంటచేసి స్వాంగశీతలమున అందలి ఔషధమును గ్రహింపవలెను ఇది కుంభపుటము

# సారూప్యౌషధ చికిత్స.

రోగము అనగా ఆయుర్వేదపద్ధతిని వాతపిత్తశ్లేష్మములయొక్క వైషమ్యస్థితి, అలోపతీమతమున దేహమునందు ప్రవేశించిన సూక్ష్మక్రిములయొక్క సముదాయస్థితి సారూప్యౌషధమతమున దేహమునందుగల జీవ లవణములయొక్క (టిష్యూ సాల్టులయొక్క) లోపస్థితి అనియు మర్యాద. హోమియోపతీ వైద్యమునందు రోగమును గురించి తర్కింప నగత్యము కానరాదు. రోగిదగ్గర కనపడుచున్న వికారములకు సమానగుణధర్మములుగల మందులను గుర్తించి ప్రయోగించుటయే ముఖ్యచికిత్సయైయున్నది. పొటెన్సీలయొక్క హెచ్చుతగ్గులనుబట్టి ఔషధములయొక్క గుణములయందు తేడాలు ఉండును యీస్థూలదేహమున సూక్ష్మరూపమును ధరించిన ప్రాణధారణాశక్తియెట్లు విడిసియున్నదో అట్లే ప్రతిమందుయందును సూక్ష్మరూపమును ధరించిన ప్రాణధారణశక్తి యిమిడియున్నది. ప్రాణధారణశక్తియే చైతన్యశక్తి యీచైతన్యశక్తియొక్క విషమస్థితియే రోగము. యథాస్థితియే ఆరోగ్యము. గాన ద్రవ్యరూపమైన మందులలోనిశక్తిని సూక్ష్మశక్తిలోనికి మార్చినగాని దేహమున వ్యాపించుటకు సావకాశము ఉండదు గనుకనే పొటెన్సీ ఎంతపెద్దదయిన అంతగొప్పగా పనిచేయును (పెద్దపొటెన్సీలోమందు తక్కువ)ఇదియే ఈ వైద్యమునందలి రహస్యము. జ్వరమువిడిచిన మొదట మందివ్వవలయును జ్వరమునకు వేళ మారినను ఎక్కువ తక్కువ స్థితికలిగినను మందునిచ్చియుచున్నట్లుగా పించిగుణముకనుపించినంతటితో మందును మాని రోగిని తృప్తిపరచుటకై పంచదార మాత్రల నిచ్చుచుండవలెను. తాత్కాలిక వ్యాధులయందు చిన్న పొటెన్సీమందులను, పురాణవ్యాధులయందు మధ్యపొటెన్సీ మందులను, వంశపారంపరాగతములైన ఫిరంగాది రోగములయందు పెద్ద పొటెన్సీమందులను వాడవలెను 1 మొదలు 18 వరకు చిన్నపొటెన్సీ 30 మొ॥ 200 వరకు మధ్యపొటెన్సీ 500 లగాయతు పైవన్నియు పెద్దపొటెన్సీలు అని తెలియవలెను. చిన్న పొటెన్సీలను అవసరమునుబట్టి రోజు 1కి (5) లేక (6) సార్లున్ను మధ్య పొటెన్సీలను రోజు 1కి (3) లేక (3) సార్లున్ను పెద్ద పొటెన్సీ మందులను వారమునకు ఒకసారిగాని యున్నంతకాలము ఊరుకొని అటు తర్వాతనున్ను వాడవలెను మిక్కిలి ప్రావీణ్యత కుదిరినగాని పెద్దపొటెన్సీలను స్వతంత్రముగా సావధానముచేసి వాడుట మంచిదికాదు. ఇచ్చినమందు ఎంతకాలము వరకు పనిచేయునో అనినయును అనుభవమువలన స్పష్ట తెలియునదై యున్నది. యీమందులు ద్రావకము, పొడుము, బిళ్ళలు, మాత్రలు, స్వరూపమున నుండును ఒకపొటె

న్నీమందుసీసా కాళీగానే దానిలో మరియొక పొటెన్సీమందును పోయుట, ఇక్లే బిరడాలను మార్చుట, యితరవస్తువులుగాని, మందులుగాని, వున్నబీరువాలో యీ మందులను దాచుట పనకిరాదు. ప్రత్యేకబీరువాలో యీమందులను నిలువజేసి తెల్ల కాగితములతో పొట్లములుగా, కట్టుకొనవలయును.

లోపలికిచ్చు ఔషధగుణమును పోలిన (పైకివ్రాయు) కొన్నిటింక్చరులుగూడ గలవు. వాటిలో కొన్ని లోపల కిచ్చు ఔషధముయొక్క పేరుతోను, మరికొన్ని మరియొక్క పేరుతోను ఉండును. వాటిలో గుడ్డపీలికలను ముంచి బాధగల ప్రదేశమందు వేయుటయు. కొన్నికొన్ని బాధలయందు అటింక్చరును 10 రెట్లు వెచ్చని నీటితోకలిపి అనీటితో బాధకల ప్రదేశములయందు కాచుటయు మంచిగాయున్నది.

ముల్లీన్ ఆయల్ చెవిసంబంధములయిన సర్వవ్యాధులకు పనిచేయును రోజు 1 కి రెండుసార్లు 2 చుక్కల చొప్పున చెవిలో వేయవలయును) పైమందులపేర్ల పేర్లతోను, ఇతరములయిన పేర్లతోను గల అయింటుమెంట్లను అవసరము నూహించి వాడినచో మంచిఫలితము కలుగును.

(1) అర్నికా— కముకుదెబ్బలు, కీళ్ళపట్లు, జిగటవిరేచనములు, నిస్త్రాణ, మూత్రబంధము, పైల వెడలకుండుట, వేవిళ్ళు వీటిని నివారణచేయును.

(2) అలెట్రిస్ ఫేరనోసా— అజీర్ణము, ఋతుస్రావము, కుసుమరోగము, గర్భస్రావము, గర్భాశయవ్యాధులు, చెవులలో హోరు, పాలిపోవుట, ఫలితేరిణా ఫులు, మలబంధము, శూల వీటిని నివారణచేయను

(3) అవెనాసతీవా— అపస్మారము, ఋతుశూల, చిత్తచాంచల్యము, తిమ్మిర్లు, దడ, నల్లమందుఅలవాటు, మొదలయినవి, మెదడుకు సంబంధించిన వ్యాధులు. (చదువుట, వ్రాయుట, ఉపన్యాసము, కవిత్వము మొదలైనవి) శీఘ్రస్ఖలనము, శుక్లనష్టము, స్త్రీలరోగములు వీటిని నివారణచేయును.

(4) అసాఫటీడా— గోరింతదగ్గు, చలి, చీముకారుట, పాలు ఎక్కువ తక్కువలు. హిస్టీరియా— వీటియును.

(5) ఆర్సెనికం ఆల్బం— అరుచి, యిగుళ్ళవాపు, ఉబ్బు, కనుపొట్టలవాపు, క్షయ, చెవులలోనిచీము, జంతువిషము, తలతిప్పు, తుమ్ములు, దయ్యముపట్టినట్లుండుట, పరిణామశూల, బోద, మన్యపుజ్వరము, విదాహము వీటిని నివారచేయును.

పునొప్పి, పులితేన్లుపులు, పుండ్లు, భ్రమ, మగిత, మనశ్చాంచల్యము, మరుపు, మసక, మ ఖమునిగారింపు, ముదిమిచేవచ్చినవ్యాధులు, మూర్ఛ, వ్రణములు, శరీరాంతర్గతములయిన కురుపులు, సంధిగుణము వీటి యును

(17) కోటెలన్ టిగ్— ఉబ్బసము, కడుపులోపోట్లు, కనురెప్పల దళసరి, చర్మరోగములు తలదిమ్ము, నిస్త్రాణ, నీళ్ళవిరేచనములు, పండ్లనుండి రక్తముపడుట మరుపు, యోనిశూల, రసికారుచుండు పొక్కులు, విరేచనానుమానము, సోమరితనము వీటి॥ యును

(18) గ్రాఫైటిస్ — ఇగుళ్ళవాపు, గాలిబిళ్ళలు, గొరెచిప్పి, చిప్పి, చలి, చీకటియందయిష్టము, చొల్లుకారుట, తామర, నిద్రలేమి, పొక్కులు, బుద్ధిమాంద్యము, బొల్లి, మలబంధము వీటి॥ యును

(19) చిరాటా — కడు పుబ్బరము, దుర్వ్యసన, నిస్త్రాణ, పొడిదగ్గు, వీటిని నివారణచేయును

(20) చైనా— అజీర్ణము, అమితమైన నిద్ర, ఉబ్బురోగము, కడు పుబ్బరము, కళ్ళిదగ్గు, కామిగ్లు, చలిజ్వరము తుమ్ములు, పాశజ్వరము, మూత్రపిండములయందలిబాధ, మూత్రబంధము, వాపులు, శూల, సంభోగమువలన కలిగిన బలహీనత వీటిని నివారణజేయును.

(21) జెల్సిమియం — ఋతుశూల, కంపము, జ్వరము, తలదిమ్ము దప్పిదాహమునందయిష్టము ప్రసవవేదన నిలచిపోవుట, భరింపలేని తలపోట మూత్రమధికముగా వెడలుట, వెర్రిచూపు, శుక్లము మూత్రముతో కలిసి పడుట, సామాన్యములయిన వాతవ్యాధుల, స్త్రీలకువచ్చు కాకిసోవాల, (మూర్ఛ) రోగము వీటిని నివారణజేయును

(22) టెరిబింత్ -- ఉమ్మిలోరక్తము పడుట, ఏటికిపోములు, గర్భపాతము, జలోదరము, దురదపొక్కులు, నసిపురుగు, పోత పపొక్కులు, (మొటిమలు) మగత, వీటి యును

(23) డల్కమరా -- అగ్నిమాంద్యము, కనుపొట్టలవాపు, కీళ్ళసంధుల యందు బయలుదేరిన బిళ్ళలు, గాలిమార్పుచే కలిగినవ్యాధులు, నీళ్ళవిరేచనములు, పక్షవాతము, మూత్రమువిడుచునప్పుడు పమితమయిన మంట, రక్తవమనములు వీటి॥వి వా॥

(24) వానియానా— నపుంసకత్వము, నరములయందుండు అశక్తత, వీటిని పోగొట్టి అధికమైనబలమును కలిగించును

(25) డిజటాలిస్— క్షయ, కామిల, గుండెలలోనీరు, లేక వాపు, గోళ్ళు

పాదములు; శిశ్నాగ్రము మొదలయినవి వాచుట, చొల్లుకారుట; దడ, నాడిసన్న సన్నగించుట; నొక్కినచో శరీరము సొట్టబడుట; నోరెండుట; పరాకు, బుద్ధి; మరణ భీతి, మూత్రబంధము, శీఘ్రముగా జ్వరమువచ్చుచుండుట, వీటిని నివారణ చేయును.

(26) డ్రొసీరా— క్షయ, కీళ్ళుపట్లులేకుండుట, కోరింతదగ్గు; చెవులలో హోరు, తుమ్ములు, పసరువాంతులు, రాత్రిభాగమందు బాధఎక్కువగుట, రొంప, వీటిని నివారణచేయును

(27) తూజా— ఊచరపొట్ట, కడుపులోను శరీరముయొక్క పైభాగమందున్న బయలుదేరుగ్రంధులు, (వాపులు) కలతనిద్ర, కీళ్ళసంధులయందు బయలుదేరినబిళ్లలు, గర్భస్రావము, గుండెలదడ, గోళ్లచుట్టూగూడుపోయుట; చెవిపోటు; తిమ్మిర్లు, నోటిపూత, పార్శ్వపునొప్పి, పుప్పిగోళ్ళు, పులిపిరికాయలు,(సురుగుడుకాయలు,) మూత్రపిండములవాపు, మూలశంక, విరేచనబంధము, శగ, సవాయి; వీటిని నివారణచేయును.

(28) నక్సువామికా— అజీర్ణము, ఉబ్బసము, ఋతుబద్ధము, చెమ్మలోతిరుగుట- లేక నీళ్లలోనానుటవలన గలిగినరోగములు, నిస్త్రాణ, పక్షవాతము, పడిశము, పురుషులకుసామాన్యముగా సంభవించుచుండెడు రోగములు, మన్యపుజ్వరము, వ్యసనమువల్లతత్త్వముచెడిపోవుట, వికారము, సోమరితనము, వీటిని నివారణచేయును.

(29) పల్సటిల్లా— ఉబ్బసము, ఊపిరిగొట్టునొప్పి, చలి; జిగటవిరేచనములు, నిద్రలేమి, పెదవులు, చాలకబీటలుతీయుట, పెద్దపురిటిలోమైల సరిగాపెడలకుండుట, లేక తెల్లగాపెడలుట, పొడిదగ్గు, మావి అలస్యముగా గానిపడకుండుట, స్త్రీలకు సామాన్యముగా సంభవించుచుండెడు రోగములు వీటిని నివారణచేయును.

(30) పేరాఫిన్— అగ్నిమాంద్యము, ఒరుపు, చలి, చీముకారుట, నోటినుండి చేదునీళ్ళుకారుట, మలబంధము, విదాహము, విశేషమయినమూత్రబాధ;శరీరమున సూదులుగుచ్చినట్లుండుబాధ వీటిని నివారణచేయును

(31) ఫాస్ఫరస్— అతిమూత్రము, ఎడతెగనివికారము, ఎముకలుపట్టులేకుండుట; క్షయ, కామిల, చుండు, తలదిమ్ము, తూలు, నీళ్లవిరేచనములు, పీసర, మగత; రుద్రవాతము; శరీరముమొద్దువలెనుండుట: వీటిని నివారణచేయును.

(32) బెల్లడోనా— ఇగుళ్లవాపు, ఋతుశూల, ఎండదెబ్బ; (వడగొట్టుట) కడుపుబ్బరము; కళ్ళుచీకట్లుకమ్ముట, కీళ్ళవాపు, కుక్కకాటు కురుపులు; కొవ్వుపట్టుట గాలిబిళ్లలు గొంతుకలోపిల్లికూతలు చెవులలోహోరు జ్వరము తలనొప్పి నత్తి నొప్పులు అగిపోవుట. బాలపాపచిన్న-భయము- మూత్రానుమానము- మూలశంక,-విరోచనములు వెర్రి లేకఉన్మాదము, సంధిగుణము వీటిని నివారణచేయును.

దురదలు- నిద్రలేమి- నుసిపురుగు- పగలునిద్ర అపలేకుండుట- పండ్లుతీపు- పాలి పోవుట- బధిరము- మూత్రవ్యాధులు- మూలవ్యాధులు- రక్తదోషసంబంధములయిన వివిధవ్యాధులు- వివిధములైన వాపులు- స్ఖలనగుణము- సంకర (పేరుపెట్టుటకువీలగునది ముకాని ముఖ్యమూలములేని) వ్యాధులు-సంతతజ్వరము- వీటినినివారణచేయును.

**(44)** సారసపరిల్లా— ఉబ్బురోగములు- ఎముకలసంబంధమైన (పిల్లలఎదు గకుండుట- ముదిమొగముఏర్పడుట- ఎముకలువంకరపోవుట- మొదలైనవ్యాధులు- కలరా- నీటిపొక్కులు- (నీటిచవ్వరోగము- అనగా చర్మము కూసములు బూసములు గాఊడిపోవుట) పక్షవాతములు- వాంతులు- వివిధములైనవాపులు- వేవిళ్ళు- సుఖ వ్యాధులు వీటిని నివారణచేయును.

**(45)** సాలిక్సునైగ్రా— అంగదౌర్బల్యము- ఉన్మాదము- ఋతుశూల- శుక్లనష్టము- హిస్టీరియా మొదలయినవి వీటను నివారణచేయును

**(46)** సెబీనా— కండలుకండలుగా వెడలుఋతుగోష్ఠము- గర్భపాతము- తలపోటు- నోటిచేదు- పరధ్యానము- (అనాలోచన) వికారాలు- మూత్రమువిడచు నప్పుడుబాధ- మహావాతసంబధములైన నొప్పులు- లేకవాపులు- స్త్రీలకుసామా న్యముగాకలిగెడు రోగములు- సురుగుడుకాయలు వీటి॥ యును.

**(47)** స్ట్రమోనియం— ఉన్మాదము- కన్నులుచీకట్లుకమ్ముట- కంపవా తము- ఒత్తి- పసుపుకక్కుడు- మూత్రబంధము- నిరాహారము- సన్నిపాతము- సూచికావాతము వీటి॥ యును

**(48)** హెపార్ సల్ఫ— అడ్డకర్రలు మొదలయిన సుఖవ్యాధులు- ఏడుపప లయినసుతలంపు- కడుపుబ్బరము - కర్ణరోగములు- క్షయసంబంధమైనదగ్గు- గుటక పడకుండుట- గోకుడుకురుపులు- చర్మముపొట్టువలె రాలిపోవుట- తెలతిరుగుట- పార్శ్వపుపోటు- పొడిదగ్గు- భ్రూమధ్యమునపోటు- మరుపు- ముఖసంబంధమైన వ్యాధులు- వస్తువులు పలువిధములైన రంగులుగాను చిత్రముగాను కనుపించుట- వాంతులు- వికారము- వీర్యముపట్టలేకుండుట- స్తిమితములేకుండుట. వీటి॥ యును

**(49)** హెమామలిస్— ఇగుళ్లవాపు- ఒరుపులు- గుండెలలోదడ-జ్వరము- తెగువులు- నిద్రలేమి- నేత్రములుమంట- పండ్లనలుపు- మూత్రపిండములవాపు- రక్తనాళములఉబ్బు- రక్తస్రావము- విషసంబంధము- వీటి॥ యును.

(50) హైడ్రాస్టిస్— అజీర్ణము - కర్ణనాదము - కండ్లకలక కంతులు - చలి కుదుపువచ్చుచుండుట - జ్వరమునందుకలిగెడు ఒడలిక - మలబంధము - మసూచికము - టీకాలబాధ - మహావాతనొప్పులు - వ్రణములు - శ్లేష్మవ్యాధులు - స్మృతిలేకుండుట వీటిని నివారణచేయును.

యీమందులయెదుట పేర్కొనబడిన రోగములకే అకారక్రమానుక్రమణిక నేర్పరచి ఆయారోగముల కెదుట తత్తద్రోగనివారణసూచకములైన మందులసంఖ్యనుతిరిగి విన్యసించినయెడల పేర్కొనబడిన లేక నిర్దిష్టమైన రోగమును వైద్యేతరులు కూడ గ్రంథమందు సులభముగా చూచుకొనుటకున్నూ - ఏరోగమునకన్ని (కేయే) మందు లుపయోగమో గోచరించుటకున్నూ - సమంజసముగా నుండునని అనేకులు హెచ్చరింప అకారాద్యౌషధక్రమగుణపాఠము - అకారాది రోగక్రమమున ప్రసక్తము గావింపబడినది

అగ్నిమాంద్యము— 9-11-16-23-30-34-35. అజీర్ణము— 2-7-13 20-28-50. అజీర్తివిరేచనములు — 14. అష్టికర్మ మొదలయినసుఖవ్యాధులు — 48 అతిమూత్రము— 31. అధఃకాయమునపట్టిననీరు— 39. అన్నమునందయిష్టము— 39. అన్నివిధములయినవిరేచనవ్యాధులు— 43. అపస్మారము -- (హిస్టీరియా) 3-4-6-45 అమితమైన ఋతుశూల— 40. అమితమయిననిద్ర— 20 అరుచి— 5-35. అంగదౌర్బల్యము - 45 అంగములవాపు - 16. అనికాయ - 13 అమవిరేచనములు - 37. ఆయాసము - 7-37 ఆవలింతలు - 41. ఆసనగండమాల - 13. ఆసనమువొరుపు లేకపుండు - 38. ఆసనముతీపు - 34. ఆందోళనము - 38 ఇగుళ్లబాధ - 10-43. ఇగుళ్లవాపు - 5-8-18-32-35-49. ఉన్మాదము - 32-41-45-47. ఉబ్బసము - 7-15-17 28-29-36. ఉబ్బు - 5-20-33-34-35-44. ఉమ్మిలో రక్తముపడుట - 22. ఉలికిపడుట - 35. ఊచరపొట్ట - 27-43. ఊపిరాడకపోవుట - 33. ఊపిరిగొట్టునొప్పి - 29. ఋతుదోషము - 33-34. ఋతుదోషముయొక్క యెగుడుదిగుడు - 41. ఋతుబద్ధము - 28. ఋతుశూల - 3-14-16-21-32-33-46. ఋతుస్రావము - 2. ఎక్కిళ్ళు 7-34. ఎడతెగనివికారము - 31. ఎముకలసంబంధమయినవ్యాధులు 44 ఎముకలు పట్టు లేకుండుట 31 ఎండదెబ్బ (వడగొట్టుట) 32-33. ఎండయెక్కినకొలది తలనొప్పియెక్కువగుట - 40. ఏటికిపాములు - 22-34-43 ఏడవవలయునని తలంపు 48. ఒళ్ళుబరువు లేక తలనొప్పులు 38 ఒరియుట-వాపు మొదలయిన అనేకరకములగు కంటిరోగములు - 37. ఒరుపు 30. 34. 49. కడు

హిష్టీరియా- (అపస్మారము) 3-4-6-45. అనారోగ్యస్థితి ప్రారంభము కాగానే సామాన్యముగా వైద్యులు చికిత్సాప్రారంభమునందు తనఊహ నుపయోగించి యీదిగువ తెలుపబడిన మందులలో దేనినో ఒకదానిని మొదలుపెట్టి వాడవలెను.

ఎకోనైట్- ఓపియం- మోకెమిల్లా- కోనియం- జెల్సిమియం- నక్సువామికా- పల్సటిల్లా- బెల్లడోనా- బ్రయోనియా- ర్హూస్టాక్సు- లేకిసిస్- వెరాట్రం అల్బం- సల్ఫర్- హెమామలిస్- (ఫెర్రంఫాస్)

శరీరము జీవాణుమయస్వరూపమగుటచే రోగోత్పత్తికి జీవాణువులు మూలకారణము. గాన జీవాణుమయశరీరమున గల పదార్థములయొక్క సంకలనము, వైషమ్యము, విభాగము వీటిని తెలియజేయుటచే జీవరసాయనశాస్త్రమని పేరిడబడిన ప్రత్యేకవైద్యవిధాన మింకొకటి కలదు. శరీరమున 12 విధములయిన లవణములుకలవనియు, వీటియందు లోపించిన లవణములనుతిరిగి పూర్తిచేయుటయే చికిత్సయనియు, యీశాస్త్రనియమము.

యీ 12 లవణములే సమస్తవ్యాధులకు దివ్యౌషధములగుటవలన వీటి ప్రయోగోపసంహారవిధానము,విద్యాగంధానుభవములచే సాధింపబడతగియున్నది మందులు క్లుప్తములగుటచే దూరదృష్టి ఎక్కువ కావలసి యున్నది. వీటియందు గూడ పొటెన్సీలు గలవు వాటని అవసరమువెంబడిని ఉపయోగింపవలెను జాగ్రత్తగ వాడినచో దుష్ప్రయోగమునందపాయములేకుండుటకును, సాధుప్రయోగమునందు, శీఘ్రకాలములో గుణమిచ్చి రోగనిర్మూలనము కావించుటకును, యీద్వాదశలవణచికిత్సావిధానమునకు సాటియగు చికిత్సావిధాన మింకొకటి లేదనుటసిద్ధాంతము. కొంచెమించుమించుగా ఒకేజాతిలోనికి చేరు రోగములయందు, ఒకరోగమునకు చెప్పబడిన మందుల నే పోలికనుబట్టి మరియొకరోగమందు గూడ ఆలోచించి వాడవలెను, ఉదాహరణ- అగ్నిమాంద్యము, అజీర్ణము, అన్నమునందయిష్టము, అరుచి, ఈమొదలయినవి. ఇందునుగురించి ప్రత్యేకగ్రంథములు పెక్కులు గలవు.

(1) కాలీమూర్ — అజీర్ణము, కండ్లఎరుపులు, పుసులు- కొయ్యకండలు- దుర్మాంసము- కుసుమవ్యాధులు- జిగటవిరోచనములు- తలనొప్పి- దగ్గు- నాలుకపూత- పైత్యము- రాచకురుపులు- శగరోగము- శ్లేష్మవ్యాధులు- హృదయవ్యాధులు వీటిని నివారణచేయును.

(2) కాలీఫాస్ — అపస్మారము- ఉన్మాదము- కడుపుబ్బరము కలరా- నపుంసకత్వము- నిద్రలేకపోవుట- ప్రసవవేదన- పార్శ్వపుపోటు- మెదడుకుసం

బంధించినవ్యాధులు- రక్తదోషము- వేవిళ్ళు- శుక్లనష్టము- సన్నిపాతవికారములు- వీటిని నివారణచేయును. (2-4-5-11 గర్భిణీస్త్రీలకు ముఖ్యముగా వాడవలసిన మందులు)

(3) కాలీసల్ఫ- అజీర్ణము- ఇగుళ్ళబాధ- ఉబ్బసము- కళ్ళకలక-క్షయ, కామిర్లు- చర్మవ్యాధులు- చప్పి- చలిజ్వరము- చుండు- చెవిపోటు- నీళ్ళవిరేచనములు- పార్శ్వపునొప్పి- మూత్రవ్యాధులు- మేహవాతరోగములు- వాంతులు- శ్వాసరోగములు- సుఖవ్యాధులు- వీటిని నివారణచేయును.

(4) కాల్కేరియాఫాస్- అజీర్ణము- ఎముకలసంబంధమయినవ్యాధులు- గర్భిణీవ్యాధులు- గవదలు-చిక్కిపోవుట- చెవులలోహోరు-తిమ్మిర్లు- నీళ్ళవిరోచనములు- పిల్లలవాంతులు- బాలసాపచిన్నె- వాతరోగములు- విరోచనములు- వీటిని నివారణచేయును.

(5) కాల్కేరియాఫ్లోర్- అజీర్ణము- ఆసనగండమాల- ఉబ్బసము- ఎముకలవ్యాధులు- కంటిరోగములు- కంతులు- కీళ్లవ్యాధులు- కొండనాలుకవాపు- గడ్డలు- గర్భిణీవ్యాధులు- జ్వరము- బుడ్డ- భగందరము- మలబంధము- మూత్రముమంట- మూలవ్యాధి- శ్లేష్మవ్యాధులు- సుఖవ్యాధులు- సురుగుడుకాయలు- వీటిని నివారణచేయును

(6) కాల్కేరియాసల్ఫ- అజీర్ణము- ఉబ్బసము- ఋతువ్యాధులు- కండ్లకలక- చర్మవ్యాధులు- చితికినకురుపులు- చెముడు- నరుకులు- పక్షవాతవ్యాధులు- మరుఘు- రసి- రొంప- విరేచనములు- శుక్లనష్టము- శ్లేష్మవ్యాధులు- వీటిని నివారణచేయును.

(7) నేట్రంమూర్- అతిమూత్రము- ఉబ్బువ్యాధులు- కండ్లకలక- చలిజ్వరము- చెవులలోచీము- తలనొప్పి- తేలుకాటు- దగ్గు- దాహము- రక్తదోషవ్యాధులు- రొంప- విరోచనవ్యాధులు- శుక్లనష్టము- సన్నిపాతవ్యాధులు- వీటిని నివారణచేయును.

(8) నేట్రంఫాస్- అజీర్ణవ్యాధులు- అతిమూత్రము- ఋతుదోషము- కడుపుబ్బరము- కండ్లకలక- క్షయవ్యాధులు- క్రిమివ్యాధులు- కుసుమవ్యాధులు- నోటిపూత- పరిణామశూల- మేహవ్యాధులు- శుక్లవ్యాధులు- వీటిని నివారణచేయును.

(9) నేట్రిుంసల్ఫ — అజీర్ణము- ఆంత్రవ్యాధులు- కడుపుబ్బరము- కండ్ల లోనిదుర్మాంసము- కామిర్లు- కుట్రవిరేచనములు- చర్మవ్యాధులు- చలిజ్వరము- చెవులలోహోరు- నిద్రలేమి- నీరసము- పైత్యవ్యాధులు- మగత- మధుమేహము- మలబంధము- మూత్రాశ్మరి- శూలవ్యాధులు- వీటిని నివారణచేయును

(10) ఫెర్రంఫాస్ — అజీర్ణము- అన్నద్వేషము- కముకుదెబ్బలు- చప్పి- జ్వరజాతులు- నరుకులు- నారికురుపులు- నలిచిదుము- నీళ్లవిరోచనములు- బెణుకునొప్పులు వాంతులు, విదాహము, శ్వాసవ్యాధులు, శుక్లవ్యాధులు, వీటనినివారణచేయు।

(11) మెగ్నీషియాఫాస్ — ఉపస్మారము- ఆంత్రవ్యాధులు- ఉబ్బసము- ఋతుశూల- ఎక్కిళ్ళు- కోరంతద్దులు- జిగటవిరోచనములు- తిమ్మిర్లు- నిస్త్రాణ- పక్షవాతము- పరాకు- పార్శ్వశూల- బాలపాంచినిన్ని- ముక్కుమూలము లేనిసంకరవ్యాధులు- ముఖవ్యాధులు- మూత్రవ్యాధులు- శూలవ్యాధులు- సుఖవ్యాధులు- వీటిని నివారణచేయును.

(12) సైలీషియా — అజీర్ణము- ఉన్మాదము- ఎముకలసంబంధమయినవ్యాధులు- క్షయవ్యాధులు- కంతులు- కురుపులు- చనువ్యాధులు- గజ్జలు- చెవులుగడియలుపడుట- టీకాలబాధ- మలబంధము- రసగులు- నాపులు- వాంతులు- శుక్లవ్యాధులు- శ్లేష్మవ్యాధులు- వీటిని నివారణచేయును

అజీర్ణము- (అజీర్ణంజ్వరము) 1-3-4 5-6-8-9-10-12 అతిమూత్రము- 7-8 అన్నద్వేషము 10 అపస్మారము 2-11 12 అసనగందనాల 5 ఆంత్రవ్యాధులు 9-11 ఇగుళ్లబాధ 3 ఉన్మాదము 3-5-6-11 ఉబ్బ వ్యాధులు 7 ఋతుదోషము 6-8 ఋతువ్యాధులు 6-8 ఋతుశూల 6-8-11 ఎక్కిళ్ళ 11 ఎముకలవ్యాధులు 4-5-12 కడుపుబ్బరము 3-8-9 కముకుదెబ్బలు 10 కలరా 2 కళ్లకలక 3-6-7-8 కంటిరోగము 5 కండ్లపుసులు- దురదలు- కొయ్యకండలు- దుర్మాంసము 1-9 కంతులు 5 12 కామిర్లు 3-8-12 కామిర్లు 3-9 క్రిమివ్యాధులు 8 కీళ్ళవ్యాధులు 5 కట్రవిరేచనములు 9 కురుపుజాతులు 12 కుసుమజాతులు 1-8-12 కొండనాలుకవాపు 5 కోరింతదగ్గు 11 గజ్జలు 5 12 గర్భిణీవ్యాధులు 4-5 గవదలు 4 చర్మవ్యాధులు 3-6-9 చప్పి 3-10 చలిజ్వరము 3-7-9 చుండు 3 చిక్కిపోవుట 4 చితికినకురుపులు 6 చెముడు 6 చెవిపోటు 3 చెవులలోచీము 7 చెవులలోహోరు 4-9 చెవులుగడియలుపడుట 12 జ్వరజాతులు (జ్వరములు) 5-10 జిగటవి

రోచనములు 1-11 టీకాలబాధ 12 తలనొప్పి 1-7 తిమ్మిర్లు 4-11 తేలుకాటు 7 దగ్గు 1-7 దాహము 7 నపుంసకత్వము 2 నరుకులు 6-10 నలిచిడుము 10 నలికురు పులు 10 నాలుకపూత 1 నిద్రలేమి 2-9 నిస్త్రాణ (నీరసము) 9-11 నీళ్లవిరోచన ములు 3-4-10 నోటిపూత మొదలయినవ్యాధులు 8 పక్షవాతము (పక్షవాతవ్యాధులు) 6-11 పరాకు 11 పరిణామశూల 8 ప్రసవవేదన 2 పార్శ్వపునొప్పి 3 పార్శ్వపుపోటు (పార్శ్వశూల) 2-11 పిల్లలవాంతులు 4 పైత్యము (పైత్యవ్యాధులు) 1-9 బాలపాపచిన్నె 4-11 బుద్ధి 5 బెణుకునొప్పి 10 భగందరము 5 మగత, మధుమేహము 9 మరుపు 6-10 మలబంధము 5-9 12 ముక్కుమూలములేని సంకరవ్యాధులు 11 ముఖవ్యాధులు 11 మూత్రము మంట 5 మూత్రవ్యాధులు 9-11 మూల వ్యాధి 5 మూత్రశ్కర 9 మెదడుకుసంబంధించినవ్యాధులు 2 మేహవాతరోగములు 3 మేహవ్యాధులు 8 రక్తరోగము (రక్తదోషవ్యాధులు) 2-7 రసి 6 రాచకురుపులు 1-12 రొంప 6-7 వాపులు 12 వాతరోగములు 4 వాంతులు 3-10-12 విదాహము 10 విరోచనములు (విరోచనవ్యాధులు) 4-6-7 వేవిళ్ళు 2 శగరోగము 1 శ్వాసరోగములు 3-10 శుక్లనష్టము (శుక్లవ్యాధులు) 2-6-7-8-10-12 శూలవ్యాధులు 9-11 శ్లేష్మవ్యాధులు 1-5-6-12 సన్నిపాతనిదానములు 2 సన్నిపాతవ్యాధులు 7 సుఖవ్యాధులు 3-5-11 సుగంధుకాయలు 5 హృదయవ్యాధులు 1

# అలోపతిమతపద్ధతి

వైద్యులు ఉష్ణమాపకముతో శరీరోష్ణము చూచు పద్ధతి ... ధర్మామీటరును బుగ్గపుగా నుంచుకొనిన యెడల పొరపాటులేకుండు నట్లు పరిచూచుకొనుటకు సాధకము కలిగియుండును ధర్మామీటరుపైని 95 డిగ్రీలు మొదలు 100- 105- 110 డిగ్రీలను తెలియజేయు అంకెలు గీయబడి యుండును. వీటిమధ్య ప్రతిడిగ్రీని తెలియజేయు పెద్దగీతలు 96 మొదలు 110 వరకు గీయబడి ప్రతిడిగ్రీలనిమధ్యయందు 5 చిన్నగీతలు గీయబడియుండును యీచిన్నచిన్నగీతలు డిగ్రీలలోని భాగములు. కంటిచూపుతోనే వీటనిపోల్చవలసియున్నది ధర్మామీటరు హిమవంతఋతువు మొదలయిన చలిరోజులలో శీఘ్రముగ ఎక్కకుండుటయు రోహిణీకార్తె మొదలయిన ఎండకాలమున కేసు (గొట్టము) లోనుండి పైకెత్తియు సరిగ్గా ఎక్కిపోవుటయుకూడ తటస్థపడుచుండును అన్నికాలములయందును దీనిని సూర్యోదయ సూర్యాస్తమయసమయములలో చూచుచుండుటమంచిది ప్రతిదినమందు

ఒకేసమయమున చూచుచుండుట మంచిది. సర్వకాలములయందు వేడినీళ్ళుత్రాగెడు అలవాటుగల తెలగాల యిండ్లలో తెలియకధర్మామీటరును వేడినీటితో కడిగితీసుకొని రాగా టెంపరేచరు ఎక్కువగాకనుపించి కంగారుపడినవారుకూడా పల్లెటూళ్లయందక్కడక్కడ కలరు గాన చల్లనినీటితో వైద్యుడే ధర్మామీటరును స్వయముగా కడుగుట మంచిదైయున్నది పసిబిడ్డలు, సరియైన తెలివిలేనివారలు, ఇట్టివారికి నాలుకక్రింద కంటె చంకయందుంచి చూచినచో విరిగిపోవుటకు వీలుండదు ఆరోగ్యముగలవారికి 97½ మొ। 98½ డిగ్రీలకు మధ్యగానుండును 97½ డిగ్రీలకుతగ్గిన యెడల మందగతి 95 డిగ్రీలకు అపాయస్థితి 99 డిగ్రీలుదాటిన జ్వరప్రారంభము 103 డి॥ లవరకు సామాన్యజ్వరము 105 డి॥ లవరకు కఠినజ్వరము 95 డి॥ లకుదిగిపోయినవారు, 106 డి॥ లవరకు పెరిగినవారు కూడ యెట్టివికారములు లేకుండ జీవించిన వారక్కడక్కడ కలరు జ్వరమును కొలుచుటకు ముందుగా పాదరసము 95 వరకు దిగిపోవునట్లు ధర్మామీటరును కుడిచేతితో నేర్పుగావిదిపి జ్వరమును కొలిచినవెంటనే చల్లనిసబ్బునీళ్ళలో కడుగవలెను చంకలోనివేడిమికి 1 డిగ్రీనికలుపుకొన్నచో నాలుకక్రింద చూచినదానికి సరిపోవును.

స్టెతస్కోపును రోగి గుండెమీదను ఊపిరితిత్తులమీదను ఉంచి పరీక్షించుట, చేతితోచూచుటకంటె వీలుగానుండును గుండెపై నుంచినప్పుడు మొదటిస్పందనము దీర్ఘముగాను రెండవస్పందనము స్వల్పముగాను వినిపించును. ఊపిరితిత్తుల పైనుంచినప్పుడు ఊపిరి పీల్చబడునప్పుడెక్కువగాను ఊపిరిని విడుచునప్పుడు తక్కువగాను శబ్దమువినబడును ఊపిరితిత్తులు కఫముతోనిండియున్నప్పుడు (నీటిలోనుండిగాలి బైటకు వచ్చునప్పటివలెనుండునట్లు) బుడబుడమని వినుపించును 1 యురినోమీటరు మధుమేహమును గుర్తించుటకు మంచిది దీనిలోనుండు మీటరుపైని పైనుండిక్రిందకు 1000-1010-1020-1030-1040-1050-1060 అంకెలుండును. ధర్మామీటరునందువలెనే ప్రతిఅంకెమధ్యను 5 చిన్నగీతలుండును ఒకగీతను రెండంకెలుగా గ్రహింపవలయును ఆరోగ్యవంతుని మూత్రము 1015 మొ॥ 1020 కిమధ్యగా ఉండును. మధుమేహము గలవారికి 1020 మొ॥ 1040 వరకు ఉండును. మూత్రముచిక్కనైనకొలదియు మీటరు లోనికి దిగక పైగానేయుండును సామాన్యముగా కొందరిమూత్రమునందును దూదిపింజవలె నుండును. ఇది దోషలక్షణముకాదు. నీలిరంగుగల లిట్మస్ పేపరును ఆరోగ్యవంతుని మూత్రములోముంచినచో అది యెర్రబడును. లిట్మస్ పెన్సిళ్ళుకూడ దొరకును యీపెన్సిలుతో కాగితముపైనిగీసి ఆకాగితమును ముంచి పైప్రకారమూహింపనగును.

ఎనీమా గ్లిసరిన్‌తో చేయుటమంచిది. దీని నుపయోగించువిధము సుగమమగుటచే వ్రాయలేదు. డ్రాప్ఫర్ కండక్టర్-ఇదికండ్లలోమందు వేసుకొనుటకుబాగుండును

(1) ఆలెట్రిస్ కార్డియల్ రిమో— స్త్రీలగర్భాశయ వ్యాధులకు (ఆలెట్రిస్ ఎలగ్జర్, ఆలెట్రిస్ ఎనామిల్, ఇవిప్రతినిధులు. అనగా నకిలీసరుకులు)

(2) ఆసెన్స్ ఆఫ్ చికెన్— రక్తవృద్ధికి (3) ఆండ్రూస్ లివర్ సాల్ట్— సుఖవిరోచనమునకు (అగరల్, కృషన్ సాల్ట్, కేలోమిల్ టేబ్లెట్స్, కేస్టారిపిల్స్, పల్విస్ జాలప్ పౌడర్, సిగాలెక్స్ టేబ్లెట్స్, లాక్సెటిప్ టేబ్లెట్స్) (4) ఈస్టన్స్ సిరప్— చలిజ్వరము తగ్గినవెనుక బలమునకు (5) ఎబిడాల్ సి, బల్లలకు (6) కాడ్ లివర్ ఆయిల్ క్షయకు, దీనినిపోలిన వ్యాధులకు (సూపర్ డి కాడ్ లివర్ ఆయల్ (ఇది చాలమంచిది) డెజన్స కాడ్ లివర్ ఆయల్, మెటజిన కాడ్ లివర్ ఆయల్, వాటర్ బర్రీస్ కాంపౌండు కాడ్ లివర్ ఆయల్, పిటూకాడ్ కాడ్ లివర్ ఆయిల్, స్టరన్స్ బయిన్ కాడ్ లివర్ ఆయల్, ఇంకా చాలా రకములు కలవు) (7) కాప్సికం (టేబ్లెట్స్‌గాను పౌడరుగాను కూడయుండును,) అజీర్ణవ్యాధులకు (8) కాల్షియంగ్లుకోనైట్ (టేబ్లెట్స్ పౌడర్) రక్తస్రావమునకు, సామాన్యవ్యాధులకు (9) కాల్సిఫరంటేబ్లెట్స్, రక్తవృద్ధికి (10) కూప్స్ హాలీబట్ చిన్నపిల్లల నిస్సత్తువను బల్లలకు (11) కెప్టన్స్ మాల్ట్ ఎక్స్‌ట్రాక్ట్ కాన్ డ్ లివర్ ఆయల్ పిల్లలబలవృద్ధికి (12) కోపేబా— సుఖవ్యాధులకు (సాండల్‌వుడ్ ఆయల్ కొద్ది రెంటిని కలిపి అరటిపండుముక్కను గుల్లగా చాకుతో దొలచి దానిలోపోసిపుచ్చుకొనెదరు)

(13) గాంగ్లెట్స్ కాప్స్యూల్స్— సెగసవాయిలకు (14) గ్లికోడిన్ టర్ప్‌వాసకా— దగ్గులకు శ్లేష్మరోగములకు (15) చినమొన్ ఆయల్ -- అన్నివిధములయిన అజీర్ణరోగములకు (16) జల్ఫాల్— కోరింతదగ్గులకు (17) టింక్చర్ ఫెర్రై పెర్‌క్లోర్- రక్తహీనరోగములకు లోపలికి, పంటినలుపు, ఇగుళ్ళవాపు మొదలైనవాటికి పైపూతకు (18) పాలుడ్రిన్ జ్వరజాతికి (19) పిప్పర్‌మెంట్ ఆయల్ అజీర్ణరోగములకు (అమదోషములకు) (20, పేపాపెప్సైన్— జీర్ణమునకు నాడి పుష్టికొఱకు, (21) పేరాఫిన్ లిక్విడ్— మూలవ్యాధి సంబంధమయిన మలబంధమునకు (22) పేలాల్, బలాభివృద్ధికి (23) పేన్‌మిలటస్ టేబ్లెట్స్— అతిమూత్రమునకు (నైటో) గ్లిసరిన్ టేబ్లెట్స్) (24) ఫెబ్రోలిన్— జ్వరములకు (25) ఫెరడాల్ నరములనిస్సత్తువకు (26) బాట్లీవాలా ఎగ్మిక్చర్ చలిజ్వరములకు బందజాతిజ్వరములకు (27) బెరిన్

టేబ్లట్స్ నరములనిస్పృష్టకు (28) బేల్ సిరప్ — గ్రహణికి, (29) బైనన్ అమేరా జ్వరములకు జీర్ణకోశాస్వస్థతలకు (30) బైస్ రెలెడ్ మెగ్నీషియా — అజీర్ణరోగము లకు- శూలకు- (31) మైలడాల్ బాలింతరోగములకు (32) యారోమాల్ట్ ఎక్స్ట్రాక్ట్ బలులకు (33) లాక్టోపెప్సిన్ జీర్ణకోశాస్వస్థతలకు చిన్నపిల్లల బలాభివృద్ధికి (34) లేసిథిన్ ఉబ్బువ్యాధికి, బలమునకు, (35) విరల్ చిన్నవయస్సు గలవారిబలాభివృద్ధికి (36) వింకోలా— బాలింతరోగములకు (37) వుడ్వర్డ్స్ గ్రైప్ వాటర్ పోతపాలపిల్లల అజీర్ణమునకు,

(38) శానటోజిన్ - బలవర్ధకమునకు (ఆహారసదృశమైనది) (39) శారీడాన్ టేబ్లట్స్— తలనొప్పికి, కీళ్ళనొప్పులకు చాలాబాధలు పోటుకు, నొప్పులకు, (40) షార్క్ లివర్ ఆయల్— క్షయవ్యాధికి (41) సార్సపరిల్లా — రక్తదోషమునకు, చర్మరోగములకు, (42) సిడ్రాల్ ఋతుశూలకు, ఇతరశూలలకు (43) సిలిరీనా— స్త్రీలగర్భాశయరోగములకు (44) సోడామింట్ బిళ్ళలు— శూలలకు, అజీర్ణమునకు, (45) పరేటోగ్రాన్ సిరప్— రక్తవృద్ధికి (46) హారంటోన్ టేబ్లట్స్— ఋతుశూలలకు (47) హాలీవరాల్ చిన్నవారలనిస్పృష్టకు (48)హిమోగ్లోబిన్ సిరప్ రక్తవృద్ధికి (వాటర్బరీస్ కాంపౌండ్ సిరప్) (49) హైపోఫాస్ఫైట్స్ (పొడి, టేబ్లట్స్)బలాభివృద్ధికి (50) హెర్బ్ టానిక్స్ (లిక్విడ్) అజీర్తి విరేచనములకు, అరువిరేచనములకు మంచిఫలితమును కలిగించెడివి వివిధములగు ఫార్మసీలయందు యీప్రకారముగ వివరింపబడిన పైమందులను వాటి ప్రతినిధులను (సబ్ సిట్యూట్లును) తెలుసుకొనుచుండును అభ్యాసకులు ఎట్టిలోపములేని కాల మందు చట్టనిషిద్ధములైన ఔషధులను, రోగములను భగించ మున్నగుచోటని విడిచిపెట్టి వారలవ్రతలను వాడతగినమందుల ఫలశ్రుతిని (ఎనాల్ సిస్సును) చక్కగా తెలుసుకొని అభ్యసింపనగును—

శ్లో॥ ఆహారగ్రసనే తమూర్ధ్వరసనాఘ్రాణా౽ననాంతర్బిలం।
బధ్వా స ష్షధా౽గ్రిమానయతి చా౽హారం పురోక్త్వా౽ధ్వనః
ఘ్రాణశ్రోత్రయుగద్వయం చ వదనశ్వాసా౽న్నకోశైకం
జాత్వా న్నేహ వమానమార్గగళితే సంకోచతే తద్బిలం।

ఆహారమును భుజించునప్పుడు కొండనాలుక ముక్కునకును గొంతుకకును మధ్యనున్నరంధ్రమును మూసి, ఆహారమును "సప్తపథ" యనుపేరుగల అన్న గొట్టముయొక్క మొదటిభాగమునకు చేర్చుచున్నది సప్తపథకుముక్కులయొక్కయు చెవులయొక్కయు జంటలనుండి రెండుచొప్పున '4' న్ను నోటినుండియు, ఊపిరి గొట్టములనుండియు, జీర్ణకోశమునుండియు, ఒక్కొక్కటిచొప్పున '3' న్ను వెరశి '7' మార్గములు కలవు ఒకానొకప్పు డాహార మన్నగొట్టములోనికి పోవుటకు బదులుగ దైవికమున ఊపిరిగొట్టములోనిక జారినప్పు డాయూపిరిగొట్ట మన్న మునుగ్రహించ ట కనువుగాకపోవుటచే మూతపడును అట్టిసమయమున ఆహారము ముక్కులనుండియు, నోటనుండియు, ఒయటుపవెలువడును (ఇదియేపలకమారుట).

శ్లో॥ హాస్యాద్యుక్త్యా భాషణా ద్వోద్గిరంతి
పుర్శ్వజ్ఞానం చాన్నకోశస్య భూరి।
ఊర్ధ్వాధోధ స్సంతి చగ్మా ణ్యధస్
త్వ క్సర్వత్రోన క్త తద్యాతి భుక్తం ॥

భుజించునప్పుడు నవ్వుటవల్లనున్ను, అధికముగా మాటలాడుటవల్లనున్ను పలకమారుటకు అవకాశమేర్పడును యీ అన్నవాహికకు స్పర్శజ్ఞాన మత్యధికము. యీ అన్నవాహికపైభాగమందును, క్రిందిభాగమందును, మధ్యభాగమందును, మూడుపొరలు కలిగియుండును యీ మూడుపొరలలోను అడుగుపొర ఎల్లప్పుడు స్రవించుచుండుటవలన భుజింపబడిన అహారము సులువుగా జీర్ణకోశములోనికి జారి పోవుచున్నది.

శ్లో॥ జీర్ణాశయప్రసరసంకుచకర్మ ణైన
తత్రత్యపర్వజనితద్రవ ౦గమేవ।
పాకం ప్రపద్య జఠరాశయమీలనేన
సూక్ష్మాంత్రసంస్థ మధుమాయురసావకీర్ణం ॥

జీర్ణాశయముయొక్క సంకోచప్రసరణములవల్ల పరిపాకమునుపొంది, పిమ్మట జీర్ణాశయము ముకుళించుటచే (కాలాంతరమున) పాకధర్మమునుపొంది, జీర్ణాశయము వంటి సూక్ష్మాంత్రముల నావరించియున్న పిత్త, మధుర, రసములతోనున్ను అంత్ర రసముతోనున్ను అహారము మిళితమగును

శ్లో॥ గర్భాంతర్భువనే విభాజక మితి స్యా దేకకుడ్యాభిదం
తస్యోర్ధ్వాధరభాగయో శ్చ కుహరే హృద్గర్భకోశాభిధే।
హృన్మధ్యే హృదయం ద్విపుప్పుసయుతంశూన్యంచకించి త్తతః
పూర్త్యా చేద్యది పుప్పుసౌ పవనత శ్శూన్యంచ పూర్ణంభవేత్॥

గర్భముయొక్క లోపలిభాగమందు, విభాజకము, అనుపేరుగల పలుచని గోడఒకటి గలదు. యీగోడయొక్క పైభాగమునకు హృదయకుహరమనియు, క్రిందిభాగమునకు గర్భకుహరమనియు పేళ్లు. హృదయకుహరముయొక్క మధ్యగా రెండువైపులను రెండుఊపిరితిత్తులతో కూడియున్న గుండెకాయకలదు. హృదయభాగమంతయు వీటితోనే నిండియుండక కొంచెము కాళీప్రదేశముకూడా ఉండియున్నది. ఊపిరితిత్తులుగాలిచే నిండింపబడినప్పుడు ఊపిరితిత్తులుపెద్దవై యీకాళీప్రదేశమంతా నిండింపబడుచుండును

శ్లో॥ ఊర్ధ్వాధస్థ బృహత్సిరా సరణినా దుశ్శోణితం కర్ణికాం
గత్వా పుప్పుససంహతిం జఠరికాం శ్వాసాలయే నాళికాః।
తన్నాళీస్థిత శోణితం స్వకలుషం హిత్వా పునస్సత్వరం
ప్రాణస్వీకరణాన్నవాకృతి ధత్తే ద్రక్తం శరీరోగతం॥

స్వభావసిద్ధముగాకలుషమైనరక్తము "ఊర్ధ్వబృహత్సిర" అధోబృహత్సిర" అనుమార్గములద్వారా క్రమముగా గుండెయొక్క కుడికర్ణికలోను, కుడిజఠరికలోను పుప్పుసధమనులలోను, కేశములవంటి శరీరాంతర్గతములైన అల్లికలలోను ప్రవేశించును. ఆ అల్లికలయందదంతకు పూర్వమందున్న రక్తము తనయందున్న కలుషపదార్థమును విడిచిపెట్టి తిరిగి ప్రాణవాయువును స్వీకరించుటవలన శుద్ధపడి శరీరమును కాపాడుకొనుటకు తగిన నూతనాకారమును ధరించుచున్నది.

శ్లో॥ కాలేయం ప్రవిశతి స్వీగ్నసిరతా మేత్యాంత్రజీర్ణాశయ
వృక్కప్లీహకనాడికా స్తదను సా కాలేయకే జృంభతే।
కుక్షిస్థావయవోర్ధ్వ పంకిలమహ త్కాంత్యైవ తత్కాలిజం
తత్కాలేయసిరాముఖాద్విశతి తత్రాధోబృహన్నాడికాం॥

చిన్నపేగులు, పెద్దపేగు, జీర్ణాశయము, వృక్కకము, ప్లీహా, వీటియొక్క సిరలుకలసి జీర్ణాశయసిరగామారి కాలేయమును పొందుచున్నది పిమ్మట యీ జీర్ణాశయసిర కాలేయములందు కేశనాళికలుగా మారిపోవుచున్నది గాన గర్భకుహరమునందలి అవయవములనుండిబయలుదేరిన కలుషరక్తముముందుగా కాలేయమును పొంది ఆకాలేయసిరాద్వారా అధోబృహత్సిరను పొందుచున్నది అనగా అధోబృహత్సిరను పొందుటకుపూర్వము, కాలేయమునందలి కేశనాళికలలో ప్రవేశించి, ఆకేశనాళికలద్వారా బృహద్ధమనిశాఖయగు సిరతోకలసి కాలేయప్రధానసిరకుచేరి దానినుండి అధోబృహత్సిరను పొందుచున్నదనట

శ్లో॥ హాకాంతివిహీన కాయికకశా న్యస్తేఽసృజి ప్రాయుకం
తద్గుల్మాత్ప్రసృతే ప్రసీతరుధిరే వశ్యంతి జీర్ణాః కణాః।
తత్తజ్జీర్ణకణాఽరుణత్వ ముపి తద్గుల్మాదసృగ్వాహకైః
కాలేయం ప్రతిపద్య తత్ర కురుతే పైత్యద్రవస్యారుణీం ॥

ప్లీహా ఎరుపులేని రంగుకణములను రక్తములోనికి పంపుచుండును. పరిశుద్ధమైనరక్తము ఆ ప్లీహాలోనుండి ప్రవహించుచుండగా ఆ పరిశుద్ధరక్తమునందు వయస్సుచెల్లినకణములు ప్లీహాయందుచిక్కుకొని, అక్కడ కొంతమార్పును పొంది నశించును ఇట్లునశించిన ఎరుపుకణములయొక్క రంగుపదార్థము (రక్తిమ) ఆప్లీహానుండి రక్తవాహికలద్వారా కాలేయమునుపొంది అచ్చటతయారగుచున్న పిత్తద్రవమునకు ఎరుపురంగును కలుగజేయుచున్నది

శ్లో॥ ఆదాయరక్తాత్కతిచి త్పదార్థా
న్ద్రవత్వ మానీయ తదాంత్రమూలే।
జహాతి తత్రాంత్రముఖాగాన్నసార
పిత్తాన్వితస్యాఽస్య మధుప్రతీతిః ॥

వృక్కకము రక్తములోనుండి కొన్నికొన్నిపదార్థములను గ్రహించి ద్రవస్వరూపముగామార్చి ఆద్రవమును అంత్రమూలమున పోయుచుండును. జీర్ణాశయమునుండియు కాలేయమునుండియు అంత్రమూలమునకు చేరిన అన్నసారముతోను పైత్యరసముతోన కలసిన యీద్రవమునకు మధురసమని పేరు.

శ్లో॥ పిత్తస్థానజరక్తమాధురసిరే ప్రాగాంత్రమూలాగమా
దేకీభూయ తదాంత్రకుడ్య వివరైర్జీర్ణాశయం ప్రాప్యచ।
తజ్జీర్ణాశయ పాకగాఽమ్ల గుణతాం హ్యాత్వాఽక్షిబం కుర్వతః
పిత్తంమాధురసంయుతం యదిభ వేత్పిష్టంవసాం జీర్ణయేత్ ॥

పిత్తాశయమునుండి బయలుదేరిన పిత్తవాహికయు, మధురవాహికయు, అంత్రమూలమునందు ప్రవేశించకపూర్వమునందు ఒకటిగాకలిసిపోయి, అంత్రమూలపు గోడలనుండి జీర్ణాశయమునుపొంది, పుల్లదనమునువహించి అంతకుపూర్వమే అక్కడ నున్నపాక రసమును ఉప్పగా మార్చివేయును కేవలపిత్తరసము పిండిపదార్థములమీదగానికొవ్వు (చమురు) పదార్థములమీదగాని పని చేయజాలదు పిత్తరసము మధురరసముతో కలిసినప్పుడే పిండిపదార్థములను కొవ్వుపదార్థములను జీర్ణము చేయు ననుట

శ్లో॥ సుజీర్ణితాహారరసావశిష్టం నిరం చ దేహోనుపయోగభూతం।
ఘనాంత్రి మాకర్షతి తత్ర నీరన్యయేన కిట్టంబహి రేత్యధస్తాత్ ॥

జీర్ణమైన పదార్థములో మిగిలినట్టియు, శరీరమున కుపయోగము కానట్టియు పదార్థమునున్న నీటినిన్ని పెద్దపేగు గ్రహించును. అట్లు గ్రహింపబడిన పదార్థమదంలి జలభాగమంతయు మాత్రపిండములోనికి మారి మిగిలిన పిప్పి యీ పెద్దపేగు ద్వారా అ ముఖమున బయలు వెడలును

శ్లో॥ అంత్రగ్రంధిషు నాళికాస్సురమితా శృంగాఖ్యకా ధాతుపా
భుక్తా క్షీరసమా వసా ఽస్రసహితా తచ్ఛృంగదుగ్ధభ్రమే।
మాష్యం శోషరిపం సధాతుపరసం స్పృష్టాస్తిపార్శ్వ ద్రిసః
క్షీరోద్వాహముఖా త్సిరాం ప్రవిశతే కంఠాపసవ్యస్థితాం ॥

చిన్న పేగులలోకి క్కరసిన కోట్లకొలది గ్రంధులు గలవు. వీటికి శృంగకములనియు, ధాతుపవాహిక లనియు పేరు. భుజింపబడిన పాకమునందలి పాలవంటి కొవ్వుపదార్థము రక్తముతో కలసి శృంగకముల (ధాతుపవాహికల) మధ్య నున్న పాలగొట్టములలో చేరును పనిచేయు అవయవములనుండి బయలుదేరు మలినమైన శోషరసము వెనుకచెప్పబడిన కొవ్వుపదార్థముతో కూడుకొని వెన్నెముకకు ప్రక్క గానున్న రసక్షీరవాహిని యనబడు పెద్దసిరాముఖమునుండి మెడకు ఎడమ భాగమందున్న సిరలో ప్రవేశించును.

శ్లో॥ ముఖ్యః ప్రాణమరు త్త్వథైవ సలిలం జీర్ణం విధాయాఽశితం
రక్తే మిశ్రగుణం కరోతి వపుష స్స్యాత్సప్తతి ర్గౌరవే।
రక్తేఽశీతి రభూ త్సతస్య సలిలం రక్తస్య కాంతిప్రదం
రక్తద్రివ్యవిసర్జనే చ కురుతే శశ్వత్సహాయం తనౌ॥

తా॥ ప్రాణవాయువువలెనే జలమున్ను శరీరమునకు అన్నివిధములచేతను ముఖ్యమైయున్నది. యీజలము ఆహారపదార్థమును జీర్ణింపచేసి జీర్ణమైన యీఆహార రసమును రక్తములో కలుపుచున్నది యీజలము శరీరముయొక్క బరువులో నూటికి (70) పాళ్ళున్ను రక్తములో నూటికి 80 పాళ్ళున్ను యుండును మరియు రక్తమునకు కాంతిని కలుగజేయుటయే గాక శరీరమునందలి వ్యర్థపదార్థమును తొలగించుట యందు సహాయమును చేయును.

శ్లో॥ నాడీకండరమండలైః ప్రచలనం వక్త్రాంఽ తజ్జీర్ణాశయై
ర్జీర్ణం జీర్ణరసప్రసార మసృజి ఘ్రాణాంగహృత్పుప్పుసైః।
శ్వాసం పుప్పుసచర్మమూత్రతధిబహిష్కారం హృదస్రాయనై
రప్రింపోషణవస్తురక్తసరణం సర్వే స్వకృత్యోత్తమాః॥

తా॥ నాడీమండలమున్ను కండరములున్ను శరీరావయవములనుచలింపజేయును. నోరు, పేగులు, జీర్ణాశయము ఇవి జీర్ణమండలము యీమండలము ఆహారమును జీర్ణింపచేసి జీర్ణమయిన ఆహారద్రవమును రక్తమునందు కలియునట్లు చేయును. ముక్కుగొంటములు, ఊపిరితిత్తులు ఇవి శ్వాసమండలము. ఇది రక్తమునకు మంచిగాలి నిచ్చి చెడుగాలిని నశింపజేయును ఊపిరితిత్తులు, చర్మము, మూత్రపిండములు ఇది బహిష్కారకమండలము. ఇది శరీరమున తయారయిన పదార్థమును వెడలించును. గుండెకాయ రక్తనాళములు ఇది రక్తప్రసరణమండలము. ఇది ప్రతిఅవయవమునకు రక్తమును, పోషణపదార్థమును ప్రసరింపచేయును.

శ్లో॥ ఏవం యంత్రసమం పృథగ్గ్రసతి తత్ప్రాణానిలం చాశనం
సద్యస్త ద్ద్వయమేళనేన తపనం శక్తః ప్రతీకేఽసృజి।
లుప్తా న్పూరయతే బహిశ్చ్యవయతే వ్యర్థా స్తథా శ్వాసతోం
గారక్షారమరు జ్జలోష్మమలినం మూత్రాశయాంతర్గతైః॥

తా॥ యీప్రకారము యంత్రముతో పోల్చదగిన మానవదేహము గాలిలో నుండి ప్రాణవాయువును వేరుగాను, ఆహారమును వేరుగాను స్వీకరించును. ఈ ప్రాణవాయువు యొక్కయు ఆహారము యొక్కయు సమ్మేళనమువలన వేడిమి (తను కాక) శక్తియు, కలుగుటయే గాక శరీరమునందును, రక్తమునందును శిథిలములైన భాగములు పూర్తి కాబడుచు ఊపిరితిత్తులవల్ల అంగారక్షారవాయువున్ను (బొగ్గుపులుసుగాలియు) నీటి ఆవిరియు మూత్రపిండములవలన నీరున్ను, మరికొన్ని పదార్థములున్ను ప్రేగులవల్ల జీర్ణము కాగా మిగిలిపోయిన పనికిమాలిన పదార్థమున్ను చర్మమువల్ల చమటయు విడిచిపెట్టబడుచుండును

## వాతస్వరూపము

శ్లో॥ పవనో బలవా న్సూక్ష్మ శ్శీతో రూక్షో లఘు శ్చలః ।
రజోగుణమయో నేతా విభాగకరణం చరేత్ ।

వాతము, బలము, సూక్ష్మము, చల్లదనము, రూక్షత్వము, (పరుషత్వము) తేలిక, కదలిక, రజోగుణము, ఆధిపత్యము, ఇవి కలదై పదార్థవిభాగమును చేయును.

## పిత్తస్వరూపము

శ్లో॥ పిత్త ముష్ణం ద్రవం పీతం నీలం సత్వగుణాత్మకం ।
కటుతిక్తరసోపేతం విదగ్ధం చామ్లతాం వ్రజేత్ ॥

పిత్తము, ఉష్ణము, ద్రవము, పచ్చదనము, నలుపు, సత్వగుణము, కటు, తిక్త, రసము, ఇవి కలదై పదార్థములచే విదగ్ధ మగుచు పుల్లతనమును పొందును.

## శ్లేష్మస్వరూపము

శ్లో॥ కఫస్స్నిగ్ధో గురు శ్శ్వేతః పిచ్ఛిల శ్శీతల స్తథా ।
తమోగుణాత్మక స్స్వాదు ర్విదగ్ధో లవణో భవేత్ ॥

కఫము, స్నిగ్ధము, బరువు, తెలుపు, బంక చల్లదనము, తమోగుణము, తీప, ఇవి కలదై పదార్థములచే విదగ్ధ మగుచు ఉప్పతనమును పొందును.

## వాతచర్య

శ్లో॥ శీతరూక్షాంగరుక్స్తంభానాశశ్యామసుషుప్తయః ।
శోషాంకోచపారుష్యశూలా వాతభవా గుణాః ॥

శైత్యము, రూక్షత్వము, ఒడలు బరువు, కదలలేకుండుట, నల్లపడుట, నిద్ర, శోష కలుగుట, సంకోచము, పారుష్యము, శూల, ఇవి వాతముయొక్క చిహ్నాలు.

## — ♦ పిత్తచర్య ♦ —

శ్లో॥ తాపాఽస్యపాకదుర్గంధక్లేశదాహారుణభ్రమాః ।
పరిశ్రమస్వేదకోరమూర్ఛాః పిత్తభవా గుణాః ॥

తాపము, నోరెండుట, దుర్వాసన, శరీరము తడిసినట్లుండుట, దాహము, ఎగుపుపారుట, భ్రమ, ఆయాసము చెమట, దప్పుల్గ, మూర్ఛ, ఇది పిత్తముయొక్క చిహ్నములు.

శ్లో॥ చిరకిర్యో త్పేదసీతలేపపిచ్ఛిలపాండవః।
కండూప దేహస్నేహాంగభారాశ్లేష్మభవా గుణాః॥

తా॥ పనియం దలసత్వము, వాపు, చల్లదనము, నునుపు, బంక, తెలుపు పారుట, దురద, బద్ధకము, శరీరము ఒడ్డుగ నుండుట, ఒడలు బరువు, ఇవి శ్లేష్మముయొక్క చిహ్నములు.

## — ♦ పంచమహాభూతగుణములు ♦ —

శ్లో॥ శబ్దస్స్పర్శశ్చ రూపంచ రసో గంధః పరాగుణాః।
పునస్తే భాఽనిలాగ్న్యంబుభువ స్త్వేకగుణాధికాః॥

తా॥ (ప్రతిలోమక్రమముగా) ఆకాశమునకు శబ్దము వాయువునకు స్పర్శము అగ్నికి రూపము జలమునకు రసము భూమికి గంధము ప్రధానగుణములు. మరియు ఆకాశమునకు శబ్దము, వాయువునకు శబ్దస్పర్శములు, అగ్నికి శబ్దస్పర్శరూపములు, జలమునకు శబ్దస్పర్శరూపరసములు, భూమికి శబ్దస్పర్శరూపరసగంధములు ఇట్లు ఒక్కొక్కగుణము అధికముగా కలది అని తెలియ నగును

శ్లో॥ గురుమందహిమస్నిగ్ధశ్లక్ష్ణసాంద్రమృదుస్థిరాః!
గుణా స్ససూక్ష్మవిశదా వింశతి స్సవిపర్యయాః॥

తా॥ బరువు, తేలిక, మాంద్యము, తైక్ష్ణ్యము, శైత్యము, ఉష్ణత్వము, స్నిగ్ధత్వము, రూక్షత్వము, మసృణత్వము (నునుపు) పరుసుదనము, సాంద్రత్వము ద్రవత్వము మృదుత్వము, కాఠిన్యము, స్థిరత్వము, ప్లవత్వము, సూక్ష్మత్వము, స్థౌల్యము, స్వచ్ఛత్వము, జిడ్డు అనునవి '20' గుణములు. ఇవి అవిరుద్ధములై యథోచితముగ ద్రవ్యాశ్రితములై యుండును.

శ్లో॥ "లఘుతీక్ష్ణోష్ణరూక్షాశ్చ ఖరద్రవదృఢప్లవాః।
అమీ సస్థూలవిశదా గుణప్రతిగుణాః క్రమాత్॥

ఇతి శ్రీ చిత్రాంగదసంగ్రహాఖ్యే శ్రీసోమయాజి పద్ధతే
సప్తదశప్రకరణేషు వర్ణాంగదప్రకరణమ్.



# చిత్రాగదసంగ్రహాఖ్యే శ్రీసోమయాజిసత్పథే సంకీర్ణప్రకరణమ్.



శ్లో॥ యస్మిన్ శిరస్సిరామూల మేవ
త్రిదోషపంచాత్మకసప్తధాతు।
గుణత్రయం చాత్రవికారకేష్టం
తద్వర్ణ సౌఖ్యోచితసూక్ష్మయోగాః॥

తా॥ ఏ శిరస్సుమొదలు, మూలకారణమైన యీశరీరము వాతపిత్తశ్లేష్మములను త్రిదోషములు, పృధివ్యప్తేజోవాయ్వాకాశములను పంచభూతములు, రసరక్త మాంసమేదోమజ్జాస్థిశుక్లములను సప్తధాతువులు, సత్వరజస్తమోగుణములను మూడు గుణములు కలిగి వివిధములైన రోగవికారములకును, మలమూత్రస్వేదాదులకును స్థానమగుచున్నదో అట్టి శరీరముయొక్క సుఖస్థితి కనుకూలమైన సులభక్రియలు చెప్పబడుచున్నవి.

— ♦ ఓషధీవీర్యకాలము ♦ —

శ్లో॥ చూర్ణానిమాసద్వయ మేవ తైల ఘృతానిచతుర్మాసక మేకవర్షం।
వనస్పతి శ్చౌషధిలేహ్యమాత్రా రసాయనం భస్మ పురాతనం చ॥

తా॥ చూర్ణములు రెండుమాసములు, తైలములు, ఘృతములు నాలుగుమాసములు, వనస్పతులు (పుష్పముతలన పుట్టిన ఫలములుగల మామిడి మొదలగునవి) ఓషధులు, (పుష్పములు లేకుండా ఫలించెడు మేడి, పనస మొదలైనవి) లేహ్యములు మాత్రలు (కజ్జలిసంబంధములయిన వటికలు లేక ముప్పెలు) ఒక సంవత్సరము. రసాయనములు (రసౌషధములు) భస్మములు (లోహసంబంధములు, రసోపరససంబంధములు) ఇవి పాతగిలినకొలది ప్రశస్తములు.

శ్లో॥ భద్రాజ్యోమణచిత్రతండులగుడ క్షౌద్రం పురాణం నగం
తత్కృతాదివివిగ్ధదో శ్లాన దతే మూలం లదా గ్రాహ్యతాం॥
శామ్యా సింహాముః విదారి తురగీ కాళీ గ్రా రేయుక
బ్రహ్మాత్వక్ప్రతి నీ ప్రిం కణీ మాంసాం సదా యోజయేత్ ॥

తా॥ ధనియాలు, నెయ్యి, పప్పులు, వాయువిడంగాలు, బెల్లము, తేనె, ఇవి (గతసాలవి అనగా పుచ్చిపోకుండాను వాసన రకుండాను ఉన్నంతవరకు ఉంచినవి) ప్రశస్తములు చర్మము, ఆకులు, మొదలైనవాట వివరకు చెప్పని సలమందు వేళ్ళపై చర్మమును గ్రహింపవలెను. తిప్పతీగె, అడ్డసరము, నేలగుమ్ముడు, పెన్నేరు. కొడిశపాల, ములగోరింట, పెద్దసదాప, పిల్లితేగలు, గాంతెనుగోమగు, ఇవి పచ్చివి ప్రశస్తములు (పచ్చివి ఎండినవెంటనే వాడుట మంచిది)

— ♦ పత్రసారము లు ♦ —

శ్లో॥ భృంగాస్ఫోటరఝటాపటోలకితవక్షుద్రామ్రికారాతసీ
తాంబూలీవిజయావిపాదిసుషవీ మత్స్యాక్షీ విష్ణుప్రియా
బహ్మాద్యాః ప్రభవంతి పత్రబలినః॥

తా॥ గుంటగలగ, జిల్లేడు, నేలవుశిక పా , ఉమ్మెత్త, పులిచింత ఒప్పలి తులసి, తములపాకు, గంజాయి,హంసపాది, కాకర, పొన్నగంటి, విష్ణుకాంత సప్తతీఆకు. మొదలయినవి పత్రసారములు (ఆకులు ప్రధానములుగాగల వగుట)

— ♦ దారుత్వక్సారములు ♦ —

పాలాశరోగాపహా।

శ్రీమాన్లంబుబలాకలోధ్రకుటజా స్సక్గంధాజిన త్వక్సినః।

తా॥ మోదుగు, రేల, రావి, నేరేడు, ఒలుసు, లొద్దుగు, కొడిశపాల ఇవి మానుపైనుండు తొక్కలు సారముగా గలవి

— ♦ కందసారములు ♦ —

శ్లో॥ రాస్నాకుష్ఠకచోరముస్తరజనీమండపనస్థాన్మికా
మూర్వాలాంగలిశారిణాశతపదీకుంభావియా పానవాః।
ఆశ్వాభేషజనాగమస్తనటిభూతాళాటనీగూరసా
భైషజ్యాగమసంప్రదాయసరణే ప్రఖ్యాతకందసారా అమీ॥

తా॥ రాస్న, సంగిల్వకోష్ఠు, కచ్చోరాలు, తుంగముస్తెలు, పసుపు, మంజిష్ఠ, నేలగుమ్ముడు, పుల్లబచ్చలి, చాగ, చన్నఉగ్గగడ్డ, సుగంధిపాల, పిల్లితేగలు, తెగడ, అతివస, వస, పెన్నేరు, అల్లము, నాగముస్తెలు, దుంపిలము, నేలతాడి, అడవికంద, (పాతకుండాదానంతట అది పడి మొలచినది) ఇవి దుంపలు సారముగా కలవి

— మూలసారములు —

శ్లో॥ రోధ న్యంశుమతీద్వయా ఉభయకడా క్షుద్రా బలాపంచకం।
పాఠాబర్బరకుండలీద్వయపునర్భామూలసారాన్వితాః॥

తా॥ ములగ, కోలపొన్న, ముయ్యాకు పొన్న, కురువేరు, దూలగుండ, వాకుడు, బలాపంచకము (అతిబల, మహాబల, నాగబల, జబిలిక, పేరాముట్టి) విష బొద్ది, వావిలంటు, తెల్లవుంప నల్లవుప, గలిజేరు, ఇవి వేరు సారముగా కలవి

— బీజసారములు —

మాషవ్రీహితిలైలసర్షపముఖాబీజప్రధానాః

తా॥ మినుగులు, ధాన్యము, నువ్వులు, ఏలకులు, ఆవాలు, మొదలైనవి బీజములు ప్రధానములుగా గలవి

— ఫలసారములు —

ఫల। శ్రేష్ఠా దాడిమపూగతాళపనసద్రాక్షాకపిత్థాదయః॥

తా॥ దానిమ్మ, పోక, తాడి, పనస, ద్రాక్ష, వెలగ మొదలైనవి ఫలములు ప్రధానములుగా గలవి

— సారసారములు —

శ్లో॥ శ్రీఖండాఽగరుదారుయష్టిమధురాద్యాః సారసారాః

మంచిగంధము, అగరు, దేవదారు, ఎండ్ర, అతిమధురము, మొదలయినవి, లోపలనుండు చావ సారముగా గలవి

— క్షీరసారము —

పయ। స్నూరాం సౌఖ్యవిరేచనీ బహుపయ ।
స్నూర్వాబ్జయోని స్నుహీ ॥

అకుచెమడు, చెముడు, జిల్లేడు, బ్రహ్మచెముడు, మొదలయినవి పాలు సారముగా కలవి.

## — ♦ నిర్యాససారములు ♦ —

నిర్యాసాతిబలా స్సువర్ణతరుశ్శైలూషాఽరిమేదాదయో ॥

రేల, మారేడు, తుమ్మ, వేప, నల్లమందు, మొదలయినవి జిగురు సారముగా కలవి

## — ♦ సర్వాంగసారములు ♦ —

భూనింబశాఽఽకిత పర్పటాఽబలముఖా ।
స్సర్వాంగసారా స్స్మృతాః ॥

నేలవేము, గుంటగలగర, పరిప్పటకము, కలబంద, మొదలైనవి సర్వాంగములు సారముగా గలవి.

## — ♦ పుష్పసారములు ♦ —

శ్లో॥ జాతిచంపకసింధువార వకుళాఽశోకోచ్చటా కేతకీ ।
పున్నాగాష్టదీమహాసహాంచ్య గ్రథావదంశతమాః
నంద్యావర్తసరోజపాటలముఖాః పుష్పసారాస్త్వమీ ॥

జాజి, సంపెంగ, వావిలి, పొగడ, అశోకము, గురివింద, మొగలి, పొన్న, మల్లి, చామంతి, రేల, మునగ, నందివర్ధనము, తామర, కలిగొట్టు, మొదలయినవి పుష్పములు సారముగా గలవి

## — ♦ క్షారసారములు ♦ —

వాసాచవ్యపునర్నవాతిలయదాన్యాక్షారసారా స్స్మృతాః ।

అడ్డసరము, చవ్యము, గలిజేరు, నువ్వు, వాము, మొదలయినవి క్షారము (కాల్చిన బూడిది) సారముగా గలవి

## — ♦ సామాన్యనియమము ♦ —

శ్లో॥ ముద్గాఢకాదీ స్నతుషా న్కషాయే ।
చూర్ణే ప్రదద్యా ద్విదుషా నజస్రం

త్వక్పత్రిమూలాఽవచనే తు మూలం
క్షీరాజ్యమూత్రేషు చ గవ్య మేవ ||

పెసలు, కందులు, మొదలైన కాయధాన్యములను కషాయాదులలో పైపొట్టు తోనున్ను, చూర్ణాదులలో పైపొట్టుతీసివేసిన్ని ప్రయోగింపవలయును. బెరడు, ఆకులు, వేరు, పువ్వు, చావ, చిగురు, పాలు, మొదలైనవాటియొక్క వివరణ, చెయ్యబడని స్థలమందు వేళ్ళనున్ను. పాలు నెయ్యి మొదలైనవాటియొక్క వివరణ చెయ్యబడనిస్థలమందు ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుపంచితము వీటినే గ్రహింపవలయును

## ఔషధపాత్రస్థానము

శ్లో|| ఆయాంతి భుక్త్వౌషధశేషతత్పరాః
ప్రసహ్య పునర్వ్యాధ్యధిదేవతా స్త్వితి
పాత్రం న్యసేద్వామతలే త్వధోముఖం
జాయుం సదోపవిశేన్ముహూర్తతః ||

రోగాధిష్ఠానదేవతలు రోగి పుచ్చుకొనగా మిగిలిన ఔషధశేషమునందు దాసక్తి కలవారై వచ్చెదరు గాన రోగి ఔషధమును పుచ్చుకొన్న పిదప ఆపాత్రను తన ఎడమప్రక్కన బోర్లించవలయును. రోగి ఔషధమును పుచ్చుకొనిన తర్వాత ఆ ఔషధముతన శరీరమునందిముడువరకు క్షణమాత్రము కూర్చుండవలయును.

## అపథ్యాప్రతీకారము

శ్లో|| లాజం పూగం నాగవల్లీదళం వా
ఖాదన్నిత్యం దేద్వ్యస్త్రిరుచ్చ్యై హిమం చ
గండూషం తృడ్వారణాయోదకేన
క్వాథం పేయం కోష్ణమేవాఽమయేషు ||

మందుపుచ్చుకొనిన ఆసమయము పేలపుగింజలను గాని పోకచెక్క ముక్కను గాని, తమలపాకును గాని, నమిలి మింగకుండా ఉమియవలెను. మందు పుచ్చుకున్న వెంటనే కలిగిన దాహశాంతికొరకు చల్లటి నీళ్ళను పుక్కిలించి ఉమియవలెను. రోగులుపుచ్చుకొను కషాయము గోరువెచ్చగా నుండవలయును.

— ♦ ఉపశయవివరణము ♦ —

శ్లో॥ హేతు వ్యాధ్యుభయాత్మభిర్నవవిధం స్యాద్వైపరీత్యాన్వితం ।
జాయ్యాహారవిహార మేవ చ పున స్తద్వైపరీత్యార్థకృత్
వాతశ్లేష్మభవజ్వరాదిషు భవే త్సుంఠీశ్రమోత్థజ్వరే
మాంసాహారనిషేవణం చ దివసస్వాపే నిశాజాగరః ॥

తా॥ ఔషధాహారవిహారములు క్రమముగా హేతువ్యాధ్యుభయాత్మకవిపరీత భేదములచే '9' విధములున్ను తద్విపరీతార్థకరభేదములచే '9' విధములున్ను మొత్తము మీాద '18' విధములు అగుచున్నవి ఎట్లన, వాతశ్లేష్మజనితజ్వరాదులయందు తద్విరుద్ధమైన వేడిగుణముగల శొంఠిని ప్రయోగించుట (1) హేతువిపరీతౌషధము. శ్రమజనితజ్వరాదులయందు శ్రమహరమైన మాంసాద్యాహారము (2) హేతువిపరీతాహారము పగటిభాగమందు నిద్రించుటచే గలిగిన బడలికయందు రాత్రి మేలుకొనుట రాత్రి మేలుకొనుటచే కలిగిన బడలికయందు పగలునిద్రించుట. (3) హేతువిపరీతవిహారము, ఇయ్యవి హేతువిపరీతౌషధాహారవిహారములు

శ్లో॥ నాశే దీపనికామసూరమపి చోదావర్తకే పిహ్యాణం
శోషే దశమూలకం కఫమరుజ్జాతగ్రహాణ్యాం దధి।
స్నిగ్ధాహారదివాసుషుప్తిబుభుః స్యాజ్జాగరః పిత్తజం
జాత్రే శ్మే జ్వాలనోపనాహగిళితం వాతభ్రమే భీషణం॥

తా॥ అతిసారమునందు దోషమును లెక్కజేయక తనప్రభావముచే వ్యాధిని తొలగించుసామర్థ్యముగల చిరుబొద్ది (4) వ్యాధివిపరీతౌషధము, అతిసారనిరోధకమైన చిరుశనగలు. (5) వ్యాధివిపరీతాహారము, ఉదావర్తవ్యాధియందు ముక్కుట. (6) వ్యాధివిపరీతవిహారము ఇయ్యది వ్యాధివిపరీతౌషధాహారవిహారములు

వాతజనితశోషయందు వాతశోషహారమైన దశమూలప్రయోగము. (7) హేతువ్యాధివిపరీతౌషధము. కఫవాతజనితగ్రహణీరోగమునందు పెరుగు. (8) హేతువ్యాధివిపరీతాహారము గురుత్వపదార్థభక్షణము, పగటినిద్ర వీటిచే జనించిన బడలికయందు రాత్రిజాగరణము (9) హేతువ్యాధివిపరీతవిహారము. ఇయ్యవి హేతువ్యాధివిపరీతౌషధాహారవిహారములు పిత్తజనితవ్రణమునందు ఉష్ణవీర్యముగల ద్రవ్యమును కట్టుకట్టుట. (10) హేతువిపరీతార్థకరౌషధము ఉష్ణవీర్యముగల పదార్థభక్షణము(11)

హేతువిపరీతార్థకరాహారము వాతజనితోన్మాదమునందు వాతమును పెంపొందించు భయమును కలుగచేయుట '12' హేతువిపరీతార్థకరవిహారము ఇయ్యవి హేతువిప రీతార్థకరౌషధాహారవిహారములు

శ్లో॥ వాంతౌ చే త్కరహాటకం విషి పయో ఽ ఙ్గ్రేంగులీ వేశనం।
దగ్ధే చాగరుయోజనా మదగదే మద్యం జడే చాలనం।
వాంతాదౌ కరహాటకాదిషు రుజా సంవర్ధ కారి ష్వపి
స్వీయేనైవ బలేన హేతువిషమం కుర్వంతి రుగ్వారణం ॥

తా॥ అజీర్ణజనితవమనములయందు వాంతిజనకమైన మ్రింగకాయ (13) వ్యాధివిపరీతార్థకరౌషధము విరేచనవ్యాధియందు విరేచనకారియగు పాలను త్రాగుట (14) వ్యాధివిపరీతార్థకరాహారము అజీర్ణవికారమునందు (గుండెంచుచున్న ప్పుడు) చేతవేళ్ళను గొంతుకలోనికి పోనిచ్చి డోకు రప్పించుకొనుట (15) వ్యాధి విపరీతార్థకరవిహారము ఇయ్యవి వ్యాధివిపరీతార్థకరౌషధాహారవిహారములు.

కాలినపుండుయందు ఉష్ణగుణప్రధానమైన అగరును పట్టించుట(16) హేతు వ్యాధివిపరీతార్థకరౌషధము మద్యపానజన్య (మదాత్యయ) వ్యాధియందు మద్య పానము (17) హేతువ్యాధివిపరీతార్థకరాహారము కదలలేకుండు వాతవ్యాధి యందు అవయవములను సాగతీయుట మాలిమిట నడిపించుట మొదలైనచలనము (18) హేతువ్యాధివిపరీతార్థకరవిహారము ఇయ్యవి హేతువ్యాధివిపరీతార్థకరౌషధా హారవిహారములు

వమనాదులయందు మ్రింగకాయ మొదలైనవి రోగమును పెంపొందించు స్వభావముగలవైనను తమ తమ ప్రభావమువలన, హేత్వాదులకు వ్యతిరేకముగా (రోగప్రకోపమునకు బదులుగా) రోగోపశాంతిని కలుగచేయుచున్నవి రోగలక్షణ ములు పూర్తిగా కాని, స్పష్టముగా కాని కానరాక వాతాదిదోషనిర్ణయావకాశము లేకుండునపుడు యీఉపశయము రోగజ్ఞానసాధన మగును.

శ్లో॥ అపి యత్ర వస్తు సమాశ్రితాః స్వయం
రసగుణవీర్యవిపాకసామకాః
నిజగతవస్తువశాంవిహాయత్యజే
స్వసహాజకర్మ చరంతి చ క్వచిత్ ॥

తా. పరిభాషాప్రకరణమున చెప్పబడిన "స్యాదేకమధ్వారసః" అను శ్లోకోక్త మధురామ్లలవణకటుకషాయతిక్తరసములు, గురుత్వలఘుత్వగుణములు ఉష్ణశైత్యవీర్యములు, మధురఅమ్లకటుపాకములు అనునవి ద్రవ్యాశ్రయములైనప్పటికిన్ని దానిని విడచి ఒక్కొక్కప్పుడు స్వతంత్రముగానే (తమంతట తాము) తమతమ కార్యమును నెరవేర్చుకొనుచున్నవి.

శ్లో॥ భుక్తం షడ్రసయుక్తమాత్మకశుచిసంయోగాత్ త్రిధా పచ్యతే।
తత్రాఽఽక్షీబమధుద్వయంతుమధుతామామ్లోఽమ్లతాంతత్త్రియం
యాత్యేవం కటుతా తతస్తు మధురా చ్ఛేఽమ్లపాకాచ్చుచి
ర్యాత స్స్యాత్కటుకా ద్గుణత్రయయుతం పిత్తానిలశ్లేష్మకం ॥

షడ్రసోపేతమైన అన్నాదికము జఠరాగ్నిసంయోగముచే మూడు రకములుగా మారుచున్నది ఎట్లనగా లవణమధురసములు రెండున్ను మధురసముగాను, అమ్లరసము అమ్లరసముగాను కటుకషాయతిక్తరసములు మూడున్ను కటురసముగాను పరిపాకమును పొందుచున్నవి వీటిలో మధురరసమువలన శ్లేష్మమును అమ్లరసమువలన పిత్తమును కటురసమువలన వాతమును జనించును పిత్తవాతశ్లేష్మములు క్రమముగా సత్త్వరజస్తమోగుణములు కలవి

శ్లో॥ రుగ్లక్షణాన్యప్రతిపాదితాని।
క్రియాచయత్రాఽప్రతిపాదితాఽత్ర
గ్రంథోక్తత్తద్గజాయులింగై
ర్వ్యాధిక్రియాజ్ఞానమపార్జితవ్యం ॥

యీప్రకరణమునందెక్కడెక్కడ రోగలక్షణములుగాని రోగోపశాంతికి మందులుగాని తెలుపబడవో అక్కడ ఆయాప్రకరణములయందు చెప్పబడిన రోగలక్షణములు ఔషధగుణములు మొదలైనవాటిచే వ్యాధులను గుర్తించుట, చికిత్సల నూహించుట, అవసరమని తెలియ నగును.

శ్లో॥ వైద్యానపేక్షోపశమస్వభావాః కేచి చ్చికిత్సానుపశాంతిరూపాః।
వైద్యస్యసీమద్వయమస్తిచైవంతద్భిన్నరోగాస్సతతంక్రియార్హాః

చికిత్స అవసరములేకుండ వాటంతటవే అవిరయే తగ్గు స్వభావముగల వ్యాధులు కొన్ని యోగ్యమైన చికిత్స చేసినను తగ్గనిస్వభావము కల వ్యాధులు కొన్ని యీరీ

తిగా వైద్యమునకు రెండు మార్గములు కలవు, యీ రెండుమార్గములకు భిన్నములగువ్యాధులే చికిత్సార్హములు.

అగ్నిమాంద్యము— ఆకలిలేకపోవుట (జఠరాగ్ని మందగించుట)

అగ్నిరోహిణి— మంటకాగి అగ్నికణములవలె చంకలో యర్రగా బయలుదేరుకురుపులు, లేక పొక్కులు

(1) పాదరసము, గంధకము కలిపి నూరినచో నల్లగ కాటుకవలె తయారగును. యీ కాటుకను నూనె, వెన్న మొదలయిన స్నిగ్ధపదార్థములతో కలిపి పూయవలెను.

(2) పై కాటుకలోనే పచ్చకర్పూరము సున్నము, అనుపానముతో కూడా కలిపి పాకంవచ్చేలాగ [illegible] స్త్రీవలె నూరి పట్టించవలెను అట్లుచేసిన చిహ్నం కూడా మాడిపోవును ప్రతిరోజూ పెసరపిండితో జాగ్రత్తగా కడుగవలెను

(3) జిల్లేడుపాలతో [illegible] యీగుడ్డను నూనెలోవేసి మరగించిన మాడిపోవు [illegible] ఆ నూనెను ఆహారంగా పట్టించవలెను

(4) నిరుడుగింజలలోని పప్పును లేతవేపాకు నూరి కలిపి పట్టించవలెను ప్రతిరోజు నాసాయంకాలం పెసరపిండితో కడుగవలెను [illegible] సంబంధముంటే నిరుడుగింజల పప్పులో నాలుగవవంతు [illegible] రసంతో 26 రోజులు భావన చేసిన భావనచాలు కూడా కలిపి నూరవలెను [illegible] వెన్నగాని, నూనెగాని పోసి నూరవలెను

(5) వేపచెక్క కాల్చి ఆవపిండి కలిసి కారుచున్న కురుపులపయిని చల్లుచుండినయడల త్వరలో మానిపోవును

(6) వేపాకు పచ్చిది ఆవునేతిలో వేసి మాడ్చి దానిలో మైనం వేసి కరిగించి పాలాస్త్రీవలె చేసివేసినచో మొండివ్రణములు కూడా మానును.

(7) వేపచిగుళ్ళు మెత్తగానూరి కట్టుచున్నయడల, సెగగడ్డలు రాచపుండ్లు త్వరలో చీముపట్టి పగులును

(8) ఏకురుపు అయినాసరే ప్రారంభం లగాయతు చితికేవరకున్నూ, చితికినది లగాయతుపూర్తిగాపలుకుడూడిపోయేవరకున్నూ జిల్లేడుపాలుగాని, కాడచెముడుపాలు గాని, రోజు1కి రెండు, లేకమూడుసార్లుపూడుచుచున్నయెడల త్వరలోమానును.

(9) మాపలపుకాయ, తమలపాకు, వెన్న, రసకర్పూరము, హారతికర్పూరము, పాదరసము, స్వల్పంగా మైలుతుత్తము మెత్తగానూరి పట్టించినయడల చిడుము, గజ్జి, దురద, కురుపులు మానును.

(10) వెలిమిడి మెత్తగా కాల్చి మజ్జిగలోకలిపి పూయుచుండినయడల నలిచిడుము, దురదలు మానును.

(11) గోరింటవేళ్ళ పైబెరడులో పసుపువేసి నూరి ఆమద్ద కట్టినయడల సెగగడ్డలు త్వరలో నయమగును

అజగల్లిక— చిన్నపిల్లలకు శరీరమునందు ఏదోవకభాగమందు, పెసలవంటి కురుపులు ఒయలుదేరి నిగనిగలాడుచు నొప్పిలేక గుండ్రముగా నుండునవి

అజీర్ణము - భుజింపబడిన ఆహారము జీర్ణము కాకుండుట

అతిమూత్రము— మూత్రము బరువుగాను, తీపిగాను (శ్వేతధాతువుతోను) ఉండువ్యాధి ఒకటియున్ను, శ్వేతధాతువుకూడా లేకుండా మూత్ర మెక్కువ పరిమాణముగాగాని, అనేకసార్లుగాగాని వెడలెడువ్యాధి ఒకటియు, రెండువిధములు.

(1) నల్లమందు అలవాటు చేసుకొన్నచో వెంటనే రక్తము చేరక్క వ్యాధి నివారణ కాగలదు యీ నల్లమందును చందోదయంతో గాని, వసంతకుసుమాకరంతో గాని కలిపి సేవింపవచ్చును నల్లమందువలన విరేచనబద్ధం కలదుతుందని సందేహిస్తే యీ వ్యాధి కుదరదు యీవ్యాధికి నల్లమందుతో సరిగా పనిచేసే మందు యింకొకటి కనుపించదు నల్లమందు మానకుండా వేసుకున్న యెడల విరేచనం సాఫీలో పడగలదు కొంతమంది చిన్నపిల్లలకు పదిసంత్సరాలు వయస్సు వచ్చేవరకు పక్కలో మూత్రమునువిడుచు బాధ కలిగియుండును విడువకుండా రెండుమాసములు రాత్రి పరుండబోవునపుడు కొంచెము నల్లమందు వేయుచుండుటవలన యీ వ్యాధి పూర్తిగా తగ్గును.

(2) వేపచక్క చూర్ణం రెండుచిన్నాలు చీనాపంచదార, రెండుచిన్నాలుకలిపి రెండుపూటలాపుచ్చుకోవలెను ఇచ్ఛాపథ్యం తీపి తినరాదు.

(3) కరక్కాయ పెచ్చులు రాత్రినీళ్ళలోనానవేశి మరుచటిరోజుఉదయం ఆపెచ్చుల నుగట్టిగాపిడిచి ఆవునేతిలో దోరగావేయించి పెద్ద పల్లేరువేళ్ల కషాయంతో కుంకుడుగింజలవలె మాత్రలుచేశి ప్రతిపూటా భోజనానంతరం రెండుమాత్రలు చొప్పున సేవించవలెను ఇచ్ఛాపథ్యం.

(4) తంగేడువేళ్లచూర్ణముగాని తంగేడుపువ్వుచూర్ణముగాని మేకవెన్నతో పుచ్చుకోవలెను

(5) కృష్ణాభ్రకము త్రిఫలచూర్ణము కలిపి వేడినీళ్ళతో పుచ్చుకోవలెను

అతిసారము— అధికముగా గాని, వికృతిగా గాని అయ్యెడు విరోచనములు.

(1) బాలింతబోలు, రసచిందూరము, వేపజిగురు, ఇంగువ, చింతపండు, సున్నము, నల్లమందు, హారతికర్పూరము వీటిని అంటికాయచారులో నూరి కందిగింజలవలె మాత్రలు చేసి, వాముమడ్డిన నీళ్ళతో రెండేసివిరేచనముల కొక మాత్రాదు చొప్పున యివ్వవలెను. వాముకాటునీళ్ళవల్ల కొంతవరకికి వాంతివచ్చుట గాని, గుడించుటగాని తటస్థించును అట్టివారికి నీళ్ళతో గాని, మజ్జిగతోగాని యివ్వ

వలెను వాము కాటునీటిలో తేనె కలిపినచో పున్పుకొనుటకు అనుకూలముగా నుండును కలరా కూడ తగ్గును మోతాదులను ఊహచే సవరించుకొనుచుండ వలయును.

(2) యింగిలీకము, గంధకము, ప్పళ్ళు మిరియాలు, వెలిగారము నాభి, ఉమ్మెత్త గింజలు, వీటిని గంజాయిఆకురసములో ఒకజాము మర్దించి మాత్రలుచేసి పెరుగు తోగాని తేనెతోగాని ఇవ్వవలెను

(3) వేపజిగురు, పంచదారకలిపి మాత్రలుచేసి యివ్వవలెను

(4) పెద్దవుశిరిచక్క కషాయం గాని, పెద్దవుశిరకాయల కషాయం గాని యిచ్చిన యెడల కొంతమందికి గ్రహణులు, అతిసారములు, నీళ్ళవిరేచనములు తగ్గును.

(5) గచ్చచిగుళ్ళు నీటిఆవిరిమీద ఉడికించి రవ్వంత బెల్లం వేసి మాత్రలుకట్టి మంచి నీళ్ళతో యిచ్చినయెడల ఆసనముపెంట కండకండలుగా పడే నెత్తురువిరేచన ములు తగ్గును

(6) వసకొమ్ము, జాజికాయ, వీటిని ఆవునేతిదీపాన్ని మాడ్చి రవ్వంత నల్లమందు కలిపి తేనెతో మాత్రలుచేసి వాడినయెడల చంటిపిల్లల విరేచనములు తగ్గును.

(7) నల్లమందు కుంకుమపువ్వు నూరి పెసరగింజలవలె మాత్రలు చేసి యిచ్చినయెడల విరేచనములు తగ్గును

(8) నల్లమందు చనుపాలతో గాని, వేడినీళ్ళతో గాని అరగతీసి పొత్తికడుపు, నాభి, మలనాళిముండు ప్రదేశము నావరించునట్లు పట్టువేయవలెను.

అధిజిహ్వక - నాలుకపైని యింకొక నాలుకవలె కొనగలిగిన వాపు ఉప జిహ్వక యనియు, అట్లే నాలుకకింద కలిగిన వాపు అధిజిహ్వక, అనియు చెప్ప బడును. నాలుక మంటగాని దురదకలిగి నీళ్ళుకారుట గాని కలిగి పుండుపడియుం డును. ఒక్కొక్కప్పుడు నాలుక మొగ్గుసారి కదలించుటకు వీలులేకుండా కూడా ఉండును. నాలుకచివర పుండుమలిమే వున్న లాసక వసబడును.

(1) రావిచక్క కషాయం పుక్కిట పట్టవలెను.

(2) పెద్ద నేపాలపు పాలు పుక్కిట పట్టవలెను.

(3) జాపత్రి నమలవలయును

(4) మాపాలపుకాయ నీళ్లతో అరగదీసి ఆ గంధము పట్టించవలెను

(5) వేడిఅన్నం మీద నూనెవేసి ఆ అన్నంతో నాలుకపైని కాచవలెను

(6) కాకరకాయ చనుపాలతో నూరి పట్టించవలెను.

అధిమందము— అభిష్యందమునకు సకాలమునందు చికిత్స చేయనిచో ముదిరి పోయి తీవ్రమయిన బాధ కలిగియుండును.

(1) కళ్ళుకలక ప్రారంభం కాగానే బ్రహ్మదండిచెట్టాన (పిల్లలు పేలని వాటిగింజలను కుక్కకుని ఆడుచుండు చెట్టుచోన) రోజు 1కి రెండుమూడుసార్లు కళ్ళలో పెట్టుచున్నయడల కళ్ళకలక త్వరలో మానును.

(2) ఉత్తరేణాకు పసరు పిండవలెను

(3) అన్నం చిమిడేలా వండి ఆ అన్నంలో పసుపు, ఆవునెయ్యి వేసి పిసికి బిళ్లలు వలె చేసి కన్నులపయిని కటవలెను

(4) బజారులో విక్రయింపబడు నేత్రబిందు సీసా వాడవలెను నేత్రబిందు వాడునప్పుడు ఇతరమందులు వాడరాదు

(5) పటిక పొంగించి నీటితో కలిపి పోయవలెను. యీ పటికపొలు కళ్లకలక మళ్ళు మొగం పట్టినతర్వాత పోయవలెను

(6) మూరెడు పొడవుగల పుగుగుడుపుల్లకు చివర ఒక చిన్నసీసా తగిలించి, ఆసీసా మూతికపైని దారముతో పుల్లకు ఏనుగు మెలికివేసి ఆదారమును సీసా మూతికి కట్టవలెను. (ఇట్లు కట్టుటచే పుల్లను త్రిప్పునప్పుడు సీసాజారి పడిపోకుండావుండును) పమ్మట ఆపుల్లకు మొదటిభాగమందు తాడు కట్టి సత్తువకొలది దానిని చక్రపొట్లం త్రిప్పినట్లు గిరిగిరాత్రిప్పినయడల పుల్లలోవున్న చెమ సీసాలోనికి చేరును తర్వాత (పుగుగుడుపాలను) ఆనీటిని ఉదయం సాయంకాలములయందు రెండేసి బొట్లు చొప్పున కంటిలో వేయుచుండినయడల కలకలు, వాపులు మొదలయిన అనేకరోగములు తగ్గును

అధుస్రషము — తెలుమూలమున యర్రగావాచిబాధకలిగి మెత్తనైయుండును (ఇగుళ్లవాపుకు చేసే చికిత్సలు చేయవలెను)

అనాస— (గ్రామ్యపదము) గుదపాకరోగమును యీపేరుతో వాడుచున్నారు గుదపాకమనగా చిన్నపిల్లలకు కలిగే ముడ్డి ఒగుపు

(1) పుండుమానే చికిత్సలు చేయవలెను.

(2) అనాసదుంప (లాంగలి) వేసి కాచిన ఆముదము పెట్టినచో తగ్గుననియు, యీ కారణమువల్లనే ఈవ్యాధికి అనాసజబ్బని పేరనియు కొంతమంది చెప్పుదురు.

అనాహము -- మూత్రపురీషబద్ధమై కడుపు ఉబ్బెడు రోగము ఆమమయినను, మలమయినను సరిగా వెడలక కోష్ఠమున నిలచియుండి వాతాదులచే శుష్కింపచేయబడినది

(1) సాధువిరేచనకారులను వాడవలెను.

(2) కడుపుపయిని కాపడములు పెట్టుటవలన ఉపయోగముండును.

అనుశయ— పాదముపై చర్మ సమ నవర్ణముగానుండి ఉన్నతముగా ఉబ్బి, లోలోపలనే పక్వమయ్యేడుకురుపు
(1) అష్టశుక్షులుచేరినగంధకము పుచ్చుకొనవలెను —

అపచారజ్వరము — అపథ్యాహారవిహారాదులచేజనించిన జ్వరము—

అపచి— చీముకారుచు తమంతటతామేపుట్ట తమంతటతామేనశించుచు చాలాకాలమువరకు బాధించుచుండు గజ్జి మొదలయినవి

అపస్మారము— స్మృతితప్పి ఏమియు తెలియక వికారముగా చూచుచు కాళ్ళుచేతులు కొట్టుకొనుచు పడిపోయియుండును మూర్ఛ, లేక స్త్రీలకువచ్చెడి "కాకిసోమాల" యనురోగము, కొంతమందికి నోటనుచ్చులు కారుచు ఇంచుమించుగా దయ్యముపట్టినవారిచేష్టలు కలగియుండును. కొంతమందికి కాళ్ళుచేతులు బిగుసుకొనిపోయి స్పృహలేకుండును కొంతమందికి నోటనుచ్చులుండవు. స్పృహయుండును

(1) ఒకనిమ్మపండురసంలో ఒకఔన్సునీళ్ళుపోసి తగునాత్రంచోడాకలిపినయెడల పొంగువచ్చును దానినిరోగబలమునుబట్టి రోజు1కి రెండుమూడుసార్లు పుచ్చుకొనవలెను భోజనమయినవెంటనే వమనమయ్యేడువ్యాధి పైత్యవ్యాధి వికారము,శూల, పైత్యసంబంధమయినమూర్ఛ ఇవన్నియు తగ్గును
(2) పర్పాటకచూర్ణం పూటకు రెండుచిన్నాలుచొప్పున మేహతత్వంకలవారు గొర్రెపాలతోగాని, గొర్రెపాలతోగాని, వాతతత్వంకలవారు ఆవుపాలతోగాని, మేకపాలతోగాని పుచ్చుకొనవలెను.
(3) మండలం (నలుబది) రోజులువిడవకుండా ఉదయంపూట ఒక నారదబ్బపండుతినవలెను అవసరమయితే ఉప్పుచేర్చుకోవలెను ఇచ్చాపథ్యం

అభిఘాతజ్వరము— దెబ్బతగులుట, దూరమునడచుట, తనశక్తికిమించిన ప్రయాసపడుట, మొదలయినవాటిచే జనించినజ్వరము
(1) తాత్కాలికోపయోగములయిన ఉపచారములు చేయవలెను—

అభిష్యందము - కళ్ళనుండి నీళ్ళుకారెడురోగము

అరతలనొప్పి— పార్శ్వపునొప్పి (1) కొంగిగంధం నల్లమందుకలిపి పట్టువేయవలెను
(2) చలకగ్రి బందితోగాని, గనుపాలతోగాని నూరిపట్టువేయవలెను.
(3) నొప్పిగానుండు పార్శ్వమునన్న చెవిలో తెల్లకాకరాకుపసరు పండవలెను.

(4) నొప్పిగలప్రదేశమందు దూలగుండాకు కట్టవలెను. దూలగుండాకుకట్టినస్థలంలో నూగుగుచ్చుకుని దద్దురెక్కినయెడల చింతపండు గుంజుపట్టు వేయవలెను.

అరుచి -- అన్నమునందిచ్ఛకలిగియు భుజింపశక్తిలేకుండుట, భావనజీలకర్ర రోజు1కి రెండుమూడుసార్లు చప్పరించవలెను భావనజీలకర్రచేయువిధము మాదీఫలరసంలో తగుమాత్రము సైంధవలవణంకలిపి, జీలకర్రపోసి పగటిభాగమున, జీలకర్రను, రసమునువిడివిడిగా ఎండబెట్టుచు రాత్రిభాగమున ఏకముచేయుచు రసము యింగిరపోయేవరకు చేయవలయును పిమ్మటదానిని చలికంపురాకుండా మధ్యమధ్య యెండబెట్టుచుజాగ్రతచేయవలెను భావనకునిమ్మ, పుల్లదబ్బపళ్ళరసం రెండపథ్యము.

అరూంషికము — శిరమునందు చీముకారుచు బయలుదేరు అనేకముఖములు గల కురుపులు. దీనివేపురిమ్మాదయని కొందరందురు

అర్జునము - కంటియందుండు తెల్లగుడ్డులో జనించిన యెర్రచుక్క

అర్బుదము - పొర్లగడ్డలేక శరీరమునందెచ్చటనో ఒకదిగ్గిరవాచినవాపు

అర్మము - దుర్మాంసము

అరోచకము — అరుచి లేక అసహ్యము

అర్శోరోగము — గుదస్థానమునలోపలగాని, వెలుపలగాని, మాంసపుమొలకలు మొలిచి వేదనకలిగించురోగము (ఇదేమూలశంక)

(1) పొలములలోమనం పెంచకుండా దానంతట అదిబయలుదేరిన కందదుంప (అడవికంద) పుటంపెట్టి రెండుతులముల గుంజులో వకతులం పేరుకొన్న నెయ్యికలిపి ప్రాతఃకాలమందు పుచ్చుకొనవలెను పెసరపప్పు, కందఇగురు, ఆవుపెరుగు, పెరుగుతోటకూరపథ్యము. ఈప్రకారము పద్ధెనిమిదిరోజులుచేయవలయును.

(2) యింగిలీకం, ఆవుపాలు వెన్న, మర్దించి గుడ్డకుపట్టించి అగుడ్డనుయెండించి వత్తివలెచేసి గోతిలోపెట్టవెలిగించి ఆగోతిపైని తిరగలిబల్లవేసి కూర్చుని ఆతిరగలిబల్లయొక్క రంధ్రముగుండా వచ్చేపొగను ఆసనముకు పట్టించవలయును.

(3) ముళ్లతోటకూర సమూలము మెత్తగానూరి చిట్టాముదంతోఉడికించి ఓళ్లవలెచేసి ఆసనముపైని కట్టవలెను. పిలకలు ఊడి పడిపోవును.

అలజి — కంటిలో తెల్లగుడ్డునకున్ను, నల్లగుడ్డునకున్ను మధ్యభాగమున ద్రాక్షపండువంటి బొబ్బలేచి పోటుపుట్టి నీరుకారును.

అలస — (పాసిపోవుట) కాళ్ళవేళ్లకును చేతివేళ్లకును కలిగెడు ఒరువు.

(1) పుండుమాను మందులను వేయవలయును.

(2) నూనె మొదలయిన జిడ్డు పదార్థములను వాడుకవలెను.

(3) కిరసనాయిలు పోసి పసుపు అద్దవలెను. దురదలు మానును.

అలసక — కడుపుఉబ్బరించి మలమూత్రములు వెలువడక దాహముకలిగిఉండును.

అలాసకము — అధిఉహ్వక చూడవలెను.

అవపాటుకము — అంగము చివరభాగమున పగులుట

(1) గుగ్గిలము, ఇంగిలీకము, నువ్వులనూని నెయ్యి, మైనము వీటినిగరిటెతో మరిగించి గుడ్డకు పట్టించివేయవలెను.

(2) మృదారుచిన్ని, జంగాలపచ్చ, అరిదళం (తాళకం) వేడెత్తు చొ॥ రేవలిచిన్ని పావలాయెత్తు మైనము, గుగ్గిలము రెండేసి తులములు చొ॥ చూర్ణించి నూనె మరగబెట్టి మైనం వేసి అమయినం కరిగినతర్వాత గుగ్గిలము వగయిరాల పొడుం వేసి కలియగలిప పాకానికివచ్చినతర్వాత దింపి జాగ్రతపెట్టి ఆపాలస్త్రీ గుడ్డకు పట్టించి వేయుచుండవలెను.

(3) రేలచక్క, ఆరువెలగచెక్క, మామిడిచక్క, ఇప్పలిక్కట్టు వీటిని చూర్ణించి చిట్లాముదంతో వుడికించి గుడ్డకు పట్టించివేయుచుండవలెను.

(4) రసచిందూరం, హారతికర్పూరం, కొబ్బరినూనె కలిప అరారగా రాయుచుండవలెను. కురుపులు, పుండ్లు, పగుళ్ళు, వగయిరా లన్నిటికిన్ని యీ పాలాస్త్రీ పనికివచ్చును

అశ్మరి— మూత్రరోగభేదము, మూత్రము కష్టముగా వెడలుటగాని, మూత్రశుక్రము లేకమైకష్టముగా వెడలుటగాని, మూత్రము గడ్డవలె గట్టిపడి, వెడలకుండుటగాని, కలిగియుండును

(1) రావిపండు, పంచదార, జీలకర్ర వీటిని పిత్తగా నూరి యీతవేళ్ల రసంతో యివ్వవలయును.

(2) ఉదయముననే బియ్యం కడిగి, ఆకడుగు, సాయంకాలమువరకు ఎండించుచు సాయంకాలము వడబోయుచు మరుచటిరోజున యీకడుగులోనే బియ్యము కడిగి సాయంకాలమున వడకట్టుచుండవలెను యీప్రకారం యిరవైవక్కరోజు వరకు చేసి అప్పటికి మిగిలియున్నదానిలో నిమ్మకాయరసము, సైంధకలవణం తగమాత్రం కలిపి సీసాలో పోసి కర్క వేసి దాచి విస్తారం కాకచేసినప్పుడు వకతులమెత్తు ఇవ్వవలెను

(3) ఎలక, పందికొక్కు గబ్బిలము వీటిలో ఏపెంటికలనయినా చనుపాలతో నూరి బొడ్డ పయిని పట్టు వేయవలెను. (గబ్బిలపు పెంటికలు కుంభసాధ్యము)

(4) సోడా నీళ్ళలో చేసి, పంచదారకలిపి ఇవ్వవలెను.

(5) ఆముదాలు ఒలిచి ఆపప్పును వెచ్చచేసి నూరి నాభిపైనగాని, పొత్తికడుపుపైన గాని వేసి కట్టవలెను దోసగింజలగంధము కూడాపనిచేయును.

(6) సూరేకారం, రేవలిచిన్ని, పటికినీళ్లలోకలిపి యివ్వవలెను ఇండుపకాయనీళ్లతో అరగదీసి ఆగంధంలో తగుమాత్రం పటికిబెల్లం చూర్ణం కలిపి కుంకుడుగింజలగాయితు గచ్చకాయంతవరకు ఇవ్వవలెను. మూత్రం పట్టు విడిపోవును. గాని చిరకాలం యివ్వరాదు. నాభి శైత్యంచేయును.

అశీతివాతములు—

అష్టవిధమూత్రకృఛ్రములు—

అష్టవిధశూలలు.—

అష్టవిధోదరములు—

అసృగ్దరము— కుసుమరోగము

(1) బేదానాలు, వట్టవేళ్ళు, సజ్జాగింజలు, వీటినినీళ్ళతోనూరి, కుంకుడుగింజలవలె మాత్రలుచేశి పుచ్చుకోవలెను. ఇచ్ఛాపథ్యం,

(2) తవాక్షీరి, కుంకుమపువ్వు, మిరియాలు, నాగకేసరాలు, పొర, కలగర, కడుగుతోనూరి, కుంకుడుగింజలవలె మాత్రలుచేశి పుచ్చుకోవలెను ఇచ్ఛాపథ్యం.

(3) నల్లేరునూరి, ఒకగింజతీసిన చింతపండుగుల్ల, పట్టినంత చింతపండు మాటుతో ఉదయం మూడుపూటలు పుచ్చుకోవలెను. చప్పిడిపథ్యం,

(4) రేగుగింజలలోనిపప్పు, బెల్లము, నెయ్యి, వీటినిమాత్రలుచేశి సేవించవలెను

(5) ఉత్తరేణిఆకురసము నెత్తిమీదమర్దనా చేయవలయును.

(6) నేటిలోలక్కనుకరిగించి దానిని పాలలోకలిపి త్రాగవలెను.

అస్థిగతజ్వరము— పురాణజ్వరము, (జీర్ణించిపోయినజ్వరము)

అస్థిస్రావము— తెల్లకుసుమ.

అహిపూతనము— శిశువులకు మలమూత్రములు జరిగినవెంటనే తడిగుడ్డతో తుడుచుటగాని, కడుగుటగాని, చేయనియడల కురుపులు బయలుదేరి ఒకదానిలో ఒకటి కలుసుకొనిపోయి విస్తరించెడు స్వభావముకల కురుపులు.

అంగముముణగలాగుకుపోవుట— ఏరోగమయిననుసరే శిశ్నముమొదట్లోకంటాముణగలాగుకొనిపోయినచో ఎంతతెలివిగాఉన్నాసరే అరోగిజీవించడని తెలియవలయును.

అంగసంధాలవాపు— కీళ్ళసంధులవాపు.

అపవిఘాతకాటు— మనుజానిచర్మమును మర్దనచేయవలెను. గేదెవెన్న, వెల్లగరము వాటినికలిపి మర్దనాచేయవలెను

అండరోగము— వృషణములవాపు

(1) కొబ్బరికోరు ఆముదముతో వెచ్చజేసికట్టవలెను
(2) ఆల్చివేళ్ళు చితుకగొట్టి ఆముదముతో వెచ్చజేసి కట్టవలెను.
(3) మేకపెంటికలు కాల్చినబూడిద కుండసానివాము, నీళ్ళతోనూరి వెచ్చజేసి కట్టవలెను
(4) కందులు నీళ్ళతో మెత్తగానూరి ఉడికించి గోరువెచ్చగా ఉండగా పట్టించు చున్నయడల గంటెవిడ్డిల వరిబీజం మానిపోవును.
(5) కాకకొండవేళ్ళగాని, గచ్చచిగుళ్ళుగాని, ఆవునేతితో ఉడికించి కట్టవలెను.
(6) నల్లమందు వేడినీళ్ళతోగాని, బ్రాందీతోగాని, అరగతీసి వేయవలయును
(7) తాటిపువ్వు మెత్తగానూరి ఆముదంతో వెచ్చచేసి కట్టవలయును
(8) తడిగుడ్డ గోచీ పెట్టవలయును
(9) గచ్చవేళ్ళు ఆముదంతో వెచ్చజేసి కట్టవలెను
(10) తాండ్రపిడదలోనిపప్పు, నల్లమందు వేడినీళ్ళతో అరగతీసి వేయవలయును.
(గలకసంబంధమయిన వ్యాధులకుకూడా ఇదేచికిత్స)

అండవృద్ధి--- అండరోగము

అండవాతము - వృషణములలో ఒకటిగాని, రెండుగాని వాచి పోటుకలిగి ఉండును

అంతరకసుమ — కంటిలోని పువ్వు

అంతర్దాహము - బాధతెలియని తాపము

అంతర్విద్రధి-- గుల్మము కంటె పెద్దది

అంత్రాలజి— గట్టిగాను ఉబ్బెత్తుగాను ఉండు కురుపులు పుట్టి, వాటి చుట్టూ ఆవాలువంటి కురుపులు బయలుదేరి స్వల్పమయిన చీముకలిగి యుండును

ఆగంతుకరోగము - దెబ్బతగులుట, శక్తికిమించిన పనులు చేయుట, బరువు మోయుట, క్రూరజంతువులతో పోరాడుట, మొదలయినవాటిచే జనించినది. బ్రాందీ యివ్వవలెను

అంత్రవృద్ధి — వాతము ప్రకోపించి సన్నని ప్రేగులలో ఎక్కడనో ఒక భాగమును సంకుచింపచేసి వాటివాటి స్థానమునుండి క్రిందకు సడలింపచేసి గజ్జలయందుచేరి జనించు గంధి (గిలక) రూపమయిన వాపు

(1) జిల్లేడాకురసంతో తీసిన సొంటిగంధం వెచ్చచేసి వేయవలయును
(2) గంధసెరోజాను, వెచ్చచేసి గజ్జకు పట్టించి బిళ్ళ, లేక కంతులపైని వేయవలెను.

చాలాబాపతులు కంతులు, గడ్డలు, బిళ్ళలు మొదలయినవి దీనివలన హరించును గండఫిరోజా కిరాణాకొట్లమీద దొరకును.

(3) పిండికట్లు కట్టవలెను.

(4) బాలింతబోలి నిమ్మపండు రసంలో నూరి వేయవలెను.

(5) గోరింటాకు రుబ్బి కట్టవలయును

(6) దేవాలయములో నుండు గన్నేరువేరు మెత్తగా అరగతీసి వేయవలెను

(7) యీతమొవ్వ, పంచదార పాకంవచ్చేలా నూరి బిళ్ళగాచేసి కట్టవలెను

ఆధ్మానము— గుడగుడశబ్దముకలిగి నొప్పితోకూడుకొన్న కడుపుబ్బరము

అనికాయు — ముల్లు మొదలయినవి రాక లోపలదిగడుటచె అరిపాదమున ముల్లు విరిగిన స్థలమునందు ఁయలుదేరుగ్రంథి

(1) ఏనుగులద్ది మర్దనచేయుచుండుటవలన హరించును

(2) కాలిలోవిరిగినముల్లురాక దిగబడిపోయినయెడల [illegible] పొప్పరతీసి, మైలతుత్తం మంచినీళ్లలో అరగదీసి, ఆగంధంపొప్పరతీసిన స్థలంలో పెట్టినయెడల మంటమండి, పట్టుబేరేసరికి అనుంటకూడా [illegible] మైలతుత్తగంధం ఎండినతర్వాతఊడదు పిమ్మట రెండుమూడుగోటలు పోనిచ్చి, మెంతులనీళ్ళలో నానపెట్టి మెత్తగానూరి ఆమెంతిపిండి కట్టినట్లో ఎంతలోతునవిరిగినముల్లు అయినా తప్పకవచ్చును నేర్పుగా చీముపిండవలెను [illegible] యములోనే ముల్లు పైకి వచ్చును

ఆమము— (ఆమదోషము) భుజింపబడిన పదార్థము సరిగాజీర్ణముగాక కడుపులో ఘనీభవించియున్నది

ఆమాతిసారము — దీనినేజిగటవిరేచనములనియు, ఆమువిరేచనములనియు అందురు

ఆయాసము — ఒగర్పు

ఆర్తవదోషము— (ఆర్తవరోగము) కుసుమ లేక సోమరోగము తెల్లకుసుమను శ్వేతప్రదరమనియు యర్రకుసుమను రక్తప్రదరమనియు చెప్పెదరు

అవర్తవ్రణము — సుడివంటిఆకారముగల కురుపు.

అసనగండమాల - అసనము, గజ్జలు, కంఠము చంకలు మొదలయిన ప్రదేశములయందుగాని వాటిచుట్టుగాని, మాలవలె [illegible] ఆప్రదేశములనుబట్టి అసనగండమాల, వంక్షణగండమాల, గలగండమాల, కక్షగండమాల. అనిచెప్పెదరు. కంఠమందుజనించిన ఒంటిగ్రంధిని గళగండమందురు

ఆహికజ్వరము— రోజువిడిచి రోజుగాని మూడురోజు కుగాని, నాలుగు రోజులకుగాని, వచ్చుచుండుజ్వరము దీనినే పాళీజ్వరమనియు, చలిజ్వరమనియు చెప్పుదురు.

(1) నిమ్మకాయ, ముప్పంకాయవలె తరిగి దానిలో ఆయిను క్వాయినా బిళ్ళలుగాని, అయిదు పొట్లములలోవున్న క్వాయినా గాని, పెట్టి చీలమన్నుయిచ్చి పుటము పెట్టి సాంగశీతలమున గింజలు, తొక్కలు సహితం పాకంవచ్చేలా నూరి గురి గింజలవలె మాత్రలుచేసి పూట 1కి రెండుమాత్రలు చొప్పున నీళ్ళతో పుచ్చు కొనవలయును ఇచ్ఛాపథ్యం. ఎంతబండజాతిజ్వరమయినాసరే జ్వరజాతిఅంతయు శమించును. క్వాయినావల్ల సంభవించే చెముడు, తిప్పు మొదలయిన యేట్టివికా రములున్ను కలుగవు. అవసరమునుబట్టి మోతాదులను సవరించుకొనుచుండవలెను.

ఇగుళ్ళవాపు— (1) జామాకు కషాయం పుక్కిటపట్టి ఉమియవలెను.

(2) కొంరిపొడుం అద్దవలయును.

ఇరివేల్లిక — శిరస్సుపైని ముక్కలిబ ధకలిగి గుండ్రముగా లేచెడుకురుపులు.

ఇరుకునొప్పి— (బెణుకునొప్పి)

(1) గలిజేరు సమూలం నూరి గాని, వేపాకు నూరిగాని అముదంతో వెచ్చచేసి కట్ట వలయును.

(2) అముదం రాసి తేలికగా తోమవలెను.

(3) నొప్పిగల అవయవమునకు సంబంధించిన చెయ్యి, లేక కలివేళ్ళ మొటికలు విరువవలెను.

4) నొప్పిగల అవయవముకి దిలేటట్లు ప్రక్కనుండు కలగాని చేయిగానిజాడించవలెను.

ఇంద్రలుప్త పేను కొరుకుట, లేక బట్టతల అందురు. గడ్డము, మీసము ఊడిపోయిన, ఇంద్రలుప్త, తల వెంట్రుకలుమాత్రి మూడిపోయిన. ఖాలిత్యము, ఈ రెండుప్రదేశములయందు గాక శరీరమునందు వచ్చుటనయినను వెంట్రుక లూడిపో యిన రుహ్యాము అని ఈప్రకారము భేదములను గుర్తించవలెను.

(1) చేదుపొట్లాకు రసము రాయుచుండవలయును.

(2) మాడీమాడకుండా కాల్చిన ఏనుగుదంతమును గాని, ఏనుగుగోరిజను గాని మెత్తగా నూరి ఆచూర్ణము, హారతికర్పూరము కొబ్బరినూనెలో కలిపి రాయు చుండవలెను.

(3) గుంటగలగరాకు నిజరసం, కొబ్బరినూనె సమానంగా కలిపి రసం యిగిరిపో యేలా కాచి ఆనూనెను రాయుచుండవలెను.

(4) ఊడుగుగింజల తైలం రాయవలెను

(5) గుంటగలగరాకు ముద్దగానూరి ఆముద్దకు నాలుగురెట్లు స్వరసమున్ను నూనెయు కలిపి నూనె మిగులునట్లు కాచి దానిలో ఏనుగుదంతమును గాని ఏనుగుగోరిజలను గాని మాడ్చిన బూడిదనున్ను, ఉశిరికవలుపు మాడ్చిన బొగ్గునున్ను కలిపి రాయుచుండిన ఊడిపోయిన వెంట్రుకలు గుబురుగా పెరుగును

(6) ఏనుగుదంతమును పుటముపెట్టి ఆచూర్ణము, రసాంజనము, మేకపెన్న కలిపి పూయుచుండవలెను.

(7) నల్లజీడిగింజలు నూనెలో వేసి కాచి ఆనూనె రాయుచుండవలెను.

(8) కొర్రులను మాడ్చి అమసి నూనెలో కలిపి రాయుచుండవలెను.

ఇంద్రవిద్ధ— మధ్యభాగమందు తామరపువ్వు బొడ్డువంటి ఆకారముగల కురుపున్ను దానిచుట్టూ చిన్నచిన్న కురుపులున్ను ఉండును

ఉదరరోగము— శరీరముకృశించుట, తెల్లపారుట, భుజములు, తుంట్లు యెండిపోవుట, కడుపులో ఒల్లగాను నీరుగాని, విళ్ళుగాని బయలుదేరుట, ఇట్టి చిహ్నములు కలిగియుండును.

ఉదర్దము— దద్దుర్లు (1) చింతపండు రాగిపళ్లెంలో నానపెట్టి పనికి ఆ పులుసు ఒళ్ళంతా పట్టించవలెను

(2) జీలకర్ర వేయించి మెత్తగా చూర్ణించి ఆవునేతిలో కలిపి రాయవలయును.

(3) పుల్లమజ్జిగతో గంగరావిచెక్క గంధం తీసి రాయవలెను

(4) పెద్దబచ్చలాకు మెత్తగా నూరి రాయవలెను

(5) గంగరావిచెక్క చూర్ణం యిరవైనాలుగు తులములు, ఎరంగిచెక్క చూర్ణం పన్నెండు తులములు, లవంగాలు, యాలకులు, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయ, తాడికాయ, ఉశిరికాయి ఆకుపత్రిక, సీమగులాబీ పువ్వులు, దినుసు వక్కంటికి తులంచొప్పున చూర్ణించి ఆచూర్ణమునకు రెట్టింపు పటికిబెల్లం పాకం పట్టి అందులో ఆవునెయ్యి తేనె అరసోలడుచొప్పున పోసిపైచూర్ణములను కలియకలిపి పూట1/4తులంచొప్పున, పుచ్చుకొనిన సమస్తవిధపైత్యములు శమించును

ఉదావర్తము— మూత్రపురిషములు అతికఠినముగావెడలుటగాని, నోటిద్వారా వెడలుటగాని, కలిగియుండునది.

ఉన్మంథకము— కుట్టినచెవిని బలాత్కారముగా పెంచుటచే జనించినవాపు, ఇదినొప్పిలేకవాపు కలిగియుండును

(1) నువ్వులనూనె వెచ్చపెట్టి దానిలోగుగ్గిలముకొంచెంవేసి కొంచి శమనగా కొంతకాలం

పాటు కాచుచుండవలయును ఉప్పురాయి, మిరియంగింజ, మంచినీళ్ళతో అరగదీసి ఆగంధం వేయుచుండవలెను కన్నుతో బయలుదేరిన సురుగుడు కాయలవంటి కురుపులు, కంతులు, తగ్గిపోవును

ఉన్మాదము — (పిచ్చి) అపస్మారము

ఉపజిహ్వక — (అధిజిహ్వక)

ఉపదంశము — మర్మావయవమందు పుండ్లు బయలుదేరిన కొరుకువ్యాధి (సవాయి)

(1) రసకర్పూరము, మదారుచిన్ని, అమాంశిలగంధకము, కవిరి, వెన్నతో నూరి పట్టం ముచుండవలెను

(2) సీమనేపాళంచెట్టు మొదట (స్తంభమునకు) కత్తినాటుపెట్టినయడల వచ్చినపాలతో రసకర్పూరం కుండపెంకుమీద అరగతీసి ఆగంధం రాశినయడల బాధవెంటనే శాంతించును

ఉబ్బసము — ఊర్ధ్వశ్వాస (1) తెల్లవాకుడు కాయలోని గింజలుతీసివేశి ఆ గుల్లనిండా ఉప్పుభ్బునూరిపెట్టి పుటము వేశి పాతబెల్లంతో కుంకుడుగింజలువలె మాత్రలుకట్టి జనముకు ఒక్కొక్కటిచొప్పున పుచ్చుకొనుచుండవలెను

ఉరక్షతము రొమ్ముపగులకొట్టినట్లు గాని, శీల, నాటినట్లుగాని యుండును దగ్గినప్పుడు నల్లగాగాని, పచ్చగాగానియుండు చిక్కనికఫము రక్తముతో కలసి వెలువడుచుండును

ఉంచరపోటు — (1) శొంఠి, బియ్యము మెత్తగానూరి నీళ్ళతో ఉడకపెట్టి ఉడుకుచుండగా పటికబెల్లం, నెయ్యితగుమాత్రం వేశి కలియుగలిపి చల్లారినతర్వాత జాగ్రతపరచి ఉదయం పరగడుపున కుంకుడు కాయంత చొప్పున తినిపించవలెను

(2) వాము యిక్కైతులమూల గోరగాంవేయించి మెత్తగానూరి వస్త్రఘాలితముచేసి దానిలో వస్త్రఘాలితము చేసిన కరిధూపము పసుపుతులముచొప్పున వేసి ముప్పది తులముల తాటబెల్లం గోటిలో వేశి పయి గుండపోసి పాకమువచ్చేలాగున తొక్కవలయును తొక్కుచుండగాగాని తర్వాతగాని దిగుదాయినూని లేహ్యపాకమునకు సరిపోవులాగునపోసి, ప్రతిరోజూనా ఉదయానే పరగడుపున గచ్చకాయంత తినిపించుచుండవలయును

ఊర్ధ్వజత్రురోగము మూపుసంధులకు పైభాగముగునుండెడు, ముక్కు, కన్ను, చెవి ముఖము, మొదలయినవాటికి సంబంధించిన రోగము

ఊపిరిగొట్టునొప్పి — హిధ్మ, ఊపిరిపీల్చునప్పుడు వెన్నుతోగాని, హృదయమునగాని, పక్కలయందు గాని ఊపిరి అందకుండా కలుగు అనిర్వాచ్యమయినొప్పి.

(1) రాయివలె గట్టిగానున్న బెల్లంముక్క బుగ్గను పెట్టుకొని ఊటమింగుచుండవలెను.
(2) ఉప్పు కాపడం పెట్టవలెను (3) సోడాపుచ్చుకోవలెను. (4) పుచ్చుకోగలిగినంత వేడిగానున్న మంచినీళ్లను గాని. కాఫీగాని, టీగాని, పాలనుగాని, పుచ్చుకోవలెను

ఊరుస్తంభము - తొడలుకదలింపవీలులేక బరువుకలిగిమిక్కిలి బాధగాఉండును.

ఋతుశూల— ముట్టుతోకలిగెడు కడుపునొప్పి

(1) శొంఠి, పిప్పలి, మిరియాలు, సైంధవలవణం, ఇంగువ, వెల్లుల్లి, ఇవి మెత్తగానూరి కుంకుడుగింజలవలె మాత్రలుచేసి బహిష్ఠఅయినదిలగాయతు పూటకు ఒకటిగాని, రెండుగాని మాత్రలను వేడి నీళ్ళతోపుచ్చుకోవలయును (ఇందులోకొంతమంది గచ్చపప్పును స్వల్పముగావేసి మాత్రలుకట్టు ఆచారముకలదు). ఈలావకపర్యాయమునకు తగ్గనియెడల బహిష్ఠఅయినప్పుడెల్లా రెండుమూడు పర్యాయములు వాడవలెను చప్పిడి పథ్యము
(2) నల్లఉప్పివేళ్ళు, పాతబెల్లం సాఠీలావిత్తుచొప్పున కలియనూరి కుంకుడుగింజలవలె మాత్రలుచేసి బహిష్ఠదినములలో ఉదయాన్నే ఒకటిగాని, రెండుగాని, మాత్రలువేడినీళ్లతో వేసుకోవలెను చప్పిడిపథ్యం
(3) తంగేడుపువ్వులు రెండుతులములు, తామరపువ్వులోనికేసరములు అరతులంనూరి వుస్తిపండ్లవలె మాత్రలుకట్టి ప్రతిరోజూనా ఉదయము సాయంకాలము ఒకటిగాని, రెండుగాని, మాత్రలను పంచదారతో పుచ్చుకొనవలయును మాత్రకావడమునకు అవసరమయితే ఆవుపాలు ఉపయోగపరచవలెను. ఋతుకాలమునందుండు బాధ, మంట, శూల చాలాకాలమువరకు బాధించు ఋతుస్రావము తగ్గును.
(4) శొంఠి, వాము, గసగసాలు, కవిరి, పోకచెక్క, సోపు, వీటినివేయించి పొడుంకొట్టి వస్త్రఘాలితంచేసి బెల్లంతో కుంకుడుగింజలవలె మాత్రలుచేసి కాపుపట్టకుండావున్న మామిడిచెక్కరసంతో పుచ్చుకోవలెను. కాపుపట్టనిమామిడినే కన్నెమామిడి అనిచెప్పచుందురు

ఋతుస్రావము— ఆర్తవదోషము. బహిష్ఠులోగాని స్నానమయినతర్వాతగాని యోనిద్వారమునుండి స్రవించుమైల.
(1) నల్లటిసున్నపుకుండలో నల్లగా తేరినతేట ఉదయంఒక అర ఔన్సుచొప్పున యిచ్చుచుండవలెను.

ఎండదెబ్బ — వడగొట్టుట, తరవాణిగాని,మజ్జిగగాని,గంజిగానిపట్టించవలెను.

ఎక్కిళ్ళు— హిక్క, (1) ఔదుళ్ళపైనుండు పొట్టునుగీచి కాగితంలో వేసి చుట్టవలెచుట్టి కాల్చవలయును.

(2) తామరగింజలచూర్ణమును నీళ్లతో సేవించవలెను.

(3) అల్లంముక్కకు ఉప్పు పూసి పండునిప్పుపైనికాల్చి ఆముక్కను బుగ్గనుంచుకొని నమలుచు ఊటమింగుచుండవలెను

ఎలుకకాటు— (1) గోగునులక తాడుకాల్చి ఎలుకకరిచిన స్థలమందు ఆ పొగపట్టించుచుండవలెను

(2) పులిసినకడుగు, లేతపత్తిఆకురసం, కలిపి గని వెంపలిరసంలో పటికబెల్లం కలిపి గాని ఇవ్వవలెను ఇచ్ఛాపథ్యం

(3) సూర్యోదయంకాకుండా రోజూ ఒక కొబ్బరిబొండంలోని నీరు త్రాగుచుండవలెను ముక్క తినరాదు ఇచ్ఛాపథ్యం

(4) దిరిసెనగింజలు, వేపాకు, గచ్చపప్పు, అవుపంచితంతో నూరి కరిచినస్థలమందు రాయుచుండవలయును

(5) విషదుష్టమగు ఒకొక్కక్క ఎలుక ఒంటిమీదపడినను పాకినను, దానిస్పర్శతగిలినంతమాత్రముననే శరీరమున గ్రంధులు బయలుదేరి అపాయస్థితిసంభవించును. గ్రంధులనుండిరక్తము వచ్చునట్లుగీసి వాటికయిని గాడిదవలమును లేపనము చేయుచుండవలెను

ఏటికిపాములు— ఇవి కడుపులో పెరిగి నలకపుల్లలు, గింటములవలె ఆకృతి కలిగి ఆసనమునుండి గాని నోటినుండిగాని పడును

(1) మునగగింజలు, వెంగల్వకోష్టు మెత్తగా నూరి తేనెతో నాకించవలయును

(2) తురకవేపచెక్క కషాయం ఒకతులం వాయువిడంగాలచూర్ణం అణాయెత్తు కలిపి ఉదయాన్నే త్రాగవలెను

(3) విషముష్టిగింజలచూర్ణం అడ్డిగెత్తు (రెండుగురిజలెత్తు) వేడినీళ్ళలో కలిపి ఉదయాన్నే త్రాగవలెను

(4) గొలుగువేళ్ళ చిలుకగ్గొట్టె తేనెతో పుష్టిక యంత్రమంత వేసి ఉదయాన్నే వేడినీళ్లతో వేసుకోవలెను.

(5) వాము లోకమిరియాలు కషాయం తీసి త్రాగవలెను.

ఒరుపు - అంగల

ఓష్ఠస్ఫుటనము — పెదవులు పగులుట (1) వెన్న మొదలగు జిడ్డుపదార్థములను రాయవలెను

కక్షము— (కక్షపిటకము) భుజములు, చంకలు, పార్శ్వములు, వీటియందు బాధతో కూడి నల్లగాగాని, వివిధవర్ణములు కలిగిగానిజనించు కురుపులు—

కచ్ఛపికము—తాబేటిబొరుసువలె మధ్యభాగమునం దున్నతమై దానియందు పొక్కులు కలిగి చూచుటకుభయము కలిగించుకురుపు.

కంటిలోనలక (1)కంటిపైభాగమందున్నయెడల అడుగురెప్పయొక్క వెండు) కలను అడుగుభాగమందున్నయడల పైరెప్పయొక్క వెండు)కలను కంటిలోనికి పోనిచ్చి నేర్పుగా తీడవలెను ఇట్లు చేయుటవలన నలక బహుసూక్ష్మముగావచ్చును

(2) కంటిలో వెన్నపూస పెట్టవలెను

(3) గుడ్డ ఉండగా చుట్టి నోటిలో ఊది ఆగుడ్డ ఆవిరి పట్టవలెను.

కంఠశాలూకము— రేగుపండు పరిమాణము కలిగి కంఠములో బయలుదేరిన గ్రంధి (శస్త్రసాధ్యము)

కందిరీగ కాటు— తీగదొండఆకు పసరుతీసి రాయవలెను.

కడుపుబ్బరము—(1) ఉప్పు, వాము కలిపి, దానినినమలి వేడినీళ్ళుత్రాగవలెను.

(2) బ్రాందీ ఉపయోగించవలెను

(3) సోడా త్రాగవలెను

(4) వేడి కాపడములను కాచవలయును

కడుపుశగపోవుట— మూత్రము కొడలక ఎప్పటికప్పుడే మూత్రమగునని అనుమానము కలిగి కూర్చున్నచోటనుండి లేచుటకు ఇష్టముండక ఒక్కొక్క బొట్టు చొప్పున మూత్రము అగును

(1) తెలిమిడి మజ్జిగలోకలిపి, పొత్తికడుపు మీదను, బొడ్డుమీదను పట్టువేయవలెను.

(2) లేతకొబ్బరికాయలోని నీరు త్రాగవలెను

(3) వేడికాఫీ, లేక టీ త్రాగవలెను

(4) డేగిసాలో గోరువెచ్చని నీళ్ళుపోసి దానిలో బొడ్డుములిగేటట్టు కూర్చోవలెను మూత్రం కాగానే లేచిరావలెను. అశ్మరి చికిత్సలుకూడా ఉపకరించును

కణతపోటు— (1) హారతికర్పూరం, పుదీనాపువ్వు అరచేతిలోవేసి నలిపి సన్నోనీరగును అదిరాయవలెను

(2) మైనము, హారతికర్పూరము ఇత్తడిగిన్నెలో వేసి, కరిగిస్తే కరిగి మంట వచ్చును ఆసమయమందు దానిని, నీళ్ళుపోసిన బూర్లిమూకుట్లో గాని, పళ్ళెంలో గాని చటాలున దిమ్మరించినచో నీటిపై కాగితమువలె అగును. దానిని నొప్పికల ప్రదేశమునవేసి తమలపాకు చేర్చి కట్టు కట్టవలెను.

కణుపుచెష్ట— వేలికణుపునందయ్యేడు కురుపు

(1) సున్నం, పసుపు కలిపి (పారాయణ) కట్టవలెను.

(2) వేలికి సరిపడేలాగున నిమ్మకాయకు తొలవేశి తగిలించవలెను.

(3) పిండికట్లు కట్టి చితికేలా చేయవలెను.

(4) సున్నం, ఆముదం కలిపి వేయవలెను.

కఫరోగము— శ్లేష్మప్రధానమయిన వ్యాధి.

కరపాణికురుపులు — కాళ్ళమీదను, చేతులమీదనుపసిపిల్లలకువేసెడికురుపులు.

కర్ణరోగము — (1) దేవదారుచెక్కను గాని, మారేడువేరును గాని గుడ్డ చుట్టపెట్టి నూనెతో తడిపి వెలిగించిన దానినుండి తైలము స్రవించును. ఆతైలమును జాగ్రతపరచి చెవులలో వేశినయడల పోటు తగ్గును

(2) వెల్లుల్లిరేకలను జిల్లేడు ఆకుమట్టి నిప్పుమీద బాగుగావెచ్చచేశి దానిని అరిచేతుల మధ్యనుంచి నలిపిపిండిన రసము స్రవించును ఆరసమును వేయవలెను.

(3) చెముడుకాడ వెచ్చవేసి ఆరసం పిండవలయును

(4) మేకపంచితంలో సైంధలవణంకలిపి పోయవలెను.

(5) పండిరాలిపోయినజిల్లేడాకులకు, నెయ్యిగాని, తేనెగాని, రాసి వెచ్చపెట్టి దాని రసం పిండవలయును.

కర్ణనాదము — చెవిహోరు, నల్లరిమియాలచూర్ణము చెవిలోవేసి వెచ్చచేసిన మంచినూనె వేశిన హోరుతగ్గును.

కర్ణశూల — (1) తేనె వేశినరశికారుట తగ్గును. (2) మేకపాలు, లేక చనుపాలుపోయవలెను (3) బ్రాందీపోయవలయును. (4) ఆముదంలో వెల్లుల్లిరేకలు వేశి బాగాకాచి గోరువెచ్చగానున్నపుడు పోయవలెను.

కర్ణిక— సన్నిపాతరోగమున చెవులవెనకగాని, క్రిందగాని జనించువాపు.

(1) కురుపులకు చేయు చికిత్సలను చేయవలయును.

(2) యీతమొవ్వ, పంచదారనూరి కట్టవలయును

కలరా— విషూచి, దీనినేమరిడిజాన్యమని చెప్పుదురు

(1) కలరాఅని అనుమానం తోచగానే 2 [illegible] సున్నముపైని తేరినసల్లని తేట యిచ్చి పిమ్మట చికిత్సలు చేయవలెను

ఇట్లుచేసినయడల సామాన్యముగా ప్రమాదము తటస్థపడదు. విరేచనంకట్టేమందు [illegible] వాడవలయును

[illegible] నొప్పిలేక వచియించను అప్పునెయ్యిరాయునగును.

కంఠశుండి— తాలువుల మొదటవాచి కంఠబిలము నష్టగించునావు

(1) శొంఠిగంధం ఉడికించి కంఠముపైని వేయవలెను

(2) శొంఠికొమ్ములో సగుమాత్రము ఉప్పువేసి నమలవలెను.

కంతులు— అంతివృద్ధి చికిత్సచేయవలెను

కదరము లేక కందరము— అరికాయి

కంపవాతము— ఎగురువాతము, కాళ్ళుగాని. చేతులుగాని, వీటిలోఒక్కటిగాని లేక శరీరమంతయుగాని, ఎగిరెడు ఒకవిధమయిన వాతరోగము.

కముకు దెబ్బలు (1)కలబంద వెచ్చచేసి దానిపైని పసుపుచల్లి కట్టవలెను

(2) బాడిందిమర్దనాచేయవలెను బ్రాందీలోనికిచ్చుచుండవలయును.

కాకవంధ్య— ఒకసంతానముకలిగినపిమ్మట తిరిగిసంతానముకలుగకుండుట.

కామిల— పాండురోగభేదము. దీనియందు మలమూత్రములు పచ్చబడి, కన్నులు పచ్చబడును

కార్శ్యరోగము— ఎండుతెగులు

కాలుపు— (1)జనపగింజమెత్తగా నూరి వెన్నలోకలిపి రాయవలెను

(2) కొబ్బరినూనె, మంచినీళ్లుకలిపి నూరినచో వెన్నవలె అగును దీనినే నవనీతమందురు. దీనిని రాయుచుండవలెను

(3) ఆనపాకుపసరు రాయుచుండవలెను

కాస—దగ్గు

కిక్కిసరోగము — గర్భిణీస్త్రీకి ఏడవమాసమున గర్భమునందు తీట పుట్టి అచ్చటి చర్మము పగులును

కిలాసము— బొల్లి, (1)పైపొర తీసిన చింతగింజలు భావంచాలు నీళ్లలో మెత్తగా నూరి రాయుచుండవలెను.

(2) పసుపు, కస్తూరిపసుపు, ఉసిరికపప్పు, లక్క, అమరశిలగంధకము, తంగేడుగింజలు, మజ్జిగతో నూరి రాయుచుండవలెను.

(3) జేగురుమన్ను, నువ్వులనూనె, మంజిష్ఠ, చిత్రమూలము, కల్లులో నూరి రాయుచుండవలయును

(4) తెల్లదింశ నవేరు ఎన్నీళ్లలో నూరి నెలదినములు రాయవలెను రోగము పాతదిలిన యెడల అధిక కాలము రాయవలెను

(5) ఏనుగుచర్మము పెద్దపులిచర్మము కాల్చి బొగ్గగా చేసి, దానిని మెత్తగా నూరి నువ్వులనూనెలో కలిపి రాయుచుండవలెను

(6) గురిగింజలు చిత్రమూలముగాని, మణిసిల ఉత్తరేణిభస్మముగాని నీళ్ళలో నూరి రాయుచుండవలెను

క్రిమిరోగము— నులిపురుగులు, లేక ఏటికిపాములు

క్లీ్లవాపు (1)సీమనేపాళపాకులకు ఆముదంరాసి వెచ్చచేసి కట్టవలెను
(2) ఆముదపాకులు వెచ్చచేసి కట్టవలయును (3)బొబ్బాసిఆకులను ఆముదంరాసి వెచ్చచేసి కట్టిన మేహవాపు తగ్గును

కుక్కకాటు — కుక్క కరిచినవాడు నీళ్ళుచూచి భయపడినయెడల బ్రతుకుట దుర్లభము దీనినే జలత్రాసమందురు

(1) కుక్క కరిచినచోట చెప్పుతో స్పృశించి, పిమ్మట కాకరాకు పసరులో దబ్బు ముంచి కట్టవలెను పుండుమానేవరకు ప్రతిరోజూనా ప్రాతస్సాయంకాలముల యందు కట్టువిప్పి దబ్బుపై కాకరాకు పసరుపోసి కట్టుచుండవలెను. పప్పు, దుంప, నూనెపోపు పనికిరాదు
(2) వావిలాకు గాయముపైని కట్టుచుండవలెను
(3) కోడిమలమును గాని,లేక నువ్వులనూని, జిల్లేడుపాలు, బెల్లము వీటి నేకముచేసి గాని గాయముపైని లేపనముచేయుచుండవలెను
(4) ఉత్తరేణివేరు చూర్ణమును తేనెతో యివ్వవలయును. ఇచ్ఛాపథ్యం
(5) నెయ్యి, కలబందరసము వీటి నేకముగా వెచ్చచేసి గోరువెచ్చగా నుండునప్పుడు, తగుమాత్రము సైంధవలవణమును కలిపి రెండుపూటలా సేవింపవలెను. ఇచ్ఛాపథ్యం.
(6) మంచినూనె, నువ్వులచూర్ణము, బెల్లము, జిల్లేడుపాలు వీటిని కుంకుడుగింజల వలె మాత్రలుచేసి. రెండుపూటలా సేవింపవలెను ఇచ్ఛాపథ్యం

కునఖము — [illegible]గోళ్ళు

కురుపులు— మంచిగంధము, వెన్న కలిపి వేసిన, సలుపు, మంట తగ్గి చల్లగా ఉండును వెల్లుల్లిపాయను మెత్తగానూరి ఆ మెత్తనిముద్ద కురుపుచివర ముక్కుపై పట్టించి జాగ్రత్తగా ఆరనివ్వవలెను. స్వల్పకాలంలో కురుపు చితుగుట గాని, అణగి పోవుటగాని జరుగును పట్టు ఆరేసరికి సలపరం తగ్గిపోవును

కుకూణకము— పాలదోషముచే పసిబిడ్డలకు కన్నులు దురద, నీళ్ళుకారుట, తల, కంటిరెప్పలు, ముక్కు వీటిని గోకుకొనుట, ఎండచూడలేక కన్నులు మూసుకొనియుండుట ఇట్టి లక్షణములు కలిగి యుండును.
(1) కరకతాడివుశిరికలు, లొద్దుగవేరు, గలిజేరువేరు, అల్లం, ములగవేరు, వాకుడు

వేరు, వీటిని మంచినీళ్ళతో నూరి వెచ్చపెట్టి లేపనము చేయవలెను. లేక కంటి చుట్టూ పట్టువేయవలెను.

కుంభకామిల — కోష్ఠము నాశ్రయించి యుండు కామిల.

కుసుమ— అసృగ్దరము

కృత్రిమవిషము— (పెట్టుమందు) (గరవిషము, దూషీవిషము, యీరెండును, కృత్రిమవిషములే) (1) ప్రతిరోజూనా ఉదయం కాకముందే అరఔన్సు అవు పంచితము మూడు లేక అయిదుపూట లివ్వవలెను.

(2) యర్రఊడుగుచక్కరసం అరఔన్సు, నల్లమేకపాలు అరఔన్స యీరెండు కలిపి ఉదయాన్నే యిచ్చుచుండవలయును

(3) జిరిళనపుల్లతో దంతధావనము చేయుచుండవలెను.

(4) మంగకాయ చూర్ణమును తరవాణితో గాని, కడుగుతో గాని త్రాగించిన వాంతి యగును.

(5) నల్లఊడుగపండును నేతితో భక్షించవలెను. విరేచనము లగును.

(6) చందనము, చంగల్వకోష్ఠు, వట్టివేళ్ళు, సోమలత, తిప్పతీగె, తెల్లవస, తామర పువ్వు, అగరు, మనిషసుపుబెరడు వీటిని చూర్ణించి వెలగకాయ రసముతో గాని, గోమూత్రముతో గాని త్రాగించవలెను

కేశశాతము— వెంట్రుకలు రాలిపోవుట

కోరియా— కొంకరలుపోవు వ్యాధి.

కొంకిపురుగు— ఈరోగి జలోదరలక్షణములుకలిగి యుండును.

కొండనాలుకవాపు— శొంఠిపొడుంతో గాని, నారదబ్బకాయ ఊరగాయతోగాని రోజు 1క రెండుమూడు సార్లు అద్దవలెను.

కోశము— యర్రకుష్ఠు.

కోరింతదగ్గు— ఇది మశూచికం వంటి అంటువ్యాధి పదిహేనుసంవత్సరములులోపు వయస్సుగలవారికి సామాన్యముగా వారివారి జీవితములో ఒకసారిమాత్రమేసంభవించును పెద్దవారికి సంభవించుట అరుదు యీదగ్గు తెరలు తెరలుగా వచ్చును ఊపిరిపీచ్చుటలో కంగారును. ఉక్కిరిబిక్కిరియు కలుగుటయే గాక వాంతియు, కన్నులలోని రక్తనాళములలోనికి రక్త మధికముగా స్రవించి కన్నుల యందు చూచుచుటకు ముక్కిలిభయంకరమైన యెరుపును కలుగును ఒకొక్కప్పుడు నోటినుండి గాని, ముక్కునుండి గాని రక్తము పడవచ్చును మూర్ఛ కూడ కలుగవచ్చును. విరోచనములు కూడా ఉండును. సామాన్యముగా రెండుమాసములు దాటినగాని యధాస్థితి యేర్పడదు. మొత్తముమీదవ్యాధి ఎంతఅపాయిస్థితిగా కను

పించినను నూటికి తొంభై యెనమండుగురికి ప్రాణభయమురాదు. బ్రాంది తప్ప యేమం దిచ్చినను అంతిగా ఉపయోగమున్నట్లు కనుపించదు తక్కువమోతాదులలో రోజు 1కి రెండుమూడు లేక నాలుగుసార్లు వరకు యివ్వవచ్చును బొత్తిగా చిన్న పిల్లలకు బ్రాందీలో గుడ్డముంచి గుండెలు, వీపు, ప్రక్కలు వీటిపై రాయుచుండ వలెను దగ్గు మళ్ళు మొగము పట్టినతర్వాత సాంబ్రాణిపువ్వు రోజు 1కి రెండు మూడు సార్లు తేనెతో యివ్వవలెను పప్పు, దుంప శ్లేష్మవృద్ధికర మయిన పదార్థ ములు తినరాదు పిల్లలు పాలు త్రాగువారైనచో తల్లులు పథ్యము చేయుటయేగాక వారి వారి తత్త్వములను పట్టి పయిని వివరించిన మందులను కూడా సేవింపనగును.

కోష్ఠరోగము — మలస్థానము నాశ్రయించి యుండురోగము.

ఖాలిత్యము— మందారపుష్పములను నూనెలోమరిగించి రాయవలెను.

గర్దభికము — గుండ్రముగాను, యర్రగాను యుండెడు, పిటకలతో వ్యాప్తమై మండలములు కలిగియుండును.

గర్భపాతము - కడుపు పోవుట.

గర్భరక్షణము — పద్మమునునూరి పాకముపట్టిన బెల్లంలోకలిపి తినుచుండ వలెను ఊహను బట్టి మోతాదుయేర్పాటు చేయవలెను.

గర్భస్రావము— ఆరుమాసములు దాటకుండ స్రావరూపమున పోవునది.

గరవిషము — దుష్టజంతువుల వివిధాంగజన్యవిషము, స్త్రీరజస్సును పదార్థ ములలో కలిపి స్వాధీనముకొరకు పెట్టబడునది.

గళగ్రహము- (గళరోగము) స్వరముహీనమై ఆహారమును దిగనివ్వక యుండు శ్లేష్మ ప్రధానమైన వ్యాధి.

గండమాల — మిరియమంత మొదలుకొని రేగుపండు పరిమాణము వరకు మెడ, పెడతలనరములు, కొంకులు వీటి యందు బయలుదేరి చీము కారుచుండునవి ఇవియేస్థలమందు బయలుదేరిన ఆస్థలమును బట్టి పేరుపెట్టుదురు ఆసనగండమాల, గళగండమాల మొదలయినవి.

గాలిబిళ్లలు — చెవుల క్రింద జనించి వాపుపోటు గల గ్రంధులు.

గుదపాకము — చంటిబిడ్డలకు కలిగెడు ఆసనము ఒరుపు (ఆనాస)

గుదభ్రంశము - పీసర (ఆసనము వెలుపలకు జారివచ్చుట)

(1) పాతతోలు మాడ్చి ఆబూడిదను చల్లుచుండవలెను.

(2) మొమ్మాయిని (గోమూత్రశిలాజితు) కొబ్బరినూనెలోకలిపి రాయుచుండవలెను

(3) వేడినీళ్లలో కూర్చుండవలెను

గోరుచుట్టు — ములగ జిగురు పట్టించవలెను

గోళ్ళుగూడుపోయుట — ఓర్చుకోగలిగినంత వేడిగానుండు చమురులో గోళ్ళను ముంచుచుండవలెను

గంధనామ్ని — చర్మముపైన మశూచికపు పొక్కులవలె లేచెడు కురుపులు

గంగవెరుగ్రిలు — మశూచికమునందు కలిగిన సంధిగుణము

గ్రంధి— కంతి లేక గడ్డ.

గ్రంధ్యర్బుదము— పార్లగడ్డ (1) పాలమీగడగాని పెరుగుమీగడగాని వేయుచుండవలెను, మంచిగంధం వేయవలెను

చర్మవ్యాధులు — తామర, శోభి, మొదలయినవి

చర్మకీలము— తెలుపు, నలుపు కలిసినరంగు కలిగి మినపగింజవలె నుండు గ్రంధి లేక మచ్చ

(1) మోదుగుమాడలు తులం, తెల్లకవిరి తులం, మైలుతుత్రం రెండుచిన్నాలు, నిమ్మ పండురసంలో నూరిపట్టించవలెను

చనుకుదురు — పాలునిలవయుండి గడ్డకట్టి వాచి కురుపువలె అగును.

(1) కలబందకుమ్మలో ఉడికించి కట్టవలయును

(2) ఉప్పువేరు ఆవుపెన్నతో అరగతీసి అగంధం వేయవలయును

(3) పిండికట్టు కట్టవలెను చితకనిచ్చో మరల మరల బాధించుచుండును గాన కురు పుగా బయలుదేరనప్పుడు చితికే సాధనము చేయుటమంచిది

చప్పి— (1) తెల్లవుశిరి ఆకు మిరియాలు నూరి పట్టంచుచుండవలెను.

(2) మిరియాలు గాని, జీలకర్ర గాని, ఈరెండు గాని, నూరి వస్త్రఘాలితంచేశి మంచి నూనెలోగాని ఆవునేతిలోగాని కలిపి ఆరారగా రాయుచుండవలెను

చిట్లపిరంగి— నల్లటిమచ్చలు గలిగిన సవాయి, నఖమాంసమునపుట్టును

చిదుము— నేపాళపుపాలు గాని వీటి బురగ గాని పట్టిచుచుండవలెనును.

చిప్యము— గోరుచుట్టు

చుండు— తలమీద లేచెడునూగు.

(1) పారుజాతపుగింజలు నీళ్లలోనూరి రాయుచుండవలెను

(2) కొబ్బరినూనె, నిమ్మకాయరసం కలిపి, రాయుచుండవలెను,

(3) తరచుగా క్షౌరము చేయించుకొనుచుండవలెను

చెముడు— (1) ఒంటెమూత్రం పోయుచుండవలెను

(2) భమిడిపత్తి ఆకురసంలో ఉప్పుకలిపి పోయుచుండవలెను —

ఛర్దిరోగము— వాంతులు, లేక డోకు రాబోవునట్లుండుట, లేక అన్నపానాదుల యందు ద్వేషము కలిగియుండుట

(1) తెల్లజీలకర్ర, దాసినిచెక్క, ఏలకుగింజలు, వరిపేలాలు వీటిని మెత్తగా నూరి తేనెతో నాకించవలెను వాంతులు కట్టును.

(2) పూర్ణచంద్రోదయం ఇయ్యవలెను.

ఛాయారోగము— తలవెంట్రుకలు యర్రబడుట.

జఠరరోగము— ఉదరరోగము.

జతుమణి— లక్ష్మ.

జలత్రాసము— కుక్కకరచినవానికి నీళ్లు కనబడుటచే కలిగెడుభయము

జలోదరము— కడుపులో నీరు పెరిగెడు వ్యాధి.

జ్వరము— (1) తాళకం, మణిశిల, పాలతుత్తం, నాభి సమభాగములు. ఇంగిలీకం రెండుభాగములు వీటిని మలగచెక్క రసంతోనున్ను, చిత్రమూలం రసంతోనున్ను మర్దించి మినపగింజలవలె మాత్రలు కట్టి, మిరియాల రసంతో వేయవలెను. వీటినే పచ్చిమాత్రలని అందురు

(2) ఇంగిలీకం, నాభి, వెలిగారం, మిరియాలు నిమ్మపండ్లరసంతో నాలుగుజాములు మర్దించి మినపగింజలవలె మాత్రలు కట్టి నీళ్ళతో గాని, మిరియాల కషాయంతో గాని ఇవ్వవలెను.

(3) శుద్ధిచేసిన ఖడ్గలోహం, పాదరసం, గంధకం, నాభి, రసకర్పూరం, ఇంగిలీకం, తాళకం, మనిబొగ్గు, వీటిని, చిత్రమూలం, తులసీ, గుంటగలగర, వావిలి రసముతో ప్రత్యేక ప్రత్యేకం ఒక్కొక్కరోజు మర్దించి కుప్పెలు కట్టబోయే ముందు తగుమాత్రం వేపచిగురు వేసి నూరి కట్టవలెను. దీనిని లఘువాతరాక్షసమని చెప్పుదురు. రసకర్పూరశుద్ధి ఎట్లనగా, వకతులంరసకర్పూరమును, వకశేరు దంపుడుబియ్యంలో పెట్టి అగ్నిసరు పెట్టవలెను. వార్చకూడదు. దానిని ఉపయోగించవలెను (దీనినినే భాండకర్పూర మందురు)

(4) గుంటగన్నేరు రసంతో మిరియాలు నూరి మాత్రలు కట్టి, వేయవలెను

(5) వకతులం నవీరపాషాణము, మూడుతులముల మిరియాలు, వీటిని కొబ్బరికాయ నీళ్ళతో కుండయందు దాకి జాము అగ్నిసరుపదునుకు వచ్చేలా ఉడకపెట్టి, నిమ్మపళ్ళ రసంతో గాని, ఫల్లదంపళ్ళ రసంతోగాని నూరి పెసలవలె మాత్రలు కట్టి ఇవ్వవలెను కఠిన పథ్యం చేయవలెను మందు మానివేసినతర్వాత కూరగాయలు చాలా కలగలిపిన నూని, ఆవ, గుమ్మడి, ఉచ్చల, పులుసు, కూడదు.

జాలగర్దభము— విసర్పి వలెనే, శరీరమంతటను, వ్యాపించి గాని, కొంత భాగముగాని, బయలుదేరును. కొంతవరికి కేవలము వాపుమాత్రమే జనించును.

జిగటవిరేనములు — ఆమవిరేచనములు

జిహ్వాదోషము— నాలుక ద్రవహీనమై ముండ్లవలె కరుకుగలిగి ఏవస్తువుయు కూడ రుచింపకుండును.

(1) రుద్రాక్షను గాని, మంచిపగడమును గాని కాకిదొండకాయ గిజరు, లేక, కాకి దొండాకు రసంతో అరగతీసి ఆగంధమును నాలుకపైని వేలితో రాసి, బంగార ముతో నాలుకను గీయవలెను.

జెర్రికాటు— (1) కుంకుడుకాయ నీళ్ళతో అరగతీసి వేయవలెను.
(2) గుమ్మడిబొడ్డు అరగతీసి వేయవలెను.

జలుబు—

డగ్గుత్తిక— గద్గదస్వరము.

తలతీట— మట్టిమూకుడునందు వేయించిన చెంగల్వకోష్ఠు చూర్ణమును నూనెలోకలిపి రాయుచుండిన తలతీట కన్నులమంట, పునిసెత్తిమీద కురుపులు మొదలయినవి మానును.

తలనొప్పి— (1) గుంటగలగరాకు రసంలో అవునెయ్యి కలిపి మర్దనా చేయవలెను (2) హారతికర్పూరం పుదీనాపువ్వు వీటిని చేలితో నలిపిన నీరగును. ఆ నీటిని శిరస్సునకు మర్దనా చేయవలెను.

తృష్ణారోగము— (దాహరోగము) మాటిమాటికి దాహాపేక్ష, లేక, దాహాము పుచ్చుకొన్నప్పుడ పరిమితముగా పుచ్చుకొనుట.

తాపము — వేదన

తావర— (చర్మవ్యాధి) (1)వెల్లుల్లిపాయరసం, ఇంగువ, జిల్లేడుపువ్వులు, తాటిబెల్లం వీటిని నూరి ఆరారగా రాయుచుండవలెను (ఉల్లిరేకలను ఊకతో కూడా నఃగకొట్టి గుడ్డలో పెట్టి పిండినయడల రసమువచ్చును.)
(2) కశిందగింజలనుగాని, కశిందవేళ్లనుగాని నిమ్మకాయరసంలో నూరిరాయుచుండవ లెను అంతరతామరాకు మజిని నీళ్ళలోకలిపి ఆరారగా రాయవలెను.

తారుణ్యపిటకలు — (ముఖదూషిక) మొటిమలు లేక పోత్రపుపొక్కులు
(1) పురుగుడాకురసం రాయవలెను

తాలురోగము— చలిమిలవ్యాధి

తాలుపుప్పటము — చలిమిలసంధులయందు పెసరగింజలవలెగాని కందిగింజ లవలెగాని అంతకంటె పెద్దవిగాగాని నొప్పి లేక జనించెడు గ్రంథులు

తాలుపాకము — పెదిమలమధ్య బయలుదేరిన పుండు.

తిమిరము— (అంధత్వము) కనపించక పోవుట.

తిమ్మిరి— మేహతత్త్వముగలవారు గొర్రె పంచితంతోను, వాతతత్త్వము కలవారు మేకపంచితంతోను ఉప్పివేగు గంధం తీసి రాయుచుండవలెను

తిలకాలకము— నువ్వుగింజపరిమాణముగల నల్లటి మచ్చలు.

తుండికేసరి— తాలువుకు చిక్కగావాచి పోటు కలిగి యుండును.

తేలుకాటు — (1) ఎడమపక్క కుడితే కుడిచెవిలోను, కుడిపక్క కుడితే ఎడమచెవిలోను, గాడిదగడ్డపా రసం రెండు చుక్కలు పిండి, కుట్టినదగ్గరకూడా కొంచెం రసం మర్దనాచేసి, ఆపిప్పి నోటిలో నుంచుకొని చప్పరించవలెను

(2) కోడిరెట్ట తమలపాకునకు సున్నంవలె రాసి నమలవలయును

(3) ఇంగువ జిల్లేడుపాలతో అరగతీసి ఆగంధం కుట్టినస్థలమందు వేసి, గుడ్డపాగ వేస్తూ మంచినూని మలగార రాసి ఎక్కినదగ్గరనుంచి క్రిందకు దిగతోమవలెను.

(4) ఈశ్వరవేరు గాని, వేపవేరు గాని, జిల్లేడువేరు గాని పళ్ళతోలాగితే చేన్చు లాగున కోసి వుంచుకుని, గ్రహణం పట్టినప్పుడు దిసమొలతో వెళ్ళి, ఆవేరును పంటితో ఊడతీసి జాగ్రత్తపెట్టి నీటితో అరగతీసి ఆగంధం తేలుకుట్టినస్థలంలో వేసి గుడ్డపాగ వేయవలయును

(5) తేలునుచంపి, ఉమ్మెత్తకాయలో పెట్టి, పుటంపెట్టి కణికలు చేసి, జాగ్రత్త పెట్టి, నీటితో అరగతీసి, ఆగంధం తేలుకుట్టినస్థలంలో వేసి గుడ్డపాగ వేయవలెను.

(6) పారాయణవేసిన కొంతమందికి బాధ తగ్గును.

(7) నల్లమందు నిమ్మకాయసరంతో రంగరించి పట్టు వేయవలెను

(8) నాగముసిణివేరు గాని, గింజ గాని నీటితో అరగతీసి వేయవలెను.

(9) శుద్ధిచేయని నాభిని అరగతీసి వేసి, గుడ్డపాగ వేయవలెను

(10) నవాసాగరము, సున్నము రంగరించిన నీరగున దానిని కాటుపయినిరుద్దవలెను

(11) కుట్టినతేలు సామాన్యముగా దొరకను దానిని చంపి, ఆకొండెమును నీటితో అరగతీసి వేయవలెను

(12) నాలుగు లేక అయిదు ఔన్సుల స్పిరిటును మూతి వెడల్పుగల సీసాలోపోసి, రోజు 1 కి ఒకటి లేక 2 తేళ్ళు చొప్పున తెచ్చి ఆస్పిరిటులో వేయుచుండవలయును వేసిన కొంతసేపటికి విషమంతయు స్పిరిటిలో విదజిమ్మి ఆతేలుచచ్చును. చచ్చినతేలును అమరువటిరోజున తీసిపారవేసి, మరలమరల కొత్త తేళ్ళను వేయుచుండవలెను ఈవిధముగా 25 తేళ్ళనైనా వేసినయడల ఆ స్పిరిటు అద్భుత

మయిన పనిచేయును. తేలు కుట్టినవెంటనే యీ స్పిరిటు మర్దనాచేసి గుడ్డపాగ వేయవలెను.

దగ్గు— (1) సాంబ్రాణిపువ్వు తేనెతో యిచ్చుచుండవలెను,

(2) తులసి ఆకు రసంలో తేనె కలిపి ఇచ్చుచుండవలెను.

(3) ములగవేళ్ళ రసంలో అవసరమయితే, వెల్లుల్లిరసం, తేనె కలిపి యిస్తే చాలా బాపతుల దగ్గులు తగ్గును. ములగరసం అదనంగా యిచ్చినయడలగాని, ఎక్కువ సార్లు యిచ్చియడల గాని నోరు గాబు చేయును గాన కనిపెట్టి చిన్నచిన్న మోతాదులతో అవసరమయినన్ని సార్లు వాడవలయును ఉల్లిపాయరసం తీయు విధానం తామరవద్ద వ్రాయబడినది

(4) మేకపాలు పరమాన్నము తినవలెను

(5) వాకుడుగింజలు, దుంపరాష్ట్రం, అక్కలకర్ర, పిప్పళ్ళు, మోడి, వీటిని తేనెతో మాత్రలుచేసి సేవించవలెను.

(6) వాకుడు కాయలు, అడ్డసరపుయీనెలు, గుంటగలగరాకు, జిల్లేడుపువ్వులు, వీటి కషాయంలో తేనె కలిపి సేవించవలెను.

(7) వావిలి, గుంటగలగర, ఉప్పి, తులసి, వీటి చిగుళ్ళు, చిత్రమూలం, మిరియాలు, బటాణీగింజలవలె మాత్రలు చేసి, అనుపానవిశేషముతో వాడవలయును.

(8) చింతబెరళ్ళుమండిగలలో శిలమన్ను యిచ్చి పుటంపెట్ట ఆభస్మ అనుపానవిశేష ములతో వాడవలెను.

దద్దుర్లు — ఉదర్దము చూచవలెను.

దండకాలసకము—కలరాలో వాతాదులు ప్రకోపించి, స్రోతస్సుల నడ్డగించి, దేహమును ధనస్సువలె వంచివేయును.

దంతకుశి—దంతముమూలములుగానేయుండిఅపారమైనబాధకలిగియుండుట.

ద్వంద్వరోగము— జంటవ్యాధి.

దారుణకము— వెంట్రుకలు గల ప్రదేశమున దురదలుగల సన్నని కురుపులు లేకపగుళ్ళు.

దాహరోగము— తృష్ణారోగము చూడవలెను.

దివాంధము— పగటిభాగమున కనపించకుండుట (వెలుతురుచూడలేకుండుట)

దురదలు— ఆవుంపచితంలో గాని, పుల్లమజ్జిగలో గాని వెలిబూడిది కలిపి రాయవలెను.

దుర్బోధనిద్ర— మరణసూచకమయిన మగత.

దూషీవిషము - అపథ్యాదులచే (మిథ్యాహారవిహారాదులచే)జనించినదోషము

దోషజ్వరము — అపథ్యభోజనము, స్త్రీసంగమము, పగటినిద్ర, మొదలగు వాటిచే జనించిన జ్వరము.

దొంగనొప్పులు — ప్రసవవేదనను గుర్తెరుంగని తొలుచూలు స్త్రీలకు తటస్థ మగునవి.

ధాతునష్టము— శుక్లనష్టము

నక్తాంధము — రేచీకటి

నకులాంధ్యము — పగటిభాగమున వస్తువులు వివిధములయిన రంగురంగులుగ కనుపించుట, యీవ్యాధి యందు రాత్రి దృష్టికనుపించదు.

నడ్డినొప్పి - (1)నిమ్మకాయ, రెండు ముక్కలుగా, కోసి, గుడ్డలోపెట్టి, వేడి గానున్న, అవునేతిలోముంచి శమునగా కాచవలెను

(2) నల్లమందు కొబ్బరినూనె రంగరించి పట్టువేయవలెను

(3) చిక్కగాపిసికిన చింతపండుగుంజు నొప్పిగలచోట పట్టించి దానిపయిని కలుపు పెట్టకుండా వున్నముగ్గు అద్దవలయును.

(4) మెత్తటిసున్నంరాశి దానిపయిని మెత్తటి బెల్లం రాయవలెను.

(5) ఉడకపెట్టిన శొంఠిగంధంరాశి దానిపయిని గంగరావి ఆకులు వేశి కట్ట వలయును.

(6) బ్రాందీ మర్దనాచేయవలయును.

(7) యూకలిపటస్ ఆయలుః ర్దనాచేయవలయును.

(8) పచ్చగన్నేరుపాలు పొడిచి పసుపు గాని అగన్నేరుచెట్టు మొదటనుండు మట్టి నిగాని అద్దవలెను

నరుకు — (1)తెల్లుకాడరసం పోసినచో రక్తప్రవాహం కట్టుటయేగాక గాయం కూడా తొందరగా మానిపోవును.

(2) చేతితో నొక్కి పట్టి తడిగుడ్డ చుట్టవలెను.

నల్లమందు అలవాటు— సాలకొడిశవేరు ఒక చిన్నం తాంబూలంలో వేసుకొను చున్నయడల నల్లమందు మానివేశిన బాధయేమియు కనుపించదు.

నల్లులు— తెల్లకిరసనాలు నల్లులుండుప్రదేశమున పోసినచో చాలాకాలమువర కు నల్లిపుచ్చదు. చంపకుండా కిరసనాలుపోయవలెను కిరసనాలువాసన ఆరోజు మట్టుకేకాని మరుచటిరోజు నుంచి ఉండదు

నవవిధమూత్రశ్మరులు —

స్వచ్ఛము— శరీరమందు. నొప్పి లేవి, నల్లటి, లేక, యర్రటి, మచ్చలు.
(1) దేవదారుదాద్రకం రాయుచుండవలెను.
(2) తేనెరాయుచుండవలెను.

నాడీవ్రణము— నారికురుపు, లేక నారకురుపు, దీనినుంచినారవచ్చుచుండును. నార తెగిపోకుండాపుల్లకుచుట్టి చాలాజాగ్రత్తగావుంచవలెను నార తెగిపోయినచో కురుపుమరల బాధించును నారపూర్తిగా బయటకువచ్చేవరకు పుల్లకు చుట్టుచు ఆపుల్ల పరున్నప్పుడున్ను నిద్రపట్ట ఒళ్ళుదెలియనిస్థితిలోను కలిపోకుండా కురు పక్కకుచేర్చి కట్టుచుండవలెను.
(1) వంకాయ వుడికించి ఆగుంజు కట్టుచుండవలెను.

నాలుక పూత— (1)మేకపాలు పుక్కిట పట్టవలయును.
(2) మేకపాలపరమాన్నం తినవలెను
(3) వేడిఅన్నంమీద నూనెవేసి ఆఅన్నంతో నాలుకపయిని శమనగాఅద్దుచుండవలెను.

నాడికారక్తం— ముక్కునుండి రక్తముస్రవించుట.
(1) చల్లనినీటిని ముక్కులోపోయవలెను

నిస్త్రాణ—నీరసము—

నిరుద్ధప్రకసనము— అంగముచివరవాచి మూత్రమునడ్డగించును.

నీరుచవ్వలు— పసిపిల్లలకు శరీరమువాచి చర్మము పొట్టువలె ఊడుచు పులి పరి నీరు కారుచు శరీరమునందుండు బెండుగ్రకలు యర్రగావుండును

నీలిక— నల్లటిమండలములు దేహమునందు గాని ముఖమునందు గాని లేచుట. (చీకటికమ్మిన విధమున ఏమియు కనుపించనందున కళ్ళు కనుపించనివ్యాధిని కూడా నీలికయని చెప్పు ఆచారముకలదు)

నెరుపు— శంఖభస్మము, సీసభస్మము వీటిని నీటలోనూరి రాసిన నల్లబడును.

నొప్పులు ఆగిపోవుట— (1)కస్తూరితములపాకులో పెట్టి నమలించవలెను
(2) ఆవునేతిలో గుడ్డముంచి కడుపుపయిని శమనగా కాచి ఆగుడ్డ కడుపుపయిని పర చవలయును. ఇట్లు దభాదభాలు చేయవలయును

నోటిపూత— నాలుకపూత చూడవలెను.

పక్షవాతము శరీరమునందొక పార్శ్వము పడిపోయినరోగము. యీవ్యాధి అంకురించగానే పుచ్చుకోగలిగినంత పట్టు తేనెపుచ్చుకోవలెను మొదటి పత్యాయం ఇట్లుచేశి తర్వాత ప్రతిరోజునా వుదయంపూట రెండుతులములు తేనె పుచ్చుకొనుచుండలెను.

పక్ష్మశాతము— కనురెప్పలపై నున్న వెంట్రుకలు ఊడిపోవుట

మనుబాల, దుంపరాష్ట్ర (రాస్న) శొంఠి యష్టిమధుకము ఆముదపువేళ్ళు గ్రంధితగరము తగరము సదాప సైంధవలవణం వాయువిడంగాలు గుంటగలర సమూలము శిలాజిత్తు మేకపాలు నల్లనువ్వులనూనె నూనెకు నాలుగురెట్లు గుంటగలగరాకు రసము వీటిని తైలపాకముగా కాచి, రాయుటవలన శిరోరోగములు, వెంట్రుకలు రాలిపోవుట, నెరయుట దంతములయందుండు దుర్గంధము సమస్త నేత్రవ్యాధులు హరించును శిరోవ్యాధులయందు అయిదు లేక ఆరుచుక్కలు ముక్కులలో వేసికొనిన అద్భుతమైన పనిచేయును

పచ్చశిగ — (1) ఒక ఔన్సు ఒహ్మాదండివేళ్ళ రసంలో రెండుచిన్నముల మిరియములపొడుం కలిపి ఉదయం మూడు లేక అయిదుపూటలు పుచ్చుకొనవలెను చప్పిడి పథ్యం. అనగా ఉప్పు పులుసు పనికిరాదు.

(2) అరటిదుంప రసం ఒకఔన్సు, మిరియముల పొడుం రెండు చిన్నాలు, రసచిందూరం చిన్నం కలిపి ఉదయం అయిదుపూటలు పుచ్చుకోవలెను. ఇచ్ఛాపథ్యం.

(3) శిలాజత్తు, శృంగిభస్మ, వంగభస్మ, పచ్చకర్పూరం, కుంకుమపువ్వు, చలవమిరియాలు, దాసినచక్క, ఛమిడిపత్తి ఆకురసంతో మర్దించి కుంకుడు గింజలవలె మాత్రలు చేసి రెండుపూటలా వేసుకొనవలెను యిచ్ఛాపథ్యం.

(4) తిప్పసత్తు, పంచదార, రసచిందూరం, కుంకుడుగింజలవలె మాత్రలు కట్టి ప్రాతస్సాయంకాలములయందు సేవింపవలెను. యిచ్ఛాపథ్యం.

(5) పత్తిఆకురసం, నేలతాడిగడ్డల రసం, పంచదార వీటిని కలిప పూట 1ఓ ఒక ఔన్సు చొప్పున రెండుపూటలా పుచ్చుకొన్నయడల కొద్దిరోజులలోనే జీర్ణించిపోయిన ప్రమేహములు, శగలు, నిర్మూల మగును చప్పిడి పథ్యం చేయవలెను.

పటలం కంటిపొర (1) ఇండుపుగింజలు, శంఖము, శొంఠి, పిప్పలి, మిరియాలు, పంచదార, సముద్రపునురుగు, రసాంజనము, వాయువిడంగాలు, మణిశిల, కోడిగుడ్డు పెంకులు, వీటిని చనుపాలతో మర్దించి కణికలు చేసి, కండ్లలో పెట్టుచుండవలెను. పొరలు, పువ్వులు, నీరుకారుట, దురద, పుసులు కట్టుట, మొదలయిననేత్రవ్యాధులన్నియు కుదురును సామాన్యముగా కంటిలో పెట్టేమందులన్నియు చనుపాలతో గాని, నీటితో గాని అరగతీసి పెట్టవలెను. మంటకు అగగిలిగినయడల నిమ్మకాయరసంతో కూడా పెట్టవచ్చును. కంటిలో కాటుక పెట్టుచున్న కాలంలో చింతపండుపులుసు, నూని, ఆవ, గుమ్మడి, బచ్చల తినినయడల అసలు వ్యాధి కుదరక పోవుటయే గాక మిక్కిలి ప్రమాద

స్థితి తప్పక సంభవించును గాన నేత్రవ్యాధుః యందు పథ్యమే ప్రధాన మని యెరుంగవలెను

(2) మైలుతుత్తం, సైంధవలవణం, పాలతుత్తం, రసాంజనం, సముద్రపునురుగు, వెలిగారం, మిరియాలు, రాగిపళ్లెంలో వేసి, నిమ్మపళ్ళరసంతో రాగిపాత్ర చేతనే మూడురోజులు విడవకుండామర్దించి కణికెలుచేసి యెండబెట్టివాడవలెను.

(3) కఫరి, మైలుతుత్తం, రసాంజనం, సముద్రపునురుగు, శంఖం, మణిశిల, తెల్ల గలిజేరువేరు, కరక, తాడి, వుశిరికలు, వీటిని నిమ్మపండ్లరసంతో ఖల్వమందు మర్దించి కణికలు చేయవలెను.

(4) మిరియాలు రెండుపాళ్ళు, కఫరి నాలుగుపాళ్ళు, నువ్వుపువ్వులు యెనిమిది పాళ్ళు, నిమ్మపడ్లరసంతో ఒకరోజు ఖల్వమందు మర్దించి కణికెలు చేయవలెను.

(5) మిరియాలు వకభాగం, వుశిరికవరుగు రెండుభాగములు, గానుగుగింజలు మూడు భాగములు, వీటిని గుంటగలగరాకు రసంతో ఖల్వమందు మూడురోజులు విడవ కుండా మర్దించి కణికెలుచేయవలెను.

(6) సముద్రపునురుగు, ఇనుపరాపొడి, మనుష్యకపాలము, కోడిగుడ్లపెంకులు, మణి శిల, వీటిని జీలకర్రకషాయంతో ఖల్వమందు, మూడురోజులు విడువకుండా మర్దించి కణికెలు చేయవలెను

(7) పసుపు, వేపచిగుళ్ళు, పిప్పళ్ళు, మిరియాలు తాడికాయలోని పలుకులు, గానుగ గింజలు. శంఖము, వస, నాభి, మణిశిల, వీటిని ఖల్వమంను, మేకపంచితముతో మూడురోజులు విడువకుండా మర్దించి కణికెలు చేవలెను

(8) రసాంజనము, కంటిలో పెట్టుచున్నయెడల అనేకవిధములయిన నేత్రవ్యాధులు తగ్గిపోవును,

(9) శంఖం నాలుగుపాళ్ళు, మణిశిల రెండుపాళ్ళు, మిరియాలు వకపాలు, సైంధవ లవణం అరపాలు. వీటిని ఖల్వమందు మేకపాలతో మూడుదినములు విడవ కుండా మర్దించి, కణికెలుచేసి పెరుగుమీదతేరిన తేటతో అరగతీసి పెట్టవలెను.

(10) ఉశిరికవరుగు కరక్కాయపెచ్చులు, తాడికాయపెచ్చులు, నిమ్మపండ్లరసంతో ఖల్వమందు ఒకరోజు మర్దించి కణికెలు చేయవలయును.

పడిశము— రొంప

పద్మినీకంటకము— తామరపువ్వుయందుండు కింజల్కములవలె గాని, తామరకాడమీద నుండు ముండ్లవలె గాని ఉండి, తెల్లటి రంగుగలిగి, దురదతో కూడుకున్న మండలములు.

పనసకము— చెవిలోపల, కఠినమయినపిటక జనించి, పోటుకలిగియుండును.

పరివర్తికము— అంగమునకు చివరభాగమున అనగా పోకదగ్గర బయలుదేరిన గ్రంధి, లేక కురుపు.

పరిణామశూల— భుజింపబడిన అహారము అరుగుదలకు వచ్చెడు సమయమున పుట్టెడు శూల. (అజీర్ణహరౌషధములను వాడవలెను)

పలలమేహము— మూత్రము వెంట, మాంసముకలిగిన నీటివలె, లేక, మాంసమువలె పడెడు రోగము.

పరిలేహి— చెవియందు అవాలవంటి సన్నని పొక్కులులేచి, చెవితమ్మియందు వ్యాపించి చెవిని తినెడు వ్యాధి.

పలితము— నెరుపు.

పల్లుకురుపు— పండ్లకుచేరిగాని, పండ్లమధ్యగాని, పండ్లపార్శ్వమందుండు ఇగుళ్ళయందు గాని, జనించు కురుపు.

పరిమ్లాయి— ప్రతివస్తువున్ను పచ్చగాకనుపించును.

ప్రదరము— సోమరోగము.

ప్రమేహ పిటక— రాచరణము.

ప్రమేహము— సెగరోగము, లేక, మూత్రము బొట్లు బొట్లుగాపడెడు సెగరోగము వంటి రోగము

ప్రవాహిక— కోష్ఠమందు, వాతముచే, అడ్డప పడిన, మలము, శ్లేష్మసంయుక్తమై, మిక్కిలి ముక్కినయడల, కొద్దిగాగాని, అధికముగాగాని ఆసనమునుండి వెడలును.

ప్రసవించుట— నొప్పులు అగిపోవుట చూడవలెను

ప్రసూతిరోగము— బాలింతజబ్బు.

పాదదాలి— అరికాలు మొద్దుపారి పగిలి నొప్పికలిగియుండును

పాముకాటు— ఉత్తరేణిఆకు, తెలకపిండిఆకు, యీరెండింటిని సమానంగా నలిపి అపసరు అరతులం మింగించి రెండుకన్నులలోను. రెండుచుక్కలు, పిడిచి కరిచినస్థలమందు అపసరు మర్దనాచేయవలెను. స్పృహావుంటే అపిప్పిబుగ్గను చప్పలింపచేయవలెను తక్షకుడుకరచినాతప్పక జీవించును. పురుగుచొంగకును. 2 శ్లం తావిడిపోయి వికృతాకారముగల పాడ జాతి సంబధమనుకున్న మండలంరోజులు పాటు యీప్రకారంపసరు ఉదయాన్నే పుచ్చుకుంటూ యీపసరు ఒంటికికూడా మర్దన చేయవలెను. నూనె, ఉలవలు మొదలయిన పప్పు జాతులు తినరాదు. పాము

కరిచినవానికి దీపం కనపడనివ్వరాదు, పాము కరిచిన అనుమానం వుంటే మిరియపు గింజ గాని, మిరపకాయగింజ గాని నమలించవలెను. పాముకరిచినవానికి ఇది కార ముగా నుండక తీపికలిగి యుండును పైఓషధులు రెండింటిని ప్రతిగృహస్తులు ఎప్పుడుపడితే అప్పుడు అందుబాటులో నుండేలాగున ఏనూతి దగ్గరనో పెంచు కొనుచుండుట మంచిది మిక్కిలి ముఖ్యములయిన ఓషధులుకదాఅని వీటిని డొంకల వలె పెంచకూడదు.

పార్శ్వపునొప్పి— శిరస్సుయందొక భాగమున బయలుదేరు నొప్పి.

(1) అగలేని బాధగల పార్శ్వపునొప్పులయందు పోటుగలచోట దూదినుండాకు కట్టవలెను, దగ్గరెక్కినయడల చింతపండు చిక్కగా నీటిలో పిసిగి అగుంజు దగ్గరు పయిని పూయవలెను

(2) అక్కలకర్ర గంధంతీసి పట్టువేయవలెను

(3) ఆముదపాకులు వెచ్చచేసి కట్టవలెను

పార్శ్వశూల— ఒంటికణత నొప్పి, లేక పోటు.

పారిగర్భికరోగము — తల్లి గర్భవంతురాలయి యుండగా ఆపాలు త్రాగిన యడపిల్లలకు, దగ్గు, మందాగ్ని, వాంతి, కునికిపాట్లు, చిక్కుట, అరుచి, భ్రమ, కోష్ఠవృద్ధి (ఊచరపొట్ట) కలిగి యుండును

పాలజ్వరము - చన్నులయందు పాలు నిలువయుండుటచే ఆపాలు గడ్డ కట్టి బయలుదేరును

పాండురోగము - దేహమునంగున్న రక్తము క్షీణించుటవలన చర్మము తెల్ల పారి, ముఖము, కంటిరెప్పలు, పాదములు, గుహ్యస్థలము, వీటియందు వాపు కలిగి యుండును.

పాళీజ్వరము — రోజువిడిచి రోజు గాని, 2, లేక 3 రోజులకు గాని, వచ్చెడు జ్వరము.

పిచ్చి— (అపస్మారము ఉన్మాదము)

పిటకామేహము— శరీరమున లేచెడు కంతులు.

పిత్తరోగము— పైత్యరోగము.

పిప్పిగోళ్ళు— కునఖము.

పిప్పిపళ్ళు— లోపలపురుగు లుండుటచే సలుపుచు పండ్లకురంగు లేర్పడి, పుచ్చిన పండ్లు.

(1) మలగబంక, ముద్దహారతికర్పూరం, నూరి దూదిలోపెట్టి పిప్పిపంటిపయిని పెట్టి నొక్కిపెట్టవలయును.

(2) అక్కలకర్ర పొడుంపంటిలో పెట్టవలయును.

పిల్లలమలబద్ధం— ముసాంబరం వేడినీళ్ళతో నూరి బొడ్డుమీదగాని, పొత్తికడుపుమీదగాని పట్టువేసి దానిపైని తమలపాకుఅద్దవలెను.

పిశాచజ్వరము— పసుపు సున్నంవేశి కలిపిన యర్రఅన్నము, వడిబొగ్గులు మిరపకాయలువేసిన వేడినీళ్ళు, కొజ్జురకాయ పెంకులోపెట్టినసూని దీపము వీటినన్నింటిని ఒక బుట్టలో పెట్టి దిగతుడిచి ఇంకొక రిద్దరిని సహాయంగా తీసుకొని జనసంచారం చేయని మూరుమూల పుంతలలో యీదిగతుడుపును విడిచిపెట్టి అచ్చటినుంచి వెనుకకు తిరిగి చూడకుండా యింటికి తిరిగివచ్చి కాళ్ళుచేతులు కడుగుకొని శరీరమంతటను విభూతిని పూసుకొని, వీర, శభ, అను నామములతో ఈశ్వరుని ధ్యానించవలెను.

యీపేర్లతో 108 పర్యాయములు విభూతిని అభిమంత్రించి, చంటిపిల్లలకు పెట్టినయెడల పోరుపెట్టుట, పలవరించుట, నిద్రలో ఉలికిపడుట, మొదలయిన బాధ లుండవు మనస్సుకు భయము తోచినప్పుడు గాని, స్మశానాదులయందు ఒంటరిగా త్రోవ నడువవలసినప్పుడు గాని, జనములేని యింటియందు ఒంటరిగా ఉండవలసినప్పుడు గాని, యీనామములను స్మరించుచున్నయెడల పిశాచబాధ కలుగదు యెంతమాత్రము సందేహములేదు. నిశ్చయము.

పీనస— దుర్గంధయుక్తమయిన చీము, రక్తము, ముక్కువెంట వెడలెడు రొంపవంటి రోగము

పీసర— గుదభ్రంశము

ప్లీహరోగము— బల్ల

పుట్టవ్రణము — చాలా కాలమువరకుమానక సెలలువేయుచుండు మొండికురుపు.

(1) గోరింటచెక్క. లేక, రావిచెక్క కషాయంతో కడుగుచుండిన చీము పట్టక త్వరలో మానిపోవును.

పునఃప్రకోపజ్వరము— తిరుగపెట్టిన జ్వరము

పురాణజ్వరము— అస్థిగతజ్వరము.

పుర్రెమాద— శిరస్సుయందు అల్లికలుగా బయలుదేరిన దట్టమయినకురుపులు

(1) చిట్టతాంబేలు బొరుసును పుటంపెట్టి, మెత్తగా నూరి, ఆముదం, వెన్న, కొబ్బరినూనె, నువ్వులనూనె మొదలయినవాటిలో కలిపి రాయుచుండవలెను (చిట్టతాంబేలు బొరుసు ఎరకలవాళ్ళవద్ద దొరకును)

పులిపిర్లు— పచ్చనిరంగు గలిగి గట్టిగా నుండు సురుగుడుకాయలు.

(1) జీడిమామిడి గింజలు చమురు రాయవలెను
(2) గుర్రపుతోక వెంట్రుకతో ప్రతిరోజునా బిగించుచుండవలెను.
(3) మంచినూనె, బెల్లం అరిచేతిలో సాకరవచ్చేలా రంగరించి రాయుచుండవలెను
(4) చాకలిచోడాలో సున్నం గాని, నూరేకారం సున్నంగాని, కలిపి ఎంతమేర తినివేయవలయునో అంతమేర తాటిఆకునకు బొరిచేసి, బొరిచేసిన ఆతాటి ఆకు సురుగుడుకాయ, లేక, కంటిమీద పెట్టి దానిపయిని సురుగుడుకాయకు గాని, కంటికి గాని పట్టించిచినయడల అప్పటికప్పుడు తినివేయును. ఎక్కడికి తినివేయవలయునో అక్కడికి తినివేసినతర్వాత తక్షణం తుడిచివేసి వెన్న గాని, నెయ్యిగాని, రాయవలెను. యీపనిని మిక్కిలి నేర్పుతో చేయవలెను
(5) చాకలిచోడు, తరవాణిలో అన్నం మెత్తగా పిసికి కడితే పుండుపడును మండదు ఇది మడమశూలకు మంచిది

పెట్టుమందు— కృత్రిమవిషము.

పేలు — పాదరసమును తమలపాకురసముతో నూరి వస్త్రముపైన పట్టించి, ఆవస్త్రమును తలవెంట్రుకలకు వానినవలె కట్టిన పేలు చచ్చి, అగుడ్లు నంటుకొనును.

పంపర— వుప్పివేరు, కొండకొమ్ము వుప్పిఆకు పసరుతో అరగతీసి వుడక పెట్టకుండా ఆగంధం రోజు 1కి నాలుగైదుసార్లు వేయుచుండవలెను.

పిరంగిరోగము— సవాయి సంబంధమైన రోగము.

బట్టతల— ఇంద్రలుప్త.

బల్ల— గుల్మము.

బహుమూత్రము— అనేకసార్లు మూత్రము విడచుట, లేక, మూత్రము ఎక్కువ పరిమాణముగా విడచుట లేక. మూత్రము బరువుగానుండుట.

బాలహపచినె్న. . (చంటిబిడ్డగుణం) పన్నెండు సంవత్సరముల లోపు వయస్సుగల పిల్లలకు సంభవించు మూర్ఛగుణముగల శ్లేష్మవాతవ్యాధి.
(1) యీవ్యాధికి వెంటనే కర్పూరం వేయవలెను.
(2) కస్తూరి వేయవలెను.
(3) శ్లేష్మవాతహరమైన రేమం డిచ్చినను ములగచక్క, వెల్లుల్లిరసం తేనె అను పానంతో యివ్వవలెను.

బాలింతరోగము— ప్రసూతిరోగము.

బృహాత్— వాతుకపదము బుడ్డ.

బొల్లి — కిలాసము.

బోద శ్లీపదము

భగందరము — వృషణములకున్ను, మలద్వారము (ఆసనము) నకున్ను మధ్య భాగమందు బయలుదేరి చీము కారుచుండు కురుపు

భ్రమ — కుమ్మరసానమీద కూర్చున్నట్లు ఒళ్ళు తిరిగెడు రోగము. లేక, శరీరము చక్రాకారముగా తిరుగుట, తూలుట మొదలయినవి.

మక్కల్లరోగము - గర్భిణీతో వున్నప్పుడు గాని, ప్రసవానంతరము గాని జనించిన శూల

మడమశూల — (1) కాల్చిన యిటుకపయిని పచ్చిజిల్లేడాకులు పరిచి శమనగా నుండేటట్లు మడెమతో తొక్కిపట్టవలెను.

(2) చాకలిచెడు, తిరివాణిలో అన్నము మెత్తగా పిసిగి కట్టవలెను.

మదరోగము — మదించినవానివలె మత్తుగానుండు వ్యాధి

మదాత్యయము — మద్యపానముచే జనించిన వ్యాధి.

మరిడిజాడ్యము — కలరా

మలబద్ధము - విరేచనము కాకుండుట, లేక, విరేచనము స్వల్పముగానగుట.

(1) చెముడుపాలలో తెలకపండి కలిపి శనగగింజంత మాత్రచేసి, వేడినీళ్ళతో వేసుకోవలెను

(2) వాము గాని, మిరియాలు గాని, లవంగాలు గాని, చెముడుపాలతో అయిదురోజులు భావనచేసి వేడినీళ్ళతో ఎన్నిమిరియాలు, లేక, ఎన్నిలవంగాలు వేసుకుంటే అన్ని విరేచనము లగును.

(3) తెల్లతెగడ చూర్ణం, పంచదార చిన్నంలగాయితు దేహతత్వమునుబట్టి వేడినీళ్ళతో వేసుకోవలెను ఆరోజుకు చారుఅన్నం తినవలెను

(4) గులాబిమొగ్గలు, వాయువిడంగాలు, కరకతాడివుశిరికలు, రేలచక్క, సైంధవలవణం, కటుకరోహిణి, వీటని చూర్ణించి తేనెతో మాత్రలుకట్టి వాడవలెను. రేలచక్క దొరకనియెడల సునాముఖీఆకువేయవలెను సుఖంగా విరేచనమగును.

(7) గంటిభారంగికషాయం త్రాగవలయును ఒకఔన్సు త్రిఫలకషాయంలో కొడిశగింజలచూర్ణం, లవంగాలచూర్ణం, పట్టిక చూర్ణం, ప్రత్యేకం ప్రత్యేకం పొడుంపట్టంత నొప్పున కలిపి తెల్లవారుజామున త్రాగవలెను సులువుగా 2 లేక, 3 విరోచనము లగును.

(8) బియ్యం తీసివేసిన వాముపొట్టు చేదుపుచ్చకాయరసంతో భావనచేసి తేనెతో

పెద్దలు చిన్నమెత్తు, పిల్లలు వడ్లగింజెత్తు పుచ్చుకోవలెను

(9) కుంకుడుకాయ నీళ్ళతో అరగతీసి ఆగంధం బొడ్డుమీద పట్టువేసి ఆసనములో నికి శనగగింజంత పోయేటట్లుగా సాధనం చేయవలెను.

(10) ఖర్జూరపుపండులోని గింజ తీసివేసి ఆకాశిలో శుద్ధిచేసిన నేపాళాలు రెండు గాని, మూడు గాని పెట్టి దారముతో కట్టి గరిటెలో తేనివేసి, దానిలో యీ ఖర్జూరపుపండును బంగారుడకపెట్టి, మాత్రలుచేసి ప్రతిరోజూనా ఉదయం ఒక్కొక్క మాత్ర చొప్పున వాడుచుండవలెను

(11) జాజీలక్కవలె యర్రగానున్న రేలజిగురు కందిగింజంత వేసుకొని నీళ్ళు త్రాగవలయును.

మషకము— నల్లగా మినపగింజవలెనుండు బొబ్బ, లేక, కంతి. లేక, మచ్చ.

మసకలు— కన్నులకు బట్టతెర అడ్డమున్నట్లుండును.

మహోదరము— అసాధ్యమయిన ఉదరరోగము.

మధుమేహము— మూత్రము తీపెక్కి చిక్కనై తేనెవలె నుండును. యీ మూత్రమును నిలువచేసినను, మూత్రమువిడిచిన ప్రదేశమునను చీమలు పట్టును.

మసూరిక— మశూచికము (తట్టమ్మ)

(1) మశూచికం వచ్చినవెంటనే అరకాలిలో కోరింటాకు నూరినముద్ద పెట్టినయెడల కన్నులలో పొక్కులు పోవును.

(2) అరికాళ్ళలోను, అరిచేతులలోను ఆవునెయ్యి మర్దనచేసినయెడల కన్నులలో పొక్కులు పోవును.

మండలకుష్ఠు— పొడలు పొడలుగా లేచెడుకుష్ఠు,

మాద— చప్పినిపోలి, సలువు, బాధ కలిగి గజ్జికురుపులవలె దట్టముగా కలుసుకొనిపోయిన కురుపులు.

ముఖదూషిక— ముఖమునందు లేచెడు యౌవనసూచకమయిన (పోత్రపు) పొక్కులు. వీటినే యువానపిటకలు అనికూడా అందురు.

ముఖమంగు— ముఖముపై బయలుదేరిన నల్లటిమచ్చలు.

ముఖరోగము— నాలుక, దవుడలు, నోరు వీటియందుపుండ్లుకలిగియుండును.

ముట్టుదోషము— రోసె అడ్డపడకుండా ముప్పేటను జనపనారత్రాడు నాజూకుగా పేని తొమ్మిదిముళ్ళువేసి, ఆదండను సాంబ్రాణి ధూపం వేసి మెడకు సరిపడేటట్లుగాను, పిల్లలకు వత్తకుండా వుండేలాగుననున్న కట్టవలెను.

మూఢగర్భము — రక్తగుల్మము చూడవలెను.

మాతృకృచ్ఛ్రము — మూత్రబంధము. మూత్రాశ్మరి చూడవలెను.

మూత్రస్రావము — పిల్లలకు పది లేక. పన్నెండు సంవత్సరములు వయస్సు వచ్చేవరకు నిద్రలో పట్టులేకుండా అయ్యేడు మూత్ర విసర్జనము

(1) రాత్రి పరుండపోయే ముందు విడువకుండా రెడు లేక, మూడు మాసముల పాటు నల్లమందు వేయుచుండవలెను.

మూలశంక — అంతరతామరాకు నూరి నేతితో వెచ్చచేసి కట్టవలెను.

మేఘరంజి — నీటితో కూడిన మేఘములు ఆకాశమున కనుపించినప్పుడు లేచిన ఉబ్బసము.

మేదోరోగము — మదాత్యయము.

మేహరోగము — కొంచెమించుగా ప్రమేహరోగమును పోలిన రోగము.

మేహపిటకము — కంతులు.

మొలగజ్జి (1) పత్తిఆకులను మెత్తగానూరి ఆముదంలోకలిపి పూయవలెను.
(2) పటికిబెల్లం, పటికి, గంధకం, నీళ్ళతో నూరి పూయవలెను.

యకృత్ — బల్ల.

యక్ష్మ — క్షయవ్యాధి

యవప్రఖ్య - బార్లీగింజలవలె గుండ్రముగాను, కఠినముగాను వుండి మాంసాశ్రితములయిన కురుపులు.

యాప్యరోగము — శరీర మున్నంతవరకు మానకుండా వుండు రోగము.

యోనిఒరుపు— సీమనేపాళపు మానుకు కత్తిగాటు పెట్టగా చిక్కటి పాలు వచ్చును. వాటితో రసకర్పూరమును కుండపెంకుమీద అరగతీసి అగంధం వేశినయడల బాధ వెంటనే తగ్గును

యోనికంద — గూద.

రక్తగ్రహణి — (1) మర్రిఊడకొనలు జీలకర్ర మాత్రలు కట్టి అవుపెరుగుతో ఇవ్వవలెను.

(2) పటికిబెల్లం, గసపాలు మాత్రలు చేసి ఇవ్వవలెను

రక్తగుల్మము — యీవ్యాధియందు, ముట్టుకాకుండుట, కుచాగ్రములు నల్లబడుట, నోటినుండి నీళ్ళుకారుట, మొదలయన వేవిళ్ళలక్షణములు కలిగి యుండి, గర్భచలనము ప్రత్యేకావయవములతో చలింపక పండాకారముగ చలించుట, ఇట్టి

లక్షణములు కలిగి యుండును. యీ వ్యాధియందు పదిమాసములు పూర్తి, అయిన తర్వాతనే గర్భము కాదని రూఢగా తెలుసుకొనిన పిమ్మట, గర్భపాతమునకు చేయు చికిత్సలను చేయవలయును

రక్తదోషము— రక్తముచెడుట లేక క్షీణించుటవల్ల బయలుదేరిన రోగము

రక్తపిత్తము — ముక్కు, నోరు యోనిద్వారము, మేఢ్రము, ఆసనము, వీటిలో దేనినుండిఅయినను అకస్మాత్తుగా రక్తముప్రవహించువ్యాధి.

రక్తవాతము — రక్తముసరిగా ప్రవహింపక, శరీరమందెక్కడనో ఒకభాగమునకుచేరి వాపు పోటుకలిగి యర్రగానుండును.

రజోవరోధము— రజస్వలకాకుండుట (మాసగమ్మ)

రసతాపము— పాదరసము అధికముగాగల మందులనుగాని, రసకర్పూరమును గాని, పాషాణాదులనుగాని, వేశినతర్వాత జనించిన (వేడిన) బాధ

రాజయక్ష్మ— క్షయరోగము

రుద్రవాతము — అకస్మాత్తుగా ప్రకోపించిన దారుణ వాతరోగము

రేచికటి— రాత్రిభాగమున కానరాకుండుట

లక్వా— పక్షవాతమువంటి మూతివంకరపోయెడు వ్యాధి

లింగనాశము— కంటిలోని సోపనశించుట

లూత— కంటి, కొలికిలోగాని దగ్గరగాని పుట్టిన పుండు

లోధరము (అలసము) హాలీమకమునకు మారు పేర్లు.

వడగొట్టుట — ఎండదెబ్బ (1)తరవాణి, లేతకొబ్బరికాయలోనినీరు మజ్జిగ తేటముంజలు, వీటిలో సందర్భమయినదానిని ఇవ్వవలయును

వమనము— (1)నల్లదిండెనవేరుతోక్క మూడుచిన్నములు, నీళ్లతోనూరితాగినయడల వాంతులను భోజనంచేస్తే వాంతులు తిగ్గును వాంతులు అధికంగా కావలసినయడల వేడినీళ్ళుతాగవలెను.

వరాహదంష్ట్రము - సూకరదంష్ట్రము, వాపు, దురద, కలిగి, గుదస్థానమున యర్రగానుండువ్రణము.

వరిబీజము — ఏదియో ఒకవృషణము పెద్దదిగాఉండి సలుపు పోటు కలిగి గాని లేకుండాగాని యుండును

వల్మీకము— శ్లీపదము, మెడ, భుజశిరసులు చంకలు హస్తములు పాదములు వేళ్ళు, వీటిసంధులు కంఠము, యీస్థలములయందు పాముపుట్టవంటి గ్రంధులు జనించి అనేకములయిన ముఖములు కలిగియుండును

వలీ— శరీరము ముడతలు పడుట

వహ్నిదగ్ధము (రక్ష) కాలుపు

వంధ్యాదోషము— గొడ్రాలితనము.

వధ్య— శరీరమున సూదులుగుచ్చినట్లుండెడుబాధ.

వ్యంగము— మంగు (ముఖమునందుండునల్లటిమచ్చ)

వ్యంగ్యము— ముఖముపయిన లేచెడు నల్లటి లేక యెర్రటి మచ్చలు

వృషణకచ్ఛువు— వృషణములపైని బయలుదేరిన గోకుడుకురుపులు.

వ్రణము— కురుపు లేక పరుపు

వికూజనము— పేగులరచుట

విదాలిక— చంకతాళికురుపు, ఇది గుండ్రని ఆకారము కలిగి గజ్జలయందు గాని చంకలయందు గాని జనించుకురుపు.

విద్రధి— అసాధ్యవయిన బల్ల లేక, ఉదరమందొక భాగమును మాత్రము వ్యాపించిన గల్ల

విరోచనములు — పందుపుచ్చుకొను కాలమున విరేచనము నల్లగాగాని, మందురంగు కలిసి గాని, యుండును ఇది దోషము కాదు.

విలంబిక— కలరాలో ఆహారాదులను, జీర్ణము కానివ్వక, ఊర్ధ్వాధోభాగములను బంధించి కోష్ఠముననిలచియున్న దోషము.

వివృతపిటక— మంటకలిగి మేడిపండువలె ఉండి, నోరుతెరచుకొని దాని చుట్టూ సన్నని కురుపులు కలిగి యుండును.

వివృతాంఘ్రి— పాదదారి.

విషదోషము— విషప్రయోగముచే జనించిన వ్యాధి.

విషమజ్వరము— అహికజ్వరము.

విషూచి— కలరా,

విసర్పి— చప్పి.

విస్ఫోటకము— (మశూచికము) కాలిన పుండ్లవంటి బొబ్బలుగల రోగము.

వేదన— తాపము

శర్కర— తేనె, నెయ్యి, కొవ్వు వీటిలో దేనియొక్కగాని, ఆకృతివంటి స్రావముగల చిన్నచిన్న గ్రంధులు.

శర్కరార్బుదము— పయి శర్కరవ్యాధి జనించినపిదప.దుర్గంధయుక్తమయిన రక్తస్రావముగల వ్యాధి,

శ్వాస-- వగర్పు.

శిరోభారము-- తలబరువు.

శిల్పకుష్ఠు-- గ్రంధులుగాలేచెడు కుష్ఠురోగము.

శ్విత్రము-- బొల్లి

శతఘ్ని-- ఉమ్మెత్తకాయవలె అనేకములయిన మాంసాంకురములు కలిగి పోటు, మంటతో కంఠనాళమును అడ్డగించును,

శ్లీపదము-- బోదకాలు.

శ్లేష్మస్రావము-- తెమడ వెడలుట రెండుడ్రాముల అట్టరసపాకురసంతో వకడ్రాము అల్లపురసంకలిపి యిచ్చినయడల క్రమముగా శ్లేష్మము తెగిపడిపోవును.

శోఫ-- వాపు

శోభి-- శరీరమందు బాధలేకుండ బయలుదేరిన కుచ్చులు.

(1) పత్తిగింజలలోని పప్పునూరి రాయుచుండవలయును.

శోష-- నీరసముచే సొమ్మసిల్లుట.

షండదోషము-- నపుంసకత్వము

షండరోగము--

సన్యాసరోగము-- మూర్ఛకంటె ప్రబలమయినది. వెంటనే గాఢముయిన (శ్లేష్మవాతజ్వర) చికిత్సచేయనిచో తక్షణమే ప్రాణము పోవును, శ్వాస బంధించినచో చికిత్సవలన లాభములేదు సన్యాసరోగికిన్ని శవమునకున్ను భేదమేమన, సన్యాసరోగి కంటిపాపలో ఎదటివాని ప్రతిబింబము కనుపించుచుండును. శవమునకు అట్లు కనుపించదు. ఇదియే యీరోగమునకు రోగికిని పరీక్షింపవలసిన గుర్తు. కంటిపాపలో ఎదటివాని ప్రతిబింబము కనుపించకపోయినను, ముక్కులో యీగలు దూరినప్పటికి రోగి చలించకున్నన, ఆట్టిరోగి మృతినొందినట్లు తెలియనగును

సన్నిరుద్ధగుదము-- మలద్వారము సన్నగిలి మలము ధారాళముగా వెడలుటకు సావకాశములేక బాధ నొందుచుండుట.

సంగ్రహణి-- అపాయస్థితిలోవున్న గ్రహణిరోగము

స్తనవిద్రధి-- చనుకుదురు లేక. చనుకురుపు.

స్వరభంగము-- స్వరహీనము

స్వరభేదము-- స్వరము మారుట.

స్వరహీనము-- (స్వరసాదము) స్వరహీనము

సంధిభంగము-- కీళ్ళు పట్టులేకుండుట.

సూతిక-బాలింతజబ్బు--

సూర్యావర్తము-- ఎండఎక్కినకొలది హెచ్చయ్యేడు పార్శ్వపు నొప్పి

స్నాయురోగము-- కీళ్ళజబ్బు.

స్త్రీదోషము-- సంగమదోషము

సోమరోగము— కుసుమ లేక అప్రయత్నముగా మూత్రము ఒక్కొక్క బొట్టుగా ప్రవహించువ్యాధి

హలీమకము — ముదిరిపోయిన కామిలావ్యాధి.

హృదయదౌర్బల్యము — మనస్థిమితము లేకుండుట.

హృల్లాసము— ఓకిరింత

హిక్క — ఎక్కిళ్ళు

హిధ్మ — ఊపిరిగొట్టునొప్పి

హృచ్ఛూల— (మంతగుండెలో) గుండెలమధ్యపోటు,

అంజనము— కంటిలోకలికము వేయుట (కలికములన్నిటిలోను మిరియపుగంధము చాలామంచిది ఇదిగాక ఇతర కలికములు వేయుటవల్ల ఒక్కొక్కప్పుడు కంటికిఅపాయము, కలుగును మిరియపుగంధంకలికమువల్ల మంటతప్ప ఇతర ప్రమాదం వుండదు)

అంతరకుసుమ— కంటిలోపువ్వు.

అంతః పరిమార్జనము — విరేచనసాధనము

అనులేపన — పైపూత లేక మర్దనా

అనులోమము — పైనుండి క్రిందికి వ్యాపించుట

అనువాసవస్తి— తైలాదులతో చేయతగిన పిచికారీ (ఎనీమా).

అపతర్పణము (కర్షణము) తీక్ష్ణములైన ఔషధకషాయాదులచే శరీరమును కృశింపచేయుట.

అవపీడనము— నశ్యక్రియ (శొంఠి మిరియాలు మొదలగు వాటిచూర్ణమును ముక్కురంధ్రములయందు ప్రవేశపెట్టుట.)

ఆస్థానవస్తి (ఆస్థాపనవస్తి) (నిరూహవస్తి) కషాయాదులతో చేయతగినపిచికారీ

ఇచ్ఛాపథ్యము— నూని, పులుపు, ఆవ, గుమ్మడి బచ్చలి, పప్పు, దుంపజాతి, వీటిని తినకుండ తేలికగా జీర్ణమగు పదార్థములను భుజించుట.

ఉత్తరబస్తి— మూత్రముకొరకుచేయు పిచికారీ.

ఉద్వర్తనము— నలుగుపెట్టుట

ఉపనాహాస్వేదము - దోషముండు స్థలమందు కట్టుకట్టుట లేక (కాముట) చమట పట్టుట.

ఊష్మస్వేదము— కషాయాదులతో ఆవిరిపట్టుట.

కటుమర్లు— కాలిచట్లు.

కబళక్రియ— కల్కాదులను నములుట

కలికము— అంజనము,

కషాయము— చితుకకొట్టబడిన ద్రవ్యమును నీటిలోవేశి యెనిమిదవ వంతు మిగిలినట్లు కాచబడినది

కంగులీ తైలము— కొరల్లనుండి తీయబడిన చమురు.

క్వాథము తేనెవలె చిక్కగా కాచబడినది

క్లేశక్రియ (క్లేశకర్మ) తడిపూత (తడిగుడ్డతో శరీరమును తుడుచుట బటారులో విక్రయింపబడు స్పంజి చాలానీటిని పిల్చుకొనును, అవసరమయినప్పుడు దానితో రోగిశరీరమును తుడిచినయడల తడిగుడ్డతో తుడుచుటకంటె మరుగుగానుండును)

క్షేత్రీకరణము— పాదరసపక్షమున సప్తకంచుకదోషములు (1)నాదదోషము (2) మలదోషము(3)చాంచల్యదోషము (4)విషదోషము (5)గిరిదోషము (6)అగ్నిదోషము (7)స్వతస్సిద్ధదోషము ఇదేఘుంటదోషము) లేకుండునట్లుచేసి ఔషధముల యందుపయోగించుటకు తగినస్థితిలోనుంచుట.

రోగిపక్షమున వమనవిరేచనములచే రోగియొక్క శరీరమును శోధించి ఔషధసేవకు యోగ్యమైన దశకు దెచ్చుట.

గండూషము— పుక్కిలించి ఉమ్మివేయుట,

చప్పిడి పథ్యము— ఉప్పు, కారం, వేయకుండా చిట్టుడుకునీళ్ళు అన్నం తినుట. లేదా ఆవుపాలలో ఏమియు కలుపుకోకుండా అన్నంమాత్రంకలుపుకొని తినుట.

జతుమూలము— పెద్ద కొరికులు

జంగమవిషము— పాము, తేలు, ఎలుక సాలిపురుగు (పురికొసఅని నాడు వా) కుక్క మొదలయినవి వీట్ల కాటువె విషించిన విషము

జంగమస్నేహము-- నెయ్యి, క్రొవ్వు మొదలయినవి.

డగ్గుత్తిక-- గద్గదస్వరము.

తంద్ర-- కునికిపాట్లు లేక సోమరితనము.

తప్తఖల్వము-- మేకపెంటికలన, ఊకను కలిపి రాజవేసి అదిబాగా కాలిన తర్వాత దానిని తీసివేసి వేడెక్కినప్రదేశమున ఖల్వమునుఉంచి, అఖల్వమున మందు మర్దన ప్రారంభింపవలయును దానికే తప్తఖల్వమని వైద్యశాస్త్రమున సంజ్ఞ.

తర్పణము-- (సంతర్పణము) (బృంహణము) ఔషధము ఆహారము మొదల యినవాటిచే శరీరబలముకొరకు చేయబడు చికిత్స

తాపస్వేదము-- ఇది 6 విధములు.

(1) అంగారస్వేదము (2) గరిటెలో లేక పెకులో నిప్పులు పోసిగాని కొరకం చుతో గాని కాచుట

(2) మధ్యభాగమందు 2 ½ అంగుళములు కాలీవుండులాగున చుట్టకుదురుచుట్టి రోగి యొక్క నెత్తినుంచి కోరముతోకోరిన జిల్లేడువేరుయొక్క పొట్టు అచుట్టుకుదురు నిండా గుల్లగాపోసి నిప్పులను చెంబులోపోసి పచ్చికమ్మలతోగాని, పట్టకారులతో గాని అనిప్పులుగల చెంబును జాగ్రత్తగా పట్టుకొని చుట్టకుదురుపై రోగికి ప్రమా దము కాకుండా చూచుచు కాచవలెను (ఇట్లుచేయుటవలన వేడిచమురులో ముంచి పెట్టిన మిరియాలమూట అంతపనిచేయును)

(2) కపాలస్వేదము-- పెంకులను నిప్పులమీద కాచి కాపడము పెట్టుట.

(3) కందుకస్వేదము-- బట్టను బంతివలెచుట్టి కాచుట.

(4) వస్త్రస్వేదము-- వస్త్రమును నిప్పులమీద కాచి, దానితో కాచుట.

(5) వాలుకాస్వేదము-- యిసుక మొదలయిన వాటిని వేయించి ఆముదపాకులలో పోసికాచుట

(6) హస్తస్వేదము-- చేతులను నిప్పులమీద గాచి కాపడము పెట్టుట.

ఏస్వేదమయినాసరే ఆహారము జీర్ణమయిన తర్వాత రోగిని గాలిలేని స్థల మందు గూర్చుండబెట్టి చేయవలెను. హృదయము, వృషణములుయందు మాత్రము యీస్వేదములను ఉపాయముతో జాగ్రతగా చేయువలయును.

ద్రవస్వేదము-- (1) మసలకాచిన నీటిలో పసుపు వైచి శరీరముపైని గుడ్డ ముసుగిడి ఆవిరిని పీల్చుట.

(2) కషాయాదులనుగాని, గోరువెచ్చని నీటిని గాని డేగిసాలోపోసి బొడ్డు మునుగునట్లు కూర్చుండుట.

ద్వంద్వమేలాపకౌషధములు-- నాభివెలిగారములు, మహిసాక్షీ శిలాజిత్తులు, తారమాక్షిక హేమమాక్షికములు, పాపరచెట్లుచిట్టమాండూరములు,

ధాతువాదము-- బంగారమును పుట్టింతుమని వాదించుట.

నశ్యము-- (నశ్యకర్మ) (నావనము) అవపీడనము (ముక్కుతో పీల్చతగినది)

నిజరసము-- కలగలుపులేకుండా ద్రవ్యమునుండి తీయబడిన రసము

నిరూహము-- ఆస్థాపనవస్తి.

ప్రతిసారణము-- జిహ్వాదోషము పోవుటకొరకు నాలుకపైని రాయతగిన ద్రవ్యము

ప్రతిలోమము-- క్రిందినుండి పైకివ్యాపించుట.

పంచకర్మలు-- (1)వమనము (2)విరేచనము (3)నశ్యము (4)నిరూహము (పిచికారీ) (5)అనువాసనము (ఎనీమా.)

ఫాంటము-- మసల కాగుచున్న నీటియందు చూర్ణముచేయని ద్రవ్యములను వేసి తయారు చేయబడిన కషాయము

బహిఃపరిమార్జనము-- రాసుట (తోముట)

భావన -- ఊరబెట్టుట

మరిచాశ్యము-- తేనె

మంథము-- శర్కర, ద్రాక్ష, చెరుకు మొదలయినవాటితో సిద్ధముచేయబడినది

యూషము-- పెసలు మొదలైనవాటితో చేయ డిన కట్టు

రక్త మోక్షము-- రక్తమును శరీరమునుండి వయకితీయుట.

రసము-- చితుకకొట్టబడిన యెండుద్రవ్యములను వేసి, రెండు లేక, మూడు పొంగులను పొంగించినది, లేక, పచ్చిద్రవ్యమునుండి పిండి తీసిన నిజరసము.

రసవాదము-- ఇమునుగాని రాగిని గాని బంగారముచేయుదుమనియు, మూలికలను సంపాదించి తెచ్చెదమనియు చెప్పుట,

లగణము-- కంటిరెప్ప లోపలిభాగమందు జనించి నొప్పి లేకుండా వుండు గ్రంధి, దీనిని నగణమని కూడాఅంగురు,

లంఘనము — రోగమందు ఆహారము లేకుండా ఉండుస్థితి (ఉపవాసము) దీనియందు భేదములు గలవు

లాజమండము — పేలాల గంజి

లేపనక్రియ — మర్దనా (లేపనము,)

వప్ప — పచికారిలోవుండు దండము

వ్యధ — శరీరమున సూదులు గుచ్చినట్లుండు బాధ.

వ్యాయామము — పరిశ్రమ లేక సంచారము

వికూజనము — పేగులరచుట

విశ్వామిత్రకి పాలము — ఎంగాణిపాత్ర

విషమాశనము హెచ్చుగా గాని తక్కువగాగాని భుజించుట

విషవాదము - ప్రతివస్తువయందు విషము కలదని వాదించుట

వేగము — మలము లేక మూత్రము, లేకవాంతి లేక ఇవన్నియు.

వేగధారణము -- మలమునుగాని మూత్రమునుగాని లేక వీటనన్నిటిని గాని బిగపట్టుట

వేసవారము పోపు (మసాలా)

శిరోవస్తి — పండి మొదలైనవాటితో శిరస్సుమీద కుండుకట్టి దానియందు తైలక షాయాదులను పోయుట

శూకము - నీటయందుండు కిప్ప

షష్ఠికధాన్యము - అరువది దినములకు పండుధాన్యము.

సముద్రఫేనము సముద్రపునురుగు.

సంశోధనక్రియ విరోచనమునకు గాని, వాంతులకు గాని యీ రెండిటికి గాని ఇచ్చు మందు

సాంగశీతలము — వేడి దానంతట అది చల్లారేవరకు ఉంచుట.

సాత్మ్యము — అలవాటు.

స్థావరవిషము — వసనాభి, నల్లమంగు, గన్నేరుపప్పు, గచ్చపప్పు, ముషిణి గింజలు మొదలైనవి.

స్థావరస్నేహము -- నువ్వులనూనె, కొబ్బరినూనె, ఆముదము, ఆవనూనె మొదలైనవి.

స్నాతకులు— (1) వంశము నిలుపుకొనుటకొరకు పెండ్లియాడదలచి అందు నిమిత్తమై ధన మార్జించువాడు.
(2) తనకున్న ధనమంతయు యాగదక్షిణగా యచ్చివేశి, తనజీవితమునిమిత్తమై ధన మార్జించువాడు
(3) తెరువరి (తోవనడచువాడు)
(4) యాగముచేయుతలంపుతో ధనమార్జించువాడు
(5) తల్లితండ్రులు గురువులు మొదలైనవారిని పోషించుటకొరకు ధనమార్జించువాడు.
(6) వేదాభ్యాసము చేయువాడు
(7) రోగపీడితుడు వీరు ఏడుగురున్ను స్నాతకులు అని చెప్పఁబడుదురు.

సిరామోక్షణము— నరములను తెగగొట్టుట

సూక్ష్మము -- తేనె నెయ్యి, బెల్లము, ఉదకము, ద్రాక్ష, దానిమ్మ, కంద మూలములు, ఇతరఫలములు, తైలములు, లవణములు, మద్యభేదములు మొదలైన వాటి సమ్మేళనముతో తయారుజేయబడిన పానకము (సిరప్)

సేచనము-- శరీరమునందు నీళ్ళు మొదలైనవాటిని చిలకరించుట

హనుగ్రహము-- కాలిచట్టలు కొట్టుకొనుట

హిమకల్పనము-- కాచకుండా యిచ్చేడు ద్రాక్షరసము, మొదలైనవి (శీతకషాయాదులు)

అగదము-- దిరిశనచెట్టుయొక్క ఆకు, తొక్క, పువ్వు, వేరు, పండు వీటి సముదాయము. ఇది సర్పవిషమును హరించును

అమ్లచతుష్టయము-- రేగు, దానిమ్మ, చింత, పులిచింత ఇది అరుచి, వాంతి పైత్యము మొదలైనవాటిని హరించును

చాతుర్జాతములు-- ఏలకులు, లవంగాలు, లవంగపత్రి నాగకేసరములు వీటి చూర్ణము లేక, కషాయము వాంతి, ఎక్కిళ్ళు, అతిసారము మొదలైన వాటిని హరించి కాంతిని బలమును ఇచ్చును.

చాతుర్భద్రికములు--అతివస, తుంగముస్తలు, తిప్పతీగె, శుంఖ వీటిచూర్ణము లేక కషాయము ఆమదోషమును, అతిసారమును హరించును

త్రికటుకములు-- శొంఠి, పిప్పలి, మరియాలు వీటిచూర్ణము లేక కషాయము. అగ్నిమాంద్యము, శ్లేష్మము, కుష్ఠము. వాతము, జ్వరము మొదలయినవాటినిహరించును

త్రిజాతికములు-- చాతుర్జాతకములలో నాగకేసరములు గాక మిగిలినవి. ఇవి చాతుర్జాతక గుణముకలవి.

త్రిఫలములు-- కరక్కాయ, తాడికాయ, ఉసిరికాయ వీటి చూర్ణము లేక కషాయము రక్తదోషము, వాతము, అగ్నిమాంద్యము. కుష్ఠము, మూలశంక త్రిదోషములు మొదలైనవాటిని హరించును.

దశమూలములు-- మారేడు, గుమ్మిడు. తక్కిలి, కలిగొట్టు, దుండుకము (గురుపంచమూలములు) ముయ్యాకుపొన్న, కోలపొన్న, ములకవాకుడు పల్లేరు (లఘుపంచమూలములు) ఇవి రెండును కలిసి దశమూలములు. గురుపంచమూల కషాయము కఫవాతమును, లఘుపంచమూల కషాయము పిత్తమును, దశమూలకషాయము త్రిదోషజనితవ్యాధులను హరించును

పంచకోలములు— చవ్యము చిత్రమూలము పిప్పలి పిప్పలిమోళ్ళు వీటి చూర్ణము లేక కషాయము. సన్నిపాతము మహోదరము మలబంధము శూల విరేచన బంధము వాతము గుల్మరోగము మొదలైన వాటిని హరించును.

పంచగవ్యము— గోవుయొక్క మూత్రము పురీషము పాలు పెరుగు నెయ్యి ఇది సమస్తపాపములను, గుల్మమును అనేకవిధములైన వ్యాధులను సర్వవిషములను హరించును

పంచసుగంధములు, తక్కోలములు పోక జాజికాయ పచ్చకర్పూరము లవంగములు వీటిచూర్ణము క్రిములను శైత్యదోషమును అగ్నిమాంద్యము మొదలలైన వాటిని హరించును.

ఫలపంచామ్లములు-- చింత నారదబ్బ నిమ్మ ఫుల్లపుల్లి మాదీఫలము ఇవి దాహమును, వాంతిని, అరుచిని, రక్తదోషమును, అగ్నిమాంద్యము మొదలైన వాటిని హరించును

లవణత్రయము -- సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము ఇవి అగ్నిమాంద్యము వాతము, గుల్మవ్యాధులు మొదలైనవాటిని హరించును

యక్షకర్దమం-- అగరుగంధము, కిస్తూరి, కుంకుమపువ్వు, చందనము, పచ్చ కర్పూరము, వీటిసముదాయమును శరీరమునకు పూసుకొనినయడల దుర్గంధమును పోగొట్టి పరిమళమును, రంజకత్వమును వశ్యమునుచేయును.

శ్లో॥ భవంతు మూలా న్యఖిలాని భూమ్యాం
సంత్వశ్వినాభా భిషజ స్సమస్తాః ।
ప్రయాంతు రోగా స్త్వరితప్రశాంతిం
జీవంతు లోకా నిరుజ శ్శతాబ్దం ॥

తా॥ భూమియందు సమస్త ఓషధులు వృద్ధినొందుగాక వైద్యవృత్తియం దున్న వారందరు, అశ్వినీదేవతలతో సమానప్రజ్ఞ గలవా రగుదురుగాక రోగము లన్నియు శీఘ్రముగా శాంతించుచుండుగాక ప్రజలందరు రోగవిహీనులై నూరు సంవత్సరములు జీవింతురుగాక.

ఇతి శ్రీ చిత్రాంగదసంగ్రహాఖ్యే శ్రీ సోమయాజిసత్వథే
సత్పథప్రకరణేషు సంగ్రహప్రకరణమ్
సర్వంసమాప్తమ్.



# తప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 2 | మేము | నీవు |
| ” | 3 | గలము | గలవు |
| 32 | 4 | వరాసు | పోర్వరాసు |
| 36 | 28 | రుగ్ణాం | రుగ్ణం |
| 39 | 17 | సుచికిత్సికిత్స | సుచికిత్స కస్య |
| 45 | 15 | సమాహారయచ | సమాహారయతి |
| 46 | 2 | రుజుత్వ | ఋజుత్వ |
| 49 | 3 | శగ్ఘరణ | శరుగ్ఘరణ |
| 59 | 11 | అహార | వాహార |
| 70 | 21 | కషాయ | తిక్తరసము, వాయువు, ఆకాశము నీటిచేకటు |
| ” | 22 | తిక్త (చగదు) | కషాయ |
| 74 | 6 | కేశః | శేశః |
| 77 | 22 | ప్రివిపదం | ప్రితిపదం |
| 79 | 14 | చేపేషు | చాపేషు |
| 105 | 24 | తేష్వస్తి | తత్రాస్తి |
| 108 | 10 | వచ్ఛపుచ్ఛ | వత్సపుచ్ఛ |
| ” | 13 | వచ్ఛపు-ఛ | వత్సపుచ్ఛ |
| 109 | 4 | దాహార | వాహార |
| 110 | 1 | మెతుకులను | పనులను |
| ” | ” | బిందువులచే | పనులను విడచి |
| 110 | 17 | రుగ్ణాం | రుగ్ణ |
| 112 | 16 | డివా | వినా |
| 113 | 16 | ప్రివాసితవ్యం | నివాసితవ్యం |
| 116 | 15 | రుగ్ణాం | రుగ్ణే |
| 119 | 14 | త్వాశ్రిమ | కృప |
| 122 | 3 | ఇహోత్త మాంగే, | ఇహోత్త మాంగే |
| 132 | 13 | భుక్త్వకేయం | భుక్త్వ రేకేయం |
| 134 | 4 | కురస్య | కురళ్ళ |
| 147 | 11 | తథోం | తథాం |
| 149 | 4 | దప్తిళ్ళ | పప్తిళ్ళ |
| ” | 5 | దూధ్మా వాదుర్భిక్ష | దాధ్మా వాదుర్భిక్ష |
| 158 | 20 | ముక్తాసవాయూం | ముక్తావళాయూం |
| 164 | 26 | దేహేతి | దేహీతి |
| 169 | 25 | వ్యాధ్యణి కాలం | వ్యాధిశలం |
| 171 | 5 | దుగాకృతిః | దృగాకృతిః |
| ” | 13 | వాక్రందితో | అక్రందితో |
| 173 | 19 | గుర్విషము | రుగ్విషము |
| ” | 28 | ష్టధారోగవతాం | స్త్రియుస్న్యష్టవరుజాం |
| ” | 29 | తత్రిగుణా | పంచగుణా |
| ” | 30 | హృచ్ఛ్వాస తస్త్రచతుర్గణేన | హృత్స్వదమా స్రత్య స్థారవాడీ |
| 174 | 1 | ఆరు | మూడు |
| ” | 2 | మూడురెట్లధి | ఐదురెట్లధి |
| ” | 3 | నాలుగురెట్లధిక | సమాన |
| ” | 11 | భాగ్ప్రజకం | భాజకం |
| 175 | 14 | అద్యం | దాద్యం |
| 177 | 21 | సన్నిపూర్చ | సన్నిపాత |
| 198 | 27 | పూర్వామరక్త | పూర్వామరక్త |
| 201 | 21 | రభి | రపి |
| 218 | 26 | కురధు | కుకధు |
| ” | 27 | వక్త్రసహ్య | వక్త్రసహ్య |
| 222 | 5 | సకామం | ప్రకామం |
| 329 | 1 | ఎప్రపద్యైః | ప్రపత్తేః |